



ఉత్కంఠ—శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు ... ... ... ...

మిథ్యాభిమానము—జం. వెంకటశర్మ, జం. శివన్న శాస్త్రిగార్లు ... ...

* ప్రతాపభానుని చరిత్రము—భాగవతుల నృసింహశర్మగారు ... ... ౧-౪

ఆంధ్రారణ్యపర్వశేష ప్రశంస—కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ... ౫-౧౬

కవి—శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు ... ... ... ౧౭-౧౮

కావ్యము-పరమప్రయోజనము—విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు ౧౯-౨౨

ఆశ్రమప్రాంతములు—సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు... ... ౨౨-౨౩

రుక్మిణీపరిణయము పరిహరణీయమా?—గున్నేపల్లి అక్షయలింగముగారు ... ౨౪-౨౭

విభీషణశరణాగతి—కొణిదెన బాలకృష్ణయ్యగారు ... ... ... ౨౮-౨౯

కళాపూర్ణోదయ విమర్శన—దేశిరాజు రామదాసుగారు ... ... ౩౦-౪౧

బాలగానము—పెద్దిభట్ల రామచంద్రరావుగారు ... ... ... ౪౧

సుశీలారూపసులు—పారనంది జగన్నాథస్వామిగారు ... ... ... ౪౨-౪౮

అమావాస్య—గరిగిపాటి రామమూర్తిగారు ... ... ... ౪౮

సరళ—ఎద్దనపూడి చెంచురామయ్యగారు ... ... ... ... ౪౯-౫౫

మావటీఁడును దేవుఁడే!—వెనుమర్తి వెంకటరత్నముగారు ... ... ౫౬

ప్రేమపరిణామము—సీరిపి ఆంజనేయులుగారు ... ... ... ౫౭-౬౫

కడుపుతీపు—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ... ... ... ౬౬-౬౭

కుక్కజట్టీ—శొంఠి వెంకటరమణగారు ... ... ... ... ౬౮-౭౨

సుతస్మృతి—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ... ... ... ౭౩

అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనములు, ౧—గిడుగు వేంకటసీతాపతిగారు ... ... ... ... ... ౭౪-౭౯

కవితాప్రయోజనము—గుండిమెడ వెంకటసుబ్బారావుగారు ... .. ౮౦

కళింగనగరము—గో. రామదాసుగారు ... ... ... ... ౮౧-౮౫

వద్దురా—(హారితకృతము) ... ... ... ... ... ౯౬
బీదరుపట్టణ ప్రశంస, పూర్వచరిత్ర—కోమాండూరి వెంకటాచారిగారు ... ౯౭-౧౦౦
క్రోధమూర్తి—పంద్యారం వెంకటసుబ్బయ్యగారు ... ... ... ౧౦౧
జీవితాదర్శము—పంగనామముల రామచంద్రరావుగారు ... ... ౧౦౧-౧౦౪
హిందూధర్మశాస్త్రపరిణామము—దిగవల్లి వేంకటశివరావుగారు ... ... ౧౦౫-౧౧౧
అనుభవిస్తున్నానురా—కో. వెం. సుబ్బారావు, కా. శివయోగానందరావుగార్లు ౧౧౧-౧౧౨
హిందూదేశమున గ్రహారాధనము—నిడుమోలు కనకసుందరంగారు ... ౧౧౩-౧౨౧
సాయంసమయము—నాదెళ్ల వెంకట్రావుగారు ... ... ... ౧౨౨-౧౨౩
ఆంధ్రము, గణితశాస్త్రము—దర్భా యజ్ఞేశ్వర సోమయాజులుగారు ... ౧౨౪-౧౨౫
జీవమా—'చింత' ... ... ... ... ... ౧౨౬
మురళీకృష్ణుడు—సీతంరాజు సత్యనారాయణశర్మగారు ... ... ,,
శ్రీసత్యనారాయణస్వామి—బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు ... ... ౧౨౯
పరపతిసంఘములు లేక బ్యాంకులు, అవిచేయగల్గుపనులు—రంగనాయకులుగారు ౧౩౦-౧౩౫
సంస్కృత భాషాప్రశంస—నేమాన సూర్యప్రకాశకవిగారు ... ... ౧౩౯-౧౪౧
నాట్యరంగప్రయోజనము— ... ... ... ... ౧౪౨-౧౪౭
ప్రణయాంజలి—కొప్పర్తి నారాయణమూర్తిగారు ... ... ... ౧౪౭
జిట్టాఅప్పయ్యగారు స్థాపించిన పదిధర్మపాఠశాలలబొలురు ... ... ౧౪౮
దేశబంధుని హృదయవేదన—ముడుంబ నరసింహాచార్యులుగారు ... ౧౪౯-౧౫౦
పూర్వకాలపు తూమనివారణపద్ధతి—టి. శివశంకరంపిళ్లగారు ... ... ౧౫౦-౧౫౨
సాభిప్రాయ విశేషములు— ... ... ... ... ౧౫౩-౧౫౮
వామనా?—తరిమల హనుమంతరావుగారు ... ... ... ౧౫౮

# చిత్రములు

వర్ణచిత్రములు—సిద్ధాగమనము, చిత్రకారుడు: కె. వి. సోమయాజులుగారు; గౌరీ కల్యాణము, చిత్రకారుడు: శ్రీయుత చా. సత్యనారాయణగారు

సాధారణ చిత్రములు—కామదహనము, ఇంద్రమన్మథ సంవాదము; బీదరుకోట వాకిలి, బీదరుకోట-కొండలో మలచిన కందకములు; రంజనుమహాలు - అంతర్గృహాము, భామినీసుల్తానుల గోరీలు, మదరసా; శ్రీ జిట్టా అప్పయ్యగారు స్థాపించిన పది ధర్మపాఠశాలల బొలురు-బొపట్ల.

* దీనితరవాయి శ్రీశర్మగారు రచియించి ప్రకటించిన 'తులసీదాసు రామాయణమున' గలదు.



## ఉత్కంఠ

వేంకటపార్వతీశ్వరకవులు

నిలువెల్లఁ గన్నైనఁ దిలకింపఁగలనేమొ
వెతదీర నీలీల విశ్వమూర్తి!
పలుకెల్ల శ్రుతియైనఁ బాడంగఁ గలనేమొ
ప్రియమార నీకీర్తి ప్రేమమూర్తి!
పొడవెల్లఁ బోలుపైనఁ బోలంగఁ గలనేమొ
తనివార నీహేలఁ దత్త్వమూర్తి!
గతియెల్ల సత్తైనఁ గలయంగఁ గలనేమొ
యలరార నీమూర్తి నాత్మమూర్తి!
నిన్నుఁ జూచుకన్నె నీమెచ్చుపాటయే
నీయెడందగూర్చు సోయగంబె
నీవు నేనుగాఁగ నెగడెడి భాగ్యమే
నాకొసంగుమయ్య లోకనాథ!

# మి థ్యా భి మా న ము

జం. వెంకటశర్మ, జం. శివన్నశాస్త్రిగార్లు

త్రాఁటియాధారమునఁ జేసి తోయజమ్ము
నీటిపై నీటుగుల్కు నయ్యాటలాడు
నటులు నేనును నీయాశ్రయమ్ముకతన
విఱ్ఱీఁగుచు నుంటిని వెఱ్ఱి నగుచు.

పుప్పొడియుఁ, జక్కఁదనమును, బూవుఁదేనె
కమ్మతావియుఁ గల్గు నక్కతనఁ గాదు
తోయజమ్మింత గుల్కుట, తూఁటిబలము
గలుగకుండిన నిది యింక నిలువఁ గలదె?

అన్నిటికి నద్దియే హేతువైనయటులు
నాదునునికికి నాదుమన్గడకు సర్వ
మునకు నీ వొక్కరుండవె మూల హేతు
బళిర! నీట మృణాళమ్ము పగిది నీవు
గానరాకుండి యింక నేఁ గమల మట్టు
తలను పై కెత్తికొనుచు మిథ్యాభిమాన
మూనఁగాఁ గారణం బవుచుందు వేల?

('పూఁదేనె' నుండి)




చెన్నపట్టణము ఆగష్టు ౧౯౨౫

సంపుటము ౨. క్రోధన సంవత్సరము, శ్రావణమాసము సంఖ్య ౮.


# ప్ర తా ప భా ను ని చ రి త్ర ము

(శ్రీ తులసీరామాయణములోనిది)


భాగవతుల నృసింహశర్మగారు


(రెండవసంపుటము - ఆఱవసంచిక తరువాయి)

కుడిపితి బ్రాహ్మణోత్తములకున్ గడుపార, నిదాఘవేళలన్
దడిపితి సర్వజీవముల నాలుకలన్ విమలాంబుధారలన్;
బుడిసిలినీరు చేకురదు; మున్నొనరించిన నోము లన్నియున్
జెడి నశియించెనే? యడవిఁ జిక్కితిఁ బొక్కితిఁ జేవఁ దక్కితిన్.

క. కడ కివ్వడువునఁ గడుఁ గడుఁ, జిడిముడిపడి, పొక్కి, మోము చిటచిటలాడన్
దడఁబడెడు వారువంబును, నడపించుచు వెడలె భూమినాయకుఁ డడవిన్.

క. కోరిందడొంకలం బడి, చేరువఁగల మలల దాటి చిట్టడవులలో
వారువము బుజ్జగించుచుఁ, గోరిక లీడేఱ నొక్కకోనం గాంచెన్.

గీ. కానలోఁ గానరాని యక్కోనలోన, నాశ్రమం బొండు నిర్మించి విశ్రమించు
కపటముని వేషధారినిఁ గాంచె నతఁడు, వెలఁది! రానున్న కీడుఁ దప్పింపవశమె?

మ. మును పెవ్వాఁడు ప్రతాపభానున్నృపుతోఁ బోరాడి యయ్యాహవం
బున సర్వస్వముఁ గోలుపోయె, విను మభ్భూపాలుఁ డిక్కానలో
మునివేషంబున డాఁగియుండె, నిపు డీభూపాలుఁ డిచ్చోటికిన్
జను దేరం గని పోల్చి లోనలరె, నీర్ష్యాగ్రస్తుఁడై మానినీ!

గీ. ఆఁకటికి దప్పికిని డస్సి వీఁకచెడిన, భూపుఁ డాతని నిక్కంపుమునిగ నెంచెఁ;
గపటముని వానికిం దటాకంబుఁ జూపె; వారువముతోడ నాతండు వారిఁ జొచ్చె.

గీ. స్నానముం జేసి విమలాంబు పానమునను, శ్రమ నివారించి, వార్చి, యాశ్రమముఁ జేరె;
గందమూలాదులన్ దన్పి కపటమౌని, సాంధ్యసమయంబునన్ వానిసరస కేగె.

ఉ. "పువ్విలుకాని నీచెలువు పొమ్మనుఁ గిమ్మననీయ దక్కటా!
ఎవ్వఁడవయ్య? యొంటిమెయి నివ్వనసీమఁ జరింప నేటి కీ
జవ్వన మిమ్మృగావళులఁ జంపునిమిత్తము వెచ్చఁబెట్టుదే?
ఇవ్విధినున్న నిన్నుఁ గని యెంతయుఁ గుందెద నేమి సేయుదున్."

క. ఇంద్రుఁడ వౌదువా? లేకయు, పేంద్రుఁడ వౌదువా? కళంకహీనుఁడవై యా
చంద్రుని నిరసించు యశ, స్సాంద్రుఁడవో" దనిన రాజచంద్రుఁడు నగుచున్.

ఉ. "ఇంద్రుఁడఁగాను, వెండియు నుపేంద్రుఁడఁగాను, ప్రతాపభానురా
జేంద్రునిమంత్రి నౌదు, వినుఁ డేఁ జనుదెంచితి వేఁటకంచు ని
స్తంద్రమదంబునన్; బథముఁదప్పితి, దప్పికిఁ జిక్కి పొక్కితిన్
సాంద్రవనాంతభాగముల సంచరియించితి మిమ్ముఁ గాంచితిన్."

గీ. అనినవిని దంభముని యిట్టు లతనికనియెఁ, "గటికిచీకటికిం దోడు గాలివాన
దుర్గమంబు వనంబు, నీదుర్గసీమ, చాలదవ్వుగనుండు నిచ్చటికి ననఘ!

గీ. ఒక్కత్రుటిలోన వేఁగు, బ్రత్యూషమునను, లేచిపోవచ్చు, నందాక వేచియుండు
మంధకారబంధురమైన యడవిఁబట్టి, ఊరికేగుదె? డెబ్బది యోజనములు."

క. "నల్లె" యని భూమిపాలుం, డల్లనగుఱ్ఱంబుఁగట్టి యవనిజమునకున్
మెల్లఁగ నిట్లనె "నోమునివల్లభ! ననుమీసుతునిగ భావింపఁదగున్.

క. మీమోముఁజూచినంతన, నామానసమందు జ్ఞాననయనము దోఁచెన్;
నామపవిత్రాక్షర శుద్ధామృతమే నాస్వదింతు నానతియీరే?"

క. అహహా! ప్రతాపభానుఁడు, కుహనామునిఁ జూచి పోల్చుకోనఁజాలం డా
మహిపాలు నాతఁ డెఱిఁగెను, తుహినాద్రిజ! యెఱుఁగరాదు ద్రోహులమతముల్.

క. ఆరాజవర్యుఁ గనుఁగొని, వైరంబును గప్పిపుచ్చి; వాత్సల్యం బే
పారఁగ, నమ్ముని మృదువా, గ్ధోరణితో నిట్టులనియెఁ దోయజనేత్రా!

క. "నను భిక్షుకుఁడండ్రు జనుల్, జనసన్నుత! నాకు ధనము సదనముఁ గలదే!
మునివృత్తి నివ్వనంబున, దినములు వెళ్ళించుచుందు, దెప్పరమయ్యున్."

చ. అనవుడు భూపుఁ డిట్లను: "మహామహిమంబును గప్పిపుచ్చి ని
వ్వనమున సంచరింతు రొకపాటిజటింబలె, నోర! సత్తపో
ధనులరు, స్వార్థమున్విడిచి ధన్యతఁగాంచినవారు, మిమ్ములన్
గనుఁగొన నొప్పదే నివురుఁగప్పిన నిప్పుగ సంయమీశ్వరా!

క. నిర్ధనియు, శాంతమూర్తియు, స్వార్థత్యాగియు, సకలజనావనుఁడును, మో
క్షార్థులు, పావనులని, వేదార్థము నిగదించుఁగాదె యనఘ! మునీంద్రా!

చ. శివుఁడవొ? పద్మగర్భుఁడవొ? శ్రీహరివో? పరికింపఁజాల నో
ప్రవిమలచిత్త! నీదు పదపద్మములంబడి సన్నుతింతు, ఘో
రవనమునందు మత్తనువుఁ బ్రాణముఁ బ్రోవఁగ వచ్చినట్టి యా
వెవఁడ వనుగ్రహింపఁగదవే? తలవాంచి నమస్కరించెదన్."

క. అన విని కుహనాముని నెమ్మనమునఁ గడు సంతసించి క్ష్మావిభువర్యుం
గని యిట్లను:-"విను మనఘా! వనమున నివసించువాఁడ వైరాగ్యమునన్.

గీ. జపతపోవనసీమకు, జ్వాలఁబోలు, లోకమాన్యత మునులము మాకుఁ దగదు;
జనము నీక్షింపకుండ నివ్వనమునందుఁ, గాలముంబుచ్చుచుందు నిక్కంబు వినుము.

గీ. కపటసుందరవేషంబుఁ గాంచినంతఁ, జతురుఁడున్ వంచితుం డగు, జనవరేణ్య!
మధురవాక్కుల నాలించు, మాత్రమునను, మానవుఁడు విశ్వసించిన హానియొదవు.

క. జనసంబంధముఁ బాసితి, వనమున నేకాకినగుచుఁ బగతత్త్వాస
క్తిని ముప్పొద్దులఁ గడపెద; ననఘా! బ్రహ్మంబుఁదక్క నన్యముఁ దలఁపన్.

క. సర్వజ్ఞుఁడు భగవంతుం, డుర్విం గల భక్తకోటి కొసఁగును ఫలమున్;
ఉర్వీశవినుతవర్తన! గర్వింపఁగరాదు చూవె జ్ఞానంబునకున్.

క. తలఁపున భక్తి శ్రద్ధలు, వెలయఁగ నాయందుఁ బ్రీతి విశ్వాసములన్
గలవాఁడవు, నినుఁ గాదను, పులుమానిసి కెట్లు కీడు మూఁడకయుండున్."

చ. పొలఁతి! ప్రతాపభాను నృపపుంగవుఁ డింటికివచ్చె, నొంటిమై
నలువుగఁ జిక్కెనంచుఁ గుహనాముని యివ్విధి ముచ్చటించి లో
నలరుచు "నన్ను నేకతనుఁ డందురు హానులు నిక్క మింతయుఁ
దెలిపితి"నన్న భూవరుఁడు నెమ్మది నమ్మికఁ గల్గి యిట్లనున్.

చ. "నను భవదీయదాసునిగ నమ్మి కృతార్థునిఁ జేయరాదె? స
జ్జననుతచర్య! యేకతనుశబ్దములం గల భావమెట్టిదో
వినియెద నానతిం"డనిన "వెంగలి యీ నరనాథపుంగవుం"
డనుచుఁ దలంచి యిట్లనియె నక్కపటాత్ముఁడు నక్కకైవడిన్.

క. సృష్టికిమును నే నీ తను, యష్టిం గైకొంటి నిట్టు లలరుచు నుంటిన్;
నష్టంబుఁ బొంద నెన్నఁడు; స్పష్టంబుగఁ జెప్పినాఁడ భక్తుఁడ వగుటన్.

గీ. తనువు విడనాడ, రెండవతనువుఁ బొంద, నేకతనునామ మివ్విధి నాకుఁ జెల్లు
దీన నాశ్చర్యముం బొందనేనె? రాజ! తపమునకుఁ గానికార్య మేతలను గలదె?

గీ. బ్రహ్మ సృష్టింపఁజాలెఁ దపంబువలనఁ, దపమునన్ శౌరి పాలింప దక్షుఁ డయ్యె
భర్గుఁడు హరింపఁజాలెఁ దపంబు కలిమిఁ, గార్యసిద్ధికి మూలంబు ఘనతపంబు."

గీ. పొలఁతి! యీరీతి నమ్మికఁబుట్టఁ బలికి, తనదు మాహాత్మ్యముం దెల్పుకొనఁ దలంచి
నట్లు నటియించి, దరహాస మంకురింప, నృపవరుంజూచి వెండియు నిట్టు లనియె.

మ. "అవురా! నీవు ప్రతాపభానుఁడవు గావా? చెప్పుమా వాని మం
త్రివె? యుద్దండబలుండవౌదు, సకలద్వీపంబులం గెల్చినాఁ
డవు! సాధారణ రాజమాత్రుఁడవె? స్పష్టంబయ్యెమున్ దివ్యదృ
ష్టి విలోకించిన సర్వమున్ మునులకున్ శీఘ్రంబుగన్ భూవరా!

క. అరిమర్దనుఁ డరిమర్దనుఁ, డరయఁగ నీ యనుఁగుఁదమ్ముఁ డలరునె సుఖియై?
వరరాజనీతిఁగఱచిన, స్థిరబుద్ధికి ధర్మరుచికి క్షేమమె చెప్పుమా?

క. నీతండ్రి నిత్య సత్యని, కేతనుఁ డన నొప్పు సత్యకేతుఁడు గాఁడా?
భ్రాంతియె? నీ కపటేంగిత, చాతుర్యమునే గ్రహింపఁజాలనె? చెప్పుమా.

గీ. అనృతము వచింపఁదగదైనఁ గినియఁజూనె, రాజులకు నొప్పు; నయ్యది రాజనీతి
మండలాధిపు లొక్కెడ మఱుఁగుపఱచి, మాటలాడుటయున్ లెస్స క్ష్మాతలేంద్ర!

క. గురుకృపవలన లభించిన, వరదృష్టింజూడ నీదు వైనము దెలిసెన్.
వర మొండు వేఁడు మొసఁగెద, నరనాయక! సన్నుత సురనాయక! వినుమా."

క. అనవుడు భూవరుఁ డిట్లను, వినయంబున: "రాజులకు లభింపకయున్నె
మునులను సందర్శించిన, మునుకొని ధర్మార్థకామమోక్షము లనఘా!

చ. జననుత! నీవు నాయెడఁ బ్రసన్నుఁడవై వర మొండువేఁడు మి
త్తునని వచించి తాత్మఁ గృపదోఁపఁగ; ధన్యుఁడ నైతి సత్తపో
ధనుల కృపావిశేషమున ధన్యతఁగాంచనివాఁ డెవండు? నీ
నెనరున శోకముం దొలఁగి నేను సుఖించెద నెల్లభంగులన్.

(సశేషము)




కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

(౨ సంపుటము ౭ సంచిక తరువాయి)

## అభ్యంతర పరిశీలనము

నన్నయభట్టారకుఁడు వనపర్వములోఁ గొంతవఱకే వ్రాసి మృతినొందెననియు, నా శేషము నెఱ్ఱనవఱకు నెవ్వరును బూరింపలేదనియు, నెఱ్ఱనమహాశయుఁడు నన్నయకుఁ గలిగిన మరణమే తనకును గలుగునను భీతిచేఁ దన పేరు పెట్టుకొనక నన్నయ పేరనే యద్దానిని లోకహితార్థమై విరచించెననియు, ననాదిసిద్ధమగు ప్రతీతి లోకసామాన్యమునందును, నసామాన్యకవిపండిత లోకమునందునుగూడఁ గలదు. ఇయ్యది పైన నేను వ్రాసిన దానిని రూఢిచేయుచున్నది. శంభుదాసుఁడారణ్య పర్వశేషమును స్వతంత్రముగ వ్రాసెనను ప్రతీతి లోకమునందు నేఁటివఱకును గలదు. దీని కిటీవలివారు కొన్నియభ్యంతరములను గలిగించుకొనిరి. వాని నిందు విమర్శించెద.

వాగనుశాసనుఁడారణ్యపర్వములోఁ బూర్వభాగమునే విరచించెననియుఁ బరభాగము నెఱ్ఱనార్యుఁడు పూరించెననియుఁ దలంచుటకు గట్టియభ్యంతర మొక్కదానిని నేఁటివారు కలిగించుకొనుచున్నారు. అదియేది యనఁ, దిక్కన మహాకవికృత విరాట్పర్వపీఠికలో నా మహాశయుఁడు నన్నపార్యుఁ డంతకుఁబూర్వము మూఁడు కృతులు వ్రాసెనని చెప్పియుండుట.

## తిక్కనార్యుని విరాటపర్వపీఠికావిమర్శనము

ఈ కవిసత్తముఁడు తన విరాటపర్వపీఠికలో "అందాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండువి, ద్యావిభుతుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" అని వ్రాసె. ఈతఁడు, నన్నపార్యుఁడు మూఁడుకృతులు వ్రాసియుండెనని చెప్పియుండుటచేతను, దాను విరాటపర్వము మొదలుకొనిమాత్రమే యాంధ్రీకరించియుండుటచేతను, నన్నపార్యుఁడు మూఁడుపర్వములు పూర్తిగ వ్రాసియుండునని యిప్పటి మనవారు కొందఱు తలంప మొదలిడిరి. ఇదియే మూలకీలకమని నే నిదివఱకే వ్రాసియున్నాను. దీని నాధారము చేసికొనియే మన వీరరాజుపంతులవారు కాశీసూర్త్యభిప్రాయముల నిర్మింప మొదలిడిరి. కాని యిదియొక పెద్ద యభ్యంతరము కాదు. ఎఱ్ఱనమహాశయుఁడు తన భారతభాగమునందును, తన నృసింహపురాణమునందును, దానారణ్యపర్వశేషపూరణము కావించితినని చెప్పుకొనియున్న దానిని ఖండింపఁజాలను. దీనికి వీరేశలింగము పంతులవారు తమకవులచరిత్ర నూతన సంపుటములో సమాధానము చెప్పియేయున్నారు. దానిని మనవీరరాజు పంతులవారు సరిగ ఖండింపఁ గలిగియుండలేదు.

తిక్కనసోమయాజి తాను లోకవిదితములైయున్న కొన్నికారణములచే విరాటపర్వము మొదలుకొనియే తెనిఁగింపఁ బ్రారంభించెను గావునను, నంతకుఁ బూర్వము శబ్దశాసనుఁడు రెండుపర్వములకు పైఁగా మూఁడవపర్వములోఁ జాలభాగమువఱకు విరచించెను గావునను స్థూలదృష్టిచే నన్నయ మూఁడుపర్వములు చెప్పెనని వ్రాసియుండె.

స్థూలదృష్టిచేఁ జేయఁబడు పరిగణనవిషయములో నిట్టివి తటస్థించుట సామాన్యమే. కాళిదాసమహాకవి తన మేఘసందేశములో యక్షునిశాపము కార్తికశుద్ధైకాదశివఱకు గడువు కలదని వ్రాసె. (శాపాంతో మే భుజగశయనా దుత్థితే శార్ఙ్గపాణౌ) ఇట్లు చెప్పియును మఱల నాషాఢశుద్ధ పాడ్యమినాఁడు మేఘుఁడు తనశాప మిఁక

నాల్గుమాసముల గడువు కలిగియున్నదని (శేషాన్మాసాన్ గమయ చతురో లోచనే మీలయిత్వా) లిఖించె. న్యాయముచే నాషాఢశుద్ధపాడ్యమి మొదలు కార్తిక శుద్ధైకాదశివఱకు గలకాలము నాల్గుమాసములుపదిదినములు గాని నాల్గుమాసములు కాదు. అయినను కాళిదాసు నాల్గుమాసము లని లిఖించె. ఇది తప్పనికాని, యామహాకవికి లెక్క తెలియదనికాని చెప్పవచ్చునా? స్థూలదృష్టిచే నట్లు వ్రాసెననికదా చెప్పవలెను. మఱియును రాజుల కాలమును దెలుపుటలో నేఁడువత్సరముల యైదు మాసములు పరిపాలించినచో నెనిమిదివత్సరము లనురీతిగా శాసనకారులు కొందఱు స్థూలదృష్టితో వ్రాయుట గలదు. అట్టిదియే యిదియు నైయున్నది.

మనము స్థూలదృష్టిచేఁ దిక్కన యుత్తర రామాయణము వ్రాసె నందుము.

"మ. వరుసం దిక్కనయజ్వ నిర్వచనకావ్యం బైతగం జేసె
నుత్తరరామాయణ మందున న్మఱి ప్రబంధం బూని
నిర్మించుచో, సరసత్వంబని ప్రాజ్ఞులార! నిరసించంబో
కుఁడీ రాఘవేశ్వరు చారిత్రము లెంద ఱెన్ని గతుల
న్వర్ణించినం గ్రాలవే".

అని కంకంటి పాపరాజు (పుష్పగిరితిమ్మన్న) తిక్కన్న యుత్తర రామాయణముఁ బూర్తిగ వ్రాసినట్లు చెప్పియున్నాఁడు. ఇట్లనుచున్నవా రిటీవలఁ బలువురుగలరు. కాని వారెల్లరును దిక్కన తుదిభాగమునఁ గొంత వ్రాయక విడిచెననియు, దానిని జయంతి రామభట్టు పూరించెననియు నెఱుఁగనివారు కారు. ఇట్లనేకములు గలవు. రామాయణచంపువు భోజుఁడు విరచించె ననుచున్నారు. కాని చంపువునంతను భోజుఁడు విరచింపలేదు. ఆతఁడు తుదభాగమును విడచియుండగా మఱియొకకవి దానిని బూరించె. గోల్డుస్మిత్తను నింగ్లీషుకవి 'రిటాలియేషన్' అను కావ్యమును వ్రాసెనందురు. కాని యాతఁడు దానినిఁ బూర్తిచేయలేదు. అయినను స్థూలదృష్టిచే చెప్పునపుడు 'గోల్డుస్మిత్తు' రిటాలియేషన్ వ్రాసెనందురు. అట్లేతిక్కనయు, నన్నపార్యుఁ డంతకుఁబూర్వము మూఁడుకృతులు వ్రాసెనని స్థూలదృష్టితో ననె ననుట యనుచితముకాదు. సర్వవిధముల సమంజసమే.

అది యట్లుండనిండు. అప్పకవ్యాదులు కూడ నన్నయ వ్రాసినవి మూఁడుపర్వము లనిరి. "గీ. ఆంధ్రశబ్ద చింతామణి వ్యాకరణము, మును రచియించి తత్సూత్రములఁ దెనుంగు, బాసచేఁ జెప్పె నన్నయభట్టు తొల్లి, పర్వములు మూఁడు శ్రీమహాభారతమున" ఇచ్చట మూఁడు పర్వము లనుదానికి మనవారేమి యర్థముఁ జెప్పెదురు? అప్పకవి, నన్నపార్యుఁ డారణ్యపర్వ మొనరించుచు నడుమ భీమకవి శాపము తగిలి మృతినొందెననియు మిగిలిన భాగమును నెఱ్ఱనార్యుఁడు పూరించెననియుఁ దలంచువాఁడు. తనగ్రంథములో నట్లు విస్పష్టముగ వ్రాసియున్నాఁడు. నన్నపార్యుఁ డారణ్యపర్వము పూర్తిచేయకయే నడుమ శాపహతుఁడై మృతినొందెననియు "స్ఫురదరుణాంశురాగరుచి" మొదలుకొని యెఱ్ఱన కవిత్వ మనియుఁ దలంచిన యప్పకవి మూఁడుపర్వము లని వ్రాసినప్పుడా వ్రాఁతకు మనమేమి యర్థము చేసికొనవలెను? ఈశంకను వీరేశలింగము పంతులవారు చేసియుండఁగా మనవీరరాజు పంతులువారు సమాధానము చెప్పక చల్లఁగ విడచిరి. అప్పకవి స్థూలదృష్టితో నట్లు వ్రాసెనని చెప్పుటకంటె నేఱుగతి మనకు లేదుగదా? అట్లే మూఁడుకృతు లని, తిక్కనమహాకవి వ్రాసినదానికిఁ గూడ నర్థము చేసికొనవలెను. అది యసంభవముకాదు. "నన్నయభట్టు వనపర్వములో మూఁడాశ్వాసములకుఁ బైఁగా రచియించియుండుటచేతఁ దిక్కనసోమయాజి రెండుపర్వముల మూఁడాశ్వాసముల 142 పద్యములని విశేషముగాఁ జెప్పక సామాన్యముగా మూఁడుకృతులని చెప్పినాఁడు. అంతియ కాని వేఱేమియు లేదు. లోకవ్యవహారమందుసహిత మొక సభకు వచ్చిన జనులు లెక్కకు సరిగా 836గురే యున్నను మనము సామాన్యముగా వేయిమంది వచ్చిరనియే చెప్పుదుము" అని వీరేశలింగం పంతులవారు చెప్పినట్లుగాఁ దిక్కనార్యుఁడు నన్నయ వ్రాసినది రెండుపర్వముల మూఁడాశ్వాసముల 142 పద్యములని వివరింప నవసరము లేదు. స్థూలదృష్టిచే మూఁడుకృతులని వ్రాసినాఁ డనుకొనుట సహజమే. బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తాము 1915 లో ప్రచురించిన శ్రీమదాంధ్రమహాభారతపీఠికలో వాగనుశాసనుఁడు వనపర్వములో "శారదరాత్రుల"ను పద్యమువఱకే లిఖించినట్లు సిద్ధాంతీకరించినవారై యుండియునుగూడ మఱల నన్నయ

భట్టు విరచిత గ్రంథవివరణ మొనరించుచు "ఇతఁడు భారతమందలి యాదిసభారణ్యపర్వములు నాంధ్రీకరించుటయే కాక లక్షణసారమను ఛందోగ్రంథమును ఆంధ్రశబ్దచింతామణి యను వ్యాకరణమును ఇంద్రవిజయ మనెడి కావ్యమును రచించినట్లు తెలియుచున్నది" అని వ్రాసిరి. స్థూలదృష్టిచేతనే కదా యీ పండితు లిట్లు వ్రాసిరి. అట్లైన తిక్కనమహాశయుఁడును వ్రాసె. సగముకంటె నెక్కుడుగా నున్న భాగమును లెక్కలోనికిఁ దీసికొనక తిక్కనమణి త్రోసివేయునా? యని మన పంతులవా రడుగుచున్నారు. ఎఱ్ఱనార్యుఁడు వనపర్వశేష పూరణమునకై ప్రయత్నించునప్పటికి నాదిపర్వద్వయమును, మూఁడవపర్వములోఁ గొంతభాగమును నాంధ్రీకరింపఁబడినవి. మఱల విరాటపర్వము మొదలుకొని తిక్కన పదునేను పర్వములును దెనిఁగింపఁబడినవి. మిగిలిన దొక్క యారణ్యపర్వశేషమే. ఒక చిన్న భాగమే మిగిలినది కావునను, తనకవితాపటుత్వముఁ జూపుట కది ప్రారంభము కావునను నెఱ్ఱనార్యుఁడు నెమ్మదిగాఁ గొంచెము పెంచి వ్రాసినదానింబట్టి సగము కంటె నెక్కుడుగా మిగిలినదని యనుకొనరాదు. బహుపర్వముల్వ్రాయవలసి యున్న తిక్కనయే వనపర్వ శేషమును బూరించిన,జాల సంగ్రహపఱచి యుండును. సంగ్రహపఱుచు స్వభావముగల తిక్కన మహాశయునకు వనపర్వశేషము గొప్పదిగాఁ గాన్పింపకపోవచ్చును. కావున మూఁడు కృతు లని స్థూలముగా వ్రాసియున్నాఁడు. అంత మాత్రముచేఁ బ్రబలాధారములచేఁ సిద్ధాంతీకరింపఁబడుచున్న వనపర్వశేష పూరణము శంభుదాసుని స్వతంత్రకవితాకలితముకాదనుకొనుట ధర్మము కాదు. ఎఱ్ఱనార్యుఁడు చెప్పినదానిని దిక్కన సోమయాజి వ్రాసినది ఖండించివేయదు. ఆరణ్యపర్వశేష మెఱ్ఱనార్యుఁడు స్వతంత్రించి వ్రాసినట్లు బహు నిదర్శనములు కాన్పించుచున్నవి. కావున తిక్కన స్థూలదృష్టితో మూఁడుకృతు లని వ్రాసెనని తలంచుటలో హానిలేదు. అట్లు తలంచిన సర్వవిషయములును సమన్వయమగుచున్నవి. లేకుండిననే చిక్కు తటస్థించుచున్నదని విజ్ఞలోకమునకు విన్నవించుకొనుచున్నాఁడ. మారనాదులు నన్నయ త్రిపర్వములోనర్చెనని వ్రాసినదానికి నిదియే సమన్వయము.

## ఉత్పన్న వాదము

మనవా రిప్పు డీనవవాదమును దెచ్చి పెట్టుటకు ముఖ్యకారణము తిక్కనాదులు నన్నయ మూఁడుపర్వములు వ్రాసెనని లిఖించుటకదా! దీనిని వాదము నిమిత్తము యథాక్షరముగాఁ దీసికొనినను శ్రీవీరరాజుపంతులవారి వాదమే సత్యమని గ్రహించుటకు నిర్వివాదావకాశము గాన్పించుటలేదు. శబ్దశాసనుఁడు ప్రథమ పర్వత్రయమును బూర్తిగా వ్రాసెనుగాని యందు 'శారదరాత్రు'లను పద్యమునకుఁ దరువాతి భాగమంతయు నేహేతువుచేతనో యుత్పన్నమై పోయినదనియు నెఱ్ఱనార్యుఁడు స్వంతకవిత్వముచేఁ బూర్తి కావించెననియు విమర్శకాగ్రణులగు శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారు మున్నగువారు వ్రాయుచున్నారు. వీరినేల నమ్మరాదు? నిర్వచనోత్తర రామాయణములోఁ దుది కథను కొంత తిక్కన తెనిఁగింపక విడిచెనని పూర్వులగు రామభట్టాదులు చెప్పుచుండినను దానిని సరకుసేయక యా భాగములుకూడఁ దిక్కన విరచించియుండఁగా నయ్యది యీవల నుత్పన్నమైనదేమో యని తలంప సాహసించిన శ్రీ వీరరాజు పంతులవారు నన్నయ మూఁడు పర్వములనుఁ బూర్తిగ వ్రాసినను 'శారదరాత్రు'లను పద్యమున కీవలనుండి మిగిలినభాగ మీవల నుత్పన్నమైనదనియు నా యుత్పన్నమైనదానిని శంభుదాసుఁడు స్వతంత్రకవిత్వముతోఁ బూరించెననియు నేల తలంపరాదు? ఈ యుత్పన్నవాదమే శ్రీవీరరాజు పంతులవారి వాదముకంటెఁ గొంత సరసముగ నున్నది. ముందు పుట్టినదిగాఁగూడ నున్నది. ప్రాచీనులు వ్రాసిన వ్రాఁతలకుఁ గవిస్తుతులకు లక్షణగ్రంథములకు లోకప్రతీతికి నిది కొంత సరిపడుచున్నది. ఉభయభాగములందున్న కవిత్వభేదములకుఁ గల కారణమును దెలుపుచున్నది. తిక్కనమహాశయాదులు వ్రాసిన వ్రాఁతల కనుగుణముగా నున్నది. ఇట్టిదానిని దమవాదముకంటె ముందుగా బయలువెడలిన వాదమును మన వీరరాజు పంతులుగారు కారణములేని కలవుపాటుతోఁ ద్రోసివేసిరి. హేతువు చూపకయే యది సమంజసవాదము కాదనిరి. అట్లు వ్రాయుట యుచితము కాదు. కాని పంతులవారు వ్రాసిన దగ్రాహ్యము.

## పులిమీఁద పుట్ర

పూర్వాపరసందర్భముల నాలోచింపక పూర్వులు వ్రాసిన వ్రాఁతలనెల్ల యథాక్షరముగ దీసికొందుమేని బహువిధములగు వింతలు బయలువెడలును. రాజనరేంద్రుని కాలములోఁ బర్వత్రయమేకాక యష్టాదశపర్వములును నాంధ్రీకరింపఁబడినవని చెప్పుకొనవలసివచ్చును! ఏమన, శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులువారు కనుఁగొనిన శాసనములో రాజనరేంద్రుఁడు భారతమాంధ్రీకరించెనని (ఆంధ్రీచకారవర భారత వంశవృత్తమ్) అని తెలుపఁబడి యున్నది. అంతియేకాని మహాభారతములో మూఁడుపర్వములు మాత్రమే తెనిఁగింపఁబడెనని వ్రాయఁబడి యుండలేదు. ఈశాసన మించుమించుగాఁ దిక్కనమహాశయుని నాఁటిదే. ఈ ప్రాచీనశాసనమును బట్టి రాజనరేంద్రునినాఁడే భారతమంతయు నాంధ్రీకరింపఁబడినట్లు కాన్పించుచున్నది. నాఁడు పూర్తిగ నాంధ్రీకరింపఁబడిన భారతములో నే హేతువుచేతనో పదునేనుపర్వములుతిక్కననాఁటికి నుత్సన్నములై పోయినవి. కావున నతఁ డాపదునేనింటిని మఱలఁ బూరించె. ఎఱ్ఱననాఁటికి మిగిలిన మూఁడుపర్వములలో నాఱల నుత్తరభాగము నష్టమయ్యె కావునఁ బ్రబంధపరమేశ్వరుఁడు పూరించె. మొదట నన్నపార్యుఁడు పూర్తిగ నాంధ్రీకరించియుండఁగాఁ గాలకర్మవశమున నాగ్రంథమిటీవల జాలవఱకు నుత్సన్నమైపోయిన దనియు, నా యుత్సన్నభాగము నిటీవల తిక్కన ఎఱ్ఱనాదులు పూరించిరనియు శ్రీ నారాయణరావుగారి శాసనముఁ బట్టి భావించుకొనుట యుచితముకదా! అనిన మనవీర్రాజు పంతులవారు మున్నగువా రేమందురో? రాజనరేంద్రుని కాలములో భారతమంతయు నాంధ్రీకరింపఁ బడకుండిన రాజరాజనరేంద్ర మహాశయుని వంశస్థుఁడగు పై శాసనకర్త తనశాసనములో 'ఆంధ్రీచకారవర భారత వంశవృత్త'మ్మని వ్రాయించునా? ఇంకను నీయూహకు నుపబలముగ నన్నయ్య భారతము వ్రాసెనని లిఖించినవారు గూడ కలరు. శ్రీకృష్ణభారతపీఠికలో శ్రీ నాగపూడి కుప్పుసామయ్యగారిట్లు వ్రాసిరి. "నన్నయ భట్టారకుఁడు తానువ్రాసిన భారతమును రాజమహేంద్రవరపురవరాధీశ్వరుండగు రాజరాజ నరేంద్రున కంకితముఁ జేసినమాడ్కి—" దీనింబట్టి నన్నయభట్టు భారతము నంతను వ్రాసెనని శ్రీకుప్పుసామయ్యగారు తలంచి రనుకొనఁదగునా? అట్లు తలంపరేని నన్నయ రెండు పర్వములును, నఱయును, వ్రాసె ననక, భారతమని వారేల వ్రాసిరి? ఇట్టి యూహలు బయలు వెడలినఁ జరిత్రాంశము లన్నియుఁ దాఱుమాఱగును గావునఁ దిక్కన వ్రాసినదానిని యథాక్షరముగాఁ దీసికొనక స్థూలదృష్టితో వ్రాసిన దానిఁగా గ్రహించుట యుచితము.

## వనపర్వశేషమునుదిక్కన యేల తెనిఁగింపలేదు?

తననాఁటికి నాదిసభాపర్వములును, నరణ్యపర్వములో గొంతభాగమును, మాత్రమే యాంధ్రీకరింపఁబడి యుండఁగా, నారణ్యపర్వశేషమును దిక్కన మహాశయుఁడు పూరింపక యేల విడచెనని మన పంతులవారు శంకించుచున్నారు. కాని యీశంక కవకాశము లేదు. ఏమన, నాతఁడు వనపర్వశేషమును పూరింపకుండుటకుఁ గల కారణమును ననాదిగా వచ్చుచున్న లోక ప్రతీతి బోధించుచునే యున్నది. ఆరణ్యపర్వమును వ్రాయుచు హఠాత్తుగా వాగనుశాసనుండు మృతినొందుటచే నాపర్వవిషయమున లోకములో నమితమగు భీతి యుదయించినది. దానికిఁ దోడుగా భీమనశాపము "వనములో నున్నాఁడా" యనుమాటల మూలము గావలెనని నమ్మక ముండుటచే నీహఠాన్మరణము కలిగినదను తలంపుదయించినది. అందుమూలమున నారణ్యపర్వమును స్పృశించుటకు నెంతటివారైన జంకెడివారు. పూర్వకాలమున నాంధ్రారణ్యపర్వ విషయములో జంకెట్లుండెడిదో శ్రీ వీరరాజుపంతులవారే తమవ్యాసములో వర్ణించియున్నారు. వనపర్వమును వ్రాయుటకును జదువుటకును దుదకు గంట, సరిగ జూచుటకునుగూడ జంకెడివారఁట. అంత భీతి యాపర్వవిషయములో లోకమునఁ గలిగి యున్నపుడు తిక్కన దానిని బూరించుటకు జంకుట యసంభవము గాదు.

## ఈభీతి పండితులదా? పామరులదా?

ఈభీతి పండితలోకములోఁ బుట్టినదేకాని పామరలోకములోఁ బుట్టినదికాదు. నన్నయ రచించిన వనపర్వభాగమందలి పద్యములమాట తలపెట్టుటకే యాంధ్ర

కవితాపోషకుఁడగు రాజనరేంద్రుఁడు జంకెనని మన వీరరాజు పంతులవారు వ్రాసిరి. ఇతఁడు పండితుఁడు కాఁడా? వివేకి కాఁడా? మరియును, పౌరాణికులు భారత పురాణ పఠనము చేయునపుడు సభాపర్వానంతరమున వనపర్వమును, బఠించుటకు జంకుదురని మనపంతులవారు వ్రాసిరి. పౌరాణికులు పండితులు కారా? వారి కీజంకేల పుట్టుచున్నది? ఎంతటి పండిత కవులకైనఁ దమకాలము నందలి విశ్వాసములయందును, భీతులయందును, నమ్మకముండక పోదు. కావునఁ దిక్కనకును నారణ్యపర్వశేషమును రచించుటకు భీతిపుట్టుట తగియే యుండునని వీరేశలింగం పంతులవారు తమ కవులచరిత్రలో వ్రాసిరి. అది సత్యమే. చక్కని కవిత్వముఁ జెప్పువారికిని గొన్ని వెఱ్ఱు లుండవచ్చును. మన వీరరాజు పంతులవారి యీ క్రింది వాక్యములఁ గనుఁడు. "శ్రీకృష్ణాష్టమీదినసంబునఁ బోతనార్యుని భాగవతమును జదువువారి నధిక్షేపించిన వృద్ధవిద్వత్కవి యొకఁ డిప్పుడును గలఁడు" ఇతఁడు విద్వత్కవిగదా! ఇట్టివాని కీచాందసత్వ మేల కలిగె? అట్లే విద్వత్కవి యగు తిక్కనకును బై చాందసత్వము కలిగినది. ఈతఁ డెంతటి మహాకవి యయినను గొన్ని వెఱ్ఱులు లేనివాఁడు కాఁడు. ఈతఁడు విరచించిన గ్రంథములు రెండు. వానిలో మొదటిదానిలో (నిర్వచనోత్తర రామాయణములోఁ) దుదిభాగమును బూరింపఁడాయె. రెండవ గ్రంథములో (భారతములో) మొదటిభాగమును ఆరణ్యపర్వశేషమును) బూరింపఁడాయె. భగవద్గీతాదులను దెనిగింపఁడాయె. దేవసన్నిధిని గాని గ్రంథమును వ్రాయఁడాయె. ఇట్టి చాందసత్వము లనేకములు గలవు. ఇట్టిస్థితిలో రాజనరేంద్రునంతటివానికి వనపర్వములోని పద్యమొక్కటియైన స్పృశించుటకైన భీతిని పుట్టించునంతటి భయము పండితలోకములో నున్నప్పుడు చాందసుఁడగు తిక్కనార్యునకు వనపర్వశేషమును బూరించుటకు జంకు బుట్టుట యసంభవముకాదు. ఇంతయేల? ఇంతలు వ్రాసిన మన వీరరాజుపంతులవారు కూడ వనపర్వము నన్నయను మ్రింగివేసినదని లిఖించిరి. నవనాగరికులైన వీరేశలింగంపంతులవారుకూడ కవిత్వవిషయములో 'శాపానుగ్రహశక్తియుక్తుఁ డనఁ గవి' యను నర్థము చెప్పు చాందసయుక్తిలోనికి వచ్చిరి. కావున పరమచాందసవృత్తిచే భీతిల్లి తిక్కన మఱి యరణ్యపర్వమును స్పృశింపక విడచె ననుటయే యుచితము. అట్లు కాదందురేని దననాఁటికి నయ్యది విశేష శిథిలావస్థలోనుండి పఠనార్హత లేకయుండెడి దనియైనఁ జెప్పుకొనక తీరదుకదా! ఈ శైథిల్యావస్థను బోఁగొట్టినంగాని భారతము పఠనయోగ్యము కానేరదని యెఱ్ఱనమహాశయునకుఁ దోఁచిన యుదారభావము మన తిక్కన కేల తోఁచకపోవలె! ఆరణ్యపర్వ విషయములో నెఱ్ఱన మహాశయుఁడు చేసిన పనిని దిక్కనమహాశయుఁడు, మొదట గావించి యాపై మిగిలిన పదునేనుపర్వములును ముట్టవలసియుండునుగదా! ఎట్లైనను దిక్కమణి వనపర్వశేష విషయములో నుపేక్షాభావమును వహించినాఁడని చెప్పక తీరదు. సోమయాజి రామాయణకాండ షట్కము తెనిఁగింపఁబడుటకుమున్నె తానుత్తరరామాయణమును రచించినాఁడు. పూర్వభాగ మాంధ్రీకరింపఁబడకుండినను తా నుత్తరభాగ మాంధ్రీకరింప మొదలిడినాఁడు. అట్టివాఁడు లోకభీతితోఁ గూడుకొనియున్న యీ యరణ్యపర్వశేషమును విడిచి విరాటపర్వమునుండి వ్రాయ మొదలిడుట వింతకాదు. కాఁబట్టి యనాదిగ కవిపండితలోకములో ననుశ్రుతముగా వచ్చుచున్న ప్రతీతిని నమ్ముటయే సమంజసము.

## అథర్వణునిం గూర్చి

తిక్కన కొకవేళ పైభీతి యున్న దనినను నథర్వణుఁడు జైనుఁడు కాన నాతని కాభీతియుండ నవకాశము లేదనియు, నట్టి యవకాశములేని యథర్వణుఁడు కూడ విరాటపర్వము మొదలుకొని భారతాంధ్రీకరణ మొనరించె ననియు, మరణభీతిలేనివాఁడుకూడ నారణ్యపర్వ శేషమును బూరింపక విరాటపర్వమునుండి మొదలిడుటకుఁ గారణము లేమనియు మన వీరరాజు పంతులవారు శంకించుచున్నారు. మతవిషయములో జైనులు మనకంటె భిన్నులైనను మరణభీతి లోనగు విషయములలో వారును మనయట్టివారె. అథర్వణుఁడు తన ఛందస్సులో వ్రాసిన యీ క్రిందిపద్యమును గనుఁడు.

'క. మగణమ్ము గదియ రగణము
వగవక కృతి మొదట నిలుపువానికి మరణం
బగు నిక్కమింద్రుఁడు మడియఁడె
యగునని యిడి తొల్లి వెంకటాదిత్యుఁ డనిన్.'

దీనింబట్టిచూడ కవితావిషయములో మనవారి కెన్నిభీతు లున్నవో అథర్వణునకును నన్నిభీతు లున్నవని తేలుచున్నది. అదిగాక యితఁడాదిపర్వము మొదలుకొని భారత మాంధ్రీకరించినట్లు లోకప్రతీతి కలదు. "పదిదినము లయిదు ప్రొద్దు" లను పద్య మథర్వణభారతములోనిదని కొంద ఱనుచున్నారు. అదియే సత్యమగు నెడల నయ్యది యాదిపర్వములోనిది కావలెను. కాని వీరేశలింగముగారు తలఁచినట్లుగా భీష్మపర్వములోనిది కానేరదు. లోకప్రతీతి యెట్లున్నదన నథర్వణుఁడు భారతమునంతిను రచించి రాజనరేంద్రునకుఁ జూపుటకై రాజమహేంద్రపురమునకుఁ బట్టుకొనివెళ్లి తదాస్థానకవి యగు నన్నపార్యు నాశ్రయించెననియు, నాతఁడు తన భారతముకంటె నథర్వణభారతము మిన్నగా నుండుటం గాంచి యసూయచెంది యథర్వణు డింట లేనప్పుఁ డాతనిగ్రంథము భస్మమగుటకై యాతఁ డున్న యిల్లు తగులఁబెట్టించె ననియు, నందులో నాతనిభారతము భస్మమాయె ననియు, నాతఁ డెవ్వరికో చూపుట కావలికిఁ బట్టుకొనిపోయిన విరాటపర్వము మాత్రము లోకమున మిగిలిపోయిన దనియుఁ బ్రతీతి కలదని వీరేశలింగము పంతులవారి కవులచరిత్రమే చెప్పుచున్నది. కావున నథర్వణునివృత్తాంతము మన వీరరాజుపంతులవారి నూతనాశయమునకు ననుకూలింపనది కాదు. ప్రతికూలముగానే యున్నది.

## వనపర్వశేష గద్యాదికము

వనపర్వములో సగముకంటె నెక్కుడుగా నున్న వనపర్వశేషమును నెఱ్ఱనమహాశయుఁడు తన స్వతంత్రకవిత్వములోఁ బూర్తిచేసినయెడల నా భాగమునకుఁ గర్తృత్వము నన్నయ్యయం దుంచుటయు, కృతిపతిత్వము రాజనరేంద్రునం దుంచుటయు నెట్లుపొసఁగునని మన వీరరాజు పంతులవారు సెలవిచ్చినరీతిగ వనపర్వవిషయములో గొప్పభీతి యాంధ్రకవి పండితలోకములో గలిగినది. ఆ భీతిచేతనే తిక్కనసోమయాజి వనపర్వశేషమును ముట్టఁడాయె. ఆభీతచేతనే మనయెఱ్ఱనమహాశయుఁడును దనపేరితోఁ దీనిని బూరించుటకు జంకి నన్నయభట్టారకుని పేరితోనే పూరించివైచెనని లోకప్రతీతి నొక్కి వక్కాణించుచున్నది. "నన్నియపేరు సెప్పి ఎఱ్ఱన, నిప్పు ముట్టినను కాలదు గాఁబోలు! మున్నూరేండ్లకు ముందున్న వానిపేరు సెప్పినంత మాత్రమున నారణ్యపర్వదోషము తప్పిపోఁగలదా ?" అని వీరరాజు పంతులవారు శంకించుచున్నారు. మనలో నిట్టిభీతులు కలవు. కాని కార్యాచరణదీక్ష హెచ్చయిపోయినపు డేదోయొక విధముగ మనస్సమాధానము చేసికొని తుదకు యెట్లో కార్యనిర్వహణ మొనర్పుటయు గలదు. మనలోఁ గొబ్బరితోఁట వేయుట కొకభీతి కలదు. పుచ్చి రాలినంగాని తోఁట పుచ్చి వేయదఁట. అనఁగా తోఁటవేసిన యజమానుఁడు మృతినొందినం గాని తోఁట కాపునకు రాదఁట. ఈభీతి మనలో మిక్కిలి వ్యాప్తి గలిగియున్నది. కాని సంపన్న గృహస్థులు తోఁటలు వేయించుట మానుటయులేదు. తాము వేయక యేకూలివానిచేతనో మొక్కలు పాతించుచున్నారు. నిజముగా నారికేళవనము వేసినందులకు ఫలముఁ జూడకుండ చచ్చుటయే తటస్థించునెడల నాతోఁట వేయించిన యజమానునకు మరణము రావలెనుగదా! మొక్కలను మఱియొక్కఁడు నాటినను తోఁటతనదాయె. తత్ఫలము తనదాయె. అట్టిస్థితిలోఁ దోఁటను నాటిన కూలి భంగము కూలివానిని జెందునా? చెందు ననినను మన శాస్త్రములు కర్మఫలము కర్తను, గారయితనుగూడఁ జెందునని కదా దెల్పుచున్నవి. అట్టిస్థితిలోఁ దోఁటకు యజమానుఁడై కూలివానిచే మొక్కలు వేయించినవానికి నా దోషము దగులకుండుట యెట్లను నాలోచన మెవరికైనఁ గలదా? ఇట్లనేకములు కలవు. ఆవిధముగానే కర్తృత్వము నన్నయ యందుంచిన బాధలేదని భావించి లోకోపకారార్థమై ఎఱ్ఱనార్యుఁడు వనపర్వశేషమును బూరించె. వనపర్వపఠనము హానికి మూలమను భీతి లోకమునకుఁగలదనియు, నా హేతువుచే భారతము చదువువారు సభాపర్వముఁ జదివి విన తరువాత శాంతిని జదివి పిమ్మట వనపర్వమును జదువుదురని మన వీరరాజుపంతులవారే సెలవిచ్చియున్నారు. ఏమి! శాంతిని జదివి నిప్పుముట్టిన నయ్యది కాలదా? వనపర్వము నిప్పైనప్పు డది యెప్పుడును నిప్పేకదా? అయినను ఏనవా రెట్లో మనశ్శాంతిని చేసికొనుటకై శాంతిని జదివి పిమ్మట వనపర్వశాంతిని జేయుచున్నారు. అట్లే నన్నయపేర నొనరించినఁ దన కే హానియు నుండదని యెంచి యెఱ్ఱనార్యుఁడువనపర్వశేషమును నన్నయపేరఁ

పూరించె. ఎఱ్ఱనార్యుఁడు స్వహస్తముతో నారణ్య
పర్వాంతమున "కం. ధీరవిచారుఁడు తత్కవి, తా రీతియ
కొంత దోఁప దద్రచనయకా, నారణ్యపర్వశేషము,
పూరించెఁ గవీంద్రకర్ణపుట పేయముగన్." అని స్పష్ట
ముగ వ్రాసియున్నాఁడు. నన్నపార్యునియం దెఱ్ఱనకు
నఖండభక్తి విశ్వాసములు కలవు. నన్నయ కొంత యొన
రించెఁగాన మిగిలిన భాగముకూడ నాతని పేరితోనే విర
చించుట మంచిదని శంభుదాసుఁడు తలంచె. గ్రంథస్థమై
యున్న యీయంశమును నమ్ముటకుసందియ మేల? ఆరణ్య

## హరివంశముంగూర్చి

పర్వశేషమునుఁబూరించుచునన్నపార్యుని పేరెత్తినవాఁడు
భారతశేషమగు హరివంశమును బూరించుచుఁ దిక్కన
పేర నేల వ్రాయలేదని మన పంతులవారు శంకించు
చున్నారు. వనపర్వము కొంతవ్రాసిన తర్వాత దానిని
బూరించుట, భారతాంధ్రీకరణమైనపిమ్మటహరివంశమును
వ్రాయుటవంటిదికాదు. న్యాయముచే హరివంశము మహా
భారత ప్రధానభాగమే కాదు. హరివంశము ఖిలముల
లోనిదని మనగ్రంథము లిట్లు చెప్పుచున్నవి:— "అష్టా
దశైవమేతాని పర్వాణ్యేతాన్యనేకశః, ఖిలేషు హరి
వంశశ్చ భవిష్యంచ ప్రకీర్తితమ్. దశశ్లోక సహస్రాణి
వింశచ్ఛ్లోకశతానిచ, ఖిలేషు హరివంశేచ సంఖ్యాతాని
మహర్షిణా." 'జయము'ను పేరుగల మహాభారతము పదు
నెనిమిదిపర్వములు మాత్రమే కలది. జయశబ్దమే దీనిని
రూఢిచేయుచున్నది. మనకవి బ్రహ్మయును,మహాభారత
మన పదునెనిమిది పర్వముల గ్రంథమనియే భావించు
చున్నాఁడు. కావుననే తన భారతపీఠికలో:—"ఆదర
ణీయసార వివిధార్థగతిస్ఫురణంబు గల్గి యష్టాదశ పర్వ
నిర్వహణ సంభృతమై పెనుపొందియుండు" అనియయ్యది
పదునెనిమిది పర్వములు గలదనియు:—"హృద యాహ్లాద
చతుర్థమూర్జిత కథాపేతంబు ......... పదునేనింటి
తెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్, తుది
ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండార
గన్."

అని విరాటము మొదలు పదునేను పర్వములను
దెనిఁగించిన గ్రంథము తుదిముట్టుననియు వ్రాసియున్నాఁ
డు. హరివంశము వనపర్వశేషమువలె మహాభారతములో
ప్రధానభాగమైనయెడల నామహాకవి దానినిగూడ దెనిఁ
గించియే యుండును. పదునేనుపర్వములనుఁ దెనిఁగించిన
తర్వాత మహారాజాస్థానములకుఁ బోయి తన భారతము
నీతఁడు వినిపించుచువచ్చినట్లుగా గాథలుకలవు. ఇట్టియవ
కాశముగల తిక్కన హరివంశము నేల తెనిఁగింపఁడాయె?
అది యందలి ప్రధానభాగము కాదు కనుకనే తెనిఁగింప
లేదు.

ఆరణ్యపర్వశేష మారణ్యపర్వములోనిదే కను
కను, నన్నయచాలవఱకు విరచించియేయున్నాఁడు గావు
నను,నాతనియందు తనకు భక్తివిశ్వాసములు కలవు కావు
నను, నారణ్యపర్వభీతి మనసున బాధించుచున్నది కావు
నను,నన్నయ విరచించినట్లే, నన్నయ పేరు పెట్టియే ఎఱ్ఱన
దానిని విరచించినాఁడు. హరివంశ విషయములలో నీ
సందర్భ మేదియును లేదు. కావున నాతఁడట్లు
చేయలేదు. హరివంశమును భారతములో నారణ్య
పర్వమువంటి యంగము కాకుండినను దానినిఁ దిక్కన
జాలవఱకు దెనిఁగించి విడుచుటయు, మిగిలినదాని నెఱ్ఱన
పూరించుటయు నైనదేమో యనిన నదియును లేదు.
కాఁబట్టి హరివంశప్రశంస సర్వవిధముల నసంబద్ధము.

## గ్రంథపూరణము చేయువారి గమనిక

నిర్వచనోత్తరరామాయణములో మిగిలిన భాగ
మును బూరించుచు జయంతి రామభట్టు మహాశయుఁడు
తన యంకితము వేసికొని తన యిచ్చవచ్చినవారికిఁ గృతి
యిచ్చెననియు, నల్లై యయ్యలార్యుఁడు యుద్ధకాండ
శేషమునఁ గావించెననియుఁ, గాన నెఱ్ఱనార్యుఁడు
వనపర్వశేషము స్వతంత్రకవిత్వముతో నొనరించినయెడ
తా నొకకృతిపతి నేర్పఱుచుకొని గ్రంథాంతమున తన
గద్యమును వేసికొనియే యుండుననియుఁ, గవి యశ
స్సును కోరనివాఁ డెవఁడనియు, వీరరాజు పంతులవారు
వ్రాయుచున్నారు. లోకములో వివిధవ్యక్తుల వృత్తులు
వివిధములుగా నుండును. కొందఱు తాము వ్రాసిన
గ్రంథము చిన్నదే యయినను, దానికిఁ గొండంతలు
గద్యములు వేసికొని, దానిలోఁ దమ వంశవృక్షమునంతను
నెక్కించుకొందురు. కొందఱు తాము వ్రాసిన గ్రంథ
ముత్కృష్టమైనదే యయినను "ఇతి భారవి విరచితే"
ఇతి "కాళిదాస విరచితే" అని యతిసూక్ష్మము లగు

గద్యములు వేసికొందురు. మఱికొందఱు గద్యములు వేసికొనుటయే లేదు. ఆ గ్రంథములు వ్రాసినవా రెవరో యిప్పటికిని దెలియవచ్చుటలేదు. కొంద ఱన్యులపేరుపెట్టి కబ్బములు విరచించుచున్నారు. ధావకుఁడు తా నొనరించిన కావ్యముల నన్నిటిని నన్యులపేరనే విరచించె. రామమోహనరాయఁడు వ్రాసిన గ్రంథము లనేకములు తనమిత్రులపేరనో, శిష్యులపేరనో విరచించె. సుమతిశతకాదుల విరచించినవా రెవ్వరో గ్రంథములఁబట్టి నేఁటికిని దెలియవచ్చుట లేదు. కొందఱు తాము విరచించిన గ్రంథములకుఁ బ్రసిద్ధికలుగుటకై పూర్వ ప్రసిద్ధకవులపేరులు పెట్టివ్రాయుట కలదు. ఎవ్వరో యిటీవలివారు చౌడేశ్వరీవిలాసమను గ్రంథమును నేకాలపువాఁడోయగు నన్నయపేరుపెట్టి విరచించిరఁట. అనేకకవులు పూర్వులపేరుపెట్టి యిప్పటికిని గ్రంథములు వ్రాయుచున్నారు. గ్రంథకర్తృత్వప్రకటనము బహువిధముల నడచుచున్నది. ఎఱ్ఱన తన స్వతంత్రకవిత్వముతో శేషమున వ్రాసియున్నయెడల నన్నపార్యుని కృతిపతికే తానును గృతియిచ్చుట యెట్లుపొసంగు నని పంతులవారు శంకించిరి. మఱల నీపంతులవారె భారతశేషమని తాము చెప్పు హరివంశమును దెనిఁగించుచు నాచనసోముఁడు తిక్కనార్యుని కృతినాథుఁడగు హరిహరనాథునకే కృతియిచ్చెనని స్వహస్తముతో లిఖించియుండిరి. అట్టిదయే యిదియు ననుకొనరాదా? దీనికి విపరీతతర్కము కావలెనా? పంతులవారి వాదవైఖరి యిట్లు నడచుచున్నది. ఇంకఁ గద్యవిషయములోఁ జూచుకొందము. నేఁటి సుప్రసిద్ధమహాకవులగు తిరుపతి వెంకటేశ్వరకవులు దేవీభాగవతమాంధ్రీకరించిరను సంగతి లోకవిదితము. ప్రతిస్కంధాంతమునను నీయుభయకవుల గద్యము లేకలవు. కాని నవమదశమ స్కంధములు వీ రిరువురిలో నెవ్వరును రచించినవి కావు. వానిని రచించిన కవులు వేఱు. ఐనను బహుస్కంధములు వీ రాంధ్రీకరించిరి. కావున స్వల్పభాగము మాత్రమే రచియించియున్న నవమదశమ స్కంధాంధ్రీకరణకర్తలు వీరిపేరితోనే గ్రంథమంతయు నుండ నిచ్చగించుటచే గ్రంథమంతయు వీరిపేరనే వీరి గద్యముతోనే వెలయుచున్నది నవమదశమ స్కంధము లన్యకర్తృకము లను విషయములంగూర్చి 'దివాకరాస్తమయమునఁ' బంద్రెండవ పుటలో శ్రీ వేంకటశాస్త్రిగారు వ్రాసిన వాక్యములఁ జూచిన విస్పష్టము కాఁగలదు. మఱియు నీజంటకవులలో గ్రంథ మొక్కరు వ్రాసినను గద్యముభయులపేర నుండుట వాడుకయై యున్నది. ఇట నెఱ్ఱనమహాశయుఁడు వనపర్వశేషమును తనపేరనుగాక నన్నయపేరను విరచించుటకుఁ గల కారణము పూర్వులచేతనే తెలుపఁబడియున్నది. కావున నయ్యలార్యాదులు చేసిన పనినే యెఱ్ఱనార్యుఁడును జేయవలసిన యవసరము లేదు. కారణాంతరముచే నీతఁడు నటియొకలాగు చేసినాఁడు. అది యటులుండ నీతఁడు తనపేరును దాచుకొని యుండలేదు. మఱియొకవిధముగా వనపర్వాంతమునను, నృసింహపురాణమునను దనకర్తృత్వమును బ్రకటించుకొనియే యున్నాఁడు.

## పూర్వులు కొందఱు నన్నయ తిక్కనలనే భారతకవులుగా నేల స్తుతించిరి?

మడికిసింగన, భారతకవులనఁగా నన్నపతిక్కనల మాత్రమే స్తుతించె ననియు, నాతఁ డెఱ్ఱనార్యునిపేరెత్తలేదు కావున శిథిలభాగపూరణ మొక స్వతంత్రకవితాభాగముగ నాతఁ డెంచకుండుటచే నట్లయ్యె ననియు తమవాదమున కిది యుపబలకమనియు వీరరాజు పంతులుగారు వ్రాసిరి. ఇది యుచితమగు వాదము కాదు. సింగన యెఱ్ఱన పేరెత్తని యంతమాత్రమున భారతకర్తృత్వ మెఱ్ఱనకు లేదని యీతఁడు తలంచిన ట్లెంచుట యుచితము కాదు. ఎఱ్ఱనపేరెత్తనివా రనేకులు గలరని పంతులువారే వ్రాసిరి. వారెల్లరిట్టి యూహతోనే విడిచిరనవచ్చునా? అది యటులుండ మడికి సింగన నాఁటికి విద్వత్కవిలోకములో నెఱ్ఱనార్యుఁడు తెలుఁగు భారతములో స్వతంత్రకవిత్వమునఁ జసుపని చేయలేదనియు శిథిలభాగ పూరణముమాత్రము కావించెననియు వాడుకయే యున్నచో నాకాలమునందేయున్న జక్కయకవి తన విక్రమార్కచరిత్రములో నన్నప, తిక్కన, ఎఱ్ఱనలను భారతకర్తృత్వధనులనుగా వర్ణించుట యెట్లు సంభవించును? మడికి సింగన, భారతకవులనుగా నన్నప తిక్కనలనుమాత్రమే యేపద్మపురాణమున లిఖించెనో యా పద్మపురాణము క్రీ.శ. 1420వ సం. నాఁటిదని కవులచరిత్రము చెప్పుచున్నది. నన్నప, తిక్కన, ఎఱ్ఱనలను, భారత

కర్తలనియు, కవిత్రయమనియు, వర్ణించిన జక్కయకవి విక్రమార్కచరిత్రము క్రీ.శ. 1410వ సం.కును 1420సం.కును మధ్యకాలమున రచియింపఁబడినదని కవులచరిత్రమే తెల్పుచున్నది. ఏకకాలమందలిమహాకవులలో నొక్కఁడు (సింగన) భారతకవులలో, నన్నప, తిక్కనలనుమాత్రమే స్తుతించె. మఱియొక్కఁడు (జక్కయ) భారతకర్తృత్వము నన్నప, తిక్కన, ఎఱ్ఱనలు ముగ్వురి యందును బెట్టి ముగ్వురను కవిత్రయ మనిపిలిచె. ఈప్రసిద్ధి జక్కననాఁటికి సుప్రసిద్ధమై యున్నదన సింగన నాఁడు నట్లే యున్నదని వేఱుగఁ జెప్పనవసరములేదు. అట్లైన సింగన యెఱ్ఱన నేల వర్ణింపలేదందురా? అది వర్ణించువాని ఇష్టములో నున్నది. పూర్వకవిస్తుతిలో నన్నపార్యుని నెత్తని గ్రంథకర్తలు కలరు. (బైచరాజు వెంకటనాథకవి మొదలగువారు). తిక్కనను బేర్కొననివా రున్నారు. (మొల్లమున్నగువారు). ఎఱ్ఱన నెంచనివారు గలరు కావున నొక కవి పేరొక గ్రంథమున నెత్తనిమాత్రమున నాఁటి కాతఁడు ప్రసిద్ధుఁడు కాఁడనఁజనదు. ఇతర బుజువులు మనకు గలవు. ఆకాలము నాఁటి జక్కన్నత్రయి పేరెత్తి యరణ్యపర్వశేషమును బ్రబంధ పరమేశ్వరుఁడు చేసినట్లు విస్పష్టముగా నుడివి యుండుటచే నా కాలము నాఁటి కెఱ్ఱనార్యుఁడు వనపర్వశేషమును స్వాతంత్రముగా విరచించె ననువాడుక కలదని యూహపడు చున్నది. ఈ యంశమును మనపంతులవారే క్రిందివాక్యములలో నంగీకరించిరి. "అడిదము సూరకవి మొదలగు లక్షణగ్రంథకర్తలును, జక్కన, మల్లయ మొదలగు ప్రబంధకవులును ఎఱ్ఱాప్రగడ యరణ్యపర్వశేషమును విరచించినట్లు వ్రాయుట, అప్పటికిఁగల వాడుకనుబట్టియే యయియుండును." "అప్పటికిఁగల వాడుక" యన నెప్పటికిఁ గల వాడుక? సింగన పద్మపురాణము వ్రాయునాఁటికిఁ గల వాడుకయనిగదా చెప్పవలెను. ఆకాలమునందే కదా జక్కయ విక్రమార్కచరిత్రమును విరచించెను. కావున సింగననాఁటికి వనపర్వశేషమును నెఱ్ఱన స్వతంత్రకవిత్వముతోఁ బూరించె ననువాడుక యున్నట్లు మన పంతులవారే యంగీకరించిరి ఇక సింగన మఱియొకలాగున తలంచెననుట కవకాశ మేది? అట్టి యవకాశ మేదియును లేదు కావున పంతులవారు వ్రాసినది తప్పు.

## శ్రీనాథుఁడు

శ్రీనాథుఁడు తనభీమఖండములో నన్నప తిక్కనలను మాత్రమే భారతకర్తలనుగా స్తుతించెనఁట. ఆహేతువుచే మనపంతులవారు శ్రీనాథుఁడు శంభుదాసుని భారతకవిగా నంగీకరింపలేదని తలంతురఁట. ఇదియు సరియగు వ్రాఁతకాదు. శ్రీనాథుఁడు భీమఖండములో నన్నప తిక్కనలను మాత్రమే పేర్కొనినను తననైషధములోఁ గవిత్రయము వారినిగూడ నెత్తినాఁడని యంగీకరించిరో యుండిరి.

## కవిత్రయము

మహాభారతము నాంధ్రీకరించు భాగ్యముం గనిన నన్నప, తిక్కన, యెఱ్ఱనలకుఁ గవిత్రయమనియుఁ ద్రయి యనియుఁ బేర్లు వచ్చినవి. దీనికిఁగారణ మష్టాదశపర్వోపేతమగు మహాభారతమునీముగ్గురు నాంధ్రీకరించుటలోఁ బాలుగలిగి యుండుటయే. ఈ కవిత్రయము నందఱు శిరసావహించిరి. సాధారణముగాఁ గవిస్తుతిలో నీత్రయి చేరియుండును. ఈత్రయిని శ్రీనాథుఁడు తన నైషధములో:—

"ధీరమతి నన్నపార్యుని, దిక్కయజ్వ, శంభుదాసునిఁ
గరమర్థి సన్నుతించి"

అని పొగడియున్నాఁడు. ఎప్పుడైన కవిత్రయమును బేర్కొనుట యైనదో యప్పుడాస్తుతికర్త హృదయమున భారతాంధ్రీకరణము స్ఫురణములో నున్నదని విస్పష్టమగుచున్నది. భారతకర్తృత్వముచే నన్నప, తిక్కనలలోఁ జేరినవాఁ డగుటచేతనే ఎఱ్ఱననుగూడ నిందు స్తుతించుట గలుగుచుండెనేని శంభుదాసునంతటివారును, వారిని మించినవారును, (పంతులవారియూహలో) నగు నాచన సోమనాథాదుల నేల స్తుతింపలేదు? నాచన సోమనాథాదుల శ్రీనాథుఁడు తన కవిస్తుతిలో చేర్పక కవిత్రయమును మాత్రమే స్తుతించెనుగావున లోకమునకు లక్ష్యభూతమగు భారతము నాంధ్రీకరించి త్రయి యని ప్రసిద్ధికెక్కిన భారతకవులను ముగ్వురను స్తుతించినట్లు విస్పష్టమగుచున్నది. కావున భారతాంధ్రీకరణము నందు నెఱ్ఱనార్యుని స్వతంత్రకవిత్వము కలిగి యుండుట చేతనే శ్రీనాథుఁడు నన్నప, తిక్కన, యెఱ్ఱనలను

మాత్రము కలిపి స్తుతించినట్లు స్పష్టమగుచున్నది. అదిగాక జక్కననాఁటికే భారతాంధ్రీకరణ కర్తృత్వము కలవారు పై కవిత్రయము వారని తేలియున్నదని మన పంతులవారే యంగీకరించిరి. తన నాఁటికి లోకములో భారతాంధ్రీకరణచణులు నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను ప్రసిద్ధియుండగా దానిని శ్రీనాథుఁ డంగీకరింపక విడుమటకు నే యవకాశమును లేదు. "ఆరణ్యపర్వములోని యంత గొప్ప భాగము నెఱ్ఱనయే రచించెనేని యారెల్లసంస్థానము నందేయుండిన శ్రీనాథున కావిషయము తెలియకపోవుట యసంభవము" అని పంతులవారు వ్రాసిరికాని శ్రీనాథున కాసంగతి తెలియదని పంతులవా రెట్లూహించిరో తెలియుటలేదు. తాను రెల్లయూస్థానమునందే యున్నవాఁడగుటచేతను, దనకు నెఱ్ఱనార్యుఁ డరణ్యపర్వ శేషముఁ బూరించి నన్నపతిక్కనల తోడివాఁడైనాఁడను భావముండుటచేతను దన శృంగారనైషధములో నన్నపతిక్కనలతో నెఱ్ఱనార్యునిజేర్చి స్తుతియించినాఁడని విస్పష్టమగుచున్నది.

## ఘట్టపదసారస్యము

శంభుదాసుఁడు వనపర్వశేషమును స్వతంత్ర కవిత్వముతోఁ బూరించినవాఁ డనువాడుక జక్కనమహాకవి నాఁటికే లోకములో వ్యాపించియున్నదనియు, నామహాకవి మున్నగు విద్వాంసులు దీనిని సర్వవిధముల నమ్మిరనియు నంగీకరించిన మన వీరరాజుపంతులవారు మఱల శ్రీనాథుఁడు వనపర్వశేషమును శంభుదాసుఁడు వ్రాయలేదనియు, నాతఁడు చేసినది శిథిలాక్షరపూరణమే యనియుఁ దలంచినాఁడని యెట్లు వ్రాసిరో తెలియవచ్చుట లేదు. వనపర్వమునంతను నన్నపార్యుఁడు పూర్తిగాఁ దెనిఁగించిన నాఁ డనుభావము శ్రీనాథునకు కలదనుటకై వీరొకవింతవాదమును దెచ్చి పెట్టిరి. ఈతఁడు ఖేమఖండమున నన్నయ్యను స్తుతించుచు "భారతఘట్టోల్లంఘన ప్రతిష్ఠ గాఢప్రతిభుఁ" అని వ్రాసెను ఘట్ట మనఁగా నరణ్యప్రదేశమఁట. కాన "భారతఘట్టోల్లంఘన ప్రతిష్ఠ గాఢప్రతిభుం"డనఁగా భయంకరమైనభారతారణ్యపర్వమును దాఁటిన ప్రతిజ్ఞగలవాఁడని భావమఁట. ఇదివింత వ్రాఁత. ఘట్టమన నరణ్యప్రదేశ మను నర్థమే లేదు. పర్యాయపద సమూహబోధకములగు నామలింగానుశాసనాదులందును, నానార్థములనిచ్చు వైజయంతి, మేదిని లోనగు ప్రాచీననిఘంటువులలోను, నవీన శబ్దార్థ సర్వస్వములగు వాచస్పత్యము, శబ్దకల్పద్రుమము, మున్నగు విపుల నిఘంటువులలోను, ఆప్టే, విల్సన్ మున్నగువారు వ్రాసిన సంస్కృతాంగ్ల విపుల నిఘంటువులలోను గూడ ఘట్టశబ్దమునకు నరణ్యప్రదేశమను నర్థమీఁబడి యుండ లేదు. కర్ణాటనిఘంటువులలో ఘట్టశబ్దమునుండి ఘాట్ అను దేశ్యపద ముత్పన్నమయ్యెననియు, దానికిఁ గొండల వరుస యని యర్థమనియు, వ్రాయఁబడియున్నది. కావుననే 'Western Ghats, Eastern Ghats, అను పదములు పుట్టినవి. ఘాటో అనఁ బర్వతమను నర్థము మన్యపు ప్రదేశములలోఁ గలదు. శబ్దరత్నాకర కారుఁడుఘట్టమన వనపర్వతప్రాయప్రదేశమను నర్థమొకదానిని నిచ్చెఁగాని దాని కాధారము మృగ్యము. ఘట్టశబ్దము నుండియే గట్టు అను తెలుఁగుపదము పర్వతమను నర్థముకలది పుట్టియుండును. ఇట్టి యర్థములంబట్టియే ఘట్టశబ్దమునకుకఠినప్రదేశమనుభావము పుట్టియుండును. ఆభావమునే వ్యాస ఘట్టాది పదము లిచ్చుచున్నవి:—

"శా. ప్రారంభించిరి వ్రాఁతయాఁగక వచింపన్నాని యాచోటులం, బారాశర్యుఁడు వ్యాసఘట్టములన ప్రఖ్యాతముల్ పద్యముల్, సారశ్లాఘ్యము లుగ్గడించుచు గణేశానుండు సర్వజ్ఞుఁడున్, రారాజన్నుతినర్థ మారసెఁడు నంతంజెప్ప బల్పద్దముల్".

శ్రీమదాంధ్రభారత నవనీతము.

ఇట ఘట్టమన కఠినప్రదేశమను నర్థము. ఈరీతిగనే భారతఘట్టోల్లంఘన మనినప్పుడు భారత కఠినోన్నతస్థానోల్లంఘన మను నర్థము చెప్పుటకును, దానినుండి భారతఘట్టోల్లంఘన మనఁగా భారతమునందలి యరణ్యపర్వమును దాఁటుట యని యర్థము చెప్పుకొనుట కవకాశ మున్నటులఁ దోఁచదు. దాటరాని(వ్యాస) ఘట్టములు భారతమున బహుపర్వములలోఁ గలవు. వనపర్వమునమాత్రమే లేవు భారతఘట్టమున మన్యపర్వములలోని దగు వనపర్వ మొక్కదానినే తీసికొనుటకవకాశము లేదు. ఘట్టమున శుల్కమునకాటంకపరచెడి చోటు. (ఘాటీ) కాన భారత ఘట్టోల్లంఘన మన నర్థముచేసికొనుటకు నాతంకము కలిగించు భారత

భాగములను నర్థము చెప్పుకొనవచ్చును. ఇంతయేల. మన కవులు "భారతఘట్టమని" "యాగమఘట్టమని" వాడుట కలదు. "రేవ"ను భావముతో నట్లువాడుచున్నారు. పిల్లలమఱ్ఱి పినవీరన తన శకుంతలాపరిణయములో నిట్లు వ్రాసియున్నాఁడు. కం. ఇట్టలమగుమతి భారత, ఘట్టమునకు నడచ యచ్చుగట్టిన కవితా, పట్టాభిషిక్తు నన్నయభట్టోపాధ్యాయుఁ దలఁచి పరమ ప్రీతిన్" అని భారత ఘట్టమునకు మార్గమేర్పాటు చేసినవాఁడని వ్రాసియున్నాఁడు; కావున ఘట్టమన "రేవ"ని యర్థము చెప్పుకొనుట యుచితము. మఱియును భారతఘట్టమన భారతమునందలి యరణ్యపర్వమని యర్థము చెప్పుచో నీక్రింది పాండురంగమాహాత్మ్యకారుని పద్యమున కేమి యర్థము చెప్పుకొనవలయును?

"కం. ఇట్టాడరాని యాగమ
ఘట్టమునకు నడవయచ్చు కట్టినమునిరా
ట్పట్టాభిషిక్తుఁ దపముల
పుట్టిన నెలవయినవ్యాసముని వర్ణింతున్".

ఇందు నాగమఘట్టమని తెల్పఁబడియున్నది. భారతఘట్టమన నారణ్యపర్వ మర్థమగుచో, నీపద్యమునందలి యాగమఘట్టమునకు వేదమునందలి యారణ్యకములకనికదా యర్థమును చేసికొనవలసియుండును! కాని యట్టియర్థము చేసికొనుట కవకాశమే లేదు. తనకుపూర్వ మొకదానితో నొకటి కలిసిపోయి, విభజింపరాని స్థితిలోనున్న వేదములను నాల్గింటిని వేఱువేఱుగ విభజించుట యను పనిని కదా వ్యాస భట్టారకుఁ డొనరించె. కాన నాగమఘట్టమునకు నడవయచ్చుకట్టెనని చతుర్వేదములలోఁ బ్రవేశించుటకు సోపానములఁ (మార్గముల) నేర్పఱచెనని భావము. కాన భారతఘట్టమనినను భారతమహాసముద్రమునఁ బ్రవేశించుటకుఁ దగు తీర మేర్పఱచెనను భావము కలుగును.

ఒకవేళ భారతఘట్టమన భారతమునందలి వనపర్వమని యర్థము చేయుటకు మనము సాహసించినను మన పంతులవారి వాదమున కదియనుకూలింపదు. ఏమన వీరును దుద కరణ్యపర్వము నన్నపార్యుని మ్రింగివేసిన దను భావముగలవారే. ఒకమూల వనపర్వము నన్నపార్యుని మ్రింగినదని చెప్పుచు మఱియొకమూల భయంకరమైన భారతారణ్యపర్వమునుదాటిన ప్రజ్ఞగలవాఁ డని వ్రాయుట యుచితమా? కాన పంతులవారు వ్రాసినది యుచితము కాదు. భారతము దురవగాహమైన ప్రారంభము గలది. దానికి నన్నపార్యుఁడు చక్కని రేవేర్పఱచినాఁడు.

## ఎఱ్ఱన వాక్యములు

ఆరణ్యపర్వమునంతను నన్నపార్యుఁడే వ్రాసెనను భావము శంభుదాసుని వాక్యములవలననే తేలుచున్నదని లిఖింప మన పంతులవారు సాహసించిరి. ఎఱ్ఱన తన నృసింహపురాణములో వ్యాసముల ప్రణీత పరమార్థమును దెల్లము చేసినవారని నన్నయ తిక్కనల స్తుతించెనఁట! దీనింబట్టి వారిద్దరే భారతమును బూరించినా రని తేలునఁట. అట్లైన కాకుఁడిన వనపర్వములో సగముకంటె నెక్కుడు విరచించిన యెఱ్ఱనార్యుఁడు పైరీతిని స్తుతించి యుండఁడఁట! ఇది మఱింత పెద్దవింత. నన్నయ రెండు పర్వములును నఱయును, దిక్కన పదునయిదు పర్వములను మొత్తముమీఁద పదునేడు పర్వములును నఱయును, దనకంటె పూర్వమునందు వ్రాసియున్న నన్నప తిక్కనలను స్తుతించువాఁడు వ్యాసపరమార్థము తెల్లము చేసినవారని స్తుతియించుట తప్పా. అందులో తానొక స్వల్పభాగము వ్రాసినంతమాత్రమున వారిని మఱియొకలాగున స్తుతిచేయునా? భారతములో నతిస్వల్పభాగము తాను వ్రాసినను మిక్కిలి ఘనమగుభాగము నంతను నాంధ్రీకరించిన పూర్వకవుల భారత కర్తలనుగా నెఱ్ఱనార్యుఁడు స్తుతించుట వింతయా? అందువింతయేదియును లేదు. అతఁ డట్లు వ్రాయుటయే సరసముగనున్నది. అట్లు కాదందురేని శంభుదాఁసుడు నన్నప తిక్కనలను నెట్లు వర్ణింపవలసి యుండునో యావిధానమును పంతులవారు కొంచెము సెలవిచ్చిన బాగుగ నుండియుండును. దీనిచే నెఱ్ఱనార్యుని వనపర్వశేష కర్తృత్వమునకు హానియింతయును లేదు.

## నన్నయ పద్యములపోలిక వనపర్వశేషమున నుండుట

మన వీరరాజు పంతులవారు నన్నయ రచనము వంటి రచనగల "చ. రయ విచలత్తురంగమ......... అను పద్యము నొకదానిని శంభుదాసుని భాగములో చూపి యాకారణముచే నాభాగమును నన్నయకవిత్వమే

యని సిద్ధాంతీకరించిరి. కాని యిది సరియగు మార్గము కాదు. కవులు తమకంటెఁ బూర్వులగు కవుల కవిత్వము ననుకరించుచుండుట లోకములో వాడుకయై యున్నది. నన్నపార్యుని రచనముంగని యారీతి రచనముంగల పద్యములను దిక్కనాదులు దమ కబ్బములలో వ్రాసికొని యున్నారు. సంస్కృత మహాభారతములోని పద్యముల వంటి పద్యములు భారవికావ్యములో కలవు. కాళిదాసు పద్యములవంటి పద్యములు బుద్ధచరిత్రమందు కలవు. భర్తృహరి పద్యములవంటి పద్యములు ప్రబోధ చంద్రోదయములో గలవు. ప్రబోధచంద్రోదయములోని పద్యములవంటివి నైషధమునఁ గలవు. ఇట్టి యుదాహరణము లనేకములు గలవు. ఇంతమాత్రముచే నొక్కవిధములగు పద్యములొకింత కలిగినంతమాత్రమున నా యుభయగ్రంథముల వ్రాసినవాఁ డొకఁడే యని వివేకు లెంచుచున్నారా? లేదు. భిన్నకవులని తలంచినను వారియందు గ్రంథచౌర్యము నాపాదించుచున్నారా? ఇంతమాత్రముచే గ్రంథచౌర్యము సంపాదించుచో కవులనెల్లర గ్రంథచోరు లని చెప్పవలసివచ్చును. అది యటులుండనిండు. నన్నయ రచనమువంటి రచనము వనపర్వములో నెట్టిన భాగమునఁ గాన్పించుట వింతగాదు. అది సహజమే. ఏమన నన్నయ కవితారీతి ననుసరించి తాను శేషమును పూరింతునని యెఱ్ఱన విస్పష్టముగాఁ జెప్పియేయున్నాఁడు. ఇట్టివాఁడు చెప్పినభాగములో నన్నపరచనమువంటి రచన ముండుట తగియే యున్నదిగదా! ఈవిషయమై శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రులువారు వ్రాసిన వాక్యములఁ జిత్తగింపుఁడు.

"మఱియు నితండు నన్నయ తెనిగించిన భాగమును గంఠపాఠము గావించి యాతనిశైలియందలి తమకముచే నాతఁడు ప్రయోగించిన పద్యవాక్యజాలమునే తఱచుగా నుపయోగించుచు వచ్చెను."

ఇట్లు వీరు తెల్పినరీతిగా నన్నయకవిత్వము ననుకరించి, యట్లుచేయుదునని చెప్పి నన్నయ పేరనే శేషపూరణ మొనరించినప్పుడు, "చం. రయవిచలత్తురంగ" మాదికము నుభయకవిత్వమునందును నుండినంత మాత్రమున వనపర్వశేషము నన్నయ వ్రాసినదే యనఁగూడదు. మఱియును సమానపదజాలము గల రచనము సభాపర్వమునందును, వనపర్వశేషమునందునుగూడ నుండుటచే నొకవిధముగా నిది నన్నయ కవిత్వము కాదను కొనుటయే యుచితమేమో? ఏమన అంత స్వల్పావధిలోఁ జెప్పిన పద్యమునేఁ గవి మఱలఁ జెప్పఁడు. తిక్కనాదులు తమ పాత్రములలో నొకగ్రంథమునందున్న దానిని మఱియొక గ్రంథములోనికిఁ దీసికొనుచు వచ్చిరి. కాని యేక గ్రంథముననే యొక యాశ్వాసమున నున్నదానిని మఱియొక యాశ్వాసములోనికిఁ దెచ్చియుండలేదు. ఇంట నొక్క భారతముననే సభాపర్వములో నున్నదానిని నవ్యవహితపరముగానున్న వనపర్వములోఁ గనుటచే నద్ది శంభుదాసుఁడు చేసిన యనుకరణము మూలముగా వచ్చియున్నదను కొనుటయే యెక్కుడు సారస్యము కలిగియున్నది. ఆరణ్యపర్వశేషమును శంభుదాసుఁడు కారణాంతరములచే నన్నయ పేరనే విరచించెనను పూర్వప్రసిద్ధిని గొట్టివేయుటకుఁ దగునాతంకములను మన పంతులవారు చూపలేకపోయిరి.

ఏవిధమునఁ జూచినను నారణ్యపర్వములో "శారదరాత్రు" లను పద్యమువఱకే నన్నపార్యుని కవిత్వమనియు, "స్ఫురదరుణాంశురాగరుచి" యనుపద్యము మొదలు దువిపఱకుఁ బ్రబంధపరమేశ్వరుని స్వతంత్రకవిత్వమనియు దలంచుటయే సత్యమార్గమని పైవిమర్శనముంబట్టి నాకు దోఁచుచున్నదని యాంధ్రవిద్వల్లోకమున కిందు మూలముగా విన్నవించుకొనుచున్నాఁడను.





# కవి

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు

నా రాజ్యంబునఁ దొల్త వర్షము వసంతం బావలం గాని పై
వేసఁకాలము లేదు ధౌతసికతా విశ్రాంతిధామాలె కా
నీ ఱొంపుల్ కనరావు వెన్నెలలె కానీ యెండలే లేవు పు
ష్పారామంబులె కాని లే వొకట శూన్యంబౌ స్థలాభోగముల్.

శా. మావర్షర్తువునం దొకానొకయెడన్ మంచుల్ విడంబించి దే
రావిస్ఫూర్తి వెలుంగఁ బందిళుల నారంభించు నేపథ్యముల్
కావించున్ జలయంత్రశాలల గమిం గల్పించు మే మందులం
ద్రోవల్ తప్పుచుఁ బోదు మారయక ముందుల్ మీఁదులున్ వెన్కలున్.

గీ. మాకు నాహారవస్తువుల్ మంచిమంచి, యూహ లానందసందోహదోహలములు
వానిఁ బడసినయెడ మాకుఁ బారణంబు, పడయఁ గలుగనిచో హరివాసరంబు.

శా. మాలోకంబున నందముం గనుచుఁ దన్మాధుర్యముం జెప్పఁగా
నాలోచించుచు దానిసోయగమునం దల్లారు తీయందనం
బౌరా మత్తిలఁజేయ నెంతయును గాయంబున్ మనంబున్ వచో
జాలంబున్ మఱపూని కొందుము పునర్జన్మంబు జాగ్రత్స్థితిన్.

ఉ. నందితలోక యా తెలివి నాఁ జను దేవత మాకుఁ దల్లి యా
నందము మాకుఁ దండ్రి జననంబును బొందిన యుత్తరక్షణం
బందున మేము * హోమవిహగావళిచందము మిన్ను ముట్టి యా
నందకథల్ సుధల్ గురియ నైపుణిఁ బాడుదు మెల్లవేళలన్.

సీ. మేరుకూటంబుల మీఁదుల నెక్కనాఁ, డొకనాఁడు సాగరోదకములందు
నందనవనకుంజబృందమం దొక్కనాఁ, డొకనాఁడు బదరికాంతికమునందు
ముయ్యేటి తరఁగల యుయ్యాల నొక్కనాఁ, డొకనాఁడు ధవళవాలుకలయందు
ప్రణయినీ పరిపూత పార్శ్వమం దొక్కనాఁ, డొకనాఁడు మునిరాజు శుకునిచెంత

---

* హోమపక్షి అంతరిక్షమున నెచటనో గ్రుడ్డు పెట్టును. ఆగ్రుడ్డు నేలవఱకు జాఱి నేల నంటక నేలపయి నుండియే పిల్లయై యెగిరి తల్లికడకుఁ బోవును.

గీ. అనుకొనిన యంతమాత్రలో నప్పడప్పుడు, ఆఘనమేఘాలఁమీఁద మే మవతరింతు
మేము దేనిని జూడఁగాఁ బోము దాని, కూరుఁ బేరును నిసుమంత యుండఁబోదు.

సీ. మా కన్నదమ్ములు మఱి యక్కసెల్లెండ్రు, తా మసంఖ్యాకు లుదారమతులు
ఏ దేశజాతులనేని బుట్టుదుము గా, తము మాకు వర్ణభేదంబు లేదు
ఏ భాషయందు మేమేది చెప్పిన నది, మాదుసోదర్యత కాదిసాక్షి
ఉదయించు భాష మామదినుండి తంతువా, యంబునుండియును దారంబుపగిది

గీ. ఎంతమంది జనించి యెంతెంత యాస్తి, వారివారికొలందిగాఁ బంచుకొనిన
వరుసగాఁ బుట్టి వారికి వలసినంత, పెరుఁగుచునె యుండు నెపుడు మాపితృధనంబు

శిల్పి

ఉ. రూపము నాదురాజ్య మనురూపములై తగు తూలికల్ మషీ
లేపము కాకితంబు లమలీమసముల్ వలిపెంబు లెంతయుఁ
నా పరివారముల్ గత మనాగతముఁ మఱి వర్తమానముఁ
'మాపని చూడు' మంచును బ్రణామ మొనర్చును నాదు చేతికిఁ.

క. వ్రాయుదు నాకాశంబును, వ్రాయంగాఁగలను నేను వాయువును మఱిఁ
వ్రాయుదు జీవరహస్యము, వ్రాయంగాఁగలను నేను భగవాను నొగిఁ.

సీ. లేమనెమ్మోమును లిఖియించి జ్ఞానిచే, నింతుసమాధి మున్గింపనేర్తు
శ్రీకృష్ణభగవానుఁ జిత్రించి పరమ నా, స్తికుచేతఁ జేతు లెత్తింపనేర్తు
వాకల నేర్పుగా వ్రాసి చూపఱచేత, బిందెలగముల ముంపింపనేర్తు
ఉపవనంబును గీచియును బూలఁ బండులఁ, గోయఁ బెండమి నొందఁ జేయనేర్తు

గీ. పటముపైఁ దెరమాత్రము పటిమ వ్రాసి, లోను నే మున్నదో యని కానఁబోవ
మాటి మాటికి దానిని మానరముగ, నెత్తఁగాఁజేసి భ్రమ మొనయింప నేర్తు.

ఉ. తేనియతోడ మోవి వినుతింపఁగ వ్రాయుదుఁ దావితోడ నె
మ్మేనిని దీర్చెదఁ బెళుకు మించుల తోడను జూపు గీసెదఁ
మానితరీతిఁ దేటలగు మాటలతోడను మోము కూర్చెదఁ
ధీనియమంబుతోడుత హృదిఁ లిఖియింతు ననంతభంగులఁ.

గీ. ఎవ్వరా యన్నవారహో యీశ్వరునకు, లేదు రూపంబు రూపంబు లేదటంచు
వ్రాసి యుంటి నిదే భగవంతు నిందు, దీనిఁ గని మీమతంబు దిద్దికొనుఁడయ్య.





# కావ్యము - పరమప్రయోజనము

విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి గారు

(భారతి సంపుటము ౧, సంచిక ౧౧ తరువాయి)

౪

కవయితలు కావ్యమునందు ఉత్కృష్టనాయకుల నిబంధించుట మాని నీచనాయకుల నిబంధించుట ఎందుకు? పుణ్యమా? పురుషార్థమా? అనునది మనము ప్రత్యుత్తరింపక విడిచిన ప్రశ్న విచారింతము.

ప్రపంచము ద్వంద్వసమ్మిశ్రితము. సుఖమును, దుఃఖమును కలిసి మెలసియే యుండును. కేవలము మంచిగాని, చెడ్డగాని ఉండదు. ప్రపంచమునం గాంచెడి వివిధపరిస్థితులను గవియైనవాఁడు పరికింపవలయును. యథార్థకవి ఉత్కృష్టప్రకృతులను మాత్రము గ్రహించి, నీచప్రకృతులను విసర్జింపఁడు; విసర్జింపజాలఁడు. కవితయే యొకప్రపంచము. కవితానిర్మాణమే యొకప్రపంచనిర్మాణము; నవ్యసృష్టి. ప్రపంచమునకుఁ బరమేష్ఠి ఎట్లు స్రష్టయో, ఈ కవితాప్రపంచమునకుఁ గవియు నట్లు. లాక్షణికు లేమన్నారు :

"అపారే కావ్యసంసారే
కవిరేవ ప్రజాపతిః ;
యథాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే.
శృంగారీ చేత్కవిః కావ్యే
జాతం రసమయం జగత్ ;
సచేత్కవి ర్వీతరాగో
నీరసం వ్యక్తమేవ తత్".

(దరిలేని యీ కావ్యసంసారమున కవియే బ్రహ్మ. ఈ ప్రపంచ మతని కెట్లు రుచించునో అట్లే అది మాఱుచుండును. కవి శృంగారియైనా, కావ్యము రసమయము. కవి విరాగి అయినచో నీరస మని సుస్పష్టము.)

కావున, కవి ప్రపంచమున దనయిచ్ఛ వచ్చిన పరిస్థితులను గ్రహించి, కవితారచనము సాఁగించును. నీచప్రకృతులను ఏల గ్రహింపవలె? ఉత్కృష్టప్రకృతులనే గ్రహింపరాదా? అని కవిని ప్రశ్నించుట అసంగతము. రసికునకుఁ గాని, లాక్షణికునకుఁ గాని అట్టి యధికారము లేదు. కవి ఒకకథావస్తువును గ్రహించి, దానికి వన్నెలు, చిన్నెలు కల్పించి మనోహరముగఁ గావ్యమును తయారుచేయును. దానిని జూడవలయును; రసాస్వాదము కావింపవలయును; ఆనందింపవలయును. రసికుని యధికార మంతియ. తప్పా

ష్యుల విమర్శింపఁగూడదనికాని, కథానిర్మితి నాక్షేపింపఁగూడదనికాని మా యాశయము కాదు. కవి స్వేచ్ఛను—అథవా కవి స్వాతంత్ర్యమును మన మరికట్టఁజాలమనుట. ఎన్ని నాళ్లు ఎందరుకవు లెన్ని సారులు వర్ణించినను రాజచరిత్రములు మాత్రమే కావ్యముల వర్ణింపవలయునోటు? సామాన్య జీవితముల కావ్యముల నిబంధించుట దిద్దరాని యపరాధ మా? రాజశిరోమణుల శౌర్యకళావిలాసము లకు, రాచపడఁతుల విరహావిహారములకుఁ దక్క, తక్కినసామాన్యాంశములఁ జిత్రించు టకుఁ జోటులేదా కవితయందు? కావ్యము నందుఁ గర్షకాదుల అమాయికసుఖజీవనము లు, కాపుపడఁతుల నిష్కైతవపుమార్గ్యవిలా సములు, పైరుపచ్చల సౌభాగ్యభాగ్యములు వర్ణనీయములు కావో? కావన నేమాత్రము వీలులేదని మామనవి. ఉత్తములగు నరపతు లే నాయకులుగా నుండవలెనను నిబంధ నము మిగుల బిఱుసుసిద్ధాంత మని మా విజ్ఞప్తి. "నీచప్రకృతినిబంధనము నీత్యుపదేశము కాదు. అందువలనఁ బరిత్యాజ్యము; లాక్షణి కోక్తమగు నుత్తమనాయకత్వము సిద్ధింపదు" అను వాదము నిలువఁజాలదని చెప్పుచు, ఏవం విధకావ్యజాతము నీత్యుపదేశక మెట్లగుచు న్నదో, నిరూపించియుంటిమి. అదియుఁగాక—

'నిరంకుశాః కవయః'

కవులు నిరంకుశులు. కవిమానసము మహోదాత్తము; స్వతంత్రభావసంవలితము. అతనిసృష్టికి ఎదురు లేదు. అతనియిచ్ఛ కడ్డము లేదు—అని యీవిచారఫలితము. ఇఁక, ఈ యవాంతరప్రశ్నమును విస్తరించుటమాని ముఖ్యవిషయమునకు వత్తముకాక. కొంత వఱకు మనము కావ్యపరమ ప్రయోజనవిష యమై చర్చించితిమి. కావ్యప్రయోజనముల లో ముఖ్యమైనది నీతి అని యంటిమి. అయి తే, కావ్యపఠనమునకుఁ బరమప్రయోజనము నీతియేనా? అని ప్రశ్న కలుగుచున్నది. విచారింతము.

(౨)

కావ్యపఠనమువలని ముఖ్యప్రయోజన ము నీతిమట్టుకు కాదు. మఱేది? ఆనందము. అయితే, నీత్యుపదేశకత్వము కావ్యమువలన సిద్ధించుచున్నదే, అనీతిమాత్రము కావ్య ప్రయోజన మని చెప్పఁ దగదా? అని విచి కిత్స కల్గుచున్నది. కావ్యములయందు నీతి అనవసరమేనా అని సందేహ ముదయించు చున్నది. నీతి కావ్యప్రయోజనములలో నేక మనుట మేము కాదనలేదు. అదియు నొక ప్రయోజనమే అని యంగీకరించితిమి. నీతి సత్కావ్యముల వ్యంగ్యసరణిని విభాసిల్లి తీఱు నని ఇదివఱకే చెప్పితిమి. కాన, నీతి కావ్య మున కనవసరమని చెప్పలేదనుట సుస్పష్టమ కాని, కావ్యముయొక్క పరమప్రయోజనము మట్టుకు నీతి కాదంటిమి. ఆనందమే పరమ ప్రయోజన మంటిమి. ఈసంవాదములు కాం చుఁడు:—

సకలప్రయోజనమౌళిభూతం
సమనన్తరమేవ రసాస్వాదనసముద్భూతం;
విగళితవేద్యాంతరం పరమానన్దమ్—

—మమ్మటుఁడు.

(కావ్యపఠనప్రయోజనములలో నెల్ల ముఖ్యమైనది, రసాస్వాదమువల్ల కలుగునది-అన్నిటిని మఱపించు పరమానందమే.)

౨. పరనిర్వృతి రేవేహ
ముఖ్యం ఫల మితి రహస్యమ్.
—విద్యానాథుఁడు

(ఈ కావ్యమునం దతిశయితమగు నానందమే ముఖ్యమగు ఫలమని రహస్యము.)

3. ఆనన్ద ఏవ పార్యంతికం
ముఖ్యం ఫలమ్.
—లోచనకారుఁడు.

(ఆనందమే ముఖ్యమగు ఫలము.)

౮. The test of exellence is pleasure.
—Aristotle.

(యోగ్యతాసమీక్షణము ఆనందము.)

పై సంవాదములు ప్రాచ్యపాశ్చాత్య విపశ్చిద్వరేణ్యులవి. వానివలన, ఆనందమే కావ్యముయొక్క- పరమప్రయోజన మని సిద్ధాంతిత మగుచున్నది. నీతి కానిండు-సదుపదేశము కానిండు-ఏదయినను కావ్యముయొక్క- పరమప్రయోజన మని చెప్పఁ గాదు. ఆనందమే-తన్మయీభావజనక మగు నానందమే-విగళితవేద్యాంతరమైన యానందమే-బ్రహ్మానందసబ్రహ్మచారి యగు నానందమే-కావ్యపఠనమునకుఁ బరమప్రయోజనమని సిద్ధాంతము. అయితే, ఈయానంద మెట్టిది ? అను ప్రశ్న బయలుదేరుచున్నది. విచారింతము.

(౬)

లోకములో ఎంత మందబుద్ధి యైనను సుఖమునే కోరుకొనును. దుఃఖమును కోరఁడు. ఆనందప్రాప్తికయి మిగుల శ్రమించును; ప్రయత్నింపడును. కావుననే, లోకము కావ్యపఠనమున ఆసక్తమానసమగుచున్నది. ఆనందపరకాష్ఠాప్రాప్తికయి కావ్యపఠనశ్రవణాదుల నొనర్చుచున్నది.

ఆనందము మొత్తముమీఁద నేకస్వరూపమైనను, విషయమునుబట్టి దాని కనేకవిభేదము లున్నవి. అతిరుచ్యమగు రసాలఫలమున్నది. కొనుచున్నాము; తినుచున్నాము. ఆనందము కలుగుచున్నది. పుత్రజననవార్త శ్రవణగోచర మగుచున్నది. ఆనందము కల్గుచున్నది. మనోహరము, రసభావోజ్జ్వలము నగు కావ్యమును జదువుచున్నాము; లేదా, వినుచున్నాము. అప్పుడును, ఇట్టిదని చెప్పరాని యానందము కలుగుచున్నది. సర్వవ్యాప్తమై, మహాతేజస్స్వరూపమై, నిష్కళంకమై, నిరంజనమై వెలయు పరబ్రహ్మను సాక్షాత్కరించుకొను నప్పుడును ఆనందము కలుగుచున్నది. కేవల మది ఆనందము కాదు-ఆనందపరసీమ.

పై చెప్పిన యానందపరంపరలో పూర్వపూర్వముకన్న నుత్తరోత్తరము బలీయ మని చెప్పకయే తెలిసికొనవచ్చును. ఫలభక్షణాద్యైహికవ్యాపారజన్యమగు నానందమంతయు నానందమే. మేము దానిని ఆనందము కాదనుట లేదు. ఆ యానందము లన్నియు క్షణి

కములు. కావ్యము—మననస్మరణాది వ్యాపార ద్వారమున అనవరతానందప్రదము. బ్రహ్మానందము అవాఙ్మానసగోచరము. ఇదియు నట్టిది. అందువలననే లాక్షణికులు కావ్యానందమును బ్రహ్మానందసబ్రహ్మచారి అన్నారు. ఈయానందానుభవమున కందఱు తగియుందు రనుట భ్రమ. విభావాదిజ్ఞానము కలిగి, రసస్వరూపనిరూపణ మొనర్చుకొని, కావ్యపఠనమున సారస్యమును గ్రహించు రసికునకే ఈయానందము చిక్కుట. తక్కుంగల వారల కది దుర్లభ మనుట పునరుక్తియ. రసికతాప్రాప్తికయినను బూర్వజన్మసంస్కార ముండవలె ననియుం గాకున్న దుర్లభ మనియుం బ్రాజ్ఞులునుడివెదరు. అయితే, కావ్యమునందు ఈయానంద మెట్లు కలుగుచున్నది యో మఱియొకపరి మీమాంసింతము.



# ఆశ్రమప్రాంతములు

నన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారు

చెక్కించి చక్కఁగా సిద్ధంబుగాఁ జేయఁ, గాఁబడినట్లున్న కందరములు
ప్రతిదినంబును నీరుపట్టి లెస్సఁగఁ బెంపఁ, బడుచున్నగతిఁ బొల్చుపండ్ల చెట్లు
ఇచ్చవచ్చినరీతి ఋషివరుల్ త్రిప్పికొ,న్నట్లుగఁ బ్రవహించు నట్టియేళ్లు
కల్పించి యొక్కనికై యేర్పఱచినట్లు, పొదలుచుండెడి పువ్వుఁ బొదరుటిండ్లు

గీ. కలిగి యొకదానిపైని నొక్కటి యమర్పఁ, గాఁబడినరీతిఁ గొమరారు గండశిలలు
శిల్పి నైపుణిఁ జూప రచించినట్లు, ప్రమద మొనరించు నాశ్రమప్రాంతము లివె.

సీ. భక్తియుక్తంబుగాఁ బాద్యంబు నర్పించు, నెల్లప్పు డీసెలయేళ్ల జాళ్లు
హృదయపూర్వకముగా నిచ్చు నర్ఘ్యంబును, దినదినం బీపూవుదీవెగములు
ఆప్యాయనమ్ముగా నాహారమర్పించుఁ, జేతికి నీ పండ్లచెట్లగుంపు
ఆర్ద్రచిత్తంబుతో నడుగు క్షేమంబును, గలకలకూయు నీపులుఁగు పిండు

గీ. అన్నిటికి నేమిగాని తానచట నెలసి,యుండు నానందదేవి మహోత్సవమునఁ
జెలఁగి యమృతవాక్యముల నాశీర్వదించు, నేగుదెంచెడు నతిథులబృందములను.

చ. వలదనుమాట లేదెవరు వచ్చిన నెన్నిదినంబులున్న నోఁ
బలికెడువారు లేరొకరివస్తువు లివ్వనుమాట లేదు; తీ
వెలగమితోడ స్నేహలతఁ బెంచుచునుందురు; బాపు! చెప్పఁగా
వలసిన దేమి? మానవుని భాగ్యమెకా యటకేఁగి చూచుటల్.

గీ. ఎపుడు సెలయేటి యొడ్డుల నెగుడు దిగుడు, రాతిబండలఁ గూర్చుండి రాత్రి పడెడు
దాఁక నానందమధురగీతములు బాడు, చంద్రు ఋషికుమారికలు మహోత్సవమున.

సీ. ఉన్నతికిం బోవుచున్న గొబ్బండుల, చెట్టుల నరసి వీక్షించుచున్నఁ
బండుల బరువుచే నిండి నేలకు వంగు, కొమ్మలు గల వృక్షకోటిఁ గన్నఁ
బరులకోసంబె జీవనములఁ దాల్చుచు, ననయంబుఁ బాఱు వాహినులఁ గన్నఁ
గంటకాదులు దన్నుఁగాఁడిన నిశ్చలత్వమును మానని శిలాతతులఁ గన్న
గీ. మానవుని చిత్తమందు నేమాత్రమైన, జ్ఞానముండినయెడల నిశ్శంకముగను
సడలిపోనె? తనంతదోషప్రవృత్తి, పరులు బోధింప నక్కఱ యప్పటకుండ.

సీ. తాపసేంద్రులకు నిత్యమును శుశ్రూషింపఁ, గ వసంతలక్ష్మి జాగ్రత్త నుండు
మునిపుత్త్రికలు గాత్రముల నెత్తి పాడఁబోఁ, గోయిలగమి శ్రుతి వేయుచుండు
బ్రహ్మచారుల వేదపాఠంబులోఁ గీర, బృందంబులు గవళ్లు దిద్దుచుండు
సామగానమునకు శైలంబు హృదయంబు, గరగి నిర్ఝరములై పఱచుచుండు
గీ. అకృతకమనోహరంబులౌ నా కుటీర, కంబు లానందరాజ్యశృంగాటకములు
ఋషిజనైకతపోధనక్రీతమైన, యా ప్రపంచంబు స్వర్గమర్త్యములసంధి.

గీ. తిరుతీరైన చల్వపందిళ్లు వేసి, రీతిరీతి పూఁదోరణాల్ వ్రేలఁగట్టి
వలయు సర్వసన్నాహంబు సలుపఁబడెను, అచట నానందలక్ష్మి కల్యాణమునకు.

గీ. ఒక్కవృక్షంబునను బూచియున్న పువ్వు, లొక్కచేనిలోపలఁ బండియున్న పంట
ఒక్కగనియందు జనియించి యున్న మణులు, ఈప్రదేశానఁ జరియించు నెల్లమంది.

శా. సాయాహ్నంబునఁ గొండవాఁగుదరినిఁ సాంధ్యక్రియల్ దీర్చి నాఁ
డేయేసాధన లాచరించుకొనిరో! యేక్రొత్తలం గాంచిరో
ఆయావాని వచించుకొంచుఁ జనుచుం ద్రంథమ్ముకాఁగా మునుల్
మాయంబోలెను ముండ్లకొమ్మలను దన్మార్గాన నొత్తించుచున్.

ఉ. మావిచిగుళ్లఁగాని సుకుమారలతాతతియందుఁగాని క్రొ
త్తావులు చల్లు పుష్పముల తండములందునఁగాని తోఁచు నా
చేవ, మనోహరత్వమును శ్రీయుఁ గనుంగొనరా దొకింతయున్
దేవళమందుఁ గన్పడెడు దేవుని మోమున నేమిచిత్రమో!

క. యువతులు యువజనములునుం, బువుఁబొదలం జేరి పాఠములు సదువుచు రా
త్రివిశేషంబుగఁ బోఁగాఁ, బవళింతు రశంకితముగఁ బార్శ్వములందున్.

# రుక్మిణీ పరిణయము పరిహరణీయమా?

## గున్నేపల్లి అక్షయలింగము గారు

"క. హాటక గర్భవధూటీ, లాటనచలితాంఘ్రి నూపురారావ శ్రీ
పాటచ్చరములు తేనియ, తేటలు మా కూచిమంచి తిమ్మయ మాటల్"

కవిసార్వభౌముఁ డని పేరువడసిన కూచిమంచి తిమ్మనామాత్యునిచే రచియింపఁబడిన "రుక్మిణీ పరిణయము"పై మన శ్రీభమిడిపాటి పెద రామసోమయాజులుగారు గావించిన విమర్శన మెంతయు యుక్తియుక్తముగను సహేతుకముగను సమంజసముగను నున్నది; కాని కొన్ని విషయములలో నేను వారి యభిప్రాయముతో నేకీభవింపఁజాలకుంటి నని విన్నవింపఁ జింతిలుచున్నాను.

తిమ్మనామాత్యుఁడు పదునేడవ శతాబ్దారంభమునం దుండిన యాంధ్రమహాకవులలో సుప్రసిద్ధుఁడని మొట్టమొదటనే తమ విమర్శనమున రామసోమయాజులు గారు పేర్కొనియున్నారు. అట్లు పేర్కొనియుండియు గ్రంథప్రాశస్త్య మెట్టులున్నను బహుళగ్రంథనిర్మాణమే యొక మహాకవిలక్షణ మగునేని ఈతిమ్మనామాత్యుఁడును మహాకవి యనఁదగినవాఁడని దిగువఁ దమ యభిప్రాయమును సూచించియుండిరి. బహుళగ్రంథనిర్మాణమునుబట్టియే తిమ్మనార్యుని మహాకవియని పేర్కొనినట్లు వారి యుద్దేశమువలన వ్యక్తమగుచున్నది. గ్రంథప్రాశస్త్యము లేకపోయినను బహుళగ్రంథనిర్మాణమును బట్టియైనను కవిసార్వభౌముని మహాకవియన నామోదింపఁగలిగినందులకు సంతసింపవలసియున్నది. కాని మహాకవులలో సుప్రసిద్ధుఁడని తాము మొదట నుడివిన దానిని వీరెట్లు సమన్వయింతురో?

"శ్రీకృష్ణుఁడు సర్వలోకారాధ్యుఁ డగు సర్వేశ్వరుం డను పూజ్యభావముతో వరించినదిగాని మన తిమ్మనార్యుని రుక్మిణివలె నాతఁడు "మదనకళాతంత్రకోవిదుఁ" డను నభిలాషచేఁగాదు" అని పోతనామాత్యవిరచితమగు నొక పద్యమును జూపి రామసోమయాజులుగారు రుక్మిణీ మనోభావమును ప్రకటించియున్నారు. పూజ్యభావము గల రుక్మిణి యిందు "మానినీచిత్తచోర!" యని శ్రీకృష్ణుని సంబోధించుట యెందులకో?

రుక్మిణి శ్రీకృష్ణుని సర్వేశ్వరుఁ డనుభావముతో మాత్రమేకాక యాతని రూపబలగుణాదులనుబట్టి తనకు నతఁడు తగిన విభుఁడని యెంచి వరించినట్లు కూడఁగన్పట్టుచున్నది.

"క. తనతండ్రి గేహమునకుం
జనుదెంచుచునున్న యతిథిజనులవలనఁ గృ
ష్ణుని రూపబలగుణాదులు [ చెక."
విని కృష్ణుఁడు తనకుఁ దగినవిభుఁడని తలఁ

— భాగవతము.

అట్లే తిమ్మనార్యుని రుక్మిణి శ్రీకృష్ణునిఁబరమపురుషుఁడును భగవంతుఁడు ననియే వరించినది. ఈ దిగువపద్యములు శ్రీకృష్ణునియెడల నామెకుఁగల పవిత్రభావమును వ్యక్తపఱుచుచున్నవి. చూడుఁడు.

"చ. సరసగుణాభిపూర్ణుఁ డగు
శౌరిపదాంబుజసేవ సేయఁగా
మరిమరి గోరుచిత్త మిఁక
మక్కువ నన్యులఁ జేరఁగోరునే
నిరతశుభాకరామరధునీ
పృథునీరవిరాజదూర్మి కా
పరిచిత రాజహంస మొకపట్టునఁ
బచ్చికపట్టుఁ జేరునే."

—రుక్మి. ఆ. 2. ప. 84.

"ఉ. మారునిఁ గేరు చారుసుకు
మారుని నందకుమారుని న్మనో
హారుని మానిమానసవి
హారుని సన్మణిహారునిన్ రమా
ధారుని ఘోరశాత్రవవి
దారుని శశ్వదుదారునిన్ సదా
చారుని భక్తరక్షణ వి
చారుని నేక్రియఁ జూడఁ గల్గునో."

—రుక్మి. ఆ. 2. ప. 37.

"మ. ధరణీదేవకుమార! నీ మహిమ చి
త్రం బెన్న నిద్ధాత్రి నె
వ్వారికిం జెల్లున మందయాన మొనరన్
ద్వారావతిం జేరి భా
స్వరలీలన్ మహిపావరోధము ప్ర
వేశంబై జగత్కారణున్
బరమాత్మున్ హరిఁ దోడి తెచ్చితివి మ
ద్భాగ్యాధి దైవంబవై."

—రుక్మి. ఆ. 5. ప. 21.

పైపద్యములనుబట్టి శ్రీకృష్ణుని నామె భగవంతుఁ డనియే వరించినదో, మన రామసోమయాజులుగారు తలంచినట్లు "మదనకళాతంత్రకోవిదుఁ" డను నభిలాషచే వరించినదో పాఠకు లరయుదురు గాక!

"రాను రాను ......... కథాబాహుళ్య వను త్కృతులు లేవు. స్వాభావికములైన వర్ణనము లెక్కడనో కాని కానరావు. భాషయు పెక్కుతావుల నస్వాభావికమే. చెప్పఁబడిన యవస్థాదు లమానుషము లతిమాత్రములు. సమాసములు పెక్కుచోట్ల నతిదీర్ఘములు .........మన యీతిమ్మనామాత్యుని "రుక్మిణీపరిణయము"కూడ నీతరగతి ప్రబంధకోటిలోనే చేర్పదగియున్నది."

అని రామసోమయాజులుగారు వ్రాసియున్నారు. గుణాగుణనిరూపణమే విమర్శనమని నిర్వచించిన వీరు "రుక్మిణీపరిణయమున" నట్టిదోషములు దొరలిన భాగములను సవిస్తరముగ నెల్లడించిన బాగుండును.

తిమ్మనార్యుఁడు బాల్యమున రుక్మిణికి నన్నమును దినిపించు సందర్భమున స్త్రీజన స్వాభావికమగు నేర్పు నెట్లు ప్రదర్శించెనో పరికింపుఁడు:

"ఉ. అల్లదె చందమామ దివి
నంటి వెలుంగు చనంటిపండులున్,
బెల్లము వెన్న చక్కెరయు
నెయ్యిని బాలును జున్ను మీఁగడల్
కొల్లలు మీఱఁ బట్టుకొని
కూరిమి నాడుకొనంగ వచ్చె రం
జిల్లి చకోరనేత్ర యట
నేయక కన్గొనుమంచు వెండియున్.

ఆ. వెండిగిన్నెలోన వెన్నయు బువ్వయుఁ
బసిఁడిగిన్నెలోనఁ బాలు నిడుక
చందమామ! రావె జాబిల్లి! రావె మా
పాపతోడ నాడ మాపులనుచు.

కం. నెలబాలుఁ జూపి నునుగి
న్నెలఁ బాలును నెయ్యిపోసి నెలఁతుక లాచి
న్నెల బాలకుఁ ద్రావించుచు;
నెలమిం గ్రీడింపఁ జేసి రింపలరారన్."

—రుక్మి. ఆ1. 81, 82, 83.

హరిరాక కెదురుచూచుచు సకలప్రయోజనములందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి రుక్మిణిని బోతనార్యుఁడును దిమ్మనామాత్యుఁడును రచియించిన యీ క్రిందిపద్యములయందుఁ జూడనగు.

"ఉ. చెప్పదు తల్లికిం దలఁపుఁ
జిక్కు దిశల్ దరహాసచంద్రికం
గప్పదు వక్త్రతామరస
గంధసమాగత భృంగసంఘమున్

రొప్పదు నిద్రఁ గైకొన దు
రోజపరస్పరసక్తహారముల్
విప్పదు కృష్ణమార్గగత
వీక్షణపంక్తులు ద్రిప్ప దెప్పుడున్.

చ. తుడువదు కన్నులన్ వెడలు
తోయకణంబులు కొప్పుఁ జక్కఁగా
ముడువదు నెచ్చెలిం గదిసి
ముచ్చటకుం జన దన్నమేమియుం
గుడువదు నీరముం గొనదు
కూరిమిఁ గీరముఁ జేరి పద్యముల్
నొడువదు వల్లకీగుణవినోదము
సేయదు డాయ దన్యులన్.

సీ. మృగనాభియలఁదదు మృగరాజ మధ్యమ
జలముల నాడదు జలజగంధి
ముకురంబు సూడదు ముకురసన్నిభముఖి
పువ్వులు దుఱుమదు పువ్వుఁబోఁడి
వనకేళిఁగోరదు వనజాతలోచన
హంసంబుఁ బెంపదు హంసగమన
లతలఁ బోషింపదు లతికాలలితదేహ
తొడవులు తొడవదు తొడవుతొడవు

ఆ. తిలకమిడదు నుదుటఁ దిలకినీతిలకంబు
కమలగృహముఁ జొరదు కమలహస్త
గారవించి తన్నుఁ గరుణఁ గైకొన వన
మాలిరాఁడు తగవుమాలి యనుచు.

మ. మలఁగున్ మెల్లని గాలికిన్ బటురట
న్మత్తద్విరేఫాలికిం
దలఁగున్ గోయిలమ్రోఁతకై యలఁగు, ను
ద్యత్కీరసంభాషలం
గలఁగున్ వెన్నెలవేఁడిమిన్ నలఁగు మా
కందాంకురచ్ఛాయకుం
దొలఁగుం గొమ్మ మనోభవానలశిఖా
దోదూయమానాంగియై.

—భాగవతము.

ఉ. కట్టదు పట్టుపుట్టములు
కాంచదు కాంచనకాంచికాదులన్
బెట్టదు కొప్పు విప్పగను
బెంచదుకొంచెపు టంచబోదలన్
ముట్టదు వీణెషాణులను
ముద్దుఁజెలుల్ దరిఁజేరఁగేరి చే
పట్టదు పట్టెఁడన్న మొక
పట్టున నైన భుజింప దింపుగన్.

మ. తలయూఁచున్ గనదోయి మూయుఁ దన
దానవ్యూహమున్ బిల్వకే [లోఁ
పలుకుం జెక్కునఁ జెయ్యి సేర్చు సఖులన్
బ్రార్థించు నిట్టూర్పుగా
డ్పులు నించున్ బయలాలకించు విధిఁది
ట్టున్ గట్టురాపట్టికిన్
పలుచందంబుల మ్రొక్కుఁ జొక్కు హరిపై
భావంబు రంజిల్లఁగన్.

సీ. కరిరాజయాన భాసురశీతకరచూత
శరవాతపోతవైఖరుల కులుకు
ముకురాభవదన హంసకిశోర పికకీర
నికరారవముల శేవకుఁదలంకు
ధవళాబ్జనయన యాసవపాన నవగాన
రవసూనమాలికాప్రతతిఁ దెగడు
తరుణీలలామ నూపురజాలవరచేల
హరినీలమణిభూషణాదు లిడదు.

గీ. కలికి ఘనసారహిమపూర గంధసార
సారసారంగనాభికాసాంకవాది
మేదురామోదశాదంబు మేనఁబూని
యలఁద నొల్లదు సంతాప మతిశయిల్ల."

—రుక్మిణీ పరిణయము.

ఈసందర్భమునందే కాక తదితరసందర్భముల యం దునుబోతనామాత్యునినుకరించి తిమ్మనార్యుఁడుచూపిన వర్ణనావైచిత్ర్య మెంతయు హృదయంగమముగ నున్నది.

రుక్మిణీపరిణయ ద్వితీయాశ్వాసమున 76,77, 78 పద్యములను దిలకించి విరహవేదనాభరంబున నున్న యం దలి రుక్మిణీమనోభావముల యౌచిత్యము నరయఁజాలక రామసోమయాజులుగారు "ఎట్టికులటకైన నిట్టి మనో భావము లుద్భవించునా?" యని తిమ్మకవిగావించిన రుక్మి ణీపాత్రపోషణమునకు వెఱగుపడుచున్నారు. ద్వారకా నగరముననున్న శ్రీకృష్ణునికి బ్రాహ్మణునిచే నీక్రిందివిధ ముగాఁ దనయభిమతమును దెలిపిన పోతనామాత్యుని రుక్మిణినిగూర్చి యిఁక వీరెట్టి విపరీతభావమును గల్పిం తురో తెలిసికొనవలసియున్నది.

"సీ. ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల ?
పురుషరత్నమ ! నీవు భోగింపఁగాలేని
తనులతవలని సౌందర్యమేల ?
భువనమోహన ! నిన్నుఁ బొడగానఁగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల ?
దయిత ! నీయధరామృతం బానఁగాలేని
జిహ్వాకు ఫలరససిద్ధియేల ?
ఆ. నీరజాతనయన ! నీవనమాలికా
గంధమబ్బలేని ఘ్రాణమేల ?
ధన్యచరిత ! నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు ? "

—భాగవతము.

"దుర్నీతికాలవాలమగు నిందలి శృంగారవర్ణనము పాఠకులను దుర్మార్గగాములం గావించుచున్నది."

ఇట్లు నిరాధారముగా రామసోమయాజులుగారు వ్రాయసాహసించుట మిగుల విషాదకరము. వీరు తలంచి నట్లు "రుక్మిణీపరిణయము" నీచభావ పూరితముగాదు; దుర్నీతిదాయకమునుగాదు. ఆయాయిపట్టుల మృదుమధు రశైలిని సరసముగను సమయోచితముగను నభివర్ణించి తిమ్మకవి తన యసామాన్యపాండిత్యవిశేషమును నిరుప మానకవిత్వపటుత్వమును జూపియున్నాఁడు.

"ఈప్రబంధమున ననేకములగు పద్యముల నడక లును, కల్పనలును, గొన్నిచోట్ల వర్ణనాంశములును గేవ లము వసుచరిత్రము ననుసరించియే వ్రాయఁబడిన ట్లగ పడుచున్నది....... . ....................... ................. కాని యాపద్యముల రచనా నైపుణ్యమును, భావపరిపూర్ణతయు, కల్పనా కౌశల మును, నాసందర్భోచిత వర్ణనాచమత్కారమును నిం దెంత వెదకినను గానబడుట లేదు. .............. .................. మొత్తముమీఁద నరయగా నా కిసుమంతయు పస గానరాలేదు."

అని రామసోమయాజులుగారు నిస్పృహతతోఁ దమ విమర్శనమున వెల్లడించియున్నారు.

పాప, మిసుమంతపసయైనను జూప నోచుకొననే రని "రుక్మిణీపరిణయము" రామరాజభూషణుని రచనా నైపుణ్యమును, భావపరిపూర్ణతయును, గల్పనా కౌశల మును, వర్ణనాచమత్కారమును వీరికి నెట్లు చూపఁగలదు!

గంగాప్రవాహమువోలె నవర్గళ ధారాశుద్ధిం బ్రక టించు తిమ్మకవి సార్వభౌముని కవితామృతమున నిసు మంతయుఁ బస గానరాదని వ్రాసిన రామసోమయాజు లుగారి వ్రాఁతయందలి విలువను బాఠకలోకమే నిర్ణ యించును గాక!

నవరసరసికులగు రుక్మిణీకృష్ణుల సంభోగవర్ణనముం జేసి "రుక్మిణీపరిణయము" పరిహరణీయమా? యని రామ సోమయాజులుగారిని బ్రశ్నింపవలసి యున్నది. ప్రసిద్ధి నహించిన మహాకవులలోఁ బెక్కురు తమ కావ్యముల యందు నిట్టివర్ణనమును విచ్చలవిడిగాఁ జేసియున్నారు. సంభోగవర్ణనమే దూష్యమైనచో రామసోమయాజులు గారి యుద్దేశమునుబట్టి "శృంగారనైషధా" ద్యుత్తమ గ్రంథము లన్నియు మూలమూలలఁ బడవలసినవే!

తిమ్మనార్యుఁడు తనగ్రంథమును శృంగారరస ప్రధానముగ రచియించినను నది దుర్నీతిదాయక మనుట కేవలము హాస్యాస్పదము. ఈగ్రంథమున ననేకములగు పద్యముల నడకలును, గల్పనలును, వర్ణనాంశములును వసుచరిత్రముననను, విజయవిలాసముననను గన్పట్టుచున్న వని కొన్ని యనుస్మృతులను జూపియున్న మన రామసోమ యాజులుగారే దీనిని దుర్నీతికాలవాలమగు దుష్టగ్రంథ ములలోఁ జేర్పనెంచుట శోచనీయము—గుణగ్రహణపారీ ణులగు సహృదయులు యథార్థమును వెల్లడింతురు గాక!



# విభీషణశరణాగతి

కోణిదెన బాలకృష్ణయ్యగారు

అనఘా! రాఘవ! నేవిభీషణుఁడ, దైత్యస్వామి తమ్ముండఁ బా
వనుఁడైనట్టి పులస్త్యపౌత్రుఁడను, నా వాసంబు లంకాపురం
బగు, నిల్లాలిని బిడ్డలన్విడచి, తెంపున్బూని, సత్యంపు భ
క్తిని నీసేవకు వచ్చినాఁడ, ఋజుబుద్ధిన్, రామచంద్రప్రభూ!

శా. అయ్యా! దొంగనుగాను, కుచ్ఛితుఁడఁగా నయ్యా, రహస్యంబు లే
దయ్యా, యున్నది యున్నరీతిగ నసత్యంబింత లేకుండ మీ
నెయ్యుల్మీరు వినంగఁ జెప్పెదను, నా నిక్కంపు గ్రంథంబు; రా
మయ్యా! నేశరణార్థినయ్య, దయచే నాలింపవయ్యా! మొఱన్.

ఉ. దాటఁగరానియవ్విధివిధానముచే నిలయంబుఁ బాసి, మో
మోటమిలేక బంధుచయము న్విడనాడి, విరాగపద్ధతిన్
బాటిలు చిత్తవృత్తిఁ దమపాదము లర్చనసేయ వచ్చితిన్
గాటఁపుఁబ్రేమ న న్మనిచి కావుమ రాఘవ! జానకీధవా!

మ. కడిమిన్ నన్నలకాలఁ దన్నిన, మహోగ్రస్ఫూర్తి వేమందిలో
దుడుకుస్మూఁతలఁ జిన్నపుచ్చినను, సంతోషంబుతో నుండు న
క్కడనే; యయ్యది దుష్టవర్తనుల సంఘంబౌటచే రోసి, నీ
యడుగుఁదమ్ములఁ గొల్వవచ్చితిని, రామా! నన్ను రక్షింపుమా.

చ. అలిగినయంతమాత్రన మహాఘనకార్య మొనర్పనౌనె; నీ
విలసిత సత్కృపాకలిత వీక్షణము ల్దరిఁజేర్పకున్నఁ గే
వల మొక తుంటకట్టె యనివారణశక్తి ననేకకార్యము
ల్సలుపునుగా బలాధికుఁడు సన్నిధిఁ జేర్చుటఁ జేసి రాఘవా!

చ. అలరులతావిఁగూడి మలయాచలమందసమీరణంబు ది
క్కులఁ బ్రసరించి మానవులకు న్సుఖమిచ్చు తెఱంగు; మంచివా
రల కగు చెల్మికల్మిని ధరాస్థలి నెన్నొ మహోపకారము
ల్సలుపఁగవచ్చు, నవ్విబుధసంతతిఁ గావఁగవచ్చు, రాఘవా!

ఉ. ఇంటఁగలట్టి గుట్టుచెడ నీతఁడు వేఱొకత్రోవఁ బట్టెఁ జూ
కొంటె యటంచు లోకులనఁ గ్రోధముఁ గాంచు నెవండు; వార ల
ట్లంట నిజంబెఱుంగకెకదా! తగనగ్నికణంబు యింటిచూ
రంటిన దాఁచవచ్చునె? రహస్యమటంచును, జానకీపతీ!

ఉ. నీవిఁకఁ బాలముంచినను నీళ్లను ముంచిన మేలెచుమ్ము, రా
జీవదళాక్ష! యన్యులను జేరను, చెంగటనుండిగాని—న
న్నావలి కేగుమన్న నటనైననుగాని, భజింతు నిన్నె; నీ
తావర! నిన్నుఁ జూచితిఁగదా! దయవచ్చినయట్లు సేయుమా?

సీ. వలిపెంపుమేలి దువ్వలువలు త్యజియించి, ముదుకబట్టలు ప్రేమ మునధరించి
మగరాల జిగిమించు మంచిసొమ్మును దీసి, సంయమిసుతుల వేసములు వేసి
చవులూరఁజేయు భోజనములువర్జించి, కందమూలముల నాకలి నడంచి
నిద్దంపు మేడలఁ బ్రొద్దుపుచ్చుటమాని, నట్టడవుల పయనంబుఁ బూని
చెప్పరానట్టి యిక్కట్లఁ జిక్కి, ముద్దు, తమ్మునిన్గూడి యిటురా కతమ్ము మమ్ము
వంటి శరణార్థి జనులఁ గాపాడఁ గాదె; లలితగుణధామ, సీతాకళత్ర రామ!

చ. "తికమక లెన్నియేని జగతిన్ బొనరించుచు, సాధువైన వా
రికిఁ గడగండ్లుగూర్చి చెలరేగిన వారలవాఁడవీవు, 'న
మ్మక మెటుపుట్టు నీయెడల మా" కని రామ! త్యజింపఁబోకుమీ
ఒకజనయిత్రియందు జని నొందినవా రొకరీతి నుందురే?

చ. పరుఁడవో, కాక నీవు నరపాలుఁడవో, మునివేషధారివో
అరయఁగ నాకునేమి పని; యార్తశరణ్య! యిహంబునందు, నా
పరమున నెల్లవేళలఁ గృపామతి నన్నను వేల్పవంచు నీ
చరణములాశ్రయించితిని స్వామి! యిదే శరణంటి రాఘవా!

చ. ఎవఁడు ధరాభరం బుడుప నేత్తైరఁ దానరుఁడై జనించెనో
ఎవని యనంత తేజము దినేంద్రుని చంద్రు వెలుంగఁ జేయునో
ఎవని యమోఘశక్తిని మునీశ్వరు లెప్డు సమాశ్రయింతు, రా
ప్రవిమలమూర్తి వీవయని రాఘవ! నేశరణంబు వేడితిన్.

మ. స్థిరచిత్తంబున నిన్నుమాత్రమె యుపాసింతున్, రఘుస్వామి! త
క్కొరు లెవ్వారిఁదలంప; దీనజనబంధూ! మైథిలీవల్లభా!
కరుణాసాగర! నీదె భార మిఁక యోగక్షేమము ల్జూచిన
న్నరయన్, ప్రాపునొసంగి బ్రోవను; మహాత్మా! రామచంద్రప్రభూ!

సీ. ముంగురుల్ మోమున మురువుజూపెడినాఁడె, గాధేయుసవనంబుఁ గాచితివఁట
అటికాలనంటిన ధరణీరజంబుచేఁ, జట్రాతి నాతిఁగా సల్పితివఁట
వీరాధివీరులు వ్రేలు మోవఁగరాని, శివధనుర్భంగంబుఁ జేసితివఁట
ఎదురెందులేక నెంతే విజృంభించిన, వాలిఁ గూలిచిపేరు వడసితివఁట
పెద్దపని యొండు దీర్పంగ బిరుదులైన, వానరులఁ గూడి యిలాగు వచ్చితివఁట
ఇట్టి నీచిత్రచరితంబు నెఱిఁగి పలుకఁ,జాల శ్రీరామ! శ్రీరామ!! శరణు! శరణు!!




దేశిరాజు రామదాసు గారు

కళాపూర్ణోదయమును రచించినది పింగళిసూరన. పింగళిసూరన అష్టదిగ్గజములలో నొకఁడనుప్రతీతి. ఈసూరన కృష్ణదేవరాయలకాలములోనివాఁడేయని కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు మహమ్మదీయమహాయుగమున నుడివిరి. అది సత్యమైనను కాకున్నను శ్రీకృష్ణదేవరాయలకాలములో నితఁడేమియు గ్రంథములు వ్రాయకుండుట నిశ్చయము. ౧౫౬౦ సం.న నీగ్రంథము నితఁడు నంద్యాలకృష్ణరాజున కిచ్చుటచే ౧౫౩౦ సం. పూర్వమే స్వర్గస్థుఁడైన శ్రీకృష్ణరాయలసభలో నితఁడుండుట యసంభవమని కీ. శే. వీరేశలింగము గారు ఆంధ్రకవులచరిత్రలో నభిప్రాయపడుచున్నారు. కవికాలనిర్ణయమునుగూర్చి యింతకన్న నాకు వేఱు తెలియదు.

పింగళిసూరన తనవంశమును ఈపుస్తకపీఠిక ౧౨వ పద్యమునఁ దానే చెప్పికొనియున్నాఁడు. ఇతఁడు ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; గౌతమగోత్రుఁడు; అమరనకు నబ్బమకుఁ బుత్రుఁడు. ఇతని స్థలనిర్ణయమునుగూర్చి చరిత్రకారులు పెక్కభిప్రాయములను జెందుచున్నారు. సూరనయే ప్రభావతీప్రద్యుమ్నమున పింగళివారు పలనాటను, పాకనాటను, గోదావరీతీరముననుగలరని చెప్పియున్నాఁడు. కాని వంశధారానదీతీరమున దూసిరైల్వేస్టేషనునకు రెండుమైళ్లదూరములో శ్రీకాకుళముతాలూకాయందలి కలివారగ్రామములో ననేకతరములనుండి పింగళివారు కలరు. వారును ఆపస్తంబసూత్రులు; గౌతమసగోత్రులు. ప్రభావతీప్రద్యుమ్నమునందుఁగల 'పేకి'కథ వారును జెప్పుచుందురు. ఇప్పటికిని వారియింటికడ పేకి పడవైచినదిగాఁ జెప్పఁబడు బండఱాయి కలదు. దీనిచే సూరనార్యునకును వీరికి నేదియో దూరసంబంధ ముండక పోదు. అదిగాక పింగళిసూరనవంశస్థులతనితండ్రితాతలకాలములోనిక్కడ నుండిరనియు, అనర్ఘమైన కవితాపటిమ సంపాదించినవెనుక సూరన రాజాశ్రయమునకై దక్షిణమునకుఁ బోయెననియు నూహించుటతప్పుకాదు. అయినను స్థలనిర్ణయమునుగూర్చి నిదమిత్థమని నిర్ణయించుట చరిత్రకారులకు విడచుచున్నాను.

## కళాపూర్ణోదయము - ప్రబంధము

కళాపూర్ణోదయము తక్కిన ప్రబంధముల వంటిది కాదని యాగ్రంథమే చెప్పక చెప్పుచున్నది. మనుచరిత్రాది ప్రబంధముల కాధారములు కలవు. వాని కథలు మార్కండేయాది పురాణములనుండి గ్రహింపఁబడి కవిచతురతచే వృద్ధినొందింపఁబడినవి. కళాపూర్ణోదయమున కట్టిమూలాధారము లేవియు లేవు. పురాణాభిప్రాయములకును ప్రజల నమ్మకమునకును వెలిగాకుండ కవికల్పనచే వృద్ధినొందిన గద్యపద్యాత్మకమగు నొకచక్కనినవల ఇది. ఇట్టిగ్రంథము లీపుస్తకమునకు ముందుగాని వెనుకగాని యిప్పటికి లేవనుట సత్యమునకు దూరముకాదు. మాదయగారిమల్లన రాజశేఖరచరిత్రమందు, అణుమాత్రముకల్పన కలదు గాని, యదిమిక్కిలి పేలవము. దీనితో సరిపోల్చుటకుఁ దగను.

కళాపూర్ణోదయమును నిరసించుచు రామరాజభూషణుఁడు:

"ఉ. కేవల కల్పనాకథలు
కృత్రిమరత్నము, లాద్యసత్కథల్
వావిరిపుట్టురత్నము ల
వారిత సత్కవి కల్పనా విభూ

పావహా పూర్వవృత్తములు
సౌనలుదీర్చిన జాతిరత్నముల్
...  ...  ...  ...  ..."

అనుపద్యము వ్రాసెనందురు. అదినిజమేయైనచో గళాపూర్ణదయపాఠకులు బట్టుమూర్తితో నేకీభవింపఁ జాలరు.

కళాపూర్ణోదయమున కాధారములు

నారదుఁడు కలహప్రియుఁడగుట, నారదునకు అసమానసంగీత ప్రవీణత, దీనిని సిద్ధాంతీకరించుటకు తుంబురునారదకలహము, నారదుఁ డీర్ష్యవహించి భగవత్ప్రసాదముచే మహోన్నతిఁ బడయుట మొదలగు పూర్వకథ కల్పింపఁబడినది. రామాయణమునందలి యిళోపాఖ్యానము ననుసరించి మణిస్తంభుఁడు స్త్రీయగుటయు, సుముఖాసత్తి పురుషుఁడగుటయు నూహింపఁబడినది. రంభానలకూబరులలోలత్వమును గర్వమునుబురస్కరించుకొనిజానకీ పరిణయమంగలి మాయాసీత మాయారామలక్ష్మణుల ననుసరించి మాయారంభానలకూబరులనుసృష్టించినాఁడు. ఇది యదియని నిర్వచింపనలవికాదు. క్వాచిత్కముగాఁగొన్నిటి నుదాహరించితిని. కథ యొకగ్రంథమునుండి గ్రహింపఁబడకపోవుటచేతను, సర్వగ్రంథసార మగుటచే నేభాగము చదివినను పరిచితమై యాహ్లాదముఁ గలిగించును. అది కేవలప్రబంధమనుట సమంజసముగాదు. అది యొక చిన్నపురాణమని నామతము. వ్యాసరచిత భారతమును, వాల్మీకిరచితరామాయణమును విడిచినయెడలఁదక్కంగల పురాణములన్నిటిదియే రసవంతమని నాయాశయము.

గ్రంథారంభము

ఆశీస్సు, నమస్కారము, వస్తునిర్దేశము నను త్రివిధ మంగళాచరణములలోను సూరన "ద్వారవతియొప్పు"అనుటచే వస్తునిర్దేశముతోఁ బ్రారంభించినాఁడు. కథద్వారకాపట్టనముతో ప్రారంభమైనది. మొదటి రెండాశ్వాసములకు రంగస్థలము ద్వారక. నిజముగా కళాపూర్ణోదయ కథాప్రారంభము సత్యలోకమునందలి యజవాణీప్రణయ కలహమునుండి. మఱియొక కవియైనచోఁ దప్పక ౫-వ ఆశ్వాసముతోఁ బ్రారంభించి కథను రసవిహీనముగాను కేవలముగాను కావించియుండును. కాని సూరన యట్లుసేయక కలభాషిణీచరిత్రతోఁ బ్రారంభించి తన యద్భుతకల్పనను వెల్లడించినాఁడు.

కలభాషిణీమణికంధరులు

కళాపూర్ణోదయమునకు నాయికా నాయకులు మధురలాలసాకళాపూర్ణులైనను నిజమైన నాయికానాయకులు కలభాషిణీమణికంధరులు.

కలభాషిణి వంగడమున వారస్త్రీయైనను ధీరోదాత్త; సాధారణవారకాంతవంటిది కాదు. సుందరమైన గాత్రము కలది. సంగీతసాహిత్యములం దసమాన ప్రవీణత కలది. సాధారణవేశ్యావృత్తిగాఁ జెప్పఁబడు నీచవృత్తికై యొడంగిన నామె చేయరాని దేమిటి?

"గీ. మొదల బలురేఖ గలదఁట యదియుఁగాక
వయసు క్రొత్తఁట వెలయాలివంగడమఁట
వనిత చక్కదనంబును వన్నెలాడి
తనముఁ గల్కితనంబును దరమె పొగడ?"

సింహము సింహమునేకోరు నన్నట్లు ఆమె మణికంధరునే కోరినది. అయినను గొందఱు సంకుసంస్కారులవలె బాహ్యప్రతిరోధమునకు వెఱచి బలవంతమునఁ జనమన స్వన్యథామార్చెను. ఆమె వెఱచినది నారదశాపమునకు. నారదేచ్ఛ వారి కనుకూలమేయని తేటపడిన వెనుక మణికంధరుని భావ్యభివృద్ధికై తనప్రాణముల నర్పింపుటకైన వెఱవలేదు. మీఁదుమిక్కిలి యాత్మశిరఃఖండనమునకై తనచేతితోనే ఖడ్గము నొసంగి మణికంధరునిఁ దొందరచేసెను. ఆహా! యేమియామెధైర్యము; తెగువ; మణికంధరునియందలిప్రేమ?

మణికంధరుఁడును కలభాషిణివలెనే నారదుని శిష్యుఁడు; సంగీతసాహిత్యములం దసమానప్రజ్ఞ కలవాఁడు; విష్ణుభక్తుఁడు; కలభాషిణినే ప్రేమించినవాఁడు. కాని యతఁడును నారదశాపభయముచేఁ దనచిత్త మన్యథా మరలించెను. విద్వాంసుఁడేకాక వీరుఁడగుటకు శల్యాసురవధయే తార్కాణము. ఇట్టివారు జన్మాంతరమునఁ గళాపూర్ణమధురలాలసలుగా మారిరనుటచేఁ గవి నాయికానాయకుల నెట్లు పోషించెనో చదువరులకే విశదపడును.

## దండకము

కలభాషిణీమణికంధరుల సారస్వతజ్ఞానమునకును, జ్ఞాపకశక్తికి నీదండకమే సాక్షి. మణికంధరుఁ డీదండకము నాశువుగాఁ జెప్పి భగవంతునిఁ బ్రార్థించెను. కలభాషిణియో దానిని విని యేకసంథగ గ్రహించినది.

ఈదండకము ఆంధ్రలోకము నందలి యుత్తమ దండకత్రయములో నొకటి. వీనిలో మొదటిది నన్నయ భట్టారకునిచే రచింపఁబడిన అరణ్యపర్వమునందలి యగ్ని నుని యీశ్వర స్తవము. రెండవది బమ్మెర పోతరాజకృత మగు దశమస్కంధమునందలి యక్రూరదండకము. మూఁడవది యీదండకము. ఈదండకమునకు మెచ్చియే భగవంతుఁడు మూఁడుకాలములవార్తలను తెలిసికోఁదగిన హారము నిచ్చెను. సూరనయు నీదండకము నాధారము చేసికొనియే పాత్రలచేఁ దన కవిత్వమును శ్లాఘించుచుఁ గొన్ని మాటలనెను. ఇట్టి దండకమునుగూర్చి వేఱుగఁ జెప్పనేల! తిలకింపుఁడు:

"మ. అని యీవైఖరి నంతయుం జదివి దై
త్యారాతి యీదండకం
బునకున్ మెచ్చుచు నిచ్చినట్టిది గదా
భూరిద్యుతిన్ నీదు శి
ష్యునికంఠంబున నొప్పు నావిమలర
త్నోద్దారహారంబు న
న్మునిలోకోత్తమ! యంచుఁబల్కి మఱియున్
బూఁబోఁడి దానిట్లనున్.

సీ. పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీలఁ
దమలోనఁ దొరయుశబ్దములఁ గూర్చి,
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్య భేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁ జేసి,
రసభావములకు సర్వాంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ సమర్చి,
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి,

తే. యమర నుపమాదులును యమకాదులు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి [నగు
కవిత చెప్పంగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

లయవిభాతి:—

చలువగల వెన్నెలల చెలువునకు సౌర
భము గలిగినను సౌరభము చలువయు
దలిర్పం, బాలుపెసగు కప్పురపు పలుకు
లకుఁ గోమలత నెలకొనిన సౌరభముఁజలు
వపసయుం గో, మలతయును గలిగి జన
ముల మిగులఁ బెంపెసఁగు మాయ పవ
నంపు గొదమలకు మధురత్వం, బలవడిన
నీడు మఱి కల దనఁగ వచ్చుఁ గడు వెలయుఁ
గల యీసుకవి పలుకులకు నెందున్."

ఈసుకవి మణికంధరుఁడో, పింగళి సూరనార్యుఁడో యూహింపుఁడు. ఈపద్యము నందలి భావమును, శైలియు జోడుపందెపు గుఱ్ఱములవలెఁ బరుగెత్తుచున్నవి. అం దేదిమిన్నయో యేర్పరుప నాకు శక్యము కాదు.

## డోలావిహారము

పింగళిసూరనార్యునివర్ణనలు ఆంధ్రగీర్వాణకవులకు నూతనములు. ప్రభావతీప్రద్యుమ్నమునందలి కందుకకేళి, యశ్వారోహణమును దిలకింపుఁడు. కళాపూర్ణోదయమునందలి డోలికావిహారమును వీక్షింపుఁడు. డోలావిహారము కథకుఁ బట్టుగొమ్మ.

"మ. తమిఁ బూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁబం
తా లాడుచుం దూఁగునా
కొమరుం బ్రాయపుగబ్బిగుబ్బెతలయం
ఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టిమొగంబై చనుచెంచుఁ దీవి కనుఁ
గొంటే దివ్యమునీంద్ర! నా

కమృగీనేత్రలమీఁదఁ గయ్యామునకుం
గాల్ దాఁచు లాగొప్పెడున్."

ఈమణికంధరునివర్ణనమున నారదుఁ డొకటంక ముపాడి నదికి మేనుయులచాటునుండి వినుచున్నరంభ కడు పుడకఁజేసెను.

"మ. భళిరా! సత్కవివాదు నిక్కమ తగం
భావించి నీవన్న యా
యెలప్రాయంపుమిటారికత్తెల బెడం
గే నెందునుం గాన వా
రలదోలాచలనోచ్చలచ్చలనముల్
త్రైవిష్టపస్త్రీలయా
దల దన్నం జనునట్లు మించె ననినం
దప్పేమి యొప్పే యగున్."

అనంతరము రంభ గర్వము, నలకూబరుస్వాభిమానము, నారదునీర్ష్య యొకటివెనుక నొకటి లేచినవి. దానికి ఫలము నారదశాపము, మాయారంభానలకూబరులు మొదలగు నద్భుతచిత్రములు.

"క. నినుఁ బోలువనిత నీకును
వనజముఖి! యితనిఁబోలువాఁ డితనికి నెం
దును గల్గి గలఁచునో యి
ట్టినిగాఢపుమదమునింపునీవుఁ చనునే."

దీని కుత్తరార్థముగాఁ గలభాషిణి కిచ్చినవరము నుఁజూడుఁడు:

"తే. కొమ్మ! మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి
కాంతు, రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయువానిని గూడి రమింపఁగలవు
నమ్ము హా మ్మింక నీభవనమున కనియె."

ఆకునందక పోకనుపొందక గోడమీఁదపిల్లివలె నారదుఁ డిచ్చిన వరమును బరికలింపుఁడు. నలకూబరుఁడని చెప్పక "రంభామనోహరాకారుఁడగుచు మెఱయువాని" ననుట చేఁగలభాషిణి వలచినది నలకూబరుఁడు కాఁడని స్పష్టము. మణికంధరుని ప్రసక్తిలేమిచే నలకూబరుఁ డేమో యని భ్రమ. యథార్థము నారదునికిఁదప్ప కలభాషిణికిఁ దెలియదు. అందుచే నామె యన్యాన్వేషణపరురాలయ్యెను; కాని యామె చెప్పినట్లు:

"..........భాగ్య
శ్రీయేమని చెప్పుదుఁ బడఁ
బోయినఁ బూఁ బాన్పునఁ బడుపోలిక
యయ్యెన్"

## కళాపూర్ణుని కాలనిర్ణయము

మణికంధరకలభాషిణులు శ్రీకృష్ణ భగవానుని కాలమువారు. మణిస్తంభుఁడు కలభాషిణికడకు వచ్చువఱకు శ్రీకృష్ణభగవానుఁ డుంటనిశ్చయము. అనఁగాఁ గలభాషిణిమృగేంద్రవాహనకడబలినొసంగఁబడువఱకుఁగృష్ణుఁడు నిర్యాణము నొందకుండుట నిశ్చయము. మఱిరెండు సంవత్సరములనాఁడే కళాపూర్ణుఁ డుదయించి సద్యోయౌవనుఁడై రాజ్యముచేకొనెను. నాఁటినుండి సంపూర్ణయౌవనవతియగువఱకు మధురలాలస నతఁడు తలఁపలేదు. అనగా ౧౨ సంవత్సరములతరువాత మధురలాలసా కళాపూర్ణుల పునస్సంధాన మూహింపనచ్చును. ఆవెనుక నొకటిరెండు సంవత్సరముల నభినవకౌముదీ మధురలాలసలయానసు, కయ్యము, కళాపూర్ణుని దిగ్విజయమును వర్ణింపఁబడినవి. ఈవిజయము అశ్వమేధపర్వమునందలి యర్జును దిగ్విజయమును బోలియున్నది. ఈ ౧౭ సంవత్సరముల కృష్ణచారిత్రమును దెలియరాదు. కాని యొకటిమాత్రము నిశ్చయము. కళాపూర్ణుని దిగ్విజయకాలమునకుఁ గృష్ణుఁడు నిర్యాణమైయుండును. లేకున్న నర్జునాదిపాండవులు వీరి నలతిగా విడిచియుండరు. వారిప్రశంసఁగూడఁగవియొత్త లేదు. అదిగాక పరీక్షితునిగూడఁ దలఁపలేదు. కావునఁ గళాపూర్ణుని దిగ్విజయము కలిద్వాపరముల సంధియందుఁ గృష్ణనిర్యాణమునకును బరీక్షి ద్యౌవనోదయమునకును మధ్యను జరిగియుండును.

## ఫలశ్రుతి

ఈపుస్తకమునందలి చమత్కారములు అనిర్వచనీయములు. ఎచ్చటనో సత్యలోకమున జరిగిన భారతీ

పితామహులప్రళయకలహము పుట్టఁబోవు మహాపురుషుని సూచనగాను, ఎందుచేతను బనికిమాలిన ఫలశ్రుతి కథకు నంతకు నాధారమై కథ వెలువడుటకుఁ గారణభూతముగను గల్పించినసూరనప్రజ్ఞ యనల్పము.

ప్రథమాశ్వాసాంతమునఁ గలభాషిణి రంభవలన నామమాత్రముగా విన్నకళాపూర్ణునికథ చెప్పుమని నారదుని వేఁడుకొనెను. కళాపూర్ణునికథ చెప్పినవారును విన్నవారును బుడమిలోఁ బుత్రపౌత్రప్రపౌత్రాభివృద్ధి గలిగి యైశ్వర్యవంతు లగుదురనియు నాకారణముచే దేవర్షి యగు తాను జెప్పవలనుపడదనియు, నదియ వెలయఁగలదనియుఁ జెప్పిపుచ్చెను. ఆవెనుక నాలవ ఆశ్వాసములో నలఘువ్రతుఁడను పేరుగల మలయాళబ్రాహ్మణుండు, ఈసంగతి వినినవాఁడై పుత్రపౌత్రప్రపౌత్రాభివృద్ధికై, కళాపూర్ణునికథను వినుటకై మృగేంద్రవాహనకడఁ దపస్సు చేయఁగడఁగెను. చూడుఁడు చిత్రము:

## అలఘువ్రతుఁడు

కళాపూర్ణునికథలు పృథ్విలో వెలయుటకుఁ గారణుఁడైన మలయాళబ్రాహ్మణుండు రెండుసంవత్సరములు మృగేంద్రవాహనకడ భువనేశ్వరీమంత్రజపముఁ గావించెను. అంతట మృగేంద్రవాహన "ఓబ్రాహ్మణుఁడా! నీకోర్కె నేఁడొకచో సిద్ధించును" అని యనుగ్రహించె. అప్పలుకులు వినంబడునంత నతం డాకస్మికోద్భూతతీవ్రవాతనిపతితుం డగుచు ననేకజనపదవ్యవహితంబైన యొకపురమధ్యంబునం బడియె. చూచితిరా చిత్రము. తానెవ్వనికథ వినుటకై తపస్సు చేయుచుండెనో యట్టికళాపూర్ణుని యెట్టయెదుట నేపడెను. కళాపూర్ణునికిఁ గళాపూర్ణునిచరిత్రగాని, యలఘువ్రతుని కతనిచరిత్రగాని తెలియదయ్యె. "తీవ కదిపిన దొంగ బయటఁబడు" నన్నట్టు ఒకటితో నొకటి బయలుపడినది.

అలఘువ్రతుఁడు తానేకాకినని తలపోయుచు విచారించుచున్న సమయమున, వాఁడు బారినచేనుపై వర్షపుఁ జినుకువలె "ప్రథమాగమాదులు నీబిడ్డలే. నీభార్యలు బ్రదికియున్నా" రనుపలుకు ఎంతయానందకరముగా నుండును? ప్రథమాగమాదులజనన మత్యద్భుతము. తనపేరు యజ్ఞశర్మ యగుటయు, తనభార్యలు నిండుచూలాండ్రగుటయు, వర్షమునకు విలువగా వారు సముద్రమునఁ బడుటయు నలఘువ్రతునికిఁ దెలియును. ఆవెనుక నాతనికిఁ దెలియదు.

ఇచ్చట సూరన చేసినకల్పన యస్వాభావికమని చెప్పఁజాలకపోయినను కేవల కాకతాళీయన్యాయముపై నాధారపడినది. పడవలోనుండి యానలువురుకాంతలు దుముకుటయు, నీటితోఁ దిమింగిలముఖద్వారము ప్రవేశించుటయు, తిరుగ నది మింటికిఁ జిమ్మిననీటితో నాకాశమునకుఁబోవుటయు, నింతలో నాపైనుండి యొకదివ్యవిమానము వచ్చుటయు, వీరందుఁబడుటయుఁ గేవలము కాకతాళీయము. ఆదివ్యమిథునము వారిని గొంపోయి యొకవేశ్యాసౌధమున విడిచిపోయినది. అనంతరము చతురాగముల జననము, సంయమినమ్మట, వారినామకరణము, వారిస్వయంవిద్యాప్రాప్తి, మదాళసయునికొలువు మొదలైనవి.

ఈసందర్భమున సూరన రెం డద్భుతపద్యములను జెప్పి తనయసమానపాండిత్యమును వెల్లడిచేసికొనినాఁడు: చూడుఁడు. ఆ.౬—ప. ౧౬౧, ౧౭౨. తనకొలువులో నున్న ప్రథమాగమాదులను కళాపూర్ణుఁడు గ్రహించి బహూకరించుటతోఁ గళాపూర్ణోదయకథ సరియని మ. కట్టమంచి, రామలింగారెడ్డిగారు తలఁచుచున్నారు. అంతటితో మధురలాలస మేడయందలిహారము గుండెనుండి పైకిఁదప్పుటచే మఱియేమియు నామెకు స్ఫురింపలేదు. అచ్చటినుండి యనఁగా నాలవయాశ్వాసాంతమునుండి యెనిమిదవ యాశ్వాసము మొదటివఱకును సాధారణ 'ప్రబంధరాకట'లోఁ బడిపోయినాఁడు. రెడ్డిగారిమతము గ్రాహ్యమేయైనను ఎనిమిదవ ఆశ్వాసమునందలి హారచరిత్రము, సుగ్రహునిశాపము కథకుఁ బైవికావు. పుస్తకాంతమునఁగల లక్ష్మీనారాయణసంవాదము కథకు వన్నెపెట్టకపోలేదు.

## ఉపాఖ్యానములు

కళాపూర్ణోదయమునందలి యుపాఖ్యానము లతిచిత్రము లైనవి. భారతాదిగ్రంథములందలి యుపాఖ్యానములవలె కథతో నేవిధమైన సంబంధములేక యంతతో నంతరించునవి కావు. ఇందలియుపాఖ్యానములు కథతో

సైక్యమైయుండును. అందలియుపాఖ్యానములు పూర్వకథలవంటివి.

## సుగాత్రీశాలీనులు

ఇందలి ప్రధానోపాఖ్యానము సుగాత్రీశాలీనుల కథ. సుగాత్రి కాశ్మీరదేశమునందలి శారదాపీఠమును భజించు పూజారిబ్రాహ్మణుని పుత్త్రిక; పతివ్రత; మిక్కిలి దైవభక్తి కలది. భర్తమేలునే కోరుచుండెడిది. భర్త సేవితముగా నెవ్వరు దూషించినను నొప్పుకొనదయ్యె. తాను నగలుధరించిన భర్త కాయురారోగ్యములు కలుగునను పిచ్చినమ్మకము గలస్త్రీ. ఆకారణముచే నాసుగాత్రి యూయన నింకేమి ప్రపంచింపఁజేసినను నెఱయ నెడసిపోవుటదక్క ప్రయోజనం బేమియులేదు. నాకు మంగళసూత్రంబీపాటి శుభస్థితి నుండిన మేలనుచు నెంచుకొనియు వేళ్ళొక్కలాగున నుండక యతని కాయురభివృద్ధికరంబులని వివిధాలంకారంబుల నెప్పుడు నేమఱక తాల్చుచుఁ దనతల్లి యతనినేమియు నిష్టుర్టాడకుండఁ బ్రార్థింపుచుండె." చూచితిరా దంపతులమనోవిభేదములు. సుగాత్రి గంగిరెద్దువలె నలంకరించుకొనుటచేఁ గనులు మిఱుమిట్లుగొలిపి యాతఁడామెనుగలియనొల్లఁడాయెను. ఆమెయో యాతని కానందము కలిగింపవలెనని నగలు ధరించెడిది. ఒకరిమనసు నొకరెఱుఁగుటెట్లు? "సర్వం కాల మపేక్షతే" యనునట్లు కొంతకాలము గడచినవెనుక నుద్యానవనమునందలి పనులు వారి సందియములఁ దీర్చినవి.

ఈసుగాత్రీశాలీనులే కళాపూర్ణుని తలిదండ్రులగు సుముఖాసత్తీ మణిస్తంభులు. పండితులయెడ నాసక్తిచే సుగాత్రి సుముఖాసత్తియైనది. వయఃస్తంభన మణిని బడసి శాలీనుఁడు మణిస్తంభుఁడయ్యెను. సుగాత్రి సుముఖాసత్తిగా మారినను గుణములం దంతగా మారుపాటులేదు. శాలీనునియందుమాత్రము కొంచెము మార్పు గలదు. శాలీనుఁడు తనపేరునకుఁ దగినవాఁడే. అది చదివినపుడెల్లను శాలీనుఁడు నావంటి సాంఘికభీరువేమో యని తలఁచుచుందును. మూఢభక్తి కలవాఁడు. అతఁడు చెరువునందుఁ బడుటకుఁ గారణము తెలిసికొనినచో నది యతని యజ్ఞానముచే నేర్పడిన కోప మని తేటపడును. శాలీనుఁ డేకాంతమున సుగాత్రిం జేరి:

"క. అమృతము సేవించితివో
రమణీ! యేమైన సిద్ధరస మబ్బెనొకో
కొమరుం బ్రాయము మిక్కిలి [మిన్.
కొమరొందెను మిగులఁ గ్రొత్తక్రొత్తగ నెల

క. మగవానికంటె మునుపుగ
మగువ కెడలు ప్రాయమండ్రు మానవతీ! నీ
జిగిబిగు లంతకు సంతకు [పుమా.
మిగులఁగఁ బొలుపొందుటకు నిమిత్తము చె

క. అని యడిగిన నే నెయ్యది [యిట్లం
యు నిమిత్తం బెఱుఁగననుఁడు నూరక
టనిగాని యేనుజెప్పెద [యెన్.
వినుమని మొగము చెవిఁజేర్చి విభుఁ డిట్లని

చ. అనిశము నీదుయౌవన శు
భాకృతి కౌఁగిటఁజేర్చు వేడుకన్
దనియమిఁజేసి వేఁడితిని
దక్కక నీకును గర్భ మెన్నఁడున్
జనితము కాకయుండు నల
శారదఁ బూజ యొనర్చువేళ వా
రనికృప నట్టు లిచ్చితి వ
రం బని యాయమ పల్కె సత్కృతిన్.

క. దానన సుమ్మీ నీనె
మ్మేనన్ సౌందర్యగుణసమృద్ధి దలిర్పం
గా నవయౌవన మెప్పుడు [దన్.
గానఁబడుట యనుడు నేను గడు వెఱఁగొం

తే. నాదుసంగమంబున నీకు నందనుండు
గలుగ వరమిచ్చె నాకు నన్నలువసతియు
నేనవేఁడిన నొక్కనాఁడిదియె నదియు
నొసరు టెట్లొకొ యట్లన యనఘుతోడ.

“క. నావుడు నాయిష్టమునకు
నీవు విరుద్ధముగ వరము నిట్లడిగితె యి
ద్దేవి నని దుర్దమక్రో [కే.”
ధావిలమతి జని యతండు హృదమున నుతికె

మాడుఁ డతని రజస్తమోగుణములు. భార్య తన వరమునకుఁ బ్రతికూలముగా వరమడిగినదిగదా యని హృదయములో నుతికెను. తనమనసులోనికోర్కె భార్య కెట్లు తెలియును నను విచారము లేదు. పోనిమ్ము; సరస్వతి యొసంగినవర మెట్లగునో యనుమాత్రమను కోరిమి లేదు.

తుట్టతుదకు శారద తనవరము నిల్పుకోకపోలేదు. ఆమె వరసాఫల్యమునకు మణిస్తంభుఁడే కారణము.

“తే......అందు సిద్ధుఁ డోయతివ నీవు
పురుషుఁడవు గమ్ము నారీత్వమును భజింతు
నేననుచు విపరీతరతేచ్ఛఁ బలికెఁ
బలుకుటయు నాదరమున నబ్జజముఖియు.

క. స్త్రీత్వము నీవొందుము పురు
షత్వము నేదాల్తు నని నిజప్రియుఁబలికెన్
సత్వరత నట్ల వారల [య్యెన్
స్త్రీత్వము పురుషత్వము విపరీతము ల

* * * *

వ. వెండియు నతఁ డిట్లనియె.

గీ. నీకు గర్భము కాకుండ నాకు, నాకుఁ
గొడుకు నీకూటమిన కలుగుటకు నీకు
వరము నిచ్చిన యవ్వాణి వాక్యమెట్లు
ఫలితముగ నున్నదియొ యొందుఁ బదరఁ
[జనదు.

చ. అదియునుగాక యంగనల
కంగజసంగరకేళికావిశే
షదశలయందు నెక్కుడఁట
సౌఖ్యగతుల్ మగవారికంటె నాఁ
కిదియు నెఱింగికో నిపు డభీష్టము
కావున నిట్టులుండఁ గో
రెద నొకకొన్నినాళ్లు విహరింపుము
నీవును బూరుషాకృతిన్.”

ఇట్లు ప్రకృతికిని చిత్రమైనకోరికఁగోరి మణిస్తంభుఁడు సత్యలోకమున బ్రహ్మ చెప్పిన కథకును, శారదాదేవి యిచ్చినవరమునకును సమన్వయముగాఁ బ్రవర్తించెను.

అతనియందలి మంచిగుణ మతనిభక్తియొక్కటియే. అదియు మూఢభక్తియు సకామభక్తియు నగుటచేఁ గించిద్గ్రాహ్యము. అతనికిఁ గ్రమక్రమముగా సుముఖాసక్తి స్వార్థత్యాగమువలనను, గలభాషిణి ధైర్యము వలనను, మృగేంద్రవాహ కటాక్షమువలనను రజస్తమోగుణములు నశించి సాత్వికోదయ మయ్యెను. అంతతో నతఁడు స్వీయరాజ్యకాంక్ష మాని తన యాత్మజుఁడగు కళాపూర్ణుని సామ్రాజ్యప్రాప్తితో నానందము వహించెను.

## మాయరంభానలకూబరులు

కళాపూర్ణోదయ మొకరూపకము అనుదృష్టితో విమర్శించినయెడల, రంభ ప్రతిరంభలయు నలకూబర మాయానలకూబరులయు చర్య యొకయంతర్నాటికగాఁ జెప్పవలయును. ఇది సూరన యద్భుతసృష్టికిఁ దార్కాణము. అట్టిచిత్రమను పాశ్చాత్యనాటకచక్రవర్తి యగు షేక్స్పియరు తన ‘తబ్బిబ్బుల ప్రహసనము’ (Comedy of errors) నందుఁ జిత్రించినాఁడు. అందలి యౌచిత్యము కించిద్గ్రాహ్యము. ఏలయన, షేక్స్పియరు సృష్టించినది రెండుజతలకవలవారిని. క్రొత్తగావచ్చినవారు వారిని బొరపడుట సహజమేకాని, తల్లిదండ్రులును చిరమిత్రులును బొరపడుట చిత్రము. అదికాక యందలి కాలము దీర్ఘము. సూరనసృష్టియందో కాల మల్పము. పాత్రలో దేవతా వరములను దిరస్కారములను గలవారు. దీనికిఁ గారకుఁడగు నారదున కది తెలియును. అతఁడో చెప్పక వచ్చినదారినే పోయెను.

## అభినవ కౌముది

ఉత్తరాంకమున మధురలాలసయే కథానాయికయైనను నభినవకౌముది తక్కువదికాదు. అభినవకౌముది ధైర్య

మునందును పట్టుదలయందును వసమానురాలు. తన్ను మోహించిన శల్యాసురుఁడు వెంబడించినను వాని నేమాత్రమును జీరికింగొనక వానినిఁ జంపినవానినే పెండ్లాడెదనని పట్టుపట్టియుండెను. భృగునిహతమతియై పోవుచున్న మణికంధరు నాశ్రయించి వానిచే శల్యాసురుని జంపించి మరుజన్మమున నతఁడు సద్యోయౌవనుఁడై జన్మించువఱకు నవివాహితయై నిరీక్షించుకొనియుండెను.

## భారతీపితామహుల పొలయల్క

ఇంతకుఁబూర్వమే నేనుజెప్పినట్లు కళాపూర్ణోదయము అజరాణీప్రణయకలహమువలనజనితము. బ్రహ్మసరస్వతుల చరిత్రయగుటచేఁ బుణ్యావహమును జిరస్మరణీయము ననుటకు సందేహము లేదు. అయినను బ్రహ్మకాని సరస్వతికాని వెలయింపఁజేయకుండుటను దాని నెఱిఁగినవారు వేఱొకరు లేకపోవుటను లోకమునఁ బ్రచురింపఁబడుట యెట్లోయని మన కాందోళనము గలిగించును. మనకేకాదు; సరస్వతీదేవికే యద్భుతముఁ గలుగఁజేసెను.

బ్రహ్మసరస్వతుల ప్రణయకలహము నంతయుఁ జేరువనున్న భారతీదేవిచిలుక మూచినది. ఆసమయమున వాణికంఠసీమనుండి వెలువడిన యపూర్వమణితమును జిలుక విని దానినే పలుసారు లుచ్చరించుచుండెను. రంభవచ్చి దానిని విని యెచ్చట నేర్చితివనఁగాఁ దిర్యగ్జాతిగావున జ్ఞానములేమిచే జరిగినదంతయు నామెకుఁ జెప్పుచుండెను. దీనిని లోపలినుండి దేవి విని కోపముతోఁ జిలుకను "అవిఘ్నుత జాగిలంబవై యిలపయిఁ బుట్టు" మని శపించెను. దానికి బ్రహ్మ పరితపించి "విూయమ్మశాపంబునకు నేఁ గాదన నెవ్వరికి నెట్లనవచ్చునది యట్లనుభవించి తదనంతరజన్మంబున మదాశయుండను జగతీపతికి మధురలాలసవై జన్మించి కళాపూర్ణుఁడను రాజునకు భార్యవయ్యెద" వని యనుగ్రహించెను. ఆమాటకు సరస్వతి యాశ్చర్యపడి "ఏమయ్యా వెండియు మదాశయుండును, మధురలాలసయు, కళాపూర్ణుండు ననుచుఁ బల్కుచున్నా" రనెను. బ్రహ్మ యిట్లు తప్పక జరుగునని చెప్పెను. అయినఁ దల్లి మగవాఁడు, తండ్రి యాఁడుదియు నెట్లగునని ప్రశ్నించెను. అది నీయొక్కచేష్టవలననే యగునని బ్రహ్మచెప్పెను.

సరస్వతిచేష్టలు రండిటియందు నెట్లు ప్రకటితమో విస్పష్టము. మణిస్తంభమునందు సరస్వతిముఖము ప్రతిబింబించుటచేతనే కళాపూర్ణుఁడు (పూర్ణబింబము) కలిగినది. ఇఁక మణిస్తంభుఁడు స్త్రీగను సుముఖాసత్తి పురుషుఁడుగను మారుటకు శారదావిరమే యాధారము.

సరస్వతి చిలుకను జాగిలముకమ్మని శపించెను. జాగిల మనఁగా సాధారణార్థము కుక్క. ఇక్కడ కుక్క యనుటకు వీలుపడదు; "వేశ్య." జాగిలశబ్దమునకు వేశ్య యని యర్థమే యున్నయెడల దాని కాధారముగా నీమాట యొక్కటియే యాంధ్రలోకమున నున్నట్టున్నది.

## సుగ్రహుని కథ

సుగ్రహుని చరిత్రయందే హారచరిత్రఁ గూడ కొంత యిమిడియున్నది. మధురలాలసాకళాపూర్ణులు సంభాషించుచుండఁగా సుగ్రహుఁడువచ్చెను. అంత మధురలాలస యతని గౌరవించి మామ యని నమస్కరించెను. హారప్రభావముచే నామెదీనిని దెలిసికొనెను. అదియెట్లని రాజడిగెను. ఆమెకథ ప్రారంభించెను. "సుగ్రహుఁడు మహారాష్ట్రదేశపురాజు. రూపానుభూతి యాతనిసోదరి; అతఁడు సౌందర్యవంతుఁడు నైశ్వర్యవంతుఁడునగుటచే నెల్ల రాజులు తమకూఁతులను బెండ్లాడ వేడఁజొచ్చిరి. దాని కతఁడు వెఱచి బృందావనమునకుఁ బోయి బాలకృష్ణుని గూర్చి తపస్సుచేసెను. కృష్ణుఁడతనికి త్రికాలజ్ఞానము నిచ్చు నొకమణిహారము నిచ్చెను. అతఁ డాహారమును దాల్చి యొక దేవాలయమునకుఁజని యచ్చటి చిత్రములను బరిశీలించుచుండెను. అందు జీవకళతో నొప్పుచున్న యొక స్త్రీప్రతిమను జూచెను. అంతలో నచ్చటి కొక యతి వచ్చెను" అనిచెప్పి మధురలాలస సంకోచించుచుండెను. అంతట సుగ్రహుఁడు దాని నెఱిఁగి తనకువలసిన కథ నెఱిఁగినవాఁ డగుటచే లేచిపోయెను. మధురలాలస మరలకథ నారంభించెను. ఆయతి మోహపరవశుఁడై నిజమైన స్త్రీ కాఁబోలునని నిండార నొక్క పరిరంభణ మాచరించెను. సుగ్రహుఁ డదిచూచి పక్కున నవ్వెను. ఆయతి తనగుట్టు బయలుపడినదిగాఁ దలఁచి సుగ్రహునిఁ బ్రతారించుటకై యచ్చటి యాచారమిదియో యన్నట్లు అచ్చటివిగ్రహముల నన్నింటిని గౌఁగిలింప మొదలుపెట్టెను. హారప్రభావముచే యథార్థము నెఱింగిన సుగ్రహుఁడు మఱింత నవ్వఁజొచ్చెను. దాని కాయతి యలిగి హారప్రభా

వము సుగ్రహునకు నిష్ఫలముగునట్లుగా శపించి పోయెను. సుగ్రహుఁడు నాహారము గుడియం దుంచిపోయెను. దానినే కృష్ణుఁడు తిరుగ మణికంధరున కిచ్చెను. ఈకథ చదివినప్పుడు సుగ్రహునికేకాదు మనకును గడుపుచెక్కలగునట్లు నవ్వువచ్చును.

ఇందలి సూరనార్యుని ప్రౌఢిమ మఱియొకకవికి విలవిలఁ దన్నుకొనిచచ్చినను రాదు. పరపురుషునియుంగల శృంగారరసమును వర్ణింపనాయని మధురలాలస సంకోచించుటయు, సుగ్రహుఁడు దానిని గ్రహించిపోవుటయు, కవికళాకౌశలమునకుఁ దార్కాణములు. ఈవిషయమున నాంధ్రకవు లనేకులు సూరనకుఁ గ్రిందే. పిల్లలమఱ్ఱిపినవీరన తనశృంగారశాకుంతలమందును, కృష్ణకవి తనశకుంతలాపరిణయమునందును నెట్లు రసాభాసము చేసిరో చూడుఁడు. మాతృకయగు కాళిదాసుని శాకుంతలరసౌచిత్యము వారికి బోధపడినదేకాదు. ప్రియంవద నాటకములో రెండుమూఁడుమాటలలో యుక్తియుక్తముగా శకుంతల దేవకాంతయని సూచించెను. వీరో చెప్పుచున్నది ప్రియంవదయనియు వినుచున్నవాఁడు దుష్యంతుఁడనియు మఱచి కాఁబోలు మఱిచ్చట స్థలములేనట్లు వసంతఋతువర్ణన మేనకావిశ్వామిత్రుల శృంగారవర్ణన, శకుంతలాప్రసూతి; ఇవియవి యనవేల, ఎన్నెన్ని చెప్పరాదో యన్నన్ని చెప్పి విడిచిరి.

సూరనకును దక్కినవారికిని గలభేద మిచ్చటఁ దిలకింపుఁడు.

ఇంతటితోఁ గథావిమర్శన చాలించి గ్రంథమంతటిమీఁదను రెండుమూఁడుమాటలను జెప్పుచున్నాను.

కళాపూర్ణోదయకథ స్వభావవిరుద్ధము కాదా, నమ్మఁదగినదియా యని కొందఱు ప్రశ్నింపవచ్చును. కళాపూర్ణోదయ మొకకల్పితప్రబంధమని మొదటనే చెప్పితిని. కాని కథ యెంతమాత్రము నస్వాభావికము కాదు. పూర్ణముగా స్వాభావికమే. కథయందలిపాత్రలు దేవతలు. వారు సర్వశక్తిమంతులు. వారు చేయఁజాలనిదే? మీఁదుమిక్కిలి వారిశక్తికిఁ దగినంత వర్ణింపకుండుటయే కథకు లోపము. ఇట్టిచర్యలే కేవల మనుష్యులే పాత్రలుగాఁగల Comedy of Errors నందుఁ గలిగినయెడల తప్పక యస్వాభావికమైయుండును. సూరనార్యుని కళాపూర్ణోదయము చదివినతోడనే మానవులహృదయములందు సారస్వతకళాపూర్ణోదయ మగును. అతనిసంగీతాభిమానమును వెల్లడియగును. అట్టియెడ కళాపూర్ణోదయమును రచించినసూరన యద్భుతశక్తికి మనము సంకోచపడ నక్కఱలేదు

కళాపూర్ణోదయకథవలన రెండుసిద్ధాంతములు బలపడుచున్నవి. ఒకటి, పునర్జన్మసిద్ధాంతము. రెండు, మానవునకేపాటిలోపమున్నను ముక్తిగాని భగవత్సాన్నిధ్యముగాని లభింపదన్నమాట. ఈరెంటిని సూరన బహుసరళముగాఁ జిత్రించినాఁడు.

మొదటిది కలభాషిణీ మణికంధరుల పునర్జన్మము వలన విదితము. రెండవదియు సూక్ష్మముగాఁ బరిశీలించినవారివలననే విదితము.

మణికంధరుఁడు జన్మవలన గంధర్వుఁడు; నారదుని శిష్యుఁడు; కృష్ణుని భక్తుఁడు; మహాపండితుఁడు. అయినను ముక్తిగాని భగవత్సాన్నిధ్యము గాని లభింపలేదు. ఏల? ఇన్ని కలిగినను నతని ఐహికేచ్ఛయందు విరక్తిగలుగలేదు. నరలోకస్త్రీయగు కలభాషిణియందుఁ బ్రేమకలదు. అయినను మణికంధరుఁడు సర్వవిధముల నుత్తముఁడు గావున నుత్తమమైన కళాపూర్ణునిజన్మ కలిగెను. దీనివలన మఱియొకటి గ్రహింపవచ్చును. తన్నే నమ్మినవారికోర్కెలు భగవంతుఁడు తీర్పకపోఁడనుట.

## శైలి

కళాపూర్ణోదయము సంభాషణపట్ల రూపకమువలెను, కల్పనలపట్ల నాఖ్యాయికవలెను, తదితరస్థలములం దొక పురాణమువలెను సర్వతోముఖముగా నలరారు నొక ప్రబంధము. ఇందు శాస్త్రోక్తమైన యష్టాదశవర్ణనలే కాక డోలావిహారము, నెత్తమ్ములాట మొదలగు నూతన వర్ణనలతో నలరారుచున్నది. ఇందలి శైలిగూర్చి దండకవిషయములోఁ గొంత చెప్పియేయున్నాను. అది నాతికఠినమై మృదుమధురమై కదళీపాకమున నున్నది. దీనిశైలికన్నఁ బ్రభావతీప్రద్యుమ్నమునందలిశైలి కొందఱు ప్రౌఢ మందురు; కాని యీకథశైలియెంతయుఁ దగియున్నది. ఒక వస్తువు నెన్నిసార్లు వర్ణించినను, చదువరులకేమాత్రము విసువు జనింపకుండ నన్నిరీతుల వర్ణించి యద్భుతశక్తి వెల్లడిచేసినాఁడీకవి, చూడుఁడు:

"సీ. పసిమిపోనెండిన కసవుబట్టయుఁబోలె
నర వెండ్రుకలఁ బర్వుశిరమువలన,
నులిగొన్న చెలఁదిపుర్వులనూలివళ్లు నా
నమరెడు ముడుకకన్బొమలవలనఁ,
గడుజిట్టినట్టి బంగరుపూఁత పొక్కిళ్ల
వడువుఁ జూపెడి మేని వళులవలనఁ,
దునిసిచ్రే లెడుమ్రాకు తునుకల వలపించు
బాహువక్షోజలంబనమువలన;
తే. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ
దనరు ఘనకాసకుహికుహిధ్వనులవలన
భావజుఁడువెళ్లిపోయిన పాడుమేడ
పగిదిఁ కాన్పించు ముదుసలిపడఁతియొకతె.

* * * *

సీ. నిండుచందురు నవ్వు నెమ్మోముసిరితోడ
నిరులు గ్రమ్మెడు వేణిభరముతోడ,
నాకర్ణలోలంబులగు నేత్రములతోడఁ
దళుకొత్తు చెక్కుటద్దములతోడ,
మిగులమిటారించు బిగిచనుంగవతోడ
లలితంపు బాహువల్లరులతోడ,
నతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ
నభినవంబైన నూఁగారుతోడ,
తే. వలువమీఁదికిఁ దొలఁకు సువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ
నమరుప్రాయంపురూపుచిత్రముగఁదాల్చె.

* * * *

సీ. అమృతంబుదొలఁకునట్లమరంగ వెల్గొలఁ
బాలుముఖేందుబింబంబుతోడ,
బాలకర్ణద్వయీ కూలంకషంబులై
తల్లడంబందు నేత్రములతోడఁ,
గడుఁ జెమర్చినయట్టి కలికిలేఁ జెక్కుల
నంటెడువిగళత్కచాళితోడ,
వలిగుబ్బపాలిండ్ల నిలువ కిటట్టు సం
క్షోభించుపయ్యెదకొంగుతోడ,
తే. వెఱపు నొకయొజ్జయై వింతవిలసనములు
గఱపఁ జూపట్టు సౌందర్యగరిమతోడ
సరభసాకర్షణాక్షోభచకితమైన
మదనుజయలక్ష్మిలీల నిమ్మగువ దనర.

* * * *

సీ. తిరముగామొడవమి విరియఁ బొఱలెడుకొప్పు
తోడ్తోడ నొకకేలఁ దుఱుముకొనుచు,
వల్లెవాటుగఁ గొంత వలుదచన్గవనిల్పి
వెఱచేత నీవి గల్పించుకొనుచు,
నుదుటిపై నొక్కింత చెదరినముంగురుల్
పాపటకును బొందుపఱచుకొనుచు,
సారెకుజారెడు శ్రవణకహ్లారంబు
లందందమూఁపున నానుకొనుచుఁ,
తే. జెమటనంటినపానుపుఁ జివురుఁదునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవుకొనుచు
రంభ యేతెంచె మిగులసంరంభ మమర
దొలుతఁ బ్రియుఁ డేగుదెంచిన త్రోవఁబట్టి."
ఆ. 3.

వీటివిభేదములు గమనింపుఁడు. మణికంధరుని తీర్థ
యాత్రఁ గమనింపుఁడు.

ఈగ్రంథము లోకోక్తులపుట్ట.

"బజ్జలపుచ్చకాయ" ఆ.1–136
"ఇల్లలికినఁ బండువగునె" ఆ.3–180
"సేనుదుట నెప్రొద్దుపొడిచెనే" ఆ.3–220
"పడఁబోయినఁ బూఁ బా
న్పునఁబడు పోలిక" ఆ. 4.– 22

ఇట్టి వనేకములు కలవు.

సూరనార్యునకుఁ గవిత్వ మెట్లుండవలెనో చక్క
గాఁ దెలియును. తెలిసినందునకుఁ దెలసినట్లు నడుచుకోఁ
గల మహాప్రజ్ఞ కలదు. ఇతఁడు కవికిని, పాలుపిదుకు
వానికి నుపదేశము చేయుచు (వ్రాసినపద్యమును జూడుఁడు:

"సీ. విశ్రాంతి విరతి గావింపక సారవ
త్సాహిత్యసౌమనస్యంబు లెఱిఁగి,
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు
లైనశబ్దముల నత్యాకులాత్మఁ,
జేయక సత్పరిచితసుకుమారవా
క్సరళితాభిప్రాయగా నొనర్చి,
పదబంధశిథిలతఁ బాటిల్లనీయక
యేచందములయందు నేమరిలక,
ఆ. పరగుకవియు దోషాకరుఁడును యశము దు
గ్ధమును బడయు నట్లు గానినాఁడు
కృతి దురాప మొదవు కీర్తియుఁ బోలు నీ
కుంట గాదు హాసయోగ్యుఁ జేయు."

ఇతనిశైలి సర్వవిధముల నుభయకవిమిత్రుని శైలిని బోలియుండును. ఉభయకవిమిత్రునివలె సకలకవిత్వరహస్యముల నెఱింగినవాఁడు సూరనదప్ప వేఱొకఁ డాంధ్రకవి లోకమున లేఁడు. చూడుఁడు:

"క. శ్రీలకు నాకరమై వి
ద్యాలతలకు నాలవాలమై హరికి సదా
కేళీభవనంబై మహిఁ
జాలం ద్వారవతియొప్పు సౌభాగ్యములన్."
—ప్ర. ఆ.

"క. ఏమిా శిష్యత్వంబున
నీమునివరు సేవ సేయ నిచ్చపొడమెనో
యోమగువ! యనిన విని యదియును
నేమియు లేదనివినీతి నిటునటు నొదిగెన్.
చ. ఒదుగుటయున్ యదుప్రవరుఁ
డోహరిణాక్షి! తలంక నేల నీ
కది కడులెస్స బుద్ధి, కృప
నిట్టిమహామహు లాత్మసేవకున్
హృదయమునందు నియ్యకొను
టెవ్వరికున్నది వేయునేటికిం
బ్రదికితి సేవ సేయుము శు
భప్రదు నిమ్ముని నిట్లయెప్పుడున్"
—ద్వి. ఆ.

పైపద్యములయందలి స్వభావమును భావగాంభీర్యమును బరికింపుడు:

"క. తిరుగా రెండేండ్లకు నీ,
సురుచిరహారోత్తమంబుఁ జూడఁగ నాకుం
దొరకెను గనుఁగవ చేసిన,
యుముపుణ్యము నేఁడు వెండియును ఫలియించెన్."

## కృత్యాది

మ. కట్టమంచి రామలింగారెడ్డిగారు, ప్రబంధములను విమర్శించుచుఁ బ్రతిగ్రంథమునకుఁ గృతిసమర్పణ కృతిపతివర్ణన మొదలగువానితో నాల్గవభాగము పోవుననియుఁ దరువాత గ్రంథమునందును, అష్టాదశవర్ణనలు, చంద్రోపాలంభన మొదలగువానితో రెండువంతులు పోవుననియుఁ మిగిలినదానియందైనను నూతనాంశము లంతగా లేవనియు నభిప్రాయపడుచున్నారు. వారియభిప్రాయము సత్యమనకు నూరముకాదు కాని కృతిసమర్పణవలననించుక చారిత్రకలాభము కలదు. అది యెట్లున్నను కళాపూర్ణోదయమునందలి కృత్యాదిని ఘనమంత యల్పముగాఁ జూడఁజాలము. అదియొక యేకాశ్వాస ప్రబంధము. ఎక్కడఁ జూచినను రసముచిప్పిలు పద్యములే. పద్యమును బోలు పద్యము లేదు. భావములు అతిగంభీరములు. ఈ కవిస్తుతినిఁ జూడుఁడు:

"చ. ఒనరగ నూర్ధ్వలోకమున
నుండిధరిత్రికి డిగ్గుగంగకున్
మనసిజవైరిమౌళియు హి
మక్షితిభృత్కటకంబువోలె శో
భనమయి భవ్యకావ్యమయి
భారతికిన్ వసనస్థలంబులై
తనరెడు వామలూరుభవతాపసు
సాత్యవతేయుఁ గొల్చెదన్."

తిమ్మరాజుకీర్తి భుల్లోకములఁ బ్రసరించె ననుట యెంతముద్దుగాఁ జెప్పెనో చూడుఁడు. శైలియా సూక్ష్మము. భావము గంభీరము.

"ఉ. చెన్నెసఁగన్ నృసింహనృప
　　శేఖరు తిమ్మనృపాల పాళియ
భ్యున్నతకీర్తి ముజ్జగము
　　నూనఁగ మానవకన్యలట్లు తా
రెన్నఁడు బోనిపున్నమన
　　మ్మర్ధులఁ గాంచితిమంచు నుబ్బుచున్
వెన్నెలకుప్ప లాడుదురు
　　వేలుపుకన్నెలు నాగకన్యలున్. "

కృష్ణరాజు కీర్తియుఁ బ్రతాపమును సర్వత్ర వ్యాపించెనన్న పద్యముఁ జూడుఁడు.

చ. పొలుపుగ నారసింహనృప
　　పుంగవుకృష్ణుఁ డనంతవైభవో
జ్జ్వలుఁడు ప్రతాపకుంకుమపుఁ
　　జర్చలఁ బొందుయశః ప్రసూనపూ
జల నలరించు విశ్వమును
　　జక్కి విరాట్తనువౌ చెలంగి,యౌ
భళి ! యిదియో మహోద్భుతపు
　　భక్తిమనంబున నెన్ని చూడఁగన్."

ఈపద్యములవలన సూరనార్యుని యుత్ప్రేక్షాద్యలంకారజ్ఞానమే కాదు; ఉన్నతమైన మతముగూడఁ దెలియనగును. విగ్రహారాధనకంటె విరాట్టును (ప్రకృతిని) పూజించుట గొప్పదని స్పష్టము కాలేదా?

ఇట్లు సూరనార్యుని గూర్చియుఁ గళాపూర్ణోదయమును గూర్చియు నెంతచెప్పినను జెప్పవచ్చును. పండితులు విమర్శింపకొలఁది బయలుపడును. ఇట నాయోపినకొలఁది విమర్శించినాను. పండితు లిందలి లోపములను మన్నింతురని వేఁడుచున్నాను.



# బా ల గా న ము

పెద్దిభట్ల రామచంద్రరావుగారు బి. ఏ., [సాహితీ సమితి]

గాన మాధుర్యలహరికి తానమైన
　　లలితకోమల రక్తపల్లవ మనోజ్ఞ
మూర్తిభాతిని ప్రకృతి సమ్ముగ్ధమయ్యె
శిశిరఋతువున నింపుగాయి చెలువు మీరి.

నిర్మలోత్పలవీక్షణానీకమునను
ఆననోత్ఫుల్లపూ దరహాసరుచిని
పరమహంసమ్మువలె నొక్క బాలకుండు
శ్రావ్యగీతము పాడె నా సరసఁజేరి.

విశ్వమోహన గానమ్ము వినినయపుడు
కూర్మి దేవకి దిద్దిన గోపబాలు
సాంద్రవేణీవిభాసిత చంద్రికవలె
బాలచంద్రుడు తోఁచె నంబరమునందు.

భవ్యమోహన బాలరూపమ్ముదాల్చి
వేణుగానవిస్ఫూర్తి నీవిమలమూర్తి
అంకితంబయ్యె హృత్సీమ నాపుణ్యరీతి;
బాల్యమొదవెను నాపుణ్యఫల మదేమొ!




పారనంది జగన్నాథస్వామి గారు, యమ్. ఏ., యల్. టి.

(సంపుటము ౨, సంచిక ౪ తరువాయి)

## అంకము ౫

### రంగము 1

లోగిట్లో ఒకవసారా

[రూపసీమదనులు ప్రవేశింతురు]

**మదనుడు:—** ఆమెకు నిద్ర పట్టింది కాని ఆశ ఉన్నట్లు వైద్యు లెవరూ ఒక్కమాటైనా చెప్పకున్నారు. గోపురము మొదట గాలిపోగుచేసిన ఇసుకదిబ్బమీాద బోర్లా పడిపోయింది. ఆమె పడేటప్పుడు మెత్తగా ఉండాలని కాబోలు గాలి అంత శ్రమపడినది...ఆపల్లెకు పోయేదారిలో ఆమెను కలుసుకొంటానని చెప్పి నీవు వెదుకవెళ్లితే, నౌకర్లు తోటంతా వెదికి వెదికి తుదకు అక్కడ చూసేరు ఆమెను. ఆమె కోమలశరీరముమీాద ఎక్కడా గాయము మేమీా లేదుసుమా; కాని నోటినుండి రక్తప్రవాహము ఆ ఎర్రని పెదవులగుండా పారుతూ ఉన్నది. కొంత సేపైనతరువాత కళ్లు తెరిచినపుడు నావైపు చూచి చిన్ననవ్వు నవ్వింది; అంతేకాని ఒక్కమాట యేమీా చెప్పలేదు.

**రూపసి:—** చిన్నపిల్లో? చిన్నపిల్ల ఏమిటి చెప్పింది? ఇద్దరూ కలిసే ఉండిరట.

**మదనుడు:—** అవును. గోపురముమీాద కనబడింది. అక్కడ చలికీ భయానికీ గజగజ వణుకుతూ ఉండెను ...ఆమెను ఎన్నో మార్లు అడిగేను. ఎంత అడిగినా ఒక్కటే మాట చెప్తుతుంది. గోడప్రక్కనుంచి పోతూఉన్న పక్షిని పట్టుకోవాలని వంగే సరికి గోడ జారిపోయిందని చెప్తుతుంది. కాని ఆఊసు ఎత్తితే అదేఏడుపు ...రూపసీ, ఈవసారాలోనే, ఇక్కడే, మధ్యాహ్నము సుశీలను నేను కలిసినపుడు, సరిగ్గా ఇక్కడే, ఈ స్తంభాలమధ్యనే మాట్లాడినప్పుడు మామూాలుకంటె తక్కువ విచారముగా ఉన్నానని అనింది. “మామూాలుకంటె తక్కువ విచారముగా ఉన్నాను.” ...రూపసీ, ఆమాటలవలన నేరము మనఇద్దరిపై స్థిరమైనట్లు తోచ లేదా? ఇంతెందుకు? ఆమె మనతో అన్న మాటలు, ఆమె చేసిన పనులు, అన్నీ జ్ఞాపకానికి వస్తూఉంటే, ఏమేమో అనుమానము నామనస్సుకు తట్టుతూఉంది; దానితో నాగుండెకాయ చీలిపోతున్నట్లు అవుతూ ఉంటుంది ...ఆహా! అనురాగముకూడా ద్వేషమంత క్రూరమైనదే

కదా! ఛీ, ఆపదలకు కారణ మయే సౌంద ర్యము ఎందుకు! అట్టి సౌందర్యాతిశయము కొరకు పరితపించే **హృదయము చాలా** పాపి. ఛీ. విధి అదృష్టమని ఎంత చెప్పినా, ఇంతగ్రుడ్డిది, ఇంత చెవిటిది అని నేను ఎప్పు డూ తలచలేదుసుమా. ఎందుకీజీవితము! ఎందుకీఆత్మ,జీవితమునకుఆధారభూతమైన హృదయరహస్యములను తెలుసుకొనలేని ఈ ఆత్మ ఎందుకు; ఈ జీవిత మెందుకు?

రూపసి:—మదనా!

మదనుడు:—ఎందుకు;ఏమిటిచేయమంటావు?

రూపసి:—పద, వెళ్దాము. పద నన్ను దీసుకో వెళ్లు. ఎక్కడ ఉన్నది సుశీల? ఛా, నేను నమ్మను. ఆలాగు చేసి ఉండదు; చేయా లసి చేసిఉండదు. ఆలాగేనైతే...

మదనుడు:—ఆలాగేనై ఉంటే...?

రూపసి:—రా, కనుక్కొందాము, రా. ఆలాగే నైఉంటే ఆమె ఎంత బాధపడి ఉండవలెనో కదా! మరి నేను...

[అనిఅంటూమదనునితీసుకొని వెళ్లిపోయింది.]

రంగము 2

సుశీల ఉన్నగది

[సుశీల పక్కపై ఉన్నది. రూపసిమదనులు ప్రవేశింతురు]

సుశీల:—[కొంచెము కదులుతూ] రూపసా, నీవేనా, రూపసీ! మదనుడా? మీఇద్దరికో సమే ఇంత సేపటినుంచి చూస్తూఉన్నాను. వచ్చేరూ, ఎంతోసంతోషముగా ఉన్నది.

మదనుడు:—సుశీలా! [అని గద్గదస్వరముతో అంటూ వెక్కి వెక్కి ఏడుస్తూ పక్కమీద చతికిలపడ్డాడు.]

సుశీల:—ఏమిటిది ఇద్దరూ ఏడుస్తున్నారు!

రూపసి:—సుశీలా, సుశీలా! ఏమిటి చేసేవే! ...ఎంతపాపిని నేను.

సుశీల:—ఎందుకు, రూపసీ, ఆలాగు నొచ్చు కొంటున్నావు. నీకింత దుఃఖము కలిగే పని ఏమిటి చేసేను నేను?

రూపసి:—సుశీలా, నీవెప్పుడూ దుఃఖకార ణము కావు; ఎప్పటికీ కాదు. నేను, నేనే మరణకారకురాల నైనాను నేను చేయ వలసిన దంతా చేయక, చేయలేకపోయి...

సుశీల:—ఏమిటి అంటున్నావో రూపసీ,నాకు అర్థము కాకుండా ఉన్నది. ఏమిటైనది చెప్పుమూ.

రూపసి:—నాకు తెలిసి ఉండవలసినది. నాకు తెలిసింది అనే నేను భావించేను ...కొ న్నాళ్లనుంచి నాఆత్మకు ఏదో వినబడుతూ ఉంది. కాని ఏమిటి చేయవలసిందో తెలి సింది కాదు. ఇంతకూ నిర్మలమైన ముగ్ధ, ఒక్కమాట, చిన్నది, ఒక్కమాట అని ఉంటే, ఆమాట స్ఫుటముగా నాహృద యానికి వినబడేఉంటే, ఆహా! జీవించి ఉండాలని తహతహపడుతున్న ప్రాణము నిలిచి ఉండిఉండునుకదా.

సుశీల:—స్పష్టముగా చెప్పుమా.

రూపసి:—నీఆలోచనగురించి నీవు నాతో ఆవేళ, ఈరోజు ఉదయము, మధ్యా హ్నము మాట్లాడినప్పుడు, నిన్ను గట్టిగా పట్టుకోవలసిఉండెను. నాహృదయమునకు సమీపముగా నిన్ను తీసుకొని, గట్టిగా

పట్టుకొని ఉంటే, ఆరపండిన నిమ్మపండు రాలిపడేటట్లు, నీఆలోచనకూడా మన ఇద్దరిమధ్యా జారిపడిపోయి ఉండును. నీ హృదయములో పొంచి ఉన్నాడని నేను అనుమానిస్తుండే నీ మరణభావనను నా రెండుచేతులతో ఊడబెరికి పారవేయ వలసి ఉండెను. నా ప్రేమశక్తిచే ఆ మహత్కార్యమును చేసి ఉండవలసింది. అదేమో కాని నేను చేయగలిగిన దేదీ నాకు స్పష్టముగా తెలిసింది కాదు. నా కండ్లకు అప్పుడప్పుడు పొగవలె గోచరమవుతూ ఉండినా అదేమిటో అంతటికీ గ్రుడ్డిదాననై మతిలేనిదానివలె కండ్లుతెరచుకొని అదే చూస్తూ ఊరుకొన్నాను ... చక్కని ముద్దు ఒక్కటి చాలును ప్రాణాన్ని నిలిపిఉంచుటకు అనే మహత్తత్వము కుగ్రామములో పెరిగే చిన్నపిల్లకైనా తెలుస్తుందికదా. అలాంటిది నాకు...ఆహా! నేను మితిలేని నీచురాలనైనా అయిఉండవలెను; లేదా,గతి కానరాని గ్రుడ్డిదాననైనా అయియుండవలెను. ఇదే మొదటిమారు, సత్యము గ్రహింపలేక, సత్యమునుండి మరీమరీ దూరముగా పారిపోయిన దానను అయినాను. నాగురించి తలచుకొనే ధైర్యము నాకే లేకున్నది. సుశీలా, నన్ను క్షమించుము. నాకిక సౌఖ్యము అసంభవము.

సుశీల:—రూపసీ, నేను చెప్పేమాట విను. నీవు వెంటనే నావద్దకు వచ్చినందుకు నాకెంతో సంతోషము కలిగింది. ఎందుచేతనంటే ఆలస్యమైన కొద్దీ నామతి చెడిపోవుట ఆరంభము అవుతూఉంది. నా కండ్లపై ఏదో బరువొక్కటి నొక్కుతున్నట్లు ఉంది. ఏమేమో వింతవింత భావనలు నామనోవీథిని పరుగెత్తుతూ ఉన్నవి. ఈస్థితి అవసానకాలమందు అందరికీ కలుగుతుందనినీకు తెలుసునుకదా. ముందు ముందు నేను ఏమి చెప్పినా, ఏమి చెప్పుతానో నాకే తెలియదు. సరిగ్గా, నీవు అంతగా సరకు చేయవద్దు. కాని ఇప్పుడు చెప్పేదేదో నాకు తెలుస్తూఉంటుంది. అదే నీవు బాగా విని, దానినే బాగా జ్ఞప్తిని ఉంచుకొని, దానినే జ్ఞాపకము తెచ్చుకొంటూ ఉండుము.....రూపసీ, నీ మనస్సులో ఎట్టి అనుమానము ఉంచుకోవద్దుసుమా!

రూపసి:— నాసుశీలా, అనుమానము దేనికి?

సుశీల:—నీవొకవేళ భావిస్తున్నావేమో ...

రూపసి:—అవును.

సుశీల:—ప్రమాదమువల్ల పడిపోలేదని నీవొకవేళ తలస్తున్నావేమో?

రూపసి:—అవసానకాలమందున్నవాళ్లు అసత్యము పలకలేరని మనకందరికీ తెలుసును. నేను నిజమే చెప్తాను.

రూపసి:—మాయెడల నీకు గల ప్రేమబలము వలన నీవు నిజమే చెప్పగలదానవని నా అభిప్రాయము.

సుశీల:—అది ఒక ప్రమాదము. నేను పడిపోయినాను ...మదనా, నీవేనా ఆ వెక్కి వెక్కి ఏడ్పు?

రూపసి:—సుశీలా వినుఁ. నిజము మాకు తెలుసునని నీవు ఎరుఁగుదువు. నేను నిన్ను ఇప్పుడు అడుగుతూ ఉంటే నాసందేహము తీరాలని కాదు; నీవుమాత్రము సందేహించవద్దుసుమా అని చెప్పడానికే. సుశీలా, నీవు సౌందర్యసంపన్నురాలవు. నీవు చేసిన పని, చూడు, ఎక్కడ ప్రేమ గ్రుడ్డిది అగునో, అప్పుడు ప్రేమవలన జరిగే పనులలో కెల్ల ఎక్కువ నిర్మలమైనది నీవు చేసిన పనే. చూడు, నేను నా మోకాళ్లపై నిలిచి ప్రమాణపూర్వకముగా చెప్పుతున్నాను, విను. నీవు చేసిన నిర్మలమైన పనికంటె సుందరమైనదానిని చేయమంటున్నాను. వివేకముతో కూడుకొన్న ప్రేమను స్మరించి అడుగుతున్నాను. మన ఇద్దరిపెదవులమధ్యనే ఉండి పోయే రహస్యముపైనే మన జీవితేము యొక్క శాంతిపరమావధి ఆధారపడి యున్నది.

సుశీల:—రూపసీ, ఏ శాంతిగురించి నీవు మాట్లాడుతున్నావు?

రూపసి:—అగాధమై, విచారపూర్వకమై ఉండేదానిగురించి.

సుశీల:—రూపసీ, అట్టిదానిని నీ కెట్లు ఇవ్వగలను? నావద్ద ఉంటే కదా...

రూపసి:—మమ్మలిని సౌఖ్యవంతులుగా చేయదలచి నీవు ప్రాణత్యాగము చేయ నుద్దేశించితి వని నీవు చెప్పితే చాలును గదా.

సుశీల:—రూపసీ, సంతోషముతో ఆమాట చెప్పేదాననే, కాని అది అసత్యము కాబట్టి చెప్పలేకున్నాను. మరణశయ్యపై ఉన్నవారు అసత్యము చెప్పగలరని నీవు నమ్మవు గదా.

రూపసి:—ఒక్కటే నేను ప్రార్థించేది సుశీలా. మరణముగురించి నీవు ఆలోచించవద్దు. చూడు, నిన్ను ముద్దుపెట్టుకొని, నీరక్తనాళములలోనికి నాప్రాణము నంతనూ పంపివేసి, నీఆత్మను నూతనజీవకళామృత ధారలతో ముంచివేస్తున్నాను ...వాస్తవముగా నీవు అనుకొన్నంత సమీపముగా మరణము వచ్చేఉంటే, ఈఅసత్యమునకు ప్రయోజన మున్నదని అంగీకరింతును. కాని మరణము దూరముగా పోయినది; జీవకళలన్నీ సత్యముకొరకు ఆందోళన పడుతున్నవి...ఒప్పుకోవూ, సుశీలా! ఎందుకు ఆలాగు తలఊచివేస్తావు. ఇంతసన్నిహితహృదయములుగల మనము, ఇట్లు మాట్లాడుకొంటూ ఉన్న మనము, మన ఆత్మలనుసరిగ్గా తెలుసుకొనలేకపోతామా?

సుశీల:—కావచ్చు కాని, రూపసీ, నీవు ఇప్పుడుమాత్రము సత్యమునుండి తప్పిపోయినావు. నీఊహ సరియైనది కాదు.

రూపసి:—అయితే వేలకొలది మైళ్లదూరములో ఉన్నట్లు మనము భావించుకొంటూ, వేరువేరుగా మనము దుఃఖిస్తూ ఉండవలసినదేనా?

సుశీల:—నేనుచెప్పిందినిజమనినీవేలనమ్మవో!

రూపసి:—ఒక చిన్న పనికూడనైనా నమ్మదు. నీమాటకాని, నీపనికాని ఏదీ ఒక్కటైనా నా ఊహకు విరోధముగా లేదు.

సుశీల:—ఏమాటలు, ఏపనులు ?

రూపసి:—తాతమ్మవద్ద ఆఖరిసెలవు ఎందుకు పుచ్చుకోని గోపురానికి వెళ్లేవు ?

సుశీల:—తాతమ్మతో చెప్పనిదీ తాతమ్మ వద్ద సెలవుతీసుకోననిదీ ఇల్లు విడిచి ఎప్పుడూ వెళ్లలేదు.

రూపసి:— సుశీలా ఎందుకు అదంతా? ఛీ, మరణము ఆసన్నమై ఉన్నప్పుడా ఈ పాడుప్రశ్నలతో నిన్ను ఆయాసపెట్టుట? నీవు సత్యమే చెప్పతున్నావని మనకిద్దరికీ తెలుసును. ఇక ఎందుకు ఇదంతా!

సుశీల:— నీకు సందేహనివృత్తి కాలేదు గదా అని నాకెంతో దుఃఖము కలుగుతూ ఉన్నది. అంతకు పూర్వము నాకెంతో సౌఖ్యము ఉండేది. నేను ఏమి చేస్తే నీ సందేహము తీరుతుంది అని నేను విచారిస్తున్నాను.

రూపసి:—నిజముచెప్పే, సుశీల

సుశీల:—నీకు కావలసిననిజమేదోగదా !

రూపసి:—నాకేమీ తెలియకుండానే, నేను నిన్నీపనికి ...

సుశీల:—కాదు, కాదు; ఎంతమాత్రము కాదు. నన్ను ఎవరూ పురికొల్పలేదు.

రూపసి:—జీవితమంతా ఆవరించి అంధకారమయముగా చేయగలిగే ఈమబ్బులను పారదోల గలుగు ఒక్కమాట చెప్పివేయుము. నామోకాళ్లమీద నిలుచుండి నిన్ను ప్రార్థిస్తున్నాను. బిగ్గరగా అందరికీ వినబడేటట్లు చెప్పవద్దు. నాచెవిలో ...; పోనీ మాటలద్వారా కాకపోతే నీనిర్మల నేత్రవిన్యాసముద్వారానైనా చెప్పు. మదనునికికూడా తెలియనీయనని ఖరారుచేస్తా.

మదనుడు:—సుశీలా, రూపసి చెప్పింది సరిగ్గా ఉంది. నేనుకూడా కోరుతున్నాను చెప్పు; సుశీలా.

సుశీల:—వంగుతూ పడిపోయినాను.

రూపసి:—సుశీలా, ఎన్నోమార్లు నన్ను అడిగేవు "నీవే నాస్థితిలోఉంటే ఏమిటి చేస్తావు" అని. జ్ఞాపకము వచ్చిందా ?

సుశీల:—వంగుతూ పడిపోయినాను.

రూపసి:—నిన్ను ఇంతగా ఎందుకు అడుగుతున్నానో తెలుసునా ?

సుశీల:—తెలుసును. ఆలాగే ఐతే చాలా చక్కగాను, సరసముగాను ఉంటుంది అని. కాని అది అసత్యము అవుతుంది.

రూపసి:—[వెక్కివెక్కి విలపిస్తూ] దైవమా, స్వచ్ఛమైన ప్రేమకు ఆశ్రయములైన ఇటువంటివారియెదుట మేమంతా ఎంత అల్పులము కదా.

సుశీల:—రూపసీ!

రూపసి:—సుశీలా, ఏమి ? అరే, తెల్లబారిపోతున్నావు ఏమిటి ! బాధ ఎక్కువగా ఉన్నదా ఏమిటి?

సుశీల:—లేదు. నాకు కలుగుతున్న ఆనందమే ఈబాధకు కారణము. అబ్బా, ఎందుకు ఆలాగు ఏడుస్తావు మదనా ?

మదనుడు:—సుశీలా !

సుశీల:—మదనా, నీవు ఆలాగు ఏడుస్తూ ఉండవద్దు. మనకు ఒకరిపై నొకరికి నిండా

ప్రేమ ఉన్నది. అందుచేత కన్నీటికి కారణము లేదు. ఇదుగో మరికొంచెము సేపటిలో నాప్రాణములు నన్ను విడిచిపోతవి. కాని అప్పుడుకూడా నాఅధరములపై సౌఖ్యవిశేషమైన చిరునవ్వు తాండవమాడగలదు. దానిని చూసి నేను నిజముగా చనిపోతినా అనేసందేహము ఎవరికైనా కలుగవచ్చును. అంత సుఖముగా నేను ఉంటున్నాను....ఏమి టది ! రూపసీ, నీవున్నా ? ఎందుకు ఏడుస్తారు ఆలాగు ? ఏమీ, అదిసౌఖ్యము కాదా మరి?

రూపసి:—మాకుకూడా ఆ పరమశాంతిని ఇవ్వవా, సుశీలా.

సుశీల:—నీవు నాకిచ్చిన శాంతిని నీకు నేను ఇస్తాను, రూపసీ?

రూపసి:—ఇవ్వగలిగీనీవుఇవ్వకుండాఉన్నావు.

సుశీల:—నాలో అంత అఖండమైన శాంతి ఉన్నదా, రూపసీ?

రూపసి:—[ఖిన్నురాలై] దేవతలుకూడా నీయెదుట అల్పులే, సుశీలా.

సుశీల:—[మారిన కంఠధ్వనితో] నీవు ఎందుకు వెళ్తున్నావు నాబిడ్డా, ఎందుకు వెళ్లిపోవాలి అని తాతమ్మ అడిగింది. అడిగితే తాతమ్మా తాళంచెవి దొరికింది అని నేను అన్నాను...

రూపసి:—సుశీలా, సుశీలా

సుశీల:—[తెలివివచ్చి] చిన్నపిల్లా !...ఏమిటి అంటూ ఉంటిని? ఏమిటి అన్నానో చెప్పమా...అదంతా అబద్ధము; అబద్ధము. చూసేవా, ముందరే చెప్పేను కానూ.

రూపసి:—నీవేమీ అనలేదు సుశీలా. ఎందుకు ఆలాగు నొచ్చుకొంటావు.

సుశీల:—ముందుగానే చెప్పేను కాను. తెలివితప్పితే నేను ఏమేమో చెప్పవచ్చును. అవేవీ సత్యము కావు సుమా. నాఆత్మ యొక్క దార్ఢ్యము పోతూ పోతూ ఉన్నది. నేనేమి అన్నా నన్ను క్షమించుము...తాతమ్మ గురించా నేను అంటూ ఉంటిని ?

రూపసి:—అవును.

సుశీల:—అవును. నీతో చెప్పాలనికూడా అనుకొన్నాను. చూడు ఆమెచేతులు ముట్టుకోకుండా ఆమెను ఎత్తాలి. ఏలాగు ఎత్తడమో నీకు నేర్పాలని అనుకొన్నాను. కాని విధి అంగీకరించలేదు. పోనీ, రూపసీ, జాగ్రత్తసుమా.

రూపసి:—[భయపడుతూ] ఏమిటి ఆలాగు అవుతున్నావు సుశీలా.

సుశీల:—ఏమీలేదు. ఆ, వెళ్లిపోతూఉంది ...కొన్ని అసత్యపుమాటలు చెప్పుతున్నానేమో అని అనుకొన్నాను.

రూపసి:—సుశీలా, మరి నిజముకోసము ప్రయత్నము చేయడము లేదులే.

సుశీల:—చూడు. అబద్ధపు సంగతులు పెదవులు దాటి వస్తే మాత్రము, నీవు నీచేతితో నానోటిద్వారము మూసివేయుమీ...ఆలాగు చేస్తావుకదూ. ఏదీ, చేస్తానని ఖరారుచేయి.

రూపసి:—ఆలాగు చేస్తాను, సుశీల.

సుశీల:—[మదనుడువైపు చూసి] రూపసితో ఒకమాట చెప్పాలి, మదనా. [మదనుడు మెల్లగా వెళ్లి పోయినాడు.] మదనుడు చాలా ఖిన్నుడై ఉన్నాడు. అతడు బాగా మరచిపోయినతరువాత మెల్ల మెల్లగా ఒక నాడు నీవు చెప్తావు ...రూపసీ, ఏదీ నాపె దవులు మూసీ. అబ్బా, ఏదో బాధగా ఉంది.

రూపసి:—సుశీలా, ఏదో చెప్తా నన్నావు.

సుశీల:—ఏమిటి చెప్పా లనుకొన్నానో మరిచిపోయినాను...అదినిజము కాదుసుమా. అబద్ధము ఆలాగు పెదవులు దాటి వస్తున్నది ...నాకళ్లుకూడా మూసి పట్టుకో ...చూడు నీవే వాటిని తెరచినావు; నీవే వాటిని మూసివేస్తే బాగా ఉంటుంది అవును నిజమే. అదే నిజము.

రూపసి:—సుశీలా

సుశీల:—[అస్ఫుటముగా, మెల్లగా] నేను ...నేను వంగుతూ పడిపోయినాను.

[ప్రాణము విడిచి వేసింది.]

రూపసి:— [బిగ్గరగా కేకవేసి ఏడుస్తూ] మదనా

మదనుడు:—[వెక్కి వెక్కి ఏడుస్తూ, సుశీలపై పడి] సుశీలా, నాముద్దుసుశీలా! ...

---

# అ మా వా స్య

గరిగిపాటి రామమూర్తి గారు

గంగామహాదేవి! కారుణ్యనిలయ
ప్రణయాగ్నిలో నేను భస్మమాచుంటి
నాయార్తి వినుమమ్మ నను జూడుమమ్మ
అనదను, నాపైన నెనరుంచుతల్లి!

నిర్మలాచ్ఛంబుతో, నీ సైకతముల
రమ్యహర్మ్యంబుల రచియించుకొనుచు
నానందరూపిపై యలరారుచుండ
సుందరాకారుండు చుక్కల ఱేడు
నాకడకరుదెంచి నారూపుచూచి
'నీ ప్రేమయే నాకు నిఖిలం' బటంచు
బాసచేసియు నన్ను వలపులో ముంచె
అతనిపల్కులు విని హర్ష మొందితిని
సకలంబు నిజమని సంతోషపడితి—

నింతకు నావిధి యిట్టు లుండంగ
నెవరి దూషించిన నేమిఫలంబు?
ప్రణయభావంబులు ప్రబలుచుండంగ
నానందభావంబు లడుగంటసాగె
ఎవ్వరు నాజీవితేశ్వరు నెత్తి
యాకాశవీథిని అతికినారొక్కొ?
నానాథురూపంబు నాస్వరూపమును
చిత్తరువుల వ్రాసి చేర్చియుంచితివి
వానినైనను నొకపరి చూడనీయ
నిష్టంబు లేదొక్కొ కష్ట మానొక్కొ?
గంగామహాదేవి కారుణ్యనిలయ
ప్రణయాగ్నిలో నేను భస్మమాచుంటి
నాయార్తి వినుమమ్మ నను జూడుమమ్మ
అనదను నాపైన నెనరుంచు తల్లి.




# సరళ

ఎద్దనపూడి చెంచురామయ్య గారు

ఛత్రపతి శివాజీమహారాజు సాధించిన దుర్గములలో తోరణదుర్గము మిక్కిలి ప్రాముఖ్యమును పటుత్వమును గలిగినది. ఈ దుర్గము శివాజీమహారాజు తన ఏలుబడిలోనికి రాగానే అందుదుర్గాదేవి ఆలయమును నిర్మించి దాని చుట్టును దివ్యమగు ఫలపుష్పవృక్షముల తోటను వేయించెను. ఇందలి ఫలితమును ప్రతిరోజును దుర్గాదేవి నిత్యనైవేద్యపూజలకు వాడుట మర్యాదగనుండెను. జనార్దన దేవు డీ ఆలయమున పూజసల్పుటకు శివాజీమహారాజుచే నియమితు డయ్యెను. జనార్దనునికి కొలదికాలముక్రిందటనే భార్యావియోగము కలిగినది. ఈతని పెంపుడుకూతురు సరళ ప్రతిరోజును ఉద్యానమునుండి ఫలపుష్పములు కోసికొనివచ్చి తమతండ్రిగారికి యిచ్చుచు ఆతనికి ఉపచారము లొనర్చుచుండెను.

సరళకు పదమూడు సంవత్సరములు నిండినవి. ఆమె ఎప్పటివలె యీరోజును దేవీపూజకు వలయు ఫలపుష్పాదుల గోయుచు ఉద్యానవనమున మందారవృక్షము నీడను నిల్చియుండెను. నిడుదలై గుబురుకొనిన నల్లని శిరోజములును, పాదములవరకు జీరాడు గుండ్రనిమొగమును, మేలిమి బంగారమును మించిన శరీరకాంతియు, సరళ సహజసౌందర్యమునకు వన్నె వెట్టుచుండినవి.

రఘునాథుడు నూత్న తారుణ్యము గలవాడు; శివాజీమహారాజుకొలువున హవల్దారుగ నున్నాడు. రాజభక్తి, దేశభక్తి, అతని కుగ్గుపాలతో బెట్టినవి. ఆయన మహారాజునకు కుడిభుజముగనున్న వాడు. రాబోవు మహమ్మదీయ సంగ్రామమున దమకు జయమును గలిగింప దుర్గాదేవి సమ్మతిని అనుగ్రహమును బడయుటకై యీరఘునాథుని, జనార్దనునికడకు బంపెను. రఘునాథుడు జనార్దనుని దర్శనమునకై అందందు వెదకుచు నుద్యానవనమున ప్రవేశించెను. ప్రవేశించిన తోడనే అతనిదృష్టి మందారవృక్షము నీడనున్న సరళపై ప్రసరించినది. కాని సరళ గమనింపలేదు. ఆమె తనకార్యమందు మగ్నతజెంది, పుష్పములచే పూజాపాత్రమును నింపుకొనుచున్నది. రఘునాథుడు ఒక్కింత బడలికతీర నొకవృక్షము కడనున్న ఱాతిపై కూర్చుండెను. ఇంతలో దనకార్యము పూర్తి చేసికొని సరళ పూజాపాత్రమును గైకొని దేవాలయమునకు బోవుచు ఱాతిపై విశ్రమించియున్న రఘునాథుని జూచినది.

రఘునాథుడు ప్రయాణపు బడలికకొంత తీరగానే దేవాలయమున నున్న జనార్దనునికడకు వచ్చి శివాజీమహారాజుగారి సందేశమును విన్నవించెను. అప్పటికి రాత్రి

సుమారు ఎనిమిది గంటలయినది. ఆపూటకు రఘునాథుడు జనార్దనుని యతిథియయ్యెను. సరళ తాను స్వహస్తములతో వారిరువురకును వడ్డన చేసినది. భోజనానంతరము రఘునాథునికి ఒకగదిలో పడక నమర్చి ఆతని నందు శయనింపచేసిరి.

రఘునాథునికి చాలరాత్రిదనుక నిదుర రాలేదు. వేసవికాలమై చక్కని గాలిరాకపోవుటచేత నతడుద్యానమున దిరుగాడజొచ్చెను. ఇంతలో తనకాళ్ల సమీపమున విద్యుత్కాంతి వలె మిరుమిట్లుగొల్పు అచేతనపదార్థ మొకటి యగుపడియెను. నిదానించిచూచి చేతికి తీసుకొనిచూడగా-అదియాసాయంకాలమునసరళ పూవులు గోయునపుడు అచ్చట పొరబాటున పారవేసికొనిన ముత్తెపుసరము. ఈముక్తాహారము అప్రయత్నముగ లభించుట రఘునాథునికి శుభశకునమని తోచినది. మరునాటియుదయమున రఘునాథుడు జనార్దనుని ప్రత్యుత్తరముతో ప్రయాణమునకు సంసిద్ధుడాయెను కాని ముత్తెపుసరమును స్వయముగ సరళకు సమర్పింప నాతనికి కుతూహలము జనించెను. జనార్దనునియొద్ద సెలవుపుచ్చుకొని యుద్యానవనమున నున్న సరళకు తనయొద్దనున్న హారము నిచ్చి ఆమె సెలవు నపేక్షించెను.

"మీ యీయుపకారమునకు కృతజ్ఞురాలను. మరల తామీదుర్గమునకు రా దటస్థించినచో తప్పక యిచ్చట దర్శనము నిప్పింప గోరెదను" అని సరళ విన్నవించినది.

"నేను మరల ఈ దుర్గమునకు రాగలనో లేదో? ఆవిషయము దైవనిర్ణయమున గలదు; కాని నీవుగావించిన యుపచారములను, నీనిరాడంబరత్వమును, నీముఖారవిందమును, నాకంఠమున జీవమున్నంతవరకును హృదయమున పదిలపరచెదను" అని రఘునాథుడు ప్రత్యుత్తరమొసంగి వెడలిపోవ నుద్యుక్తుడాయెను.

సరళకు నోటమాటరాలేదు; కాని ఆమె నయనములనుండి ఒకటి రెండు బాష్పబిందువులుమాత్రము అప్రయత్నముగ రాలినవి. అతడు పోవుచుండినపుడు కంటికగపడుచున్నంతవరకు దృష్టిఅంతయు రఘునాథుని మీదనే యుండినది.

* * *

నాడుమొదలు సరళకు మనఃస్థిమితము లేదు. ఆమెహృదయము మారిపోయినది. అనేకవిధము లగు భావపరంపరలు పొడకట్టినవి. పుష్పముల గోయునపుడేమి, వనమునందుండునపుడేమి మునుపటివలె సంతోషముగ నుండుటలేదు. రఘునాథుడు యుద్ధభూములనుండితిరిగివచ్చినట్లును, తన పెంపుడుతండ్రి రఘునాథునికిని తనకును వివాహము స్థిరపరచినట్లును ఆమె అనేకమార్లు కలగనినది. కాని కలలుకల్లలే యగుచున్నవి గాని యథార్థములుగాలేదు. మాసములు గడచిపోవుచున్నవి.

* * *

చిరకాలమునకు మరల ఒకరోజు రఘునాథుడు తోరణదుర్గమునకు శివాజీ మహారాజుయొద్దనుంచి జనార్దనుడు రాజధానికి రావలసినట్లుగ నుత్తరముతో వచ్చెను. సరళ ముఖము వికసించినది. ఆమె సంతోషమునకు

మితిలేదు. రఘునాథునితోడను తండ్రితోడను రాజధాని పట్టణమునకు బోవుట కామె మనసు ఉవ్విళ్లూరుచుండెను.

*  *  *

ఆరాత్రి భోజనానంతరము రఘునాథుడును జనార్దనదేవుడును తలవాకిట అరుగుమీద గూర్చుండి సంభాషించుచుండిరి. రఘునాథుడు తనమనస్సులోని సరళను గూర్చిన విషయమంతయు వెల్లడించెను. జనార్దనుడును "రఘూ! నేను నిన్ను చిరకాలమునుండియు నెరుగుదును. సరళకూడ క్షత్రియకులమున జన్మించిన బాలిక. మీయిరువురి వివాహము నాకు పరమసమ్మతము. ఈమారు జరుగగల మహాసంగ్రామమున మహారాజునకు విజయముగలిగెనేని నేనే ఈవివాహమును దగ్గర నుండి జరిగింతును.

ఈమాటలన్నియు చాటుననుండిన సరళకూడ వినినది. ఉభయుల హృదయములు మహానందపూర్ణములయినవి. మరునాడుదయమున ముప్పురును ప్రయాణోన్ముఖులయి రాజధాని యగు సింహగఢకు బయలుదేరిరి. పట్టణసమీపమునకు రాగానే రఘునాథుడు సరళతో "హృదయాధిష్ఠాన దేవతా! సెలవు పుచ్చుకొనెదను. రేపటినుండియు నీవు మహారాజుగారి అంతఃపురములో నుండగలవు. నేను యుద్ధభూమికి బోవుదును. ఈ బీదసైనికుని మరువకుందువుగాక" అనెను. సరళ యీమాటలువినగానే కంట దడిపెట్టుచు "భగవంతుడు మిమ్ములను రక్షించుగాత! నేనుమాత్రము మిమ్ములనెట్లు మరువగలను" అనినది.

*  *  *

రఘునాథుడు వయస్సున చిన్నవాడైనను ధైర్యము, సాహసము, ఔదార్యము గలిగిన మేటిబంటు. శివాజీమహారాజు ప్రాణములను సైస్తఖానుడు సంహరింపదలచినపుడు రఘునాథుడు తనపరాక్రమముచే ఆయాపదనుండి యతనిని తప్పించెను. అనేకపర్యాయములు రఘునాథుని పరాక్రమమును జూచి ఆనందించి శివాజీమహారాజు వీరసన్మానసూచకముగా నాతనికొక ఖడ్గమును, బిరుదమును గూడ నను గ్రహించినాడు.

రఘునాథుడును జయసింహుడును కలిసి శివాజీ మహారాజునకుగాను బిజాపూరు నవాబులతో సంకులసంగ్రామ మొనర్చుచుండిరి. ప్రతిరోజును రాత్రిపూట రఘునాథుడు సరళాజనార్దను లున్నచోటునకు వచ్చి యుద్ధభూమియందలి విశేషములను జెప్పుచుండెను. ఒకనాటిరాత్రి కోటను రహస్యముగ బట్టుకొనుటకు శివాజీ తగినప్రయత్నములు చేయించి సైనికులనందరిని బయలుదేరునట్లు ఆజ్ఞాపించెను. సేనయంతయు బయలుదేరినది. రఘునాథుడుమాత్రము కొంతఆలస్యముగ నా రాత్రి సైనికదళమును గలిసికొనెను. అనుకొనిన ప్రకారము ఆరాత్రి కోటను ముట్టడించినారు. రఘునాథుడే మొట్టమొదట కోటలో ప్రవేశించి కోటను ముట్టడించుటలోను, జయముగాంచుటలోను మహారాజుగారికిని మిగుల దోడ్పడి కీర్తినిసంపాదించిన వీరుడు. మహమ్మదీయులు అనేకులు బందీలయిరి. కొందరు యుద్ధమున చనిపోయిరి. మహారాష్ట్ర సైన్యమున గూడ గొంతమంది వీరస్వర్గ మలంకరించిరి.

యుద్ధమున జయమందిన వీరులకు బహుమానముల నిచ్చుటకు మరునటిరోజున శివాజీ మహారాజుగారు ఒక మహాసభను గావించిరి. మంత్రులు, సామంతులు, సైనికులాసభను నిండి యుండిరి. బందీలయిన మహమ్మదీయుల నందరిని శివాజీమహారాజు దర్బారునకు రావించి వారిని విడుదలచేయించుటకు ఉత్తర్వుల నిచ్చినారు. వారి నాయకు డగు అబ్దుల్ రజాకు అనువీరుడు ముందరికి వచ్చి "మహారాజా! మీ యీయౌదార్యములు నాకు అపరిమితానందము గలిగించుచున్నది. రాత్రి మీసైనికులు మమ్ము బంధించినది అబద్ధము. ఇప్పుడు మీరు నన్ను బంధించినది నిజము. మీసైన్యమున అందరును రాజభక్తులుగారు. కొందరు ద్రోహు లున్నారు. రాత్రి జరిగిన యుద్ధమున మీసైన్యమున అనేకులు మృతినొందిరి. దీనికి కారణము మీసైన్యములోని ఒకవీరుడు. ఈసంగ్రామమునకు సంబంధించిన అనేకరహస్యములను అతడు నాకు దెలిపినాడు. ఆ కారణముననే మీరు తలవని తలంపుగ గోటను ముట్టడించినను మీసైన్యమున కొంతమందిని మేము చంపగలిగితిమి. కాని ఆతనిపేరును మాత్రము నేను చెప్పజాలను" అని విన్నవించెను. ఈమాటలు వినినంతనే శివాజీమహారాజునకు కోపము వచ్చినది. మొగము ఎఱ్ఱబారినది. ఆతని శరీరమంతయు వడకుచున్నది. సైనికులలో ఒక్కనికైన ఉచ్ఛ్వాసనిశ్వాసములు లేవు.

ఇంతలో జయసింహుడు లేచి శివాజీమహారాజును శాంతపర్చుచు ఇట్లనియెను.

"రాత్రియుద్ధమునకు వెడలునప్పుడు ఆలస్యముగ వచ్చినవారుగాని, లేక రాకయుండినవారుగాని యున్నచో దెలుపుడు. ఆసైనికుడు రాత్రియుద్ధమున చనిపోయిన సరియే. లేనిచో నిప్పుడు మహారాజుసమక్షమున వానిని హాజరు పరుపుడు."

చందర్ రావు అనుసైనికుడు ముందునకువచ్చి "మహాప్రభూ! రాత్రి మేము యుద్ధభూమికి వెడలునప్పుడు ఒక హావల్దారుడు మమ్ము ఆలస్యముగ ద్రోవలో కలిసికొనినాడు.

శివాజి:—చెప్పుము. ఆతుచ్ఛుని పేరు-ఆనీచుని పేరు-వాడింకను జీవించియున్నాడా?

కొంతవడి మహాసభ అంతయు నిశ్శబ్దముగ నున్నది. "ఆనయవంచకుని పేరు హావల్దారు రఘునాథుడు" అని వినబడినది.

"నీవు అనృతము లాడుచుంటివి. నీవాక్యములు రఘునాథుని సద్గుణములను మరుగుపరుపజాలవు. ఆతనిధైర్యమును, ప్రభువిశ్వాసమును నేను చిరకాలమునుండియు నెరుగుదును. ఇటువంటి నిందల నాతనిపై మోపినందుకిదె బహుమానము; తీసికొనుము" అనుచు శివాజిమహారాజు కోపముతో తన ఖడ్గమును వెలుపలికి తీసినాడు.

రఘునాథుడు ముందునకువచ్చి "మహారాజా చందర్ రావు చెప్పినది నిజము. అతడు శిక్షార్హుడుకాడు. నిన్నటిరాత్రి సైన్యము యుద్ధభూమికి వెడలునపుడు నేను ఆలస్యముగ వారిని కలిసికొనినది నిజము" అనినాడు.

"రఘునాథా! నీవే కోటను జయించితివి. నీపరాక్రమమును నేను ముఖాముఖిని చూచితిని. నీవు వంచకుడవా?"

"మహారాజా! ఈయపసింద విషయమున నేనేమియు నెరుగను; కాని రాత్రి సైనికదళమును మాత్ర మాలస్యముగ చేరితిని. ఇది యథార్థము.

రఘునాథుడు మరియేమియు మాటలాడలేదు. శివాజీమహారాజునకు తీవ్రమగుకోపము జనించినది. ఆయావేశముతో రఘునాథుని శిరమును ఛేదించుటకు ఖడ్గము నెత్తెను. జయసింహుడు ఆ ఖడ్గమును పట్టుకొని "మహారాజా! నా జీవితమంతయు యుద్ధభూమినే గడిపియున్నాను. రఘునాథుని నేనుగూడ చిరకాలమునుండి యెరుగుదును. ఇంతదాతని దోష మేమియు గనుపడదు. కాని ఏకారణముననో ఆతడు నిజమును వెలిపరుప సందేహించుచున్నాడు. ఇందేదియో యొక మహారహస్య మిమిడియున్నది. మహాధైర్యశాలియు, విశ్వాసపాత్రుడునగు ఒకసైనికుని చంపిన పాపమున కొడిగట్టకొనకుము. ఆతని గాపాడుము" అని విన్నవించుకొనెను.

శివాజీమహారాజునకు జయసింహునియం దధికభక్తిగలదు. అతనివాక్యములను త్రోసిపుచ్చలేదు. "రఘునాథా! నీ చేతనున్న ఖడ్గము నిచ్చట నుంచి యిప్పుడే నీ పీరాజ్యమును విడిచి పొమ్ము. ఇక నెన్నటికిని ఇందు ప్రవేశింపరాదు" అనిమెల్లగ నుడువుచు ఆరోజు నకు దర్బారును చాలించి వెడలి పోయినాడు. రఘునాథుడు ఎచ్చటికో వెళ్లినాడు.

* * *

ఈసంగతులు అగ్నిగోళములవలె దేశమంతటను ప్రాకినవి. సరళకు యీవిషయము తెలిసినదికాని రఘునాథుడు వంచకుడని ఆమె నమ్మలేదు. ఆమెహృదయమునందలి యూహలన్నియు భగ్నములైనవి.

* * *

పైవిషయములన్నియు జరిగి కొంతకాలమయినది. ఒకనాడు సరళ యుద్యానవనమందున్న పచ్చికబయలునందు చింతాకులితమానసయై ఏదియో ఆలోచించుకొనుచు కూర్చుండియుండెను. దవ్వున ఒకసాధువు కాషాయాంబరములతో నిడుదయైన గడ్డముతో కనిపించెను. సరళ యాతని చూచినది. సాధువామెను సమీపించి "నీవేమైన నడుగదలచితివా?" అనెను.

సరళ మాటలాడలేదు.

"నీమనస్సులోని విషయము గ్రహించితిని. వంచకుడని లోకమున పిలువబడుచున్న యొకసైనికుని విషయమై నీ వడుగదలచితివి."

"నీవు నిజమగు సన్న్యాసివి కావు- రఘునాథుడు వంచకుడు కాడు. నే నెరుగుదును."

"నీకు ఆసైనికునిపై ప్రేమమున్నటుల తెలియుచున్నది. నేను మరల ఆతనిని కలిసికొనినయెడల నీవేమైన సందేశమును చెప్పెదవా?"

"అటులయిన నీవిదివరలో ఒకమారు అతని కలిసికొనియుంటివని తలచెదను. తన భవిష్యద్విషయమును నీతో నేమైన నాతడు దెలిపెనా"?

"అవును; నేనాతని చూచితిని. తనమీద కలిగినదోషము, కేవలము అపవాదముమాత్రమేయని రూపించుకొనుటకు ప్రయత్నించుచునఁట! అట్లుకానిచో చివరకు తనప్రాణములనైన విడచునట."

"సరళ రాజపుత్రబాలిక. ఆమె ప్రాణములున్నంతవరకు రఘునాథుని నామమును కీర్తించుచుండును. అతడు నిర్దోషి" ఈవిషయమును నేనునుడివినట్టు లాతనితో చెప్పుము.

"తన నిర్దోషిత్వమును ఋజువుపర్చుకొనుటలో ఆతడు జయముగాంచునని తోఁచదు."

"తనమీది యీనిందను ఖడ్గముతో బాపికొనుమని చెప్పుము. నేనాతనికై జన్మించితిననియు ఎప్పుడును అతనినే స్మరించుచుచుందుననియు చెప్పుము. స్వామీ! తమనామధేయము నే తెలియవచ్చునా?

ఆ! తెలియవచ్చును నాపేరు "సేతుపతి గోస్వామి"

ఆ గోస్వామియే మన రఘునాథుడు. ఆవేసముతోడనే ఆతడు హస్తినాపురమునకు వచ్చినాడు. అచ్చట ఔరంగజేబు చక్రవర్తి శివాజీమహారాజును కొంత సైన్యమును బంధించి చెరసాలలో నుంచినట్లు తెలిసినది. ఫకీరువేషమున చెరలోనున్న మహారాజును గుర్తించి ఆతనివిడుదలకు ఒకరహస్యమగు నుపాయమును చెప్పినాడు. కాని తాను తప్పించుకొనినచో తనసైన్యమంతయును ఔరంగజేబుచక్రవర్తి కోపానలమునకు గురికావలసి వచ్చునని ఆయాలోచనమునకు శివాజీ సమ్మతింపలేదు. రఘునాథుడు శంభాజీసహాయమున శివాజీమహారాజును చెరలోనుండి తప్పించెను. శివాజీమహారాజు అడవిమార్గమున నతివేగమున గుఱ్ఱమునెక్కి దౌడాయించుచుండెను. దారిలోముగ్గురు అశ్వారోహకులు తారసిల్లి ఢిల్లీనగరమునకు మార్గమును జూపవలసినదిగ నతని నడిగిరి. కానియపుడు మారువేసముననున్న మహారాజునకు ఏమిచేయుటకును దోచలేదు. ఒకసైనికుడు కంఠస్వరమునుబట్టి యాతని గుర్తించి మరల బందీకృతుని గావించుటకు ఉద్యుక్తుడైనాడు. మహారాజునొద్ద యిప్పుడు ఆయుధములేవియు లేవు; కాని మహాపరాక్రమశాలియు, ధైర్యవంతుడును, సమయస్ఫూర్తియు గలవాడు గనుక వానిని సత్తువకొలది మొగముమీద నొక్క గుద్దు గుద్దినాడు. ఆదెబ్బతో నా సైనికుడు నేలపై నొరగెను. ఇంతలో తలవనితలంపుగ రెండుఅంబులు వచ్చి యిరువురు సైనికులకు తగిలినవి. వెంటనే వారిరువురు మొదలు నఱికినతరువులవలె క్రిందగూలిరి.

చెంత మారువేసముననున్న రఘునాథుడు మహారాజునకు నమస్కరించెను. శివాజీ మహారాజు రఘునాథుని కౌగలించి "స్వామీ! ఆపదుద్ధారకా! నన్నురక్షించిన తమనామధేయ మేమియో తెలియగోరుచున్నాను. భవానీమహాదేవి భక్తుల రక్షింపఁబంపిన భక్తులై యుందురా?

"మహారాజా! ఈపురుషుడు అన్యుడు గాడు - చిరకాలము తమసేవ చేయుచుండిన

వాడు-ఇప్పుడును తమసేవయందే నిమగ్నుడయియున్న వాడు-రఘునాథుడు."

శివాజీ మహారాజధికానందముతో రఘునాథుని చేరదీసి "రఘూ! తొందరపడి నీకు నేను పరిమితిలేని అవమానమును కలిగించితిని. రవాతి విచారణలవలన నీవు అపరాధివి గావని తెలిసి పశ్చాత్తాపమొందితిని. నీకు గావించిన పరాభవము నేటివరకు నాకు తీరని మనోవ్యథను కలిగించుచున్నది. నన్ను క్షమింపవలయును. ఇప్పుడు నీవుగావించిన యీ నాప్రాణరక్షణమునకు కృతజ్ఞత జూపెదను" అనినాడు.

* * *

శివాజీమహారాజు సింహాగఢమును చేరి మరల రఘునాథునికి సైన్యమునందు గొప్ప యుద్యోగమును ప్రసాదించెను.

* * *

మధ్యకాలమున జనార్దనుడు సరళకు పెండ్లిగావింపవలెనను తలంపున ఒకసంబంధమును నిర్ణయించి ముహూర్తమును స్థిరపరిచెను. కాని సరళకు మనస్సునకానందము గలిగించుటకు మారుగ యీవిషయము మరి కొంతదుఃఖమును మనోవేదనను గలిగించెను. ముహూర్త సమయమునకు ఆమె యింటియందెవ్వరికిని గానుపింపలేదు. సమీపగ్రామమున నున్న-యొక జమీందారుని యింట పరిచారికగ కాలమును గడపుచుండినది.

ఒకరోజున సరళ జమీందారుని చిన్నికుమార్తెతో నుద్యానవనమున విహరింపుచుండినది. అపుడు గోస్వామి వేసముతోడనే రఘునాథు డచ్చట ప్రత్యక్షమయ్యెను.

"స్వామీ! రఘునాథునిమీది ప్రేమచే ఆతనినే స్మరించుచుంటిని. నాతండ్రి మరియొకనికి నన్నిచ్చి వివాహముచేయుటకు బలవంతముచేసెను. నా మనోనిశ్చయము ఆతని కెరిగింప నన్నింటనుండి వెడలగొట్టినాడు.

గోస్వామి కనులవెంట బాష్పములు రాలినవి. ఆతడు గద్గదస్వరముతో "రఘునాథుడు యిప్పు డిచటికి వచ్చినయెడల నీ వాతని గుర్తింపగలవా?" అని యడిగెను. సరళ యీతని గుర్తించి మూర్ఛితయై ఆతనిబాహువులలో లీనమై పోయినది.

శివాజీమహారాజు రఘునాథుని అనేకవిధముల గౌరవించెను. కోటను కాపాడుచుండిన సైనికుడొకడు గతించినతర్వాత ఆనాటి రాత్రిజరిగిన మహాయుద్ధమున చందర్‌రావే శివాజీమహారాజు రహస్య వృత్తాంతములను ఆతనికి ఎఱిగించినట్లు దృఢముగ ఋజువైనది. చందర్‌రావును ఉరితీయవలసినదిగ శివాజీ మహారాజు ఆజ్ఞాపించెనుగాని చందర్‌రావ్ సైనికులకు చిక్కలేదు. తనంతతానే మరణము గావించుకొనినాడు.

* * *

రఘునాథునికి సరళకు వివాహమయినది. శివాజీమహారాజు అనేక బహుమానముల నంపెను. అన్నిటికన్నను విలువయైన బహుమతి ఒకచిన్న లేఖ. మహారాజు స్వహస్తముతోడ వ్రాసినది. అందిటు లున్నది. "రఘునాథా, ప్రియమిత్రమా! చిరకాలము ప్రభుభక్తి విశ్వాసములుగలిగి అనేకమారులు నాప్రాణసంరక్షణము గావించితివి. మీరిరువురును క్షత్రియధర్మముల నతిక్రమింపక "ఓర్ మందల్" దుర్గమును పరిపాలింపుదురు గాత"



# మావటీఁడును దేవుఁడే!

పెనుమర్తి వెంకటరత్నము గారు

త

ఉపాధ్యాయుడు చెప్పెను:—

జగతిఁబొలుపారు వస్తుసంచయములెల్ల
నామహాత్ముని రామణీయకము లగును
స్థావరము జంగమంబైన సర్వసృష్టి
అపరంధాము హృదయవిన్యస్తవృత్తి.

శిష్యుఁ డాలించె నీవచశ్శ్రేణికలను
గాని దానఁగలట్టి భావానురూప
మర్మము గ్రహింపలేక దైవానుగతిని
పోవుచుండె నతండొక పురమువీథి.

వానికెదురుగ నొకమత్తవారణంబు
సరసగంభీరగమనప్రసక్తి మెసఁగ
వచ్చుచున్నది మావటివాఁడు, శిష్యుఁ
'దొలఁగుతొలఁగని' పెద్దగొంతున వచించె.

నేను తొలఁగను లోకము లేనిశక్తి
నుద్భవించి, ప్రకాశించి, యొకట మగ్గు
నామహాత్ముఁడు భగవానుఁ డరయ నేను
ఈసమస్తము నాలీలయే, తలిర్చు.

ఈమదేభము భగవానుఁ డేనుగూడ
దేవుఁడను దేవుఁడే తను వెగడికొనునా ?

భయ మిఁకేలని శిష్యుఁడు ప్రతిమవోలెఁ
గదలకుండెను రాజమార్గమునయందు.

చండవేదండతుండ ప్రచాలనమున
జర్జరీకృతమయ్యె నాజడునితనువు,
ఎట్టులో తెప్పరిల్లి తా నేఁగి నాఁడు
గురునిపాదాంబుజంబుల కొలఁకులకును.

'ఓగురూత్తమ! భగవానుఁ డొప్పు నంత
నంతయును నామహాత్మునియతిశయంబు'
అనివచించి రటంచుఁ గథానుసరణి
తెలిపినంతన గురువు నవ్వులను జిలికె.

'అగును! సర్వము నాతనియద్భుతంబు
నీవు దేవుఁడ వా కరిదేవమూర్తి'
మావటీఁడును దేవుఁడే!—నీవు దేవు
మాటతప్పితి గావున మలసె నిదియు.

శిష్యునిమనంబు ప్రాతరంచితజలేజ
బంధురోచిస్సులందునఁ బ్రామికొనియె
మలయపర్వతకూటనైర్మల్యవాయు
ఘటితులందుఁ బటీరాంబుకణము లొలికె.






## పరభాగము

పరమ కరుణావిలాసంబుఁ బఱపి చూడ, సిద్ధ్యసిద్ధుల సమరీతిఁ జేసి చూడ
నింద్రియవికారముల నిగ్రహించి చూడ, విమలవిజ్ఞానగరిమంబు విశద మగును.

* * * * *

ఆత్మశాంతికిఁ గారణ మైన దదియె, భిన్నభావమ్ములను బాపి పెంచు నదియె
కర్మబంధముల కృత్యములఁ జీల్చు ఖడ్గ మిదియె, శుద్ధవైదికమార్గమ్ముఁ జూపు నదియె.

## ప్రథమప్రకరణము

తే. తరువు లతిరసఫలభార గురుతఁ గాంచు, నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులు గారు బుధులు సమృద్ధిచేత, జగతి నుపకర్తలకు నిది సహజగుణము.—భర్తృహరి.

దేవేంద్రుఁడు జయపుర వాస్తవ్యుఁడు. అతఁ డొక యున్నతవంశ సంజాతుఁడగు మహేంద్రనాథుని యగ్రతనూభవుఁడు, ఎట్టికళంకము నంటనిరీతిఁ బోషింపఁబడిన పుత్రరత్నము, ఆతని యుత్కృష్టభావనలు, సర్వజనహృదయాహ్లాదకరమగు సుచిత్రప్రవర్తనము, నాతని మనోహరభాసురాకారమున కెంతయును మెఱుఁగుపెట్టుచుండెను. ఉత్తమగ్రంథావలోకనము సత్సాంగత్యములతోడి నెయ్యమును గారణములు కాఁగ, నాతఁ డఱుగఁదీసిన వజ్రమువలె మిక్కిలి వన్నెయు వాసియుఁ గాంచెను.

దేవేంద్రుఁ డెట్టి సమగ్రసౌఖ్యములతోఁ బెంపొంది యున్నను, జనసామాన్యమునకు సర్వసాధారణము లగు కష్టపరంపరలుమాత్ర మాతనిని దఱచుగ నెదుర్కొనుచుండకపోలేదు. ఎల్లవిధములఁ దన్నానందడోలికలనుంచి యూఁచుచు, సర్వమును మఱపింపఁ జాలిన భగవతి-మాతృదేవి—కురులు కూడనినాఁడె కంఠప్రాయముననె తన్నుఁ బాసిపోయెను. తనప్రేమకుఁ బాత్రురాలును బ్రాణసమానురాలును నగు భగిని, సప్తవర్షప్రాయముననే యైహికాంకమునుండి మఱుఁగుపడెను. ఈప్రపంచమున సమస్తమును దనకు నాత్మజుఁడుగాఁ దలఁచి, యాతనిపురోభివృద్ధిమార్గమున లక్ష్య మిడి సంరక్షించుచుఁ బ్రాణమునకుఁ బ్రాణముగాఁ జూచుకొనుచుండిన, యమ్మహాభాగుఁడు—పితృశ్రేష్ఠుఁడు—మహేంద్రనాథుఁడు – తనపుత్రుని (దేవేంద్రుని) యిరువదవయేఁట, స్వర్గసోపానపరంపరల నారోహించెను. ఆహా! దేవేంద్రుఁ డీ భయానకప్రదర్శనము నెట్లు విలోకించెను! ఈవిపదంబుధుల నెట్లీఁదఁగల్గెను!!

మాతులుని యాదేశమును శిరసావహించి, దేవేంద్రుఁడు శాంతిపురమునందలి యొక కులీనవంశసంభూతయగు నంబికాకన్య, నిరువదియైదవయేఁట వివాహమా

* వేదాంతతత్త్వవిదుఁడగు వేమన, 'చంపఁదగినయట్టి శత్రు' వను గీతమునఁ బ్రేమస్వరూపమంతయు నిమిడించెను. 'జేమ్స్ రస్సెల్ లోవె' లను నాంగ్లకవివర్యుఁడు రచించిన 'యూసుఫ్' కథ, యీపరమార్థమును వ్యక్తపఱుచునదే. ఆంగ్లమున నిది రమారమి యఱువదిపాదములుగల పద్యరూపమున వ్రాయఁబడినది. నేనద్దానిననుసరించియే యీ ప్రేమపరిణామము వ్రాసితిని. ప్రేమపరిణామమునకును నైకథకును గల్పనలో విశేషవ్యత్యాస మున్నను, నాకథారచనమున కెక్కుడుగ మార్గదర్శకమైన దదియే. సీ.ఆం.

డెను. అంబికాదేవి రూపమున బంగారుకుండ. సుగుణపుంజము. పేదలకుఁ బెన్నిధి. అర్థులపాలిట కల్పశాఖి. మఱియు సాధ్వీశిరోమణి. ఆమెకుఁ బతియే ప్రత్యక్షదైవము. విభునికన్నెఱిఁగి తలలోని నాలుకవోలె, హారములోని దారమట్లు మనసు కలిసి మెలఁగుచుండును. పతియందుఁ దగియుండిన యుత్కృష్టగుణరాజము లెన్నియో యామె సముచిత ప్రవర్తనమునఁ బ్రకాశింపఁజొచ్చెను. నాథుఁడు నామెను బ్రాణమునకుఁ బ్రాణముగ మన్నించుచుండెను. దేవేంద్రనాథునివలన నాయోషారత్నము నలువురఁ బుత్త్రుల నార్వురఁ బుత్త్రికలఁ బడసెను. అందు మొదటి మువ్వురును దక్కఁ దక్కినసంతతి యామెకు నిలువలేదు. సంతానమరణశోక మెవ్వరికిని భరింపరానిదే యగును. అంబికాదేవి యిట్టి దుర్భరగర్భశోకమునఁ జాల కృశించెను. ఐహికకష్టపరంపర లాత్మీయసుఖాభివృద్ధికి సాధనభూతము లని విశ్వసించిన దేవేంద్రనాథుఁడుమాత్ర మీయాతనల నత్యంత శాంతభావమున సహించి, సంతోషపూర్వకముగ ననుభవించెను.

దేవేంద్రనాథుఁడు జయపురమునం దొక మహాధన సంపన్నుఁడును, భూస్వామియు నయియుండెను. కేవల ధనార్జనమే పరమసాధనముగాఁ గొని, యందుల కనేక దుర్నీతిపథములఁ ద్రొక్కి, యమాయకులగు సాధుపురుషులను, నిరుపేదలను దీవ్రవేదనల పాలు గావించి, వారి విత్తములఁ గొల్లగొని, యొక్కుమ్మడిఁ గుబేరులు కాఁ జూచు నోపెడిగాండ్రఁ బోలు, కొందఱు ధనాశాపరులవలెఁ గాక, న్యాయైకమార్గమున నాతఁడు కష్టమునకుఁ దగిన ఫలము నందుచుండెను. వంశపరంపరాగతమైన యైశ్వర్య మెంత యతిశయముగ నున్నను, దాని నుపయోగించుకొనుచుఁ దానలసుఁడుగ నుండక, యా ధనాగారములఁ గన్నెత్తియైనఁ జూడక, స్వార్జితవిత్తమునుండియే కుటుంబపోషణమును, నతిథిసత్కారమును, లోకపూజయుఁ గావించుచుండెను. అతఁడు తన్నాశ్రయించు ననాథజనులకును, భిక్షుకులకును నన్నవస్త్రాదికముల నొసఁగి, వారి ననారత మాదరించుచుండును.

దేవేంద్రనాథుఁడు గోరక్షణము నొక పరమకర్తవ్యకృషిగ భావించినవాఁడు. కామధేనువుల కెనయగు గోసంతతి, యాతని యైశ్వర్యమునం దొక పూజనీయము వృద్ధికరమునగు భాగమై కన్పట్టుచు, నిరంతరము సుప్రశస్త క్షీరధారలఁ బితుకుచుండెను. కసుఁగందుల కొఱకయి పురమునఁ గోరినవారి కెల్ల నా మధురదుగ్ధముఁ బ్రతిఫలమునపేక్షింపక యొసఁగవలసినదని, యాతఁడు తన గోపాలుర కాజ్ఞ చేసియుండెను; మఱియు నాతఁడు పర్వతప్రాంతములనుండి విలువగల యోషధీలతలఁ దెప్పించి, వానిచే నుత్కృష్టములగు నౌషధముల నాయత్తపఱిచి, తనూత్త్రమున రోగుల కుచితచికిత్సలు సల్పుచుండును. ఆ మహాశయుఁడు దీనులకష్టములఁ జూచి సహింపఁడు. వారినిఁ గాచుటకును, వారిదుఃఖములఁ దొలఁచుటకును, నెప్పుడు నాతని మానసముత్కంఠితమగుచుండును. దేవేంద్రనాథుని హృదయ మిట్టియోచనాప్రవాహమున మునిఁగి తేలుచుండుటచేఁ, గొండొకతఱి నతఁ డితరచింతల నన్నింటిని మఱచుచుండువాఁడు.

మింటనుంచిన దివ్వెవలె దేవేంద్రనాథుఁడు మిగుల ప్రకాశించెను. అమ్మహనీయుని కీర్తిచంద్రిక లచిరకాలముననే యనంతముఖములఁ బ్రసరింపఁజొచ్చెను. ఆతని పరహితాచరణశీలమును గూర్చి యాలించినవారిలోఁ బెక్కండ్రు, దేవేంద్రనాథుని సందర్శించుటకై పలుతావులనుండి చనుదెంచుచుందురు. కాని, పైన సూచించిన యంశములకంటె, ననేకులు భ్రమించియున్నరీతిని, మాహాత్మ్య మింకెద్దియు నాతనికడ నగపడదు. గాఢములగు నిగూఢమర్మముల కాపురుషుని మానసికతలమునఁ జోటులేదు. కైసేతలయందైన నాతనికి డాబులేదు. అశ్వశకటములు—మఱబండ్లు, యానములు దేవేంద్రునకుఁ గాఁబట్టవు. వాని నాడంబరముగ నుపయోగించిననే కాని, యుచిత గౌరవ మొనఁగూడదను భ్రాంతియు నాతని కున్నట్లు తోఁచదు. సేవకులు సహచరులై యుండ నవసరము లేదు. ఆతఁడు సామాన్యమానవులకంటె నేవిషయమునను దన యాధిక్యముఁ బ్రకటించుట కానము. ఇట్లుండియు దేవేంద్రనాథుఁ డనేకపర్యాయము లనిష్టసంఘటనములకు గుఱి కాకపోలేదు. అయిన నాసాధుశీలుఁడు తనయెడ హాని దలఁచువారికిఁ గీడుసేయఁజాలఁడు. ఇది యొక్కటియే యాతనికిఁ గల పరమోదారగుణములలో నెల్లఁ బ్రధానమైనది.

## ద్వితీయ ప్రకరణము

గీ. కుసుమగుచ్ఛంబునకుఁ బోలె బొసఁగు శౌర్య
మానవంతున కివి రెండు మహితగతులు,
సకలజనమస్తకప్రదేశముల నైన
వనమునం దైన జీర్ణభావంబుఁ గనుట.

—భర్తృహరి.

హేమకుమారుఁడు దేవేంద్రనాథున కేకపుత్రుఁడు కాఁడు; కాని దేవేంద్రనాథున కాతని యనంతరము గల్గిన పురుషసంతతిలో నిలిచిన దీహేమకుమారుఁడు మాత్రమే. దేవేంద్రనాథున కాతఁడు ప్రాణసదృశుఁడును, అంబికాదేవికి బహిఃప్రాణమును నయి యుండెను. కన్న సంతతి నెల్లఁ గోల్పోయినపగుటం జేసి, యీప్రపంచమున హేమకుమారుఁడు తక్కఁ దల్లి కిఁక బ్రతుకు వేఱుగా లేదు. కనుక నామె పుత్రుని నెల్లప్పుడు కన్నులఁ గప్పుకొనుచు, నొకక్షణమైనఁ దన ముద్దులుగుల్కు కుమారుని విడిచియుండఁజాలనంతటి గాఢానురాగము నంది, కడు గారాబమున నాతని జూచుకొనుచుఁ బుత్రకుని పురోభివృద్ధి నత్యుత్సాహముతోఁ గాంక్షించుచుండెను.

హేమకుమారునిపై నిష్కారణముగ మాత్సర్యము పూనియున్న జ్ఞాతి సురేంద్రకుమారుఁడు. కారణాంతరము వలన నాతఁ డనేకమాసములక్రితమే దేశాంతర సందర్శనాసక్తుఁడై యెందో పోయెను. తదుపరి యాతనియునికి నెవ్వరికిని దెలియరా లేదు.

హేమకుమారుని ప్రథమసోదరి యుమాసతి. సంవత్సరమునాఁడే భవానీపురమునందలి కిశోరరాయని కీమె సమర్పింపఁబడెను. కాత్యాయినీకుమారి ద్వితీయ భగిని. హేమకుమారునికివలె నీమెకును వివాహనిర్ణయ మింకను గాలేదు. పితృదేవుఁడగు దేవేంద్రనాథుఁ డొకవారము దినములనుండియు గ్రామాంతరగతుఁడై యుండుటకుఁ గారణ మీవ్యాపారమే యగునేమొ.

హేమకుమారున కిప్పు డిరువదియైదేండ్ల ప్రాయము. వెడఁదయగు నెన్నుదురు, విస్తృతములై యిందీవరముల నిరసింపఁజాలు కాటుకకన్నులు, విశాలవక్షము, దీర్ఘబాహువులు నపరంజివలెఁ గాంతుల నీను నాతని కోమలశరీరమునకు మఱింత నవీనసౌందర్యము గూర్చుచుండెను.

యుక్తసమయమున హేమకుమారుఁడు చక్కని విద్య నేర్చెను. ముఖ్యముగ మతవిషయక మగు యోజన లాతనికి వెన్నతోడ నలవడెను. ఈవిషయమునఁ గొంత కాలముననే యాతఁ డందె వేసినచేయి యయ్యెను. ఒకప్పు డీవిషయములలో హేమకుమారునకును, మతేతరులలోఁ బ్రముఖులకును వాగ్వాదము పొడమి, క్రమక్రమముగ హెచ్చి భయంకరరూపముఁ దాల్చుచుండెడిది. అదిమాచి మాతృదేవి, ప్రమాదకరమగు నట్టి తర్కవిషయముల నుండి నిర్గమింప నాతనిఁ గోరుచుండుటయు, మనోహర మందహాసము ముఖమునఁ దొలుకాడఁ, గుమారుఁడు ప్రశాంతవచనములఁ దల్లి కొప్పిదమగు సమాధానము చెప్పి పుచ్చుచుండుటయు జరుగుచుండెను.

విచారముఁ బోనిచ్చుకొలఁదిని హేమకుమారుని మానసేంద్రియమున, నావిషయక ప్రణాళికలు మిగుల గాఢములై బలుపుకొనుచుండెను. ఇట్టి బలవత్తర విషయమునుండి యాతని మరల్చుట కెవ్వనిచే నగును? అమాయకుఁడగు హేమకుమారున కీయూహలే చివరకుఁ గంఠగత విషప్రాయములై పరిణమించునా యేమి?

## తృతీయ ప్రకరణము

తే. విద్యచే భూషితుండయి వెలయుచున్న
దొడరి వర్జింపఁ దగుఁ జుమీ దుర్జనుండు
చారుమాణిక్యభూషిత శస్తమస్త
కంబయిన పన్నగము భయంకరము గాదె?

—భర్తృహరి.

ఒకనాఁటి మధ్యాహ్నమున నించుమించు పదునొకండుగంటల సమయమున, రుద్రదత్తుఁడు దేవేంద్రనాథుని గృహమువంక నడచుచుండెను. ఆతఁ డింతవఱకు నెప్పుడును జయపురమునుగాని యందలి దేవేంద్రనాథునిగాని చూచి యెఱుఁగఁడు. ఇప్పు డాకస్మికముగ నాయువకుఁ డాపట్టణాంకమునఁ బోవుచుండి, యొకటి పెల్లునఁ బురప్రవేశము చేసి, దేవేంద్రనాథుని యౌదార్యమునుగూర్చి విని, యాతని సౌధప్రాంగణముఁ జొచ్చెను.

దేవేంద్రనాథుని గృహము రెండంతస్థుల మేడ. రుద్రదత్తుఁ డా భవనప్రాకారద్వారములనుండి క్రింది యంతస్తునందలి వసారాలోనికిఁ బోయెను. దానియున్నత కవాటములు రెండును బంధింపఁబడి యుండెను.

రుద్రదత్తునకు నిముసములు గడచుకొలఁది క్షుద్వేదన పెల్లుకొనుచుండెను. అందులకు దాహబాధయుఁ దోడ్పడుచుండెను. ఆతని కేమియుఁ దోఁచుటలేదు. మనస్సునఁ గలఁత మిక్కిలి హెచ్చుచుండెను. అయిన నాతఁ డొక్కింతతడవందుఁ గష్టముతో నిలిచి, కేవలనిర్వేదముతో నా భవననిర్మాణచిత్రముఁ జూచుచుఁ, గుడ్యభాగమున నొక్కచోఁ గల యాలేఖ్యములోని విషయమును హృద్గతమున గ్రహించి, యంచలి కీలు ద్రిప్పెను. అదియుఁ గిటకిట స్వన మొనరించెను; కాని మార్పేమియును సంభవింప లేదు. లోపల నెవ్వరేనియున్నదియు లేనిదియుఁ దెలియ లేదు. రుద్రదత్తుఁ డెంతయు క్షుధాతురుఁడై బడలియున్నందున దానిఁ దీర్చికొనుటకే యతి సంభ్రమముతో నాతఁ డీయెడకు వచ్చెను. ఆగృహద్వారములు మూసి యుండుటయుఁ, దన మనోరథసిద్ధికై తాను సల్పిన కృషి నిరుపయోగమగుటయు నాతని యాయాసమును మఱింత హెచ్చించెను. మరల నాతఁ డా కీలను బలము కొలఁదిని ద్రిప్పెను. కొంతవడికి గృహాంతర్భాగమునుండి తలుపులు ద్రోసికొనుచు నొక సేవకాయుఁడు వెలుపలికి వచ్చెను. ఇతఁ డాయింటి ప్రధానసేవకుఁడగు 'రామదాసు'. రుద్రదత్తుఁడుఁ నిశ్చలమగు తీవ్రదృష్టి నాతని నొక్క నిమేషకాలమట్టె తేఱిపాఱఁ జూచి, శిరముపంకించి "నీవిప్పటికైనను బ్రసన్నుఁడవగుట నా యదృష్టమని భావింతును. మీ యజమానుని నియమములంతె యసందర్భములుగ నుండెనేమి?" అని యధిక్షేపించెను. రామదాసందులకు విసుగుకొనలేదు. ఆ యతిథి సహజముగఁ గ్రోధస్వభావుఁడయి యుండుననియు, నందులకు క్షుద్బాధయుఁ గొంత తోడ్పడెననియుఁ దలఁచి విస్మితుఁడై, శాంతవచనముల నాతని మీఁదియంతస్తునకుఁ గొనిపోయెను. రామదాసు తలంచినట్లు రుద్రదత్తుఁడు నిశ్చయముగఁ గ్రోధస్వభావుఁడే.

మెలికలు తిరిగిపోవు సోపానములఁ గడచిన యనంతరము, విశాలమై, యత్యంత రామణీయకమై మధ్యభాగమునఁ గమానులు తీర్చిన భవంతియుఁ, జుట్టును జిన్నచిన్న గదులునుగల యొక యద్భుతమందిరము రుద్రదత్తునకు గోచరించెను. రుద్రదత్తుని మాడ్కి లామందిరమును దిరస్కరించుచున్నట్లుండెను. రామదాసందలి కృష్ణపాణి గంగాధరుల కాతనిఁ బరిచితునిగా నొనరించి తనస్థానమునకుఁ బోయెను. గంగాధరుఁ డచ్చటి జలవాహకుఁడు. కృష్ణపాణి యాయింటివంటది. మజ్జనభోజనాదికములలో నా రాయతిథి నెల్లభంగముల నుపచరించిరి.

రుద్రదత్తుఁడు భోజనానంతరమున, శయనమందిరమునఁ గల పర్యంకమునందలి తూలికాతల్పముఁ జేరెను. బహువిధచిత్రపటసంశోభితమై, మనోహరపరిమళసమ్మిళితపవనపూరితమై యాగది యెంతయు మహద[illegible] దాయకముగ నొప్పారుచుండెను. ఇట్టి యాప్రాసాదమున నతిథిపూజకై నిరీక్షించియున్న సేవకావళిసల్పిన కైంకర్యాతిశయముననో మార్గాయాసమువలన డస్సియున్న కారణముననో రుద్రదత్తుఁ డాహృద్యతల్పమున మేనిఁ జేర్చుట తడవుగా సుఖనిద్రఁ జెందెను.

ఆతఁ డెంతకాలము నిద్రించెనో! సుషుప్తిఁ దెలిసి యెదుటనున్న ఘటికాయంత్రము నవలోకించు నప్పటికి, అదియు మూఁడుగంటలు కొట్టెను. అపరాహ్ణకాలము మీఱినదని తలఁచి, యాతఁడు పడకనుండి లేచెను. నేలపై గూరుచుండి కుడ్యమున నొరగి కునుకుపాట్లఁ జెందుచుండిన వృద్ధదాసి యొకర్తుక, పర్యంకపుఁ గిఁచురావమున నులికిపడి హెచ్చరికఁ జెందెను. రుద్రదత్తుఁడు దాసి నిట్లు పలుకరించెను.

రుద్ర—ఓసీ! నీయజమానుఁ డెవ్వఁడు? ఎందున్నవాఁడు?

దాసి—ఈవిషయమై మనవిచేసికొనుటకు ముందు, అతిథిపూజాభాగ్యమును నాకుఁ గలుగఁజేసిన తామెవ్వరో తెలిసికొనఁ గుతూహలమగుచున్నది.

దాసిమాటలు రుద్రదత్తుని మనస్సునకు వికటముగ దోఁచెను. ఆతఁడు విసుఁగుకొనుచు, "నీవు మట్టుమర్యాద లెఱుంగని దానివలె నగపడుచున్నావు. నేనెవ్వఁడనైన నేమి? నాతో నీకేమి పనియున్నది? నీవేమైనఁ బెండ్లిజేరమునకు వచ్చితివా?" యనెను.

దాసి—లేదులేదు అయ్యా! క్షమింపుఁడు. మీరెవ్వరో తెలిసికొనఁ గోరి యడిగితిని; గాని మిమ్మధిక్షేపించుటకుఁ గాదు.

దాసి మాటాడుచున్నట్టె రుద్రదత్తుఁ డామెవంకఁ జుఱుచుఱఁ జూచుచు, "నావిషయమై తెలిసికొన నీకెవ్వఁ డధికార మిచ్చెను?" అనెను.

రుద్రదత్తుని చుఱుకుఁ జూపులు దాసిని భయభ్రాంతగ నొనర్చెను. ఆతనివాక్యమామె హృదయతలమునఁ బిడుగువలె నాటెను. ఆమె శరీరము కంపించెను. గద్గదస్వరమున దాసి యిట్లనెను. "నేను మీయెడ నట్టి... ..." వాక్యమింకను ముగియలేదు. రుద్రదత్తుఁ డుగ్రుఁడై "ఛీ! నోరెత్తకు. నీవంటి యాఁడుదానికి నింతసాగసు?" అని గర్జించెను.

దాసికి మిన్నువిఱిగి మీఁదఁ బడినట్లయ్యెను. హృదయము తటతటఁ గొట్టుకొనఁదొడఁగెను. ఆమె యొడలు గడగడ వడఁకెను. అచ్చటనుండి జాఱి యది వెఱ్ఱిమొగమున నిశ్శబ్దముగ భవంతిలోనికిఁ బోయెను. ఆతఁ డందున్నంతవఱకు నామె మఱల నాగదిఁ జేరలేదు.

రుద్రదత్తుఁడు ముక్కోపి. మీఁదుమిక్కిలి నిరంకుశాధికారప్రియుఁడు. యుక్తాయుక్త వివేచనా రహితుఁడు. దురభిమాన వంచితుఁడు. విశాలభావ మాతనికిఁ గొలఁది. తనమాటయే శిలాశాసనము. మఱియుఁ దన యాజ్ఞయే సుగ్రీవాజ్ఞ. ప్రపంచమునఁ దన కధికుఁడు లేఁడు. ఇట్లని యాతఁడు తలఁచుచుండును. అగునేని యీస్వభావము రుద్రదత్తునకు నిజమైన సంతోషము నొసఁగదు. మఱియు నొకానొప్పు డది యితరుల మనోవేదనకుఁ గూడ హేతుభూతము కావచ్చును. ఆతఁ డేదియో యోజించుచుండి తటాలున నాగది విడిచిపోయెను.

## చతుర్థప్రకరణము

[illegible]

మానికముఁ బెకలింపవచ్చుఁ, బ్రా
యక చలదూర్మికానికర
మైన మహోదధి దాఁటవచ్చు, మ
స్తకమునఁ బూవుదండవలె
సర్పమునైన ధరింపవచ్చు, మ
చ్చిక ఘటియింప మూర్ఖజన
చిత్తముఁ దెల్ప నసాధ్య మేరికిన్.—భర్తృహరి.

హేమకుమారునిగది ప్రత్యేకము. అది యాభవనోపరితలమునఁగల మేడను సమీపమున మాతృదేవీమందిరమునకుఁ బార్శ్వభాగమున వెలుగనుండెను. అచ్చటనుండి క్రిందికిఁబోవుటకును బైకివచ్చుటకును బ్రత్యేకసోపానము లమర్పఁబడినవి. హేమకుమారుఁ డతిథులను మిత్రులను సందర్శించుట యాగదియందే.

హేమకుమారుఁ డిప్పుడు తన గదిలోఁ బేపబెత్తముతో నల్లిన కుర్చీపైఁ గూరుచుండి యుండెను. ఆతని మ్రోలనున్న వలయాకారపు బల్లపైఁ, గొన్ని ప్రాచీన తాళపత్రపుస్తకము లొకవంకను, ముద్రిత గ్రంథములు వేఱొకవైపునను, నుండెను. ఆతఁడు తనయాప్తమిత్రుఁడగు రామదేవవర్మతో సంభాషించుచుండెను. ఆసందర్భముననే రుద్రదత్తుఁ డామందిరమునకు వచ్చెను. హేమకుమారుఁ డానందస్ఫుట నయనారవిందుఁడై, యతిథికిఁ బ్రణామము లాచరించి, యెదుటనున్న యున్నతపీఠమున నాతని సుఖోపవిష్టునిఁ జేసెను. రామదేవవర్మ హేమకుమారునితోఁ సెలవుగైకొని, యచ్చటనుండి మరలి, మెట్లుదిగి క్రిందికిఁబోయెను. అనంతరము రుద్రదత్తునకును హేమకుమారునకును నీక్రిందిసంభాషణము జరిగెను.

రుద్ర—మీ యుదారతత్త్వమును గొనియాడుటకై నే నియ్యెడకు రాలేదు. అయ్యా! ఒకానొక కాలమున గర్భదరిద్రులకుఁగూడ, జగమున నిట్టి సత్కారప్రాప్తి యుండునని నేనీమందిరమున గ్రహింపఁ గల్గినందుల కానందించుచున్నాఁడను.

హేమ—మీ భావ మసమంజసమని నేను భావింపను; కాని నేఁడు గర్భదరిద్రుఁడుగ నుండువాఁడే రేపు కనకపర్వతము నారోహింప వచ్చును. ఈ వరసంపదలు శాశ్వతసుఖదాయకములు కాఁజాలవు. స్థిరగుణమణిదామములచే మనకంఠసీమలు విరాజిల్లవలయును. ఆ దామమునకుఁ బ్రేమము వజ్రపతకము. అదిలేనిహారము కాంతివిహీనమగు దీపమువలె నిరర్థకము.

రుద్ర—ప్రేమ మమూల్యగుణము. దాని కన్నికడల సమానవినియోగముఁ జూపుట విలువ నగౌరవపఱచుట యగును.

హేమ—ప్రేమ మమూల్యగుణరాజమే. సంశయము లేదు; అయినను వినియోగమునఁగాని దానివిలువ హెచ్చదు. ప్రాణికోటియందది యెంతయతిశయముగ సమానవ్యాప్తిఁగాంచునో, యంతవిరివిగ దానిమూల్యము ప్రపంచమున నతిశయించును.

రుద్ర—అది యసంభవము. ఈ హెచ్చుతక్కువలలో, ఈ న్యూనాధిక పరిస్థితులలో, ఈ భిన్న జాతులలో, భిన్న హృదయములలో, భిన్న రుచులలోఁ బ్రేమను సమానముగఁ బ్రసరింపఁగడంగుట, దోమకంఠమునఁ గుంజరయూథమును జొప్పించునట్లు, అస్వాభావికము, అసాధ్యము, అనర్థదాయకము, కేవల మసంభవమును నగును.

హేమ—అవును. సర్వసముఁడగు నా పరమేశ్వరుని సంతతియం దిట్టి విషమజాతులు, విషమరుచులు నెందులకు?

రుద్ర—ఉన్నవి; ఉండకేపోవు. అట్లు లేకున్న మనుష్యుని జీవయాత్ర యెంతమాత్రము సుకరము కానేరదు.

హేమ—ఈ భిన్న ప్రవృత్తులు మానవ జీవితమున నెంతమాత్రము నాధారములు కావనుట నా మనవి. వాని నాధారములుగఁ గల్పించుకొనిననాఁడు సమభావమున కవి యడ్డంకిగ నుండకేమానవు.

రుద్ర—(వెకనవ్వు నవ్వుచు) అదియే--అట్లు కావని భావించుటయే--అసాధ్యము.

హేమ—(సస్మితుఁడై) శ్రీకృష్ణుని నాతని యుద్దేశములను మనము గౌరవింతుముకద? వారికి సమభావము లేదా? సమత్వమున కమ్మహిమాంచితుఁ డాదర్శమూర్తి కాఁడా! ఈ విషయమునఁ బ్రహ్లాదకుమారుఁడు మన కొక యుత్తమసాక్షియు నాచార్యపురుషుఁడును నగుచుండలేదా? ఆతఁడు తనయందును నిఖిల భూతములయందును నొక్క విధమున సమప్రవర్తనముఁ గనఁబఱచిన పురుషవరేణ్యుఁడు కాఁడా? రాజర్షి తిలకుఁడగు రంతిదేవుని పూజ్యచారిత్ర మిందుల కెంతయు నాదర్శప్రాయమై యుండుట మనము గ్రహించియేయున్నారము. కల్యాణపుర బసవేశ్వరుని గూర్చియు మనకుఁ దెలిసినయంశమే. పతితజనులలోఁ దాను నొక్కఁడని భావించిన ఘనుఁడాతఁడును. పతిత జాతియందు మిక్కిలి హీనదశయందున్న 'హరళయ్య'నుగాంచి యనుతపించి, యపారప్రేమచేఁ జేరదీసి యాతనికి దైవత్వమును బ్రసాదించి, ప్రపంచమునఁ దనమహనీయతను సుస్థిరముగఁ జాటిన కరుణామయమూర్తి కాఁడెను. ఘోరవనసత్త్వములను సహితము మిత్రదృష్టిం గని వాని నిసర్గస్వభావమున నిమిడియున్న దైవోద్దేశ్యము నెఱింగి, తదీయక్షుద్బాధానివారణార్థమై తనశరీరమునుండి కోసినమాంసమునైన సమర్పింప సంసిద్ధుఁడై, సమస్తభూతవర్గమునెడ సమాదరాతిశయమే చూపి, యుత్కృష్టమై, జ్ఞానసమన్వితమై, పూజనీయమైన, తనమానవత్వమును సార్థకమునర్చుకొన్న వర్ధమానవీరుఁ డెంతటి ధీరోదారచరితుఁడు? ఉదారచరిత్రులకు లోకమే కుటుంబమనియు, వారు లోకమునందలి యఖిలజీవజాలమును దమ కుటుంబమట్లు చూచి ప్రేమింతురనియుఁ, బ్రతి మానవునకు నట్టిశీల మావశ్యకమనియు, వినఁగల్గితిమి. మహనీయుల చరిత్రములు విన్నను, వారి జీవితపరమార్థముఁ గన్నను, సర్వము సమానమను సిద్ధాంతము తేలఁగలదు. ప్రాణికోటిని సమముగఁ బ్రేమింపని హృదయమునఁ బవిత్రత పూర్ణముగ నెలకొనదు. నిష్కళంకభక్తిభావము నంకురింపదు. మీరు సెలవిచ్చిన యంశములఁబట్టి యంతస్తు లావశ్యకమనునది మీ యభిప్రాయముగ నేను దలంపవచ్చునా?

రుద్ర—ఔను. అదియె నా యాశయము. మీరు ముమ్మాటికిని నమ్ముఁడు. న్యూనాధికభావము లుండితీరవలెను. వర్ణవ్యవస్థ యిందుకొఱకే యేర్పడినది. కొంత జీవపరమార్థము గ్రహింపఁజాలక సమభావ మావశ్యక మందురు. అది యసాధ్యము. సర్వసముఁడు మహాత్ముఁడు. అమ్మహనీయుఁ డొక్క నిస్సంగుఁ డీశ్వరుఁడే. అతని భౌతికప్రపంచముతో నిమిత్తము లేదు.

హేమ—అట్లయినచోఁ బ్రాణికోటికి నిజమయిన యానంద ముండునని నేను దలఁపఁజాలను.

అతిసత్కారముతో నారంభమైనవారి వాదము తారతమ్యవిభేదములవంకఁ దిరిగి, యంతటితోఁ బోక వర్ణవివక్షతను దరువాత నాందోళనలకును నందుపై నన్యోన్యమతాచార వ్యవహారవిమర్శములకును జొచ్చి, తీవ్రతమ వాక్కలహవ్యాపారముగాఁ బరిణమించెను. రుద్రదత్తుఁడు హేమకుమారుని నతిశయించుటకై నోరోడక, ఱెక్కముక్కాడనీయక, నల్లేరుపై బండిచందమునఁ బుంఖానుపుంఖములుగఁ దనవాగ్విశిఖావృష్టిఁ గురియుచు, వాదనిరూపణమునకై భయంకరచర్చలకు లోనై, కొండ

పిండిగొట్టుటకుం దివిరెను. హేమకుమారుఁ డవసరపడక కష్టమునొందక, వ్యాకులపాటులేక నెమ్మదిగ, సప్రమాణముగ రుద్రదత్తుని వాదములనెల్లఁ గన్నెఱిఁగి విమర్శింపఁజొచ్చెను. హేమకుమారుని నిరుపమాన వాక్చమత్కృతియం దాతని యద్భుతమేధాశక్తి వెల్లివిరియుచుండెను. అందువలన రుద్రదత్తున కాతనియెడ దాక్షిణ్యభావము పోఁగొనెను. కృతజ్ఞత నశించెను. మాత్సర్యము హెచ్చెను. ఈ హేతువున వాసము నంతకంతకు వృద్ధినొందెను. దానియుపహతికి మార్గాంతరము లేకపోయెను.

ఈయుదంత మంబికాదేవికిఁ దెలిసినది. ఆమె కనంతమగు విచారము కలిగినది. హేమకుమారుని మందలించుట యది యదను కాదు. పరపురుషునిమ్రోల నిలిచి, కుమారునకు హితవుగఱప దొరకొనుట యా సాధ్వీమణికి సమీచీనకర్మముగ దోఁపలేదు. ఉపాయాంతర మేమియు నామెకు స్ఫురింపలేదు. పాపమాభగవతి కష్టదాయకమగు నాయనిష్టసంఘటన నివారణోపాయము నెఱుఁగక కొన్నిక్షణములు గడపెను.

తదుపరి ద్వారముకడనుండి యవ్యక్తకంపిత స్వరమొండు వెలువడెను. అది వ్యగ్రచిత్తుఁడయియున్న రుద్రదత్తునకు వినఁబడనంతటి సూక్ష్మాకృతి వహించియున్నను హేమకుమారుని మానసికతలమున మాత్రము గాఢముగ నాటినది. వెంటనే యాతఁడు చేతులుదక్కి వినమ్రుఁడై నిలుచుండి, కవాటములనంకఁ జెవియొగ్గి యాలకింపఁజొచ్చెను. "అతిథి దైవసమానుఁడు. అమ్మహనీయునిఁ దీవ్రవాక్యములచే బాధించుట నీకుసత్కర్మము కాదు. ఇట్టి ఘోరాతిథి నగౌరవము చేసిన యవమానము మనకుఁ గలుగగలదు. తండ్రీ! హేమకుమారమణీ! ఈభయంకర విషయమునుండి విరమింపుము" ఇవి తన మాతృదేవి యాదేశవాక్యరత్నములు. తోడనే హేమకుమారుఁడు తీవ్రవిచారద్యోతకమగు నొక్కనిట్టూర్పు విడిచి కుర్చీపై వ్రాలెను. "ఓ మాతృదేవీ! నీకరుణావ్యంజక భావణములలో నమృతరస ముట్టిపడుచున్నను, నేఁ డేకారణము ననో గాని నాకది విషప్రాయముగఁ దోచుచున్నది. నేను నీ వాక్యోల్లంఘనము చేసిన ఘోరపాతకమునఁ బడిపోవుచున్నాఁడను. స్వకృతాపరాధ మహాదోషఫలానుభవమునకుఁ దలవాల్చి యుండుటచే, భగవతీ! పరమకృపామయీ! నన్ను క్షమింపకుము." ఈభావతరంగములు హేమకుమారుని హృదయకాసారమునుండి పొంగి పొరలుచున్నట్టు లాతని ముఖవైలక్ష్యము సాక్ష్యమిచ్చుచుండెను. ఇఁక దీనికిఁ బరతోపాయము లేదు.

వాద మింకను బూర్తియయి యుండలేదు. రుద్రదత్తుఁడు హేమకుమారుని పైఁ బయింబయిని బలవత్తరములయిన ప్రశ్నాశుగములఁ గుంభద్రోణముగఁ గురియించుట మానలేదు. ఆపరంపరనుండి యాతఁడింక దరిచేరఁజాలఁడని రుద్రదత్తుఁడు భావించెను. హేమకుమారుఁడు నిరుత్సాహుఁడుగాక, దేనికిని దడవుకొనక, సత్యమునకు జంకక—నిష్కళంక భావమునఁ బ్రసన్న వదనముతో—నాతనిప్రశ్నములనెల్ల సౌమ్యభావమున ఖండింపఁజొచ్చెను. ఆతని న్యాయైక విమర్శనము, రుద్రదత్తుని యున్మత్తచిత్తమున కింపుగాఁ దోఁపలేదు. ఆతని స్వభావము చాల శ్రేష్ఠముగ నుండెను. అందు నమ్రభావ మాంతయు నగపడుటలేదు. అడఁగియుండిన దురభిమానము ప్రకోపించెను. శాంతము సమూలవినాశము నొందెను. క్రోధమునహాప్రసూనములు రేఁగెను. ఆతని హృదయ మీర్ష్యాప్రపూర్ణమయ్యెను. ముఖమండలమున రక్తిమము హెచ్చెను. అందు రౌద్రదేవతమూర్తీభవించెను. మఱియుఁ బ్రతిభ యాకృతి నాల్చెను. నఖశిఖాపర్యంత ముద్రేకించిన క్రోధాగ్నిశిఖలచే నాతనికాయము దహించుకొనిపోవుచుండెను. ఆభయంకరోపానలజ్వాలలను వాగమృతము శాంతిపఱుపఁజాలదు.

రుద్రదత్తుఁడు కుపితన్మృగేంద్రునివలెమునఁ గాలాహలహల గోలుచుఁ దన తీక్ష్ణతరకుటిలనృక్స్వరపరంపరల హేమకుమారునిపైఁ బఱపుచు, వికటస్వరమున "ఆగుమాగుమోరి! జ్ఞానలేశమునఁ బ్రమత్తుఁడవయి ముందువెనుకలారయక పెదమాటలను దొరకొంటివి. నా స్వభావ మెఱుంగమిఁగాబోలు నీవిట్టి నిరర్థక వాగ్వ్యయమునకు బూనుట! మందభాగ్యుఁడా! ఇదిగో రుద్రదత్తుని క్రోధవిషవహ్నికీలల కాహుతి యగుదువుగాక!" అనియార్చుచుఁ దన యొరనుండి నిశితకృపాణమును పైకి లాగెను. ఆహా! ఎంతదారుణము! అది రుద్రదత్తుని దక్షిణకరమున దటిత్కరణి నొక్కమెఱపుమెఱసి, హఠాత్తుగ హేమకుమారుని సుకుమార శరీరమును ఛేదించుకొని పోయెను.

వెంటనే యొకభయదాకవనామందిరద్వారముల భేదించుకొని పోయెను. రుద్రపత్నుండా నిమేషమునసే యంత ర్హితుండయిపోయెను.

## పంచమ ప్రకరణము

గీ. కన్నతల్లికి సంతుపైఁ గల్గుహార్ద్ర
యగును బ్రాణాధారకంబట్టు లరుట, మాత
జీవములనైన లీలవర్జింపఁగలదు,
గాని గర్భశోకాబ్ధినిఁ గడవలేదు.

హేమకుమారుని కఠోరస్వరము చెవినిసోఁకినంతనే యంబికాదేవిగుండె చెలునైపోయెను. ఆమెయొక్క చో నిలువఁజాలక, యా యుత్తరక్షణమునసే హేమకుమారుని శయనశాలఁ జొచ్చినది. శశిలేని నిశవలె, దీప్తిలేని దీపికవలెఁ, గీరములేని పంజరముతీరున హేమకుమారుని దివ్యమందిరము భయదాయకమై, కలావిహీనమై, సర్వశూన్యమై శ్మశానమువోలెఁ గన్పట్టుచుండెను. అందలి ప్రశాంతచంద్రమండల మస్తమించినది. అచ్చటి ప్రాణజ్యోతి చల్లఁబడినది. అందున్న దివ్యశకుంత మాకస్మికముగ నెగిరిపోయినది. అంధకారబంధురమగు గహబిలము తెఱంగున, నాగది నిశ్శబ్దమై, ఘోరముగఁ గాపట్టుచుండెను. కట్టా! ఎట్టి భయంకరకర్మము!!

ఆర్యజనగేయుఁ డమల దయామయుండు
ధర్మనిరతుండు విజ్ఞానతత్త్వవేది
బీదలకుఁ జెన్నిధింబోలు ప్రేమమూర్తి
అందఱను దనవలెఁగను ననఘుస్ఫూర్తి
సత్యమార్గానువర్తి విస్తారకీర్తి
యైనహేమకుమారు భవ్యాదరమ్ముఁ
గని, కృతఘ్నతఁ జెఱప యుక్తంబె తనకు,
ఇంటఁదిని వాసములను లెక్కిడినయట్లు,
తినినయింటికె చిచ్చిడి చనినయట్లు,
గుడిసెవసియించి గుడిత్రాళ్లఁ గోసినట్లు,
అండఁగొని యంతవృక్షమ్ము నడఁచినట్లు,
కుడిచిపాలెల్ల బొమ్మను గ్రుమ్మినట్లు,
తేనెపూసినకత్తి చందానమెలఁగి,
కాలిలోముల్లుఁ గంటిలోఁ గణికవోలె
హృదయగతశల్యమట్లు వర్తించి, యిట్టి
పుణ్యరాశి నుమ్మూలింపఁబోలెనెట్లు?
ఎట్టికరుణాప్రపూరమిదెట్టినీతి?
ఇట్టివిపరీత మెందేనిఁ బుట్టెనొక్కొ?
ఇట్టిఘాతుకకర్మంబు నెఱుఁగవశమె?
ప్రేమపరిణామ మిట్టిదే! ప్రేమపూర్ణ
హృదయులను జెందుఫలము నిట్టిదియె! జగమునందుఁ బ్రేమమయాత్ముల కవధిలేదె?

అయ్యో! హేమకుమారుని స్వర్ణసదృశదేహము నిరాశ్రయమగు నవకోమల లతికవోలె నేలదొరలి ధూళిధూసరమై యుండెను. ఆతని వదనబింబమునఁ గాంతిలేదు. శారదచంద్రికాసన్నిభ మగు రుచిరహాస మందుండి మాయమైనది. ఆతని సర్వాంగకములు రుధిరసంసిక్తములై యుండెను. ఆహా!

ఆవిశుద్ధాత్మకుని మానసాభ్రమందు
నతని సువిశాలహృదయాంతరాళమందు విలసిల్లుచున్న సుధాంశునందు,
వలఁపుగొను నంతరంగ సుమమ్మునందుఁ,
బూజ్యమగు దనసంకల్పరాజ్యమందు,
వినుతతర భావకాసారకమలమందు,
ఎట్టిమధురసమూరెనో యెవ్వఁడెఱుఁగు?
ఎట్టికళలూరుచుండెనో యెవ్వఁడెఱుఁగు?
ఎట్టిసౌరభ మెసఁగెనో యెవ్వఁడెఱుఁగు?
ఎట్టివ్యక్తులు నడచెనో యెవ్వఁడెఱుఁగు?
ఎట్టిమధుపముల్ మరిసెనో యెవ్వఁడెఱుఁగు?
చండవాతూలహతి మేఘఖండ మడఁగె,
నాసుధాకరుఁ డంతలో నస్తమించెఁ,
గాంచుచున్నట్టె సుమము శుష్కించిపోయెఁ,
గొంతతలచూపి రాజ్యము క్రుంగిపోయె,
నీరజముఁగూడ ముకుళించి సెలకునిఁగె,
నంత తీయనిధారలు నంతరించెఁ
గాంతులడఁగెను; చీకట్లు గ్రమ్ముకొనియె;
గుబులుకొనకయ నెత్తావి కోలుపడియెఁ,
దోఁచకయె వ్యక్తిగణమెల్ల దూరమయ్యె;
మధుకరవితాన మొక్కెడ మాయమయ్యె;
మాయసృష్టి తనంతన మఱుఁగుపడియె.

నిర్ఘాతసహస్ర మంబికాదేవి శరీరమునఁ జొచ్చి భేదించిన ట్లయ్యెను. పాప మా భగవతి నిలువున నిలిచిపోయెను. అయ్యో! ఆ దీనవదన—ఆ కృశాంగి ఆయంబికాదేవి—కన్నీరు మున్నీరు గాఁగఁ, గుమారుని రక్తసిక్తాంగమున నొఱగెను. "తండ్రీ! నాబహిఃప్రాణమా నాకేది దారి?" ఆదుఃఖభాగిని యిఁక మాట లాడఁజాలదు. ఆమెకంఠము రుద్ధమయ్యెను. ఆనిర్భాగ్యురాలు తాపభరమున మూర్ఛనొంది పడిపోయెను.—

శ్రీలకు నిధానమైననారీమతల్లి
దయకుఁ బెన్నిధియగు ప్రమదాలలామ
ప్రాణులను ప్రాణముగఁజూచుఁ బరమసాధ్వి
భాగ్యములకెల్ల సంతె సౌభాగ్యమనుచుఁ
క్షేమగుణవృద్ధికిని సంతె ధామమనుచు
ప్రాణమునకు సంతతిబహిఃప్రాణమనుచు
నెపుడు భావించుచుండెడు నిద్ధచరిత
కన్నకొడుకుల నొక్కరొక్కరిని దానె
మృత్యువాహారముగఁగొని మెసవ నొసఁగి
సంతతికి నొక్కమొగి జలాంజలి యొసంగి
శోకసంతప్తచిత్తయై స్రుక్కి—స్రుక్కి
మారునింబోలు హేమకుమారుఁగాంచి
తనదు భాగ్యధామము హేమతనయుఁ డనుచు
తనదుప్రేమంపుగని హేమతనయుఁ డనుచు
తనదు జీవసేవధి హేమతనయుఁ డనుచుఁ
దలఁచి, దుఃఖసాగరము నీఁదంగఁగనిన
తనిసి నిత్యసంతుష్టిఁ బొందంగఁగనిన
తల్లి, మృదుతనూవల్లి, కాంతామతల్లి,
తన మహైశ్వర్యమైన పుత్రకునిఁబాసి
తన దయారాశియైన పుత్రకునిఁబాసి
తనబహిఃప్రాణమైన పుత్రకునిఁబాసి
యెట్టు లాధిల దావాగ్ని—నేగఁగలదు?

అశనిబోలు నీయుదంత మంతఃపుర మందిరములఁ బ్రతిధ్వనించెను. అందలి పరిజను లొక్కుమ్మడిని రోదించుచు, హేమకుమారునిగదిఁ జొచ్చిరి. మాతృదేవి స్మృతిఁ దెలిసి, దీనవచనములతోఁ, గన్నీటిధారలతో సేవకావళివంకఁ దలయెత్తి, విపత్సూచకమగు దృష్టిని సారించి, "అక్కటా నా ముద్దులకూన పోయెనా? నాబంగారుకొండ పోయెనా? నానోములఫలిత మింతటితోఁ దీరెనా? నా యదృష్ట దేవుఁడు నాకిఁక లేఁడా? కట్టా! నా హేమకుమార రత్నము నన్నొంటిమెయి డించిపోయెనా? ఎందుఁబోయెను, ఎందుఁబోయెను? అయ్యో! చెప్పరేమి?" అని యున్మత్తవోలెఁ బలువరించుచు, నావిషాదరసపూరిత స్వాంత, ఆన్మథితహృదయ, శుష్కకంఠయై, మానసికపరివేదనాభరమున నురలఁ బడిపోయెను.

ఆమె యనురాగవల్లిక కాశ్రయమ్ము
నామె యానందమంజరి కమృతవృష్టి
యామె సౌఖ్యవారాశికి నాకరమ్ము
నామెజీవవిత్తమ్మున కాలయమ్ముఁ
బోయె నాశ్రయమును బోయెఁ బోయె వృష్టి
వల్లికయు వల్లరియుఁగూడ వ్రాలిపోయె
నీరు వాయుమండలమునఁ జేరికొనియెఁ
బ్రాణధనము హరింపఁగఁబడియె, నింత
కాదరువు పుత్రుఁ డొక్కండె యగుటకతన
నొక్కపలుకైన సుతుఁ డాడకుండు కతన
నాశ లిమ్మెయి భగ్నమ్ము లగుటకతనఁ
దల్లి కీలోకమంతయు వల్లకాడె
యౌను, నిముసమునకు మున్దు హీనులలగ
మించు సమభావగరిమ బోధించుచున్న
సత్యధర్మోపదేశమ్ము సల్పుచున్న
దివ్యప్రేమైకమార్గమ్ముఁ దెల్పుచున్న
విమలతత్త్వప్రబోధఁ గావించుచున్న
పరమశాంతప్రవర్షమ్ముఁ గురియుచున్న
శీతలవచోమృతమ్ము వర్షించుచున్న
మధురసముఁ జిందుచున్న కుమారుఁ డిపుడు
కోలుపడెఁ దెవ్వ; మాటలు దూలె — సోలె
ఎంత మాఱుపు! క్షణములో నెట్టిచింత!

(సశేషము)



# కడుపుతీపు

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

(సంపుటము ౨. సంచిక ౧. తరువాయి)

వ. నా నాతండు నిట్లనియెను.

సీ. పరిమళించెడు తెల్లవిరికొత్తిమిరిచేల, యింపుఁజూచుచు సంచరింపఁగలిగె,
ఘృతదధిప్లుతముగా నతిరుచ్యముగ మిత్ర, గృహముల విందారగింపఁ గలిగె,
తోఁక పైకెత్తి గంతులు అంకెలిడుచుండు, కోడెదూడలపిండు చూడఁగలిగె,
సెనగకాయలు మొక్కజొన్నకండె లూచకంకులు గాల్చి చెఱుఁదిండ్లు సలుపఁగలిగె
గీ. హృదయ మిచ్చి యాదరించుగృహస్థుల, నడుమఁగాపురం బొనర్పఁగలిగె
కేలుమోడ్పు నీకుఁ గృష్ణాతరంగిణీ, తీరశోభితాంధ్రదేశలక్ష్మి!

క. చక్కెర యక్కఱలేనివి, చిక్కని పాల్ గడ్డపెరుగు జిడ్డగునేయున్
మిక్కిలి చవిగలకూరలు, చిక్కున్ గృష్ణాస్రవంతిచెంతలయూళ్లన్.

ఉ. ఓర్వరు మాయమర్మముల నుజ్జ్వలధీమహిమంబు పేర్పడన్
నేర్వరుగాక విద్దియలు, నెయ్యముతియ్యము చూచుకొంద్రు లో
గర్వము తక్కువేయయినఁ గండ్రతనంబునఁ గానవత్తు రా
యుర్వపురుజ్జ్వలుల్ బలసమున్నతు లెన్నఁగ నాంధ్రపుత్రకుల్.

క. ఆతిథ్యగౌరవంబును, స్వాతంత్ర్యప్రియత, స్వల్పసంతోషము, దు
ర్నీతివిహీనత, నైచ్యా, పేతత్వము నాంధ్రులందుఁ బేర్పడుగుణముల్.

సీ. మాయమర్మము లేక మర్యాదగోల్పోక, మాధుర్యమున మీఱు మాటతీరు
క్రుంకు జంకులు లేక పొంకంబు గోల్పోక, విప్పారియొప్పారు వెన్నుతీరు
లౌల్యంబు లేక చాపల్యంబు గోల్పోక, తీపుతీయములూరు చూపుతీరు
క్రొవ్వుంబులుపు లేక మవ్వంబు గోల్పోక, నడపున బెడఁగారు పొడవుతీరు
గీ. అఖిలభారతకుమార్యభ్యంతరస్థితా, నేకజాతియువతిలోకమునను
నిస్సమానరీతి నెగడుఁగదా తెల్గు, నాతియందు వీరమాతయందు.

వ. అని యిట్లు గొంతదడవంధ్రతయెడఁ దమకుఁగల యాదరమును వారు పరస్పరము
పేరు కొనిరి.

శా. పోటుంబాటుగ రేఁగు చాఁగుచును దత్పుణ్యస్థలత్యాగదుః
ఖాటోపం బటు గొంతదాఁక నలభార్యాభర్తలన్ వేచెఁ గా
ర్యాటంకంబున నిర్వురుం గదలి రత్యంతంబు దుఃఖంబొ యా
రాటంబో విధి సాఁగనీయదుగదా ప్రాపంచికవ్యాపృతిన్.

గీ. క్రొత్తయేటినీటఁ గ్రుంకుటఁ దలలకు, నొండుమట్టి పట్టియుండు ననుచు
బిడ్డలకుఁ దలంటి వేన్నీరు వోసెను, పొలితి దానుగూడఁ బోసికొనియె.

గీ. క్రుంకనున్నాఁడు సూర్యుండు ఘోరమైన, యంధకారమ్ము క్రమ్మునటంచు నామె
వీడుగదలెను పేరంటమాడుటకును, వడివడిగ నాఁడు మంగళవారమగుట.

గీ. ఆరఁబూచిన గున్నగన్నేరు చెట్లు, యట్లు నీర్కావికోకల నందగించి
కొంద ఱరుదెంచి రువిద లానంద లోక బృందమై పేరఁటమ్ము చరింపఁ జనిరి.

శా. తెప్పల్ నిండి విశాలనేత్ర మధురశ్రీ లాత్మసౌభాగ్యముం
జెప్పన్ నిండుఁబయంట సత్కులవధూశీలమ్ము రూపింపఁగాఁ
గొప్పుల్ పువ్వులఁ బుక్కిలించుచును సౌగుణ్యంబు వాసింపఁగా
నప్పుణ్యాంగన లొప్పి రంధ్రవిభవం బచ్చొత్తుచున్నా రనన్.

ఉ. ఐహికభాగ్యలక్ష్మి నడయాడఁ దొడంగినదో యనన్ సుత
వ్యూహముతోడ నాభరణభూషితయై యలపుణ్యసాధ్వియు
త్సాహము గొంత కొంతపరితాపముఁ దోఁపఁగ నాల్గువాడలన్
గేహముగేహమున్ విడువకే చనెఁ బేరఁట మాచరింపఁగాన్

సీ. ఆదరంబునఁ బిల్చినందఱిండ్లకు వెళ్ళె, నచ్చటచ్చట ముచ్చటాడెఁ గొంత
సంతాపమునఁ దనచననుండు కొఱఁగించె, ముంచెవారి వియోగమోహవారి
వారిచ్చినవి తాల్చె బసుపుఁగుంకుమము తాంబూలంబు సెనగలుఁ బుచ్చుకొనియె.
తెచ్చుకొనియె నీరు వెచ్చఁగాఁ గన్నీర, వేఁడుకొనియె వారి వీడుకోలు
గీ. మరల దర్శనంబు దొరకొనునో లేదొ, మఱవవలవ దనియె, మఱియు నాయె
బొంది యరుగఁగాని యందులప్రాణ మీ, యూరువిడిచి యరుగనేరదనుచు

వ. అంత.

గీ. వాడవాడకుఁ బేరంటమాడ నరిగి, తిరిగివచ్చిరి వారెల్లఁ దీగబోండ్లు
ఇల్లుసేరిచి యామెచే మెల్ల వీడు, కోల్వడసి రప్పటికిఁ బ్రొద్దు క్రుంకుచుండె.

ఉ. చమ్మఁగ గోరువెచ్చఁగ సుసహ్యముగా వెలుఁగొంది యాద్రుచేఁ
గుమ్మలువోవు జీవులనెగుల్దొలఁగించిన వేఁడివెల్గు తే
జమ్ముక్రమమ్ముగా ముడిఁగి జాజుకొనన్ జరమాచలంబుపై
గుమ్మడిపూవుచందమునఁ గొండొకగన్పడె బింబమాత్రుఁడై.

(ఇది మాపటివేళ)



# కుక్క-జట్టీ

శాంతి వెంకటరమణ గారు, బి. యే.

విస్సన్నతో వీథిలోనికి వెళ్లడమనేది, తద్దినం కొనితెచ్చుకోవడం అన్నమాట. మనిషి తిన్నటివాడు కాడు. ఇంటికప్పుమీద బెడ్డవేసి, పిపొగ్గేరకం! ఎక్కడికి వెళ్లినా కుక్క-జట్టీలు తెస్తూవుంటాడు. వాడిలో వుండే గొప్ప లోపం యేమిటీ అంటే, ప్రపంచంలో యెవరూ తనవంటి కుశాగ్రబుద్ధి కలవాళ్లు కారని. 'వీళ్ల కీమాత్రం వివేకం లేదేమి చెప్మా?' అనుకుంటాడు. కాని పాపం వాడికి మనసులో మాత్రం యెట్టి దుర్గుణంలేదు— తెల్చుకోకుండానే తవ్వాయిల్లో పడతాడు.

విస్సన్న, నేనూ కలిసి, ఒకనాడు కాఫీ క్లబ్బుకి వెళ్లడం తటస్థించింది. ఊళ్లో కల్లా అయ్యరు క్లబ్బు చాలా పేరుపడ్డది; చాలా పెద్దది కూడాను. ఎప్పుడూ అక్కడ జనం క్రిక్కిరిసి ఉంటారు. వచ్చినవాళ్లకి ఫలహారాలు వడ్డించిందికి చాలమంది నౌకర్లు, చాకర్లు ఉన్నారు. క్లబ్బులో బెంచీలు, బల్లలు, శుభ్రంగా ఉండి, వచ్చేవారు కూర్చుందుకు మంచి సదుపాయంగా ఉంటాయి.

మాకిద్దరికీ పరిచయం లేనట్లు, విస్సన్న, నేనూ చెరొక బెంచీమీద కూర్చున్నాం. నాకు కావలసిన ఫలహారపు దినుసులు నేను తెప్పించుకున్నాను. విస్సన్న ధ్యానంమట్టుకు టిఫిన్ మీద లేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఇంతట్లో క్లబ్బు కుర్రవాడొకడు విస్సన్నను సమీపించి, "అయ్యా, మీకు ఏంకావాలి?" అని అడిగాడు.

వెంటనే విస్సన్న కుర్రవాడివైపు తిరిగి, "సబ్బుబిళ్ల, పీట, వేడినీళ్లు, మంగలివాడు కావాలి" అన్నాడు. ఆకుర్రవాడు మొదట బిక్కజచ్చి చూచి, పిమ్మట కొంచెం కోపంతో "ఇది క్షవరాలషాపు కాదు; కాఫీహోటేలు" అని తీక్ష్ణంగా పలికి, విస్సన్న వేపు చురచుర చూడడం ప్రారంభించాడు.

విస్సన్న చిరునవ్వుతో, "అయితే అబ్బాయీ, ఏంకావాలని యెందుకు నన్నడిగావు? కాఫీక్లబ్బులోకివచ్చేవాళ్లెవరైనాయెందుకొస్తారనుకున్నావు? ఆమాత్రం ఊహించుకోలేకుంటే యెలాగు? ...నీకాఫీ, యిడ్లీ, నువ్వు తీసుకురావడం మాని, ఏంకావలని అడగడ మెందుకు?" అన్నాడు.

ఆకుర్రవాడు యేమీ అనకుండా, మొగం చిట్లించుకొని లోపలికి పోయి కాఫీ యిడ్లీ తెచ్చి విస్సన్నయెదుట ఉంచాడు. అంతట విస్సన్న మెల్లగా "చూడూ, అబ్బా

యీ, మనం యేపని చేస్తూవున్నా, కొంచెం ఆలోచిస్తూ వుండాలి; సంగతులు గ్రహించాలి. అంతేకాని, కాఫీహోటలుకి వచ్చిన వాడు తిరగలి కొనడానికి రాడుకద? పాంకోళ్లు మంచి రకం దొరుకుతాయా అని అడగడు కద? నేను చుట్టలకొట్టు పెట్టుకుంటే, నాదుకాణానికి వచ్చేవాడు చుట్టలకోసం వచ్చేడనుకుంటానుకాని, గుఱ్ఱం బేరమాడిందికి వచ్చేడని తలచను కద? ఏమంటావు, నిజమేనా?" అన్నాడు.

ఆకుర్రవాడికి అపరిమితమైన కోపం వొచ్చింది; కాని యేమీ బదులుచెప్పక, లోపలికి వెళ్లిపోయాడు. విస్సన్న మాటలకు నాకు ఉప్పెనగా నవ్వొచ్చింది. కాని నవ్వు సమాళించుకొని ఊరుకున్నాను.

విస్సన్నకు సమీపంగా ఆబెంచీ మీదనే కూర్చుని ఒక వైదీకపు బ్రాహ్మడు యిడ్లి తెప్పించుకొని, పచ్చడి మారడిగి, తొందరగా తింటున్నాడు. క్షణమాత్రం వానిని నిదానించి, విస్సన్న, "ఏమండీ అయ్యా, ఇటు చూడండి...ఆయిడ్లీలో నంచుకుందుకు వేసిన పచ్చడిలో తలవెంప్రుకలు కాని, కరుదూపం కాని, యిటువంటివి యేవైనా పడివున్నాయా?" అని ప్రశ్నించాడు.

నోటికెత్తిన యిడ్డెనముక్క అసహ్యంతో నేల పడవేసి, ఆబ్రాహ్మడు "అబ్బే, యేం గ్రహచారం! వెంప్రుకలు పడ్డాయటండీ, నేను కనిపెట్టనేలేదు." అంటూ, ఫలహారం విడిచి లేవబోతూ వుంటే విస్సన్న, "అదికాదండీ నేనన్నది. వెంప్రుకలు పడ్డాయి అని నేచెప్పలేదు. ఒకవేళ మీరు తింటూవున్న పచ్చడిలో అట్టివి పడివుంటే నాకు చెప్పమన్నాను. అంతే కాని—" అంటూ తనయిడ్లీ మెల్లగా తినడం ప్రారంభించాడు.

ఆతరవాత హోటలధికారితో వెళ్లి ఆవైదీక బ్రాహ్మడు యేంచెప్పాడోకాని, అయ్యరుగుండారు సర్దుకుంటూ వచ్చి విస్సన్నతో, "ఏమండీ సామీ, యిడ్లిఛట్నీలో తలవెండ్రుకలున్నవని చెప్తిరటనే? ఏవీ చూపండిమీ! పాపం ఆయన యిడ్లీభోజనం చెయ్యకుండానే వెళ్లిపోయినారే! ఇది మీకు బాగావుందా?" అని గద్దించడం ప్రారంభించాడు.

అయ్యరువేపు తిరిగి విస్సన్న, "నేనట్లా యేమీ అనలేదు" అన్నాడు.

"అనలేదా? మరి మీరన్నట్లు ఆబ్రాహ్మడు చెప్పాడే?"

"నేనన్నది యేమిటంటె, ఆయన తింటూవున్న పచ్చడిలో వెండ్రుకలు, కరుదూపం, యిత్యాది సామగ్రి యేమైనా ప్రమాదవశాత్తూ ఒకవేళ పడివున్నట్టయితే, నాకు తెలియజేయవలసిందని ప్రార్థించాను." అని విస్సన్న సమాధానం చెప్పాడు.

"అట్లా అనడం మీకు న్యాయంగా వుందా?"

"అదికాదండీ, అయ్యర్‌గారూ, పచ్చడివంటి పదార్థంలో సాధారణంగా మా స్వగృహాల్లోకూడా యేం జరగడం సహజం అంటే, ఆడవాళ్లు చిక్కుతీసుకున్న తలవెండ్రుకలు, మొదలైనవి మిశ్రమం అవుతూ వుంటాయి.

ఇందులో ఆశ్చర్యం యేముందీ? ఆకారణం చాత నేను ఆ బ్రాహ్మడిని అలా అడిగాను కాని, మరేం కాదు. ఒకవేళ నేను 'అయ్యా, పచ్చడిలో గుడ్డపీలికలు కాని, పళ్లుదోము పుల్లలు కాని పడ్డాయా?' అని అడిగివుంటే, అసందర్భంగా అడిగానని తలచవచ్చును. ఏమంటారా, అట్టి వస్తువులు పచ్చడిలో కలిసి పోవడం అనేది, యెన్నడూ జరగదు." అని విస్సన్న పెద్దలెక్చరు మొదలుపెట్టాడు.

అయ్యరు తెల్లబోయి చూస్తూ, యింతట్లో ఎవరో తనను పిలవగా, విస్సన్నతో యేమీ బదులు పలకక, తనలోతాను యేదో గొణుగుకొంటూ వెళ్లిపోయాడు.

విస్సన్న యిడ్లీ తినడం సమాప్తంచేసి, చెయ్యి కడుక్కున్నాడు. కాఫీ యింకా వేడిగా ఉండబట్టి, చల్లారే వరకూ కూర్చోవలసి వచ్చింది. ఊరికే కూచుంటే విస్సన్నకి ఊసు పోతుందీ? తన కెదురుగా వున్న బెంచీపైన ఒక కోమటి కూర్చుని, కాఫీతాగే ప్రయత్నంలో వున్నాడు. విస్సన్న దృష్టంతా అటువైపే వున్నది. కోమటి రెండు గుక్కల కాఫీ తాగే వరకూ నిరీక్షించి, అటుపైని విస్సన్న, "శెట్టిగారూ, మీరు కాఫీ పుచ్చుకుంటున్నారుకదా! మీ కేదీ వింతవాసన వేయలేదూ?" అని ప్రశ్నించాడు. కోమటి కనుమానం గలిగి కాఫీ పదేపదే వాసన చూడడం ప్రారంభించాడు. కొంచెంతాగి, చప్పరించి పరీక్షించాడు.

"నా కేమీ స్పృహించలేదండి. ఏం వాసన అని మీ అభిప్రాయం?"

"పోనీ, రుచిలో యేమైనా విశేషం ఉందా?" "ఏమోనండి పోల్చలేకుండా వున్నాను. అదికాక, కాఫీవేడికి గొంతుక కాలిపోతూ వుంటే, యేం నిదానం చెయ్యడం?" అన్నాడు శెట్టి.

అంతటితోనైనా ఊరుకోక విస్సన్న, "కాఫీలోకి వాళ్లు మరిగిస్తూవున్న పాలలో, చుట్టపీకగాని, పొడుముపొట్లంగాని పడివుంటుందేమో అని మిమ్మల్ని అడిగాను." అన్నాడు.

కోమటి తాగుతూవున్న కాఫీ తుప్పున ఉమ్మివేసి, పైకివెళ్లి వమనం చేసుకోవడానికి యత్నించి, వమనం కానందున కడుపులో యేదో వికారంగా వున్నదని సోడాబుడ్డి ఒకటి తాగి, అయ్యరు దగ్గిరికివెళ్లి డబ్బుచెల్లించాడు.

శెట్టి వెళ్లిపోయిన ఉత్తరక్షణం అయ్యరు కుర్చీనుంచి లేచి, ధుమధుమ లాడుతూ విస్సన్నవద్దకు వచ్చాడు. ఈపర్యాయం నిజంగా యేదో యుద్ధం జరుగుతుందని నేను చాలా భయపడ్డాను. విస్సన్నకిమాత్రం అట్టి జంకు లేక, అయ్యరు కోపంతో తనవైపు రావడం కనిపెట్టి, పకపక నవ్వడం ప్రారంభించాడు. ఆనవ్వుతో అయ్యరుకి మతిపోయింది. వెఱ్ఱెత్తిన కోతికి జెఱ్ఱి కరిచినట్లు పరిణమించింది. తోకతొక్కిన పామువలె అయ్యరు కస్సూబుస్సూ మనడం మొదలుపెట్టాడు.

"ఇదేమయ్యా, యీ అన్యాయం? హోటల్ పెట్టి యిన్ని సంవత్సరాలైంది కాని, యెన్నడూ ఇక్కడ ఎవరూ కూడా కాఫీ బాగుండలేదనికాని, తినుబడివస్తువులు రుచిగా లేవనికాని, అనివుండలేదు. మీరు నాక్లబ్బుకు

చాలా అపకీర్తి వేస్తూవున్నారే! మొదట నేమో ఛట్నీలో వెండ్రుకలున్నవని అన్నారు. ఇప్పుడు కాఫీలో పోసిన పాలు చుట్టకంపు కొడుతున్నాయని అంటున్నారు. ఇట్లాటిమాటలు కల్పించడం పెద్దమనిషి తరహాయేనా? ఇంతమంది తగుమనుష్యులు ఇక్కడ కాఫీ పుచ్చుకుంటున్నారు; ఎవరికీలేని వింతవాసన, వింతరుచి, మీకొచ్చిందా యేమిటి?

"అయ్యరుగారూ, మీరు నెమ్మదిగాను, మర్యాదగాను మాట్లాడితేనే గాని ప్రయోజనంలేదు. మీరు నామీద నిష్కారణంగా నేరం మోపుతూ వున్నారు. కాఫీ చుట్టకంపు వేస్తున్నదని నేను అనడంలేదు; ఆమాట కేవలం అసత్యం." అని విస్సన్న గట్టిగా నోరుచేసి, కన్ను లెఱ్ఱచేశాడు.

"అయితే పోనీ, మరి యేమంటిరి? మీరు శెట్టిగారితో యేమన్నారో సెలవియ్యండిమీ."

"అలా అడగండి, చెప్తాను. కాగుతూ వున్న పాలలో, చుట్టపీకలు పడేటందుకు అవకాశం కలదు గనక, అట్టి ప్రమాదం జరిగి ఉంటుందేమో అని అనుమానం కలిగి, కాఫీ తాగే ముందుగానే సందేహం తీర్చుకోవడం భావ్యం అని తలచి, శెట్టిగారితో ప్రస్తావించాను. ఇప్పుడు నేనింకా గుక్కెడు కాఫీ అయినా తాగలేదు గదా, నేను కాఫీ యేం వాసన వేస్తూవుందో ఎలా చెప్పగలను?" అని యింకా విస్సన్న యేమో చెపుతూ వుండగానే అయ్యరు, అన్నాడు.

"చాల్చాలు లేవయ్యా, పాలలో చుట్టపీకలు యెట్లా పడుతవండీ? ఎవరు విన్నా నవ్వుతారు."

విస్సన్నకి ఒళ్లు మండుకొచ్చింది. అయ్యరునేరకపోయి ఆమాట అన్నాడు.

"అయ్యార్ గారూ, పాలలో చుట్టపీకలు పడడం యెలా తటస్థిస్తుందని కదూ అడిగారు? చెప్తాను వినండి. మీవద్ద కొలువుకి కుదురుకున్న వాళ్లలో అందరూ కాకపోయినా, కొంతమందయినా చుట్టలు కాల్చేవాళ్లుఉన్నారా, లేదా? కాఫీక్లబ్బులో చేరుకున్న కుర్రవాళ్లకి అనేకమందికి, యిలాటి దుర్వ్యసనాలు చాలా ఉంటాయి. చుట్టలు, సిగరెట్లు మొదలైనవి కాల్చడం వాళ్లకి సామాన్యమైన వ్యసనం! ఇంకా కొందరు పొడుం కూడా పీలుస్తారు; కొందరు ఖారా ఖిల్లీ నములుతారు. పొయ్యివద్ద మీ మనుషులు నలుగురూ చేరి, ఫలహారాలు పక్వం చేస్తూవున్నప్పుడు చుట్టలు కాల్చరా? పొడుం పీల్చరా? ఖిల్లీలు వెయ్యరా? అన్నీ చేస్తారు. ఆసమయంలో మీరు యేదో పనిమీద ఒక కుర్రవాడిని కేకవేసి పిలుస్తారనుకోండి. వాడు అప్పుడు చుట్ట కాలుస్తున్నాడనుకోండి. ఆచుట్ట కాలుస్తూనే వాడు మీవద్దకు రాడుకద? మీ పిలుపు వినగానే వాడు చుట్టతీసి, గోడకి రాసి ఆర్పి, యేగూట్లోనో, యేదూలం మీదనో, ఎక్కడో భద్రపరచుకొని, అప్పుడు యివతలికి వస్తాడు. పొడుం పొట్లాలు దాచుకుందుకు సహితం యివే స్థానాలు. ఈరీతిగా దాచుకుని, తిరిగీ, ఆవస్తువులను ఉపయోగించడానికి వీలు చిక్కనప్పుడు, క్రమంగా అవి మరుపొస్తాయి. అట్టి చుట్టపీకలు, పొడుం పొట్లాలు మొదలైనవి, గాలికి కాసి; బల్లులు, యెలకలు సంచారం

చేస్తూవున్నప్పుడు కాని, జారి, దిగువనున్న ఫలహారాలలోను, పాలగిన్నెలోను పడుతూ వుంటాయి. అట్టి ప్రమాదాలు మనం ప్రత్యక్షంగా జరగడం చూడకపోయినా, అవి జరిగేటందుకు వీలు ఉన్నదంటారా, లేదంటారా? అంతేకాని, మీరు బుద్ధిపూర్వకంగా పాలగిన్నెలో చుట్టపీకలు వేసి మరిగిస్తారని యెవరన్నారు? ఒకవేళ యెవరైనా అనినా; అది విశ్వసించ రాని మాట. ప్రమాదాలు అన్నింట్లోను వస్తవి; రావు అని తలచడం బుద్ధి తక్కువ! పోనిగాని, అయ్యరుగారూ, మీరు యిలాటి ప్రమాదాలు జరగడం అనేది యెన్నడు విన లేదు, చూడలేదు, అని ప్రమాణపూర్తిగా చెప్పగలరా?"

"ఏమో స్వామీ, మీతో వాదనకి నేను రాలేదు. నాకిట్లాటి సంగతులేమీ తెలియవు." అని అయ్యరు మొగం చిట్లించుకున్నాడు.

"మీకు తెలియకపోతే నేను మనవి చేస్తాను కదూ, ఇటువినండి పంచదారకీ, తేనెకీ చీమలు చేరుతవి. నేతి కుండలలోను, నూనె కుండలలోను బొద్దెంకలుపడిపోతూవుంటాయి. ధాన్యం కొట్లలో యెలకలు, పిల్లులు, కావలసినంత రసాభాసు చేస్తూవుంటాయి. పప్పుల బుట్లల్లోను, అరిసెల పెట్లల్లోను, మూషక ప్రవేశం కాకుండా ఉండదు. ఇక మన వంట దినుసులలో సహితం, అనేకమైన విపరీతాలు జరుగుతూ వుంటాయి. తోటకూర, బచ్చలి ఆకు, గోంగూర, యిత్యాది ఆకు కూరలు పులుసు వండినప్పుడు, ఆకు తేళ్లు, చిట్టిమిడతలు మొదలైనవి విస్తట్లో ప్రత్యక్షం కావడం కద్దు. బూరెలూ, బొబ్బట్లూ—యిలాటి పిండి వంటల్లో కండచీమలు, యీగలు రావడం వింతకాదు. పిడకల తంపిమీద పెద్దకడవతో పాలు కాగుతూ వున్నప్పుడు, పైనుంచి బల్లులు తేళ్లు, కట్లపాములు, కూడా పడడం ఆశ్చర్యం కాదు. అనుభవం మీద యీసంగతులన్నీ మన పూర్వులు పూర్తిగా గ్రహించారు గనకనే, "ప్రతి మనిషి కూడా యేడాదికి అర్ధమణుగు తలకాయమెత్తు మాంసం భక్షిస్తాడు" అని గ్రంథాల్లో వ్రాసారు.

"స్వామీ, మీ ఉపన్యాసం ఇంక చాలించండి. మీపుణ్యం ఉంటుంది. వినడానికి నాకు కష్టంగావుంది. మీరు సెలవిచ్చినదంతా వాస్తవమే కావచ్చును; కాని మాక్లబ్బులో మాత్రం మీరు యిట్లాటి ప్రసంగం గూర్చి మాట్లాడకూడదు. కాఫీహోటలు కొచ్చేవారు వారికి కావలసిన ఫలహారం ఆరగించి వెళ్లిపోవలెనే కానీ, యిట్టిమాటలెందుకండీ?"

ఇంకా ఊరుకుంటే బాగుండదని నేను లేచి "అయ్యో, అయ్యరుగారూ, దీనికోసం యింత వివాదం, చర్చ, యెందుకండి! ఊరుకుందురూ." అని నెమ్మదిగా సమాధాన పఱచి పంపివేసి, విస్సన్నతో "కాఫీ చల్లారిపోతూవుంది. వేగం తాగేస్తే, పోదాం మనం. కాఫీక్లబ్బుకి వచ్చి, కాట్లాడడం బాగుండదు" అని చెప్పి, తొందర పెట్టాను.

ఇవతల కొచ్చిన తర్వాత, నన్ను చూసి నవ్వుతూ అన్నాడు, "ఎవడికీ మతి సుతీ ఉన్నట్లు కనిపించదే, చెప్మా! మాటాడితే తిన్నగా అర్థం కూడా చేసుకోక అసందర్భంగా ప్రవర్తిస్తారేం? నా మాటల్లో యేం దురుద్దేశం ఉన్నదని, అయ్యరు అలా కరవొచ్చాడు?"

ఏమీ అనక, నాలో నేను నవ్వుకున్నాను.




శ్రీ శివశంకరశాస్త్రి గారు [సాహితీ సమితి]

శాంత రజనీవేళ కాచ
స్వచ్ఛవర్తుల దీపికోజ్జ్వల
సదనభాగములోన జొచ్చితి
సఖుని వెనువెంటన్.

భిత్తికలపై పటము లొప్పెను
ప్రియసుహృత్కరకమలచాలిత
తూలికాంకిత వివిధరూప
ద్యుతి వితానముతో.

నలుకెలంకులు మందిరమ్మున
నయనపర్వము గాగ శోభిలె
ప్రస్తుత నూత్నవిలాస వస్తు
ప్రతతి సంపదలన్.

ముద్దుమొగమున వ్రాలి నల్లని
ముంగురులు నటియించు చుండగ
అతనికొమరుడు నన్ను డాసెను
అడుగు లిడుకొనుచున్.

రమ్ము కృష్ణా, రమ్ము రమ్మని
రయముతో నా చిన్నిబాలుని
చంక నిడుకొని ముద్దులాడితి
సంతసం బెసగన్.

తాత తాతా యనుచు బాలుడు
తనకరమ్ముల మద్గళమ్మును
గాగిలింపగ నాశరీరము
గగురుపాటొందెన్.

హర్షవశమున జాలువారిన
వశ్రు బిందువు, లాక్షణమ్మున
బాలకృష్ణుడె క్రోడగతు డగు
భంగి గనిపించెన్.

అంత జ్ఞప్తికి వచ్చె పూర్వం
బస్తమించిన నాకుమారుడు,
ఉష్ణ బాష్పకణప్రవాహం
బురలె కనుదోయిన్.

హృదయదాహము రేగుచున్నను
ఎట్టులో దిగమ్రింగి, అయ్యెడ
సరభసమ్ముగ ముద్దులాడితి
సఖుని తనుజాతున్.

అయ్యొ కొడుకా, నీవు దివమున
కరుగువేళను నాయెడందను
రవులు కొల్పిన చిచ్చు నేటికి
రాజుచున్నదిరా !

ఆప్తమిత్రుల శిశువులం గని
హర్ష మొందుచు నుండుటేనా ?
సొంతబిడ్డల నెత్తుకొనియెడి
సుఖము లేదొక్కో ?



# అనంతవర్మచోడగంగదేవుని కొర్ని శాసనములు

గిడుగు వేంకట సీతాపతి గారు, బి. ఏ., యల్. టి.

## మొదటి శాసనము; శక. 1003.

సుమారు పదిమాసముల క్రిందట గంజాం జిల్లాలో కళింగపట్టణమునకు చేరువగానున్న కొర్ని గ్రామమందు ఒకరి యింట పునాదులు త్రవ్వుతుండగా ఒకకుండ దొరికినది; అందులో రెండు తామ్ర శాసనములు కనబడినవి. అవి మన్నుతగిలి చెడిపోకుండా ఉండుటకు కుండనిండా ఊకపోసి ఆకుండ ఎవరో భూమిలో పాతిపెట్టినారు. కొర్ని గ్రామమునకు చేరువనున్న పోలాకి గ్రామమందలి బ్ర. దార్లపూడి లక్ష్మీనారాయణ శర్మగారు ఈసంగతి విని, అక్కడికి వెళ్లి, ఈశాసనములు సంపాదించి నావద్దకు పంపించినారు; వారికి నేనెంతో కృతజ్ఞుడను.

రెండున్ను అనంతవర్మచోడ గంగదేవుని భూదాన శాసనములే; రెండున్ను కొర్ని గ్రామమునకు సంబంధించినవే; రెండున్ను సంస్కృతభాషలో రచితమైనవే. వాటిలో ఒకటి శక 1003 లోను, రెండవది శక 1034 లోను పుట్టినవి; గనుక మొదటిది ఈసంచికలో ప్రకటించి, రెండవది మరియొక సంచికలో ప్రకటిస్తాను.

ఈశాసనము అయిదు రేకులు గలది. ప్రతి రేకున్ను సుమారు $8\frac{1}{4}$ అంగుళములు పొడవుగాను, 4 అం. వెడల్పుగాను ఉన్నది. రేకులన్నిటికిన్ని ఎడమవైపు అంచుకు సుమారు ఒక అంగుళము దూరముగా రంధ్రములున్నవి. వాటిగుండా ఒకరాగి కడియము అమర్చబడి ఉన్నది. ఆకడియమునకు ఈ అయిదు రేకులున్ను వ్రేలాడుతున్నవి. కడియము చుట్టుకొలత $15\frac{1}{2}$ అంగుళములు. కడియము కడ్డీచుట్టుకొలత ఒకఅంగుళము. ఈకడియము తాలూకు రెండుకొనలున్ను వలయాకారమున ఉన్న ఒక రాజముద్రికకు అంటి ఉన్నవి. ఆ రాజముద్రిక $1\frac{1}{2}$ అం. ఎత్తుగా ఉన్నది. వలయాకారమున ఉన్న దాని అడుగు భాగము 7 అంగుళముల పరిధిగలది. రాజముద్రికయందు $1\frac{1}{4}$ అం. ఎత్తుగల నందివిగ్రహమున్నది. ఆనంది విగ్రహమునకు నాలుగు వైపులను శంఖము, చామరము మొదలయినవి చెక్కినారు.

### లిపి

ఈ శాసనమందున్న లిపి ప్రాచీన నాగరి లిపి. 1896-1897 లో 'ఎపిగ్రాఫియా

ఇండికా' అనే పత్రిక సం. 4 లో మాతండ్రి గారు, రామమూర్తి పంతులుగారు ప్రకటించిన మూడవ వజ్రహస్తుని శాసనమందలి అక్షరములకును, ఈశాసనమందలి అక్షరములకును వ్రాతలో భేదములేదు. ఈక్రిందను వివరించిన విషయములు ఈ శాసనమందు చూడదగినవి:—

(1) ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఓ, ఔ, ఝ, థ—వర్ణములు ఈ శాసనమందు రాలేదు.

(2) ఉ, ం, ః, క, జ, ట, ఠ, ద, మ, య, ర, ల, వ—వర్ణములు నేటి నాగరివర్ణముల వలెనే ఉన్నవి.

(3) అ, ఆ, గ, త, న, ప, ఫ, ష, హ—వర్ణములు నేటి నాగరివర్ణములకు దగ్గరగా ఉన్నవి.

(4) ఇ, ఈ, లకు వ్రాతలో భేదము కనబడలేదు. (పం. 40, 44, 50.)

(5) బ, వర్ణముండవలసిన-చోట వకారమే కనబడుతున్నది. (పం. 7, 12, 20, 24, 26, 28, 37, 40, 41, 46, 50, 51.)

(6) ద, డ లకు వ్రాతలో భేదము అత్యల్పము. (పం. 1, 5.)

(7) లణలకు భేదము, కొంచెమున్నా తెలుసుకోవడము కష్టము. లకారమునకు నెత్తిమీద ఉండే అడ్డుగీత ణకారమునకు ఉండదు. ణ్ణ,లు-వీటికి భేదము అత్యల్పము. (పం. 13, 47.)

(8) నవర్ణము ఈ శాసనములో రెండు విధములుగా ఉన్నది. (పం. 1 లోని నకారములు, మిక్కిలి ప్రాచీనమైన లిపి ననుసరించినవి. పం. 13-14 లోని నకారములు నేటినాగరి నకారములను పోలి ఉన్నవి.)

(9) గుణింతములో + ఆ, + ఇ, + ఈ, + ఉ, + ఊ, + ఋ—ఇవి నేటినాగరి గుణింతములో ఉన్నట్లు ఉన్నవి.

(10) గుణింతములో ఏత్వము, ఇంచుమించుగా ఇత్వము వలెనే ఉంటుంది; అందుచేత కొన్ని-చోట్ల సందర్భము చూచుకొంటేనేకాని ఏదో తెలుసుకోలేము. (తృకుటే-పం. 42. ఇది తృకుటి వలెనే ఉన్నది.)

(11) హల్లులగుణింతము చాలామట్టుకు నేటి నాగరిగుణింతమును పోలి ఉన్నది.

(12) ంక, ంచ, ంట, ంత మొ. సంయుక్త వర్ణములలో వర్గాక్షరములు సాధారణముగా వాటి అనునాసికాక్షరములతో కలిసి ఉంటవి; గాని, కొన్ని-చోట్ల అనుస్వారము కనబడుతున్నది. జకారమునకు మారుగా (గంగా పం. 28; తోనేంగి పం. 42); నకారమునకు మారుగా (సంధి. పం. 50.)

(13) ఞ, ణ—వీటికి మారుగా అనుస్వార మెక్కడను కనబడలేదు.

(14) పవర్గాక్షరములున్ను, య, ర, ల, వ, శ, ష, స, హ లున్ను సాధారణముగా బిందువుతో చేరి ఉంటవిగాని మవర్ణముతో చేరి ఉండవు; గాని, మూడు-చోట్ల మాత్రము మవర్ణముతో కలిసి ఉన్నవి. చూ. మ్వ (పం. 52), మ్బ (పం. 20), మ్వ (పం. 53.)

(15) వాక్యాంతమందు ఒక్క చోటనే మకారము పొల్లుకనబడినది. (పం.17); తక్కిన

చోట్ల (అనుస్వార)బిందువున్నది; ఈబిందువు క్రిందను హంసపాదమువంటి గురుతు కనబడుతున్నది. ఇది వాక్యాంతమందు వచ్చే అనుస్వారమును సూచించును గాబోలు. ఈగురుతు పదమధ్యమందుగాని వాక్యమధ్యమందుగాని వచ్చే (అనుస్వార) బిందువు క్రింద కనబడదు.

(16) ఇ్చ, ఇ్ఛ లలో చ ఛ లు మొదటను వ్రాసి, ఇ కారము దాని తర్వాతను వ్రాయడము ఆకాలమందు ఆచారము. అయితే, ఇ ముందు కనబడే చ కారమునకున్ను, తక్కిన చోట్లనున్న చ కారమునకున్ను వ్రాతలో కొద్దిగా భేదము కనబడుతున్నది.

(17) వెలపల గిలకతో ఉన్న హల్వర్ణములకు ద్విత్వము వస్తుంది. ఉ. సర్వ్వ, వివర్జ్జిత, ఆచన్ద్రార్క్క (పం. 35). అయితే పవర్ణమునకు మాత్రము ద్విత్వము రావడంలేదు. వర్ష (పం. 13, 18, 19.)

(18) వెలపలగిలకతో ఉన్న భ కారమునకు ద్విత్వము వచ్చినప్పుడు భవర్ణము క్రింద భవర్ణము కనబడుతున్నది. (పం. 5, 53.)

(19) శ వర్ణమునకు మారుగా స వర్ణము రెండుచోట్ల ఉన్నది. (పం. 40, 50.)

(20) "సముజ్వల" (పం. 7)లో జ కారమునకు ద్విత్వము రావలసి ఉండెను. ఐతే ఈపొరపాటు ఈ శాసనమందేకాక ఇతర శాసనము లన్నిటలోను ఉన్నది.

(21) పొరపాటున పం. 51 లో మ్, పం. 44 లో విసర్గము మరచినారు.

భాష

ఈ శాసనమునందలి భాష మొదటనుండి చివరవరకున్ను సంస్కృతము; ఇందులో అయిదుశ్లోకములు మాత్రమే కలవు: ఒక వంశస్థ, ఒక స్రగ్ధర, మూడు (అనుష్టుభ్) శ్లోకములు. ఈదిగువ వివరించిన స్థలములలో సంధిసూత్రములు పాటించలేదు:—హస్తః యో (పం. 15), నిరతేభ్యః త్రి (పం. 39), బ్రాహ్మణేభ్యః ధారా (పం. 40), ఆగ్నేయతః వల్మీక (పం. 43), పశ్చిమతః ఈషత్ వక్రం (పం. 44), పశ్చిమతః + వన.

ఈదిగువ నుదాహరించిన వాక్యమందు క్త్వార్థక క్రియకు అన్వయము సరిగాలేదు. "తత్పశ్చిమతః ఈషత్ వక్రం గత్వా మరీచవృక్షపఙ్క్తి" (పం. 44)

పం. 42 లో 'తృకుటే' అనిన్ని, పం. 45, 47 లో 'తృకూటే' అనిన్ని, పం. 49లో 'తృకూటం' అనిన్ని, పం. 51లో 'తృకూట' అనిన్ని ఉన్నది. 'తృకూట' శబ్దము నేను చూచిన నిఘంటువులలో కనబడలేదు. సందర్భమునుబట్టిచూడగా మూడుఎల్లలు కలిపిన చోటు అని అర్థమిచ్చే 'ముమ్మొలగుట్ట'కు సమానార్థమందు కల్పితమయిన సంస్కృత శబ్దమయి ఉంటునని తోస్తున్నది. *

* మయ్యనికట్టు, ముయ్యనికుట్టు, ముయ్యలకుట్ట: ఈశబ్దములు కొన్ని శాసనములందు దేశభాషలో ఎల్లలు వివరించినప్పుడు కనబడుతున్నవి. ఎపి. ఇం. సం 4. పుట 96 లో పిఠాపురము మల్లిదేవుని శాసనము ప్రకటిస్తూ మయ్యని, ముయ్యల రూపాంతరము లని సమానార్థము లని హుల్ట్ జ్ దొరగారు వ్రాసినారు. కాని, 'మయ్యని' 'ముమ్మొల'యొక్క రూపాంతరము కాదనిన్ని, అదిసంస్కృత 'మధ్య'-ప్రాకృత- మజ్జ, మయ్య అయి ఉండు

దానమిచ్చిన ఖోన్న (కొర్ని)గ్రామము నకు ఎల్లలు వివరిస్తూ మూడుచోట్ల(పం. 43, 44, 45) మరీచ వృక్షమును పేర్కొన్నారు. ఇది ఏవృక్షమో తెలియదు; మిరియము అయి ఉండదు. 'పిప్పల'కుపర్యాయపదముగా'మరీచ' వాడుకలో ఉండిఉంటే, రావిచెట్టు అయి ఉంటుంది.

'గతాణ'అనేశబ్దము నాలుగుసార్లు వచ్చినది(పం.42,48,49,51); అర్థం స్పష్టంగా లేదు; నిఘంటువులలో చెప్పిన అర్థం పొందదు; సందర్భమును బట్టి చూడగా 'పుంత'కు సంస్కృత పదముగా వాడినట్లు కనబడుతున్నది. గంజాం, విశాఖపట్టణం జిల్లాలలో పుంతకు మారుగా 'గోర్జ' అంటారు. పశువులు మొదలయిన వాటి నడకకే ఉపయోగమయినది నడగోర్జ, వానకాలములో నీరు ప్రవహించేదయితే నీటి గోర్జ.

'లక్షసాలి'(పం. 55)అక్షశాలిఅని ఉండవలెను. దీని తద్భవమే కాబోలు 'అగసాలీ అనగా రాగిపట్టాలు మొదలయిన వాటి మీదను అక్షరములు చెక్కడము పని చేసే వాడని అర్థము.

రాజవంశావళి

కళింగరాజ్య మేలినరాజులు రెండు వంశములవారుగా ఏర్పడిఉన్నారు. ఈ రెండువంశములలోను మొదటిది " ప్రాచీనగాంగవంశ " మనిన్ని, రెండవది " తర్వాతి గాంగవంశ " మనిన్ని ఇంతవరకును ఈవిషయమునుగురించి వ్రాస్తూఉన్న పండితు లందరున్ను అభిప్రాయ పడిఉన్నారు. అయితే, వీటిలో మొదటిది 'గాంగవంశము'; రెండవది'గంగవంశము'. రెండవదానికి 'గాంగవంశ'మన్న పేరు పెట్టుటకు ఆధారము కనబడదు. మొదటివంశపురాజులు హస్తివర్మ, ఇంద్రవర్మ, దేవేంద్రవర్మ మొదలయినవారు. వీరి శాసనము లన్నిటిలోను "గాంగామలకులతిలకో."అని ఉంటున్నది. రెండవవంశపురాజులు వజ్రహస్తుడు, అనంతవర్మ చోడగంగదేవుడు మొదలయినవారు; వీరిశాసనము లన్నిటిలోను "గంగానామన్వయ" అని ఉంటున్నది. మొదటివంశపు, అనగా గాంగ వంశపురాజులగోత్రము ఎక్కడనూ చెప్పలేదు; రెండవవంశపు అనగా గంగవంశపు రాజుల గోత్రము ఆత్రేయగోత్ర మని వజ్రహస్తుని శాసనములందున్ను, అనంతవర్మచోడగంగుని శాసనములందున్ను ఉన్నది.

గాంగవంశపురాజులు తమతమ కాలములను సూచించవలసివచ్చినప్పుడు " ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరములు" అని తమవంశపు శకమునే పాటిస్తూవచ్చినారు గాని, శాలివాహనశకమునుగాని విక్రమార్కుని శకమును గాని పాటించలేదు. వజ్రహస్తుని శాసనములందున్ను అనంతవర్మ చోడగంగుని శాసనములందున్ను శకవర్షములు చెప్పినారు. ఈ విషయములన్నీ పరిశీలించగా మొదటిగాంగ

ననిన్ని, తెలుగులో'ని' ప్రత్యయముతో కలిసి విశేషణముగా ఉంటుందనిన్ని, ఇప్పటికిన్ని 'ఊరిమధ్యను' అనుటకు "ఊరిమయాన" అని అంటారనిన్ని మాతండ్రిగారి అభిప్రాయము. 'ముయ్యెల', 'ముయ్యల' అయి రానురాను 'మూల' కూడా అయినట్లు కనబడుతున్నది. మూడింటికి నడుముగా ఉన్నదానికి 'మూలగట్టు' అని అంటున్నారట.

వంశమువారున్ను తర్వాతిగంగవంశమువారున్ను ఒక్కసంతతివా రయినట్లు కనబడదు.

ఆత్రేయ గోత్రము గల ఈ గంగవంశ రాజులవంశావళి రెండువిధములుగా కనబడుతున్నది. శక 960 లో రాజ్యాభిషిక్తుడయిన వజ్రహస్తుని తామ్రశాసనములె ఇంతవరకు మనకు దొరికిన ఈ గంగవంశరాజుల తామ్రశాసనములలో మొట్టమొదటివి. వజ్రహస్తుని శాసనములం దన్నింటను అతని తాతకు ముత్తాత అయిన గుణమహార్ణవమహారాజు మొదలుకొని వంశావళి ఉన్నది. ఆవంశానుక్రమమే ఇప్పుడు నేను ప్రకటించిన అనంతవర్మచోడగంగుని శాసనమందున్ను ఉన్నది. అంతేకాక దీనిలో ఆవజ్రహస్తుడు 33 సంవత్సరములున్ను పిమ్మట అతని కుమారుడు, రాజరాజు 8 సంవత్సరములున్ను రాజ్యము చేసినారనిన్ని, పిమ్మట రాజరాజు కుమారుడు అనంతవర్మ శక. 999 లో రాజ్యాభిషిక్తుడయినా డనిన్నికూడా చెప్పినారు. ఈ వంశానుక్రమమే అనంతవర్మచోడగంగుని శాసనములలో మరి రెండింటియందున్ను కనబడుతున్నది. (ఒకటి శక 1003 నాటిది, మరియొకటి శక 1057 నాటిది. ఇవి ఇండియన్ ఆంటిక్వెరి సం. 18 లో ప్రకటితమైనవి.) నాకు దొరికిన రెండవ కొర్ని శాసనములో చాలపెద్ద వంశానుక్రమమున్నది; గుణమహార్ణవ మహారాజుకు పూర్వము సృష్ట్యాదినుండిన్ని రాజ్యము చేసిన రాజులగురించిన విషయములుకూడా ఉన్నవి. ఇంత పెద్దవంశానుక్రమము అనంతవర్మచోడగంగుని శాసనములలో మరియొకదానిలోకూడా ఉన్నది. అది శక 1040 నాటిది. ఇండియన్ ఆంటిక్వెరి సం. 18 లో ప్రకటితమైనది. ఈ పెద్దవంశానుక్రమమునకున్ను, చిన్నవంశానుక్రమమునకున్ను కొన్ని విషయములలో వైషమ్యము కనబడుతూ ఉన్నది. ఏ శాసనమం దున్నది సత్యమో చెప్పుటకు వీలులేదు. ఈ విషయమునుగూర్చిన్ని కళింగనగర మేది అనే విషయమును గూర్చిన్ని రెండవ కొర్ని శాసనము ప్రకటించినప్పుడు చర్చించ దలచుకొన్నాను గనుక ఇక్కడ ఇంతకన్న అధికముగా వ్రాయడం లేదు.

దానము

ఈ శాసనములో అనంతవర్మచోడ గంగమహారాజు శక 1003 లో మీనమాసమందు బహుళపంచమీ ఆదివారమునాడు (అనగా క్రీ. శ. 1082 మార్చినెల 27 తేదీని *) ఖోన్నగ్రామము 300 గురు బ్రాహ్మణులకు దానముచేసినట్లున్నది. దానముచేసిన గ్రామమునకు ఎల్లలు వివరిస్తూ మరి అయిదు గ్రామములను పేర్కొన్నారు. ఈ ఆరుగ్రామములున్ను ఎక్కడ నున్నవో నిర్ణయించవచ్చును. దానమిచ్చిన ఖోన్నగ్రామమునకు నేడు 'కొర్ని' యని పేరు. ఈ కొర్నిగ్రామములోనే ఈ తామ్రశాసనములు దొరికినవి. ఖోన్నగ్రామమునకు ఎల్లలుగా చెప్పిన గ్రామములు కొర్నిగ్రామము చుట్టును శాసనములో చెప్పినట్లే ఇప్పుడున్ను ఉన్నవి. రెండవ కొర్ని శాసనములో ఈ దానము ఉదాహృతమయి

* పర్లాకిమిడి కాపరస్థులు శ్రీయుత నీలమణి పాణిగ్రాహి సిద్ధాంతిగారు ఈ తేదీ గణితంచేసి చెప్పినారు.

ఉన్నది. అందులో ఈ గ్రామముల పేర్లు మరి యొకసారి చెప్పినారు. గ్రామనామముల ఉచ్చారణలో కొద్దిగా భేదము కనబడుతున్నది. అది ఈ క్రింద పట్టికలో చూపిస్తున్నాను.

| శక. 1003. శాసనములోని పేళ్లు | శక. 1034. శాసనములోని పేళ్లు | ఇప్పటి పేళ్లు |
|---|---|---|
| ఖోన్న | ఖోన్న | కొర్ని |
| హోంబరవల్లి (పం.42) (-వేల్లి)(పం.50) | ఓం బరవేల్లి | ఒమరవెల్లి |
| తోనేంగి | తోనేంగి | తోణంగి |
| ఖోల్లేర | ఖోల్లిర | కొర్లాం * |
| తూలువు | తూలువు | తూలుగు |
| గార | గార | గార |

కొర్ని శాసనముల రెండింటను దాన ప్రతిగ్రహీతలు బ్రాహ్మణులు. ఈ శాసనములో 'యజనయాజనాది షట్కర్మ నిరతులయిన 300 బ్రాహ్మణులకు' అనిన్ని రెండవ శాసనములో 'ఖోన్నగ్రామ నివాసులయిన బ్రాహ్మణులకు' అనిన్ని చెప్పినారు. ఇప్పుడు ఈగ్రామముల ఆరింటిలో ఎక్కడను ఒక్క బ్రాహ్మణుడైనా లేడు. ఆ కాలమందు అంత మంది బ్రాహ్మణులు ఉండిరిగదా! వారి సంతతివారు ఏమయినారు? అందరును నశించిపోయి నారని గాని దేశాంతరము పోయినారని గాని చెప్పుట యుక్తియుక్తము గాలేదు. ఈగ్రామములందున్ను, ముఖలింగమందున్ను ఈజిల్లాలో ఇంకా మరికొన్ని ఇతరస్థలములందున్ను కాళింగులనేకులున్నారు. వీరు యజ్ఞోపవీతము ధరిస్తున్నారు; వీరికి ఉపనయనసంస్కారం వేదోక్తముగా కాకపోయినా, పురాణోక్తముగానైనా ఉన్నది; పరాశర, భారద్వాజ మొదలయిన గోత్రము లున్నవి. వీరిలో కొందరు మత్స్య మాంసాహారము విడిచిపెట్టినారు. ఆచారవ్యవహారములలో బ్రాహ్మణుల వలెనే కనబడుతున్నారు. వీరింటిపేళ్లు సూర, బసవ మొదలయినవి. ముఖలింగేశ్వరాలయము లోఅర్చకులుగా మొదటనుండిన్ని ఇప్పటి కాళింగుల కుటుంబములవారే ఉన్నట్లు నిదర్శనములున్నవి. 12వ శతాబ్దమున ఒరిస్సాదేశము కళింగరాజు వశమయినప్పుడు ముఖలింగము నుండి అర్చకుల కుటుంబ మొకటి భువనేశ్వరాలయమునకు వెళ్లినట్లు ప్రతీతికలదు. ఆ కుటుంబము సంతతివారు (బసవవారు) నేటికిని అక్కడ అర్చకులుగా ఉన్నారట. వారు ఓఢ్రి బ్రాహ్మణులుగా పరిగణింపబడుతున్నారట. ఈ విషయములన్నీ పరిశీలించిచూడగా నేటి కాళింగులలో ఆనాటి బ్రాహ్మణుల సంతతివారు ఉండవచ్చునని ఊహించుటకు అవకాశము కనబడుతున్నది.

* ఖోల్లిరగ్రామం, రానురాను, ఖొల్లిరగాం, ఖొర్లగాం, కొర్లగాం, కొర్లాం అయి ఉంటుంది.

# మూ ల ము ౧



మొదటిరేకు, రెండవపెడ

1. ఓం-౨. స్వస్తి శ్రీమతా మఖిలభువన³ వినుతనయవినయదయాదానదాక్షిణ్య సత్య
2. శౌచశౌర్య్య ధైర్య్యాదిగుణరత్నపవిత్రకాణా మాత్రేయగోత్రాణాం
3. విమలవిచారాచారపుణ్యసలిలప్రక్షాలితకలికాల కల్మషమషీ
4. ణాం మహామహేన్ద్రాచలశిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః సకల
5. భువననిర్మ్మాణైకసూత్రధారస్య శశాఙ్కచూడా మణే ర్భగవతో
6. గోకర్ణ్ణస్వామినః ప్రసాదా త్సమాసాదితైకశఙ్ఖ భేరీపఞ్చమహా
7. శబ్దధవలచ్ఛత్ర హేమచామరవరవృషభలాఞ్ఛనసముద్వల⁴సమస్తసామ్రా
8. జ్యమహిమ్నా మనేకసమరసఙ్ఘట్టనసముపలబ్ధవిజయలక్ష్మీసమాలి

---

౧. నాకుదొరికిన రేకుల ననుసరించి

౨ ఓం అనుటకు ౘ గురుతున్నది

౩. 'భువన' అని ఉండవలెను.

౪. 'సముజ్జ్వల' అని



రెండవ రేకు; మొదటి పెడ

9. జ్గితోత్తుఙ్గ భుజదణ్డమణ్డితానాం త్రికలిఙ్గమహీభుజాం గఙ్గా
10. నా మన్వయ మలఙ్కరిష్ణో ర్విష్ణోరివ విక్రమాక్రాన్తధరామణ్డలస్య
11. గుణమహార్ణవమహారాజస్య పుత్రః॥౦॥ శ్రీవజ్రహస్తదేవ శ్చతుశ్చ
12. త్వారింశత మబ్దకాన్ క్షితి మరక్షీత్॥ తత్తనయో గుణ్డమరాజా వ
13. ర్షత్రయ మపాలయత్॥ తదను తదనుజః కామార్ణవదేవః ప
14 ఞ్చత్రింశద్వర్షాణి॥తస్యానుజో వినయాదిత్యః సమా స్తిస్రః
15. ॥తతః కామార్ణవతనయో వజ్రహస్తః యోమదగలిత గణ్డాన్ గ
16. జాన్ సహస్ర మర్థిభ్యః సమదాత్ సపఞ్చత్రింశత మబ్దకాన్

౧ 'హిం' మొదటచెక్కి 'ది'గా దిద్దినట్లున్నది



రెండవ రేకు, రెండవ పెడ

17. ॥తత స్తదగ్రసూనుః కామార్ణ్ణవదేవోర్ద్ధ సమామ్॥తత స్తదనుజో

18. గుణ్డమహీపతి స్త్రీణి వర్షాణి॥ తదను తస్య ద్వైమాతురో మధుకా

19 మార్ణ్ణవ ఏకోనవింశతివర్షాణి॥తతః కామార్ణ్ణవా ద్వైదు

20. మ్యాన్వయసముద్భవాయాం వినయమహాదేవ్యాం జాతః శ్రీవజ్ర

21. హస్తదేవో మోదివః పత స్త మతిభీషణ మశనిం శస్త్రైర్భి

22. జఘాన స త్రయస్త్రింశత మబ్దకా నవని మపాలయత్॥[1]తతస్తు తస్యా

23. త్కుంభకారిమర్ద్దన స్సరాజరాజక్షితిపః క్షితిం సమాః॥అ

౧ వంశేష్వన్యతమ



మూడవరేకు, మొదటిపెడ

24. రక్షి దష్టో వరుణాలయాంబరా న్నిధి గ్గుణానా న్నిధిపాలసన్నిభః॥

25 [౧]తత్రో రాజేన్ద్రవోలస్య తనయా రాజసున్దరీ రాజ్ఞ స్తస్యాగ్రమహిషీ స

26. తీ సుత మసూయత॥ [౨]శాకాబ్దే నన్ద రన్ధ్రగ్రహగణగణితే కుంభస

27. ంస్థే దినేశే శుక్లే పక్షేతృ తీయాయుజి రవిజదినే రేవతీ

28. భే న్నృయుగ్మే లగ్నే గంగాన్వ యాంబుజవనదినకృ ద్వి

29. శ్వ విశ్వంభరాయా శ్చక్రం సంరక్షితుం సద్గుణనిధి రధిప శ్చో

30. డగఙ్గో భిషిక్తః॥౧॥ కలిఙ్గనగరా త్పరమమాహేశ్వర

---

౧ శ్లోకము.

౨. స్రగ్ధర.



మూడవరేకు; రెండవపెడ

31. పరమభట్టారక మహారాజాధిరాజ త్రికలిఙ్గాధిపతిః (శ్రీ)
32. మదనస్తవమ్మాళ్ చోడగఙ్గదేవః కుశలీ సమస్తామాత్యప్రముఖ జ
33. నపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి విదిత మస్తు భవతాం॥ వరా
34. హవర్తన్యాం ఖోన్నగ్రామ శ్చతుస్సీమావచ్ఛిన్న స్సజల
35. స్సర్వపీడా వివర్జిత మాచన్ద్రార్క్కక్షితి సమకాలంయా
36. వన్మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాయశోభివృద్ధయే॥ హారనయన
37. వియద్గగనచన్ద్రగణితే శాకాబ్దే మీనమాస కృష్ణప(చ)[౧]

౧. 'ఇచ్చ'లోని 'చ' ఇక్కడ ఉన్నది, 'ఇ' తర్వాతిరేకులో మొదటిపంక్తి మొదటిఅక్షరముగా ఉన్నది. ఇక్కడ ఉన్న 'చ'వర్ణమునకున్ను తక్కినచోట్లనున్న 'చ'వర్ణమునకున్ను వ్రాతలో కొద్దిగా భేదమున్నది.



నాలుగవ రేకు; మొదటి పేడ

38. ఇచ్ఛమ్యా మాదిత్యవారే సామాన్యతో నానాగోత్రేభ్యః యజనయా

39. జనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహ షట్కర్మ్మ నిరతేభ్యః త్రి

40. ౧సత బ్రాహ్మణేభ్యః ధారాపూర్వ్వక మస్మాభి ర్దత్త ఇతి॥ అస్య

41. గ్రామస్య సీమాలిఙ్గాని లిఖ్యన్తే। పూర్వ్వతః ఖోన్నహాంబ

42. రవల్లి తో నేఙ్గిగ్రామాణాం త్రికుటే౨తో నేంగిగ్రామ వక్రగ

43. త్తా। ఆగ్నేయతః వల్మీకసహితమరీచవృక్షః॥ తత్పశ్చిమ

44. తః ఈషత్ వక్రంగత్వా మరీచవృక్షపఙ్క్తి ౩ తతః ఖోన్నతో

---

౧. 'త్రిశత' అని ఉండవలెను.

౨. 'త్రికూటే' అని ఉండవలెను కాబోలు:

3. 'పఙ్క్తిః' అని ఉండవలెను.



నాలుగవ రేకు; రెండవ పెడ

45. నేఙ్గిఖోల్లేర గ్రామాణాం త్రికూటే వల్మీకసహితమరీచవృక్ష

46. ః।దక్షిణస్యాం। దిశి బృహద్వల్మీకః।తత్పశ్చిమతః వనరాజికా

47. నైరి[1]త్యాం ఖోన్నఖోల్లేరతూలువుగ్రామాణాం త్రికూటే తనువాపి

48. కా గర్త్తా చ।పశ్చిమాయాం గర్త్తా।వాయవ్యతః ఖోన్నతూలువు[2]గా

49. రగ్రామాణాం గర్త్తాతీరత్రికూటం।ఉత్తరస్యాం తటాకద్వ

50. య సేతుసంధిః॥ ఈసా[3]న్యతఃఖోన్నగారహో[4]ంబర వేళ్లిగ్రామా

51. ణాం తో నేఙ్గిగర్త్తాతీరత్రికూట[5]॥[6]బహుభిర్వ్వసుధా దత్తా రాజభి స్సగ

52. రాదిభిః॥యస్యయస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలం॥[7]స్వదత్తాం ప్పర

౧. 'నైరృత్యాం' అని ఉండవలెను.

౨. 'తూలువు'లో 'వు' చెక్కడము మొదట మరచిపోయి 'లు' తర్వాత మీదను హంసపాదము పెట్టి క్రిందను పంక్తి దిగువను చిన్న 'వు' చెక్కినట్లున్నది.

౩. 'ఈశాన్యతః' అని ఉండవలెను.

౪. 42-వ పంక్తిలో 'హోంబరవల్లి' అని ఉన్నది.

౫. 'త్రికూటం' అని కాబోలు ఉండవలెను.

౬-౭. శ్లోకములు.



అయిదవ రేకు; మొదటిపేట

53. దత్తాం వ్వా యో హరేత వసున్ధరాం।స విష్ఠాయాం కృమి భ్భూత్వా పితృభి స్స
54. హ పచ్యతే॥మహాశ్లోయస్థసన్ధివిగ్రహిమాపురయసూనునా దామోదరే
55. ణ లిఖితం॥మాహాక్షసా[1]లివల్లే మోజేనోత్కీర్ణం[2] తః[3] ॥

తెలుగు తర్జుమా

(పంక్తులు1—11) ఓం. ప్రపంచమందంతటను పొగడ్తగన్న నయము, వినయము,దయ, దానము, దాక్షిణ్యాము, సత్యము, శౌచము, శౌర్యము, ధైర్యము మొదలయిన గుణరత్నములచేత పవిత్రమైనటువంటిన్ని; ఆత్రేయ గోత్రమందు పుట్టినటువంటిన్ని; నిర్మలమైన తలంపులు, ఆచారములు అనే పవిత్రజలములచేత కలికాలకల్మషమనే మసిని కడిగివేసినటువంటిన్ని మహామహేంద్రగిరిశిఖరమందు ప్రతిష్ఠితుడై, చరాచర ప్రపంచమునకు గురువుగాను, సమస్తభువన నిర్మాణమునకు ముఖ్యసూత్రధారుడుగానుఉండి,చంద్రశేఖరుడున్ను భగవంతుడున్ను ఐన గోకర్ణస్వామియొక్క అనుగ్రహమువల్ల ప్రాప్తమైన శంఖము, భేరి, పంచమహాశబ్దములు, తెల్లనిఛత్రము,బంగారు చామరము, శ్రేష్ఠమైన వృషభ చిహ్నము— వీటిచేత ప్రకాశిస్తూఉన్న. సమస్తసామ్రాజ్య మహిమలున్ను, కలిగినటువంటిన్ని; అనేక యుద్ధములసంఘర్షణవల్ల(తాము)పొందిన విజయలక్ష్మి కౌగిలించుకొన్న భుజదండములచేత అలంకృతులయినటువంటిన్ని; త్రికళింగ మనే భూమిని అనుభవిస్తూ ఉన్నటువంటిన్ని గంగులయొక్క వంశమును అలంకరించి, విక్రమముచేత విష్ణువువలెనే భూమండలమును ఆక్రమించిన గుణమహార్ణవ మహారాజు గారి పుత్రుడు,

(పం. 11—16) శ్రీవజ్రహస్త దేవుడు 44 సంవత్సరములు రాజ్యమేలినాడు. అతని కుమారుడు, గుండమరాజు 3 సంవత్సరములు పరిపాలనము చేసినాడు. తర్వాత, అతని

౧. '—శాలి' అని ఉండవలెను.
౨. '—నోత్కీర్ణం' అని ఉండవలెను.
3. 'తః' అంటే తోక అని ఆప్టేనిఘంటులో ఉన్నది; శాసనం సంపూర్ణం అని తెలియజేయుటకు కాబోలు సంజ్ఞగా ఉన్నది.

తమ్ముడు, కామార్ణవదేవుడు 35 సంవత్సరములున్ను, పిమ్మట, అతనితమ్ముడు, వినయాదిత్యుడు 3 సంవత్సరములున్ను (రాజ్య మేలినారు). తర్వాత కామార్ణవుని కుమారుడైన వజ్రహస్తుడు* మదగలితగండములు గలఏనుగులను వేయింటిని అడిగినవారికి దానముచేసినవాడు, 35 సంవత్సరములు (రాజ్య మేలినాడు).

(పం. 17–22) తర్వాత, అతని పెద్ద కుమారుడు కామార్ణవదేవుడు అర్ధసంవత్సరమున్ను, పిమ్మట అతని(కామార్ణవుని) తమ్ముడు, గుండమహీపతి 3 సంవత్సరములున్ను, అటుపిమ్మట అతని సవతితల్లి కుమారుడయిన మధుకామార్ణవుడు 19 సంవత్సరములున్ను రాజ్యమేలినారు. పిమ్మట కామార్ణవునికి వైదుంబవంశోద్భవయైన వినయమహాదేవివల్ల కలిగిన శ్రీ వజ్రహస్తదేవుడు స్వర్గమునుండి అతిభయంకరముగా పడుతూ ఉన్నటువంటి పిడుగును ఖడ్గముతో ఖండించినవాడు, 33 సంవత్సరములు అవని పాలించినాడు.

(పం. 22–24) పిమ్మట, అతని కుమారుడు, రాజరాజు అనే భూపాలుడు—శత్రువులను మర్దించినవాడు, సద్గుణములనిధి, కుబేరుని వంటివాడు—సముద్రపరివృత మయిన భూమిని పరిపాలించినాడు.

(పం. 25–26) పిమ్మట, రాజేంద్రుని చోళుని కూతురైన రాజసుందరి అతనికి (రాజరాజుకు) పట్టపుదేవియై కుమారుని కనినది.

(పం. 26-30) శక 999 లో సూర్యుడు కుంభమం దుండగా, శుక్లపక్షమి, తదియనాడు, శనివారమున, రేవతినక్షత్రము రాగా, మిథునలగ్నమందు గంగవంశ పద్మవనమునకు సూర్యుడున్ను, సద్గుణములకు నిధిన్ని అయిన చోడగంగమహారాజు భూచక్రమును సంరక్షించుటకు రాజ్యాభిషిక్తు డయినాడు.

(పం. 30-33)పరమమాహేశ్వరుడున్ను, పరమభట్టారకుడున్ను, మహారాజాధిరాజున్ను, త్రికళింగాధిపతిన్ని అయిన శ్రీమదనంతవర్మచోడ గంగదేవుడు కుశలియై సమస్తమయిన అమాత్యప్రముఖ జనపదులనున్ను పిలిపించి ఆజ్ఞాపించినాడు :

"మీ కందరికీ తెలియవలసినది ఏమంటే:—

(పం. 33-40) వరాహవర్తనియందున్న ఖోన్నగ్రామము, నాలుగువైపులను ఏర్పరచిన ఎల్లల మధ్యమందు అవచ్ఛిన్నమై ఉన్నది. సమస్తజల సహితంగా, పన్నులు మొదలయిన బాధలు ఏమీ లేకుండాచేసి, మాతలిదండ్రుల పుణ్యయశోభివృద్ధికొరకున్ను మా పుణ్యయశోభివృద్ధికొరకున్ను శక 1003 వర్షములు కాగా మీనమాసమందు బహుళపంచమీ ఆదివారమున యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహ షట్కర్మనిరతులైన నానాగోత్రముల బ్రాహ్మణులకు 300 మందికి

* ఇతనికే "అనియంకభీముడు" అనేపేరు ఉండినట్లు క్రీ. శ. 1038 లో రాజ్యాభిషిక్తుడయిన వజ్రహస్తుని శాసనములవల్ల స్పష్టము.

ఆచంద్రార్కం(అనుభవించగలందులకు) ధారా పూర్వకంగా దానము చేసినాము."

(పం. 40-51) ఈ గ్రామమునకు ఎల్లలు వ్రాస్తున్నాము. తూర్పున, ఖోన్న హాంబర వల్లి తోనేంగిగ్రామముల మూడింటికీ సంధిగా పోయే తోనేంగిగ్రామముపుంత (గోర్జ). ఆగ్నేయమందు, పుట్టతో కలిసిఉన్న మరీచ వృక్షము; దానికి పడమటివైపున కొంచెము వంకరగాపోతే మరీచవృక్షపంక్తి; దానిప్రక్కను ఖోన్నతోనేంగి ఖోల్లేరగ్రామముల మూడింటికీ నడుమను పుట్టతో కలిసిఉన్న మరీచ వృక్షము; దక్షిణమందు, పెద్దపుట్ట; దానికి పడమటను, అడవులపంక్తి. నైరృతిని, ఖోన్న ఖోల్లేర తూలువుగ్రామముల మూడింటికిని నడుమను బందాను, పుంతాను. పడమటను, పుంత. వాయవ్యమందు, ఖోన్నతూలువుగార గ్రామముల మూడింటితాలూకుపుంత; *ఏటిఒడ్డున ముయ్యేలసంది. ఉత్తరమందు, రెండు తటాకముల నడుమనున్న గట్టు. ఈశాన్యమందు, ఖోన్నగార హాంబరవెల్లిగ్రామముల మూడింటికీ నడుమగాపోయే తోనేంగిపుంత; * ఏటిఒడ్డున ముయ్యేలసంది.

(పం. 51-54) సగరాదిరాజు లనేకులు భూదానము చేసినారు. భూమి ఏయేకాలము లందు ఎవరెవరివశమై ఉంటుందో ఆయా కాలములందు వారివారికి తత్ఫలము లభ్యమవుతూ ఉంటుంది. స్వదత్తమయినా పరదత్తమయినా భూమిని ఎవడు హరిస్తాడో వాడు మలమందలి పురుగై తనపెద్దలతో కలిసి దగ్ధమవుతాడు.

(పం. 54-55) మహాక్షాయస్థుడున్న సంధివిగ్రహిన్ని ఆయిన మావురయ కుమారుడు దామోదరుడు వ్రాసినది. మాహాక్షశాలి (అగసాలి)వల్లె మోజు చెక్కినది.



* ఈ ఏరు వంశధార; ఇది గారహాంబరవల్లి (వమరావెల్లి) గ్రామముల ప్రక్కనుండిపోయి కళింగపట్టణంవద్ద సముద్రములో పడుతున్నది.



# కవితాప్రయోజనము

గుండిమెడ వెంకట సుబ్బారావు గారు

ప్రణవ వాక్ప్రతాప దుర్దాంత మహాగ్ని క,క్రమ ధూర్తచక్రంబు కంప మొంద
తన సుధామధుర సుందర గాన వాహిని, కఖిలభూతములు జోహా రనంగ
తన దిగ్విశాల శీతల ముఖజ్యోతి కు,ద్భట తమఃపటలి విధ్వంస మంద
తన సూక్ష్మదృగ్జాలమునకు దృశ్యాదృశ్య, బహుళవిశ్వము బట్టబయలుగాఁగ
గీ. అద్వితీయకాంతుల మయూరాసనంబు,నందు వాణీసమేతుఁడై యధివసించి
మించి పదునాల్గు భువనముల్ సంచరించు, సత్కవి నిరంకుశుఁడు కాఁడె జగతిలోన.

సీ. తలఁచెనా సార్వభౌముల కసాధ్యంబైన, యఖిలార్థసిద్ధి తనంతఁగలుగు!
వలచెనా సర్వసర్వంసహాచక్రంబు, క్షణమాత్రమునఁ బదాక్రాంత మగును!
కొలిచెనా మనసార, క్షుద్రజీవనుఁడైన, భిక్షోపజీవి కుబేరుఁడగును!
నిలిచెనా తనముందు నిఖిలసాధన సమ,న్వితవైరి లోకంబు నిలువ వెఱచు!
గీ. అట్టి కవితామహాశక్తి * * * * * మహితగతుల
క్షితి నహోరాత్రముల్ ప్రయోగింపరేల? అఖిలవేత్తలా సుకవిసింహంబు లకట!

తే. గీ. కవులు సంఘవిహంగపక్షములు! కవులు, సర్వవేత్తలు! దుర్వారశక్తు లరయ!
ఇట్టి సుకవీశ్వరుల మహోత్కృష్టశక్తి, అనుపయోగార్థ మగుచుండె నకట! నేఁడు!
సీ. పుల్లమ్మ విరహాగ్నిఁ బొక్కుచున్నదియంట!—ఎంతకష్టము! మా కిఁ కేమిదిక్కు?
చెట్టుపై నొకపిట్ట రెట్టవేసినదంట!—కృష్ణకృష్ణా! మా కిఁ కేమిదారి?
మొగసాల ముసలమ్మ మూల్గుచున్నదియంట!—కటకటా! మా కింక గతి యదేమి?
మెంకిపై తనకు రం గెక్కువైనది యంట!—హరహరా! యింక మా ప్రాప్తమేమి?
గీ. ఎవ్వరికిఁ గావలయునయ్య! యిట్టికవిత? పనికిమాలిన యీశుష్కభావ కవిత
యెవ్వరికిఁ గావలయు?—మహోత్కృష్టగతులఁ, గవిత కాలానుకూలమై క్రాలవలదె?

తే. గీ. సత్య మడుగంటి, ధర్మనాశనము కల్గి, పృథ్విపై నధర్మము చెలరేగుచుండ,
పనికిమాలిన యీశుష్కభావ కవిత, గాక, వేఱుసందేశంబు మీకు లేదె?





# కళింగనగరము

గో. రామదాసు గారు, బి. ఏ., యమ్. ఆర్. ఏ. యస్.

గాంగ వంశజులైన రాజులకు రాజధానియైన కళింగనగర మేది? ఈ విషయమై మ. రా. రా. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు రక్తాక్షి సం. మాఘమాసపు భారతి సంచిక **144-146** పుటలలో తర్కించియున్నారు. కాని వారి విమర్శన యావత్తు ప్రస్తుతకాలపు కళింగపట్నపు పక్షమునకే వ్రాలియున్నట్లు కన్పించుచున్నది. వీరు నిష్పక్షపాతముగా విమర్శించినటులు గూడ గనిపించదు. ఈకళింగనగర మని చెప్పు స్థానమును ప్రస్తుత స్థానములతో నిరూపించక ముందు కొన్నిహాంశములను గుర్తించవలసి యున్నది.

గాంగ వంశజులలో రెండు తెగలవారున్నట్లు వారివారిశాసనములయందు గల మతలబునుబట్టి తెలియవచ్చుచున్నది. మొదటి తెగవారిశాసనములలో ఒకటి, రెండు, మూడు తరములకంటె ఎక్కువ వర్ణింపబడియుండలేదు. వారి గోత్రమును జెప్పలేదు. కళింగరాజ్యశకములోసంవత్సరములు గణన చేయలేదు. రెండవతెగవారు మూడుతరములకంటె ఎక్కువ తరముల బేర్కొనుదురు. వారి గోత్రమును వక్కాణించెదరు. శాలివాహన శకములో సంవత్సరములను లెక్కించెదరు. ఇట్లు రెండు విధములైన వారని తెలిసినపైని ఈ రెండు తెగలవారి రాజ్యస్థాన మొకటియా లేక వేరా అని ఆలోచించవలెను.

మొదటితెగవారి శాసనములలోని వర్ణనలవల్ల వారిరాజ్యస్థానము సముద్రతీరమందున్నట్లే కన్పించుచున్నది. మహారాజ ఇంద్రవర్మయొక్క (శ్రీ)కాకుళశాసనమున నిట్లు చెప్పబడియున్నది!

"జలధితరంగకరపల్లవాలింగితసకలకళింగావనీతల తిలకాయమానా ద్విజయకళింగనగరాత్."

సుమారు 5, 6 శతాబ్దములలో నుండిన కాళిదాసు తనరఘువంశములో నిట్లు కళింగరాజ్యస్థానముయొక్క ప్రదేశమును సూచించి యుండెను.

"యమాత్మన స్సద్మని సన్నికృష్టో
మన్ద్రధ్వనిత్యాజితయామతూర్యః;
ప్రాసాద వాతాయనదృశ్యవీచిః
ప్రబోధయ త్యర్ణవఏవ సుప్తమ్."

—సర్గ ౬, శ్లో. ౫౬.

రాజుగారిమేడపైని కిటికీలనుండియే సముద్రము గన్పించునట. ఎంత సామీప్యములో నున్నదియో!

ఈ పట్టణము మహేంద్రగిరికి సమీపములో నున్నట్లుగూడ సూచింపబడియున్నది.

"అసౌ మహేంద్రాద్రిసమానసారః
పతి ర్మహేంద్రస్య మహోదధేశ్చ;
యస్య క్షరత్సైన్యగజచ్ఛలేన
యాత్రాసు యాతీవ పురో మహేంద్రః."
—సర్గ ౬, శ్లో. ౫౪.

ఈశ్లోకమందు "పతిర్మహేంద్రస్యమహోదధేశ్చ" అనుదానికి మల్లినాథు డిట్లు వ్యాఖ్యానము వ్రాయుచున్నాడు. "అసౌ హేమాంగదో నామ. మహేంద్రస్య కులపర్వతస్య మహోదధేః (మహాసముద్రస్య) చ పతిః స్వామీ 'మహేంద్రమహోదధీఏవ వాస్య గిరిజలదుర్గే'ఇతిభావః" అనగా మహేంద్రపర్వతముగిరిదుర్గమునుసముద్రము జలదుర్గమును ఇతనికి. కావున ఇతని ముఖ్యస్థానము సముద్రమునకును మహేంద్రగిరికిని మధ్యనున్నట్లు స్పష్టమగుచున్నది. అలాగుకానిచో కొండకోటలోకికావలిస్తే కొండకోటలోకి, సముద్రముపైకి కావలిస్తే సముద్రములోనికి పోవుటకు వీలులేదు. లేదా భూమివైపు మహేంద్రగిరివల్లను తూర్పున సముద్రమువల్లను సంరక్షింపబడుచుండెనని యైనా అర్థము కావచ్చును. అలాగునైనా మహేంద్రగిరిసముద్రములకు మధ్యనుండవలెను కళింగరాజుయొక్క ముఖ్యపట్ణము.[1]

నాల్గవశతాబ్దాంతమందు వ్రాయబడిన అల్లహాబాదు సముద్రగుప్తశాసనములో చెప్పియున్న "మహేంద్రగిరికొత్తూరక" అనునది పైన కాళిదాసు చెప్పినదాని కన్వయించియే యున్నది. "మహేంద్రగిరివద్దనున్న కొత్తూరు స్థానముగాగల" యనియర్థము. కావున సముద్రగుప్తునికాలమునకు కొత్తూరు కళింగమునకు రాజ్యస్థానమై యున్నట్లు తెలియవచ్చుచున్నది. బారువవద్ద పారుచున్న మహేంద్రతనయ ముఖద్వారమునకు ఉత్తరవైపు ఉన్న కొత్తూరే ఈకొత్తూరని విన్సెంటుస్మిత్తు, కీల్హారను (Vincent Smith, Keilhorn) గారు నిర్ణయించినారు. ఈకొత్తూరుకు గంగవంశపురాజులశాసనములలో జెప్పియున్న గుణములన్నీ పట్టియున్నవి; కాళిదాసువర్ణన వర్తించుచున్నది. కాన ఇదియే ఆనాటికళింగనగరమై యుండినట్లు తోచుచున్నది.

నగరమనగా రాజున్నస్థానము. ఇప్పటికిని ఓఢ్రదేశములలో జమీదారు డుండుభవనమును నగరమని యందురు. కావున కళింగరాజు లుండేస్థానముగాన నది కళింగనగరమాయెను. ఖారవేలుని హాటగుంఫగుహా శాసములో బేర్కొనబడినకళింగనగరము అతని ముఖ్యస్థానము. ఆకళింగనగరమును, ప్రథమ గంగరాజుల ముఖ్య స్థానమును ఒక్కటిగా నేరవు.

రెండవశతరముగాంగులకాలములో ఇది మారిపోయినట్లు మనకు ప్రమాణములు గనిపించుచున్నవి. ప్రథమకామార్ణవుడు తన స్థానమును 'జనోపురా' లో ఉంచినట్లును రెండవకామార్ణవుడు అచ్చటనుండి నగరమునకు వెళ్లియున్నట్లు అచ్చట 'మధుకేశ్వరు' డను లింగరూపధారియైన ఈశున కాలయము గట్టినట్లును అనంతవర్మచోడగంగుల విశాఖ

1. సర్గ ౬, శ్లో. ౫౩. "అనేన సార్ధం విహరాంబురాశే స్తీరేషు తాలీవనమర్మరేషు." అని ఆకాళిదాసే చెప్పుటచే కళింగరాజస్థానము సముద్రతీరమందే మహేంద్రగిరి కనబడేటట్లు ఉన్నదని స్పష్టమగుచున్నది.

పట్నపు శాసనములో జెప్పబడి యున్నది. (Ind. Ant., June 1889, No. 179)

49. పంక్తి.

"తస్య చాపహసితసురేంద్రపురమ్
జంతావుర్నామనగరిరాజధా న్యాసీత్".

అనగా 'జంతావుర' నేది కళింగనగర మాయెనని యర్థము.

60. పంక్తి.

"......తస్య తిరస్కృతత్రివిష్ట

61. పమ్ నగరన్నామ పురమాసీత్॥
తస్మిన్ సోఽపి మధుకవృక్షజననా దీశ
స్య లింగాకృతేః కృత్వాఖ్యం.

62. మధుకేశ ఇత్యరచయత్ ప్రాసాదం అభ్రకషం..."

ఇందు నగరమనే పేరుగల గ్రామము పురమైనది. అనగా నగరమే కళింగనగరమాయెనని యర్థము. ఇందువల్ల పురమన్న నగరమన్న ఒక్కటియే అర్థమైనట్లు కన్పించుచున్నది. ఇటువలెనే రామాయణములో గూడ వాడబడియున్నది.

బాలకాండము—సర్గ-౫.

5. "అయోధ్యానామ నగరీ తత్రాసీత్ లోకవిశ్రుతా."
6. "మనునా మానవేంద్రేణ యాపురీ నిర్మితా స్వయమ్."

మధుకేశు డనులింగము ఉండుట యొక్క చిహ్న ఈనగరమునకు. ఒక్క ముఖలింగేశ్వరునికే ఈనామమున్నట్లు ఆలయమందున్న శాసనమువల్ల స్పష్టమగుచున్నది. కావున ముఖలింగము మొదలు నగరికటకమువరకూ ఈ రెండవ కామార్ణవుని రాజ్యస్థానము వ్యాపించియుండినట్లు రూఢియగుచున్నది. ఈనగరమందు పెద్ద పెద్ద మేడలు మిద్దెలుకూడ ఈయన కట్టించినా డనుటకు పైన జెప్పినశాసనమే ప్రమాణము.

ఈయన తర్వాత యేలిన రాజులకుకూడ ఇదియే ముఖ్యస్థానమైనట్లు వారి శాసనములవల్ల రూఢియగుచున్నది. భీమఖేదికోడుకైన ధర్మఖేది యిచ్చిన మందసశాసనము (అనంతవర్మదేవ యను బిరుదువహించిన రాజుకాలము నాటిది. శకం 975)లో "సుధాధవళ ప్రాసాద మాల వీరతల్లాలితల్లోలాత్" అని చెప్పి యుండుటచే శకం 975 సం.రమునకు అదియే ముఖ్యస్థానమైయున్నట్లు రూఢియగుచున్నది! అనంతవర్మ చోడగంగులకాలములో రాజ్యస్థానము కటకపురికి మార్చబడినట్లు శాసనములు చెప్పుచున్నవి. కావున ముఖలింగాలయములోనున్న శాసనములలో బేర్కొనబడిన 'కళింగనగరము, కళింగావని నగరము' మొదలైన నామములుగల కళింగనగరమదియే కాని మరియొకటి గానేరదు.

ఏశాసనములలోనైననూ లేదా మరియే గ్రంథములోనైననూ ఈకళింగ రాజ్యస్థానమునకు 'కళింగపట్నమ'ని చెప్పియున్నట్లు కన్పించదు. నామలింగానుశాసనమందు 'పూః, పురం, నగరం, పత్తనం' ఇవి అన్నియు పర్యాయపదములుగా జెప్పబడియున్నది. అందుచే 'నగరమ'న్నా 'పట్టణమ'న్నా ఒక్కటే కదా యని తలచి నగరమన్నదగ్గర పట్నమని పెట్టి అది ఇది ఒక్కటే యని చెప్పుట యుక్తమగునా? విజయనగరమును విజయపట్నమని చెప్పగలమా? పట్టణమని చెప్పనిచ్చ గలిగినప్పుడు విజయనగరపట్న మని చెప్పుదుము. కావున కళింగనగరమే కళింగపట్న మని భావించుట యుక్తముగా గనిపించదు.

వేములవాడ భీమకవి చెప్పినదనియున్న చాటుపద్యములో వర్ణించియున్నది ఈకళింగ పట్నమే అయి ఉండవచ్చు. భారతి రక్తాక్షి సం. మాఘమాసపుసంచికలో వ్రాయబడిన పద్యములలో గూడ కళింగపట్న మనియే యున్నది. ఆవర్ణనయంతయు ఇప్పటి కళింగ మదేకాని ఈ కళింగపట్నము ఆనాటి కళింగ నగరమై యుండనేరదనుదానికి ఒక్కయాలోచన చేయవలెను.

తెలుగుకవులు ప్రబలుట A. D. 7100 సం. రమునకు దరిమిలానుగాని అంతకుపూర్వమై యుండనేరదు. ఉన్ననూ కళింగమునకు ఆకవులు వచ్చియుండరు. నిదర్శనము లేమీకానరావు. కావున పైన ఉదహరించిన పద్యములు పుట్టుసరికి కళింగరాజులు కటకమునకు వెళ్లిపోయియున్నారు. ఇంతియకాక ఆ పద్యములలో బుడతకీచులు మొదలైన వారినిజెప్పియుండుటచే ఆపద్యములు చాలా నవీనములని కూడ దోచుచున్నది. అప్పటిలో గొప్పకళింగపట్టము రేవుస్థలముగా కూడ నుండియుండవచ్చును. అచ్చట గొప్ప వర్తకులు మొదలైనవారు ఉండియుండవచ్చును. ఆశోభను జూచి కవి తనకల్పన కొలది ఉత్ప్రేక్షించియుండును. పూర్వము ఈకళింగపట్నము గొప్పరేవు స్థలమనిన్ని ఇచ్చట అనేకమంది ధనికు లుండేవారనిన్ని, అందులో ఘనపండావారను గొప్పకుటుంబ ముండేదనిన్ని, వారికి విస్తారము వాడవర్తక ముండేదనిన్ని యొకకథ నేటికిని శ్రీకాకుళ ప్రాంతములయందు చెప్పుదురు. ఈవర్తకవ్యాపారములచే దీనికి 16, 17 శతాబ్దములలో ఖ్యాతి వచ్చియుండవచ్చును. ఆఖ్యాతిలో పూర్వపు గొప్పస్థానములు నశించిపోవుటచే వాటిఔన్నత్యము అంతరించిపోయినది. అందుచే వాటిఘనతఅంతయు దీనికి జేర్చి జనులు చెప్పకొనుటయు సంభవించి యుండవచ్చును. అలాగుకాకున్న క్రీ. శ. 1810-12లో వ్రాయబడినకైఫీతులోనిహాంశములు రావు. 1810 కిన్ని 1100 లకున్ను 800 సం. ములు అంతరమున్నది. ఈ కాలములో పూర్వపుహాంశములు యెన్నిమరచుటకున్ను క్రొత్తహాంశములు యెన్నిఉద్భవించుటకును అవకాశమున్నదో చూడండి. ఏమీలేదు? 17వ శతాబ్దమందు మనదేశములో ఉండి వ్యాపారము చేసిన డచ్చివారిచరిత్రమే మరచిపోతిమి. ప్రదేశములపేర్లే మరచిపోతిమి. ఇక కంచుకోటవిషయమైయ్యా, ఓ, శ్రీకాకుళంవెళ్లితే యెన్నిచోట్లనో ఈకంచుకోట లున్నట్లు చెప్పుతారు. దంతవక్త్రునికోట యొకటిఅట; కళింగరాజులశాసనములలో జెప్పినదంతపురమునకు వచ్చినపాట్లు.శిశుపాలునికోట యొకటిఅట; ఒకప్పుడు రాజ్యస్థానమైన సింహపురమునకు వచ్చినపాట్లు.ఇలాగు యెన్నియో కోటలు. అన్నీ పూర్వము పురాణములలో చెప్పబడిన మహాసీయులతో సంపుటీకరించబడినవే! ఇంతేల? నాగావళినదియే నాడు బలరాముడు నాగలితో గొట్టగా ఉద్భవించిన దట. ఆజలమునకు తన నాగలితోనే దారి చూపించుచూ అచ్చటచ్చట లింగ ప్రతిష్ఠలు చేసెననియు చెప్పుదురు. ఆ

లింగములే శ్రీ కాకుళములో కోటీశ్వర స్వామి, సంగాములో సంగమేశ్వరుడు, గుంపలో గుంపేశ్వరుడు మొదలుగా 5 క్షేత్రములు బలరామప్రతిష్ఠగా జెప్పుదురు. ఇది యంతయు యెట్లువచ్చినది? ఆనదికి 'లాంగుల్యా' యనుఒకనామ మున్నది. దీనిని సమర్థించుటకు ఈకథ పుట్టినది. కాని శాసనపరిశీలనవల్ల ఈనదికి పూర్వము వరాహ వర్తిని యనునామమున్నట్లు, శ్రీకాకుళం కోటీశ్వర స్వామి మూడవవజ్రహస్తునికాలమున కున్నట్లు, మొదటి గాంగులకాలమునకు లేనట్లు కన్పించుచున్నది. కావున పుక్కిటిపురాణమునకును నిజమైన చరిత్రమునకును చాల దూరము.

మరియు ఆలోచించిచూడగా పట్టణమనునది సాధారణముగా ఓడరేవులకే ఉపయోగించునామముగా దోచుచున్నది. చెన్నపట్నము, మచిలీపట్నము, నాగపట్నము, విశాఖపట్నము. అందుచే కళింగపట్నము గూడ ఒకరేవుపట్నముగా ఉండనోపు కాని ఇది యెన్నడును రాజ్యస్థానము అయియుండనేరదు. ఒకవేళ అయిఉంశిననూ ఏదో యొక్క చిన్నరాజ్యమునకైయుండునేమో?

గాంగవంశమైనపిదప సూర్యవంశపురాజులు ఆరాజ్యమును పాలించిరి. 15 వ శతాబ్దము మొదలు 16 వ శతాబ్దము మధ్యవరకు ఈవంశము కళింగరాజ్యమును బాలించెను. వారికాలములో అనేకమైన చిన్నచిన్నపరగణాలుగా దేశము విభజింపబడియుండె. అప్పటిలో ఈకళింగపట్నము ఒకచిన్న పరగణాకు ముఖ్యస్థానమై యుండియుండవచ్చును. అంతేకాని కళింగరాజ్యమునకు నగరమై ఎన్నడూ ఉండలేదని స్పష్టమగుచున్నది.

మత్స్యపురాణమందు నగరమెటులుండవలెనో చెప్పియున్నది. "పట్టాభిషిక్తుడైన పార్థివుడు తృణకాష్ఠాదిసమృద్ధిగల నదీతీరదేశమధ్యంబున ... ... నగరంబు నిర్మింపవలయు .. ......... అందొకవీథ్యగ్రభాగంబున దేవాయతనము రెండవవీథ్యగ్రభాగంబున రాజభవనము... ... ... ఉండవలెను." (250 వ అధ్యాయము). ఈప్రకారము ముఖలింగము మొదలు నగరికటకమువరకూ పూర్వమందు వ్యాప్తమైయున్న నగరము కట్టబడినట్లు గనిపించును. ఈగుణములు కళింగపట్నమందు గానిపించవు. పూర్వకాలపు దేవళము ఒకటైనా కానరాదు. ఏవిధముగా జూచిననూ కళింగపట్నము రాజధానిగా ఉన్నట్లు కనిపించదు. కళింగరాజుల శాసనములయందు జెప్పబడిన కళింగనగరము మొదటితెగవారి కాలమందు మహేంద్రతనయ నదీముఖద్వారమందును, రెండవతెగవారి కాలమందు ముఖలింగమువద్దనూ ఉన్నట్లు స్పష్టమగుచున్నది.





# వద్దురా!

(హరిత కృతము)

గేయము

వద్దురా యీపాడు లోకము
వద్దురా యీబీదు శోకము
దిద్ది తీర్చేవాఁడు లేఁడు
దిక్కు మొక్కు లేని గోడు—వద్దురా.

౨

గడగడగడపకుఁ బోయి 'యమ్మా,
కబళ'మని వాపోయినా నా
కడుపు మంటకు దోసెఁడంబలి
కఱవు చేస్తివి దేవుఁడా—వద్దురా.

3

పగలు రేతిరి ఒక్కటాయెను
పజ్జ నడిచే దిక్కుపోయెను
వగచి పట్టెడు బువ్వఁ బెట్టే
వాఁడు లేఁడో దేవుఁడా—వద్దురా.

౪

ఎండఁబడి పొద్దస్తమానము
తిండి తిప్పలు లేక తిరిగితి
కన్నులకుఁ జీఁకట్లు గప్పెను
కాళ్ల నడకను బట్టు దప్పెను—వద్దురా.

౫

ఉద్దికానని మిద్దెటిండ్లు
అద్దు పొద్దు లేని తిండ్లు
అదరిపడు మోటారు బండ్లు
మొదలుచూడని మీఁదికండ్లు—వద్దురా.

౬

కండ్లఁగానను తెన్ను దొరకదు
బండ్ల బడకల దాడి తఱుఁగదు
తొలఁగఁదీయను సందులేదు
త్రోఁపుల మితిమేర లేదు—వద్దురా.

౭

పట్న మన్న బడాయిరా (ఇది)
పాపముల పెనుగోయిరా
శాంతిపాలి కసాయిరా (పర)
సాధనలకు లడాయిరా—వద్దురా.

౮

కలిమిలేముల కలఁత మ్రోఁత
కష్టజీవుల గొంతు కోఁత
పట్నవాసము పైకి బూఁత
పరువు తెరువు లేని రోఁత—వద్దురా.

౯

కల్ల కపటము లేదురా (అది)
కష్టజీవుల తల్లిరా
పుల్లగూరా బువ్వఁ దిన్నా
పల్లె పట్టె హాయిరా—వద్దురా.



౨. బీదరుకోట - కొండలో మలిచిన కందకములు

# బీదరుపట్టణ ప్రశంస, పూర్వచరిత్ర

కొమాండూరి వెంకటాచారి గారు

హిందూదేశములో స్వతంత్రరాజుల పరిపాలన మందు ప్రఖ్యాతిగాంచి మహమ్మదీయులచే నేలబడి ప్రస్తుతము శిథిలమై పూర్వపుఔన్నత్యము నింకను ప్రకటించు బీదరుపట్టణ మిప్పటికిని జనుల నాకర్షించు చుండును.

## హిందువులనాటికాలము

బీదరుపట్టణము నిజాము రాష్ట్రమునకు ముఖ్యపట్టణమైన హైదరాబాదునకు పశ్చిమముగా సుమారరువది మైళ్లదూరమున నున్నది. పూర్వ మీపట్టణపరిసరమంతయు హిందూరాజుల పాలనలో నుండెను. మన మహాభారతమునందు చెప్పబడిన నలచరిత్రకును, మహాభాగవతమందు చెప్పబడిన రుక్మిణీకల్యాణమునకును సంబంధించిన విదర్భరాజ్యము ప్రస్తుతము బీరార్, ఖాండిష్ (Berar, Khandish)యని పిలువబడుచున్నది. అక్బరుచక్రవర్తి కాలమునాటి ఫైజీ (Faizi) చరిత్రకారుడు "నలూవుద్దమన్" అను నలచరిత్రను ఉరుదూభాషలో వ్రాసి దమయంతి తండ్రి యగు భీముడు బీదరుపట్టణ ప్రాంతముల నేలినవాడని నిరూపించి యున్నాడు. వీటినిబట్టి చూడ బీదరురాజ్యము చాలకాలము హిందూరాజుల యధీనములో నున్నదనితోచును.

## బీదరు రాజధానీ ముఖ్యపట్టణము

భామనీరాజ్యస్థాపనానంతరము, అనగా 1429 వరకు బీదరునుగురించి చరిత్రయం దేమియును చెప్పబడలేదు. భామినీ సుల్తానులలో పదియవ వాడగు అహమ్మదువాని (Ahmed wani) 1428లో బీదరును ముఖ్యపట్టణముగ చేసెను. దీనిని గురించి ప్రజలు ఐతిహ్యము నొకదానిని చెప్పుదురు. ప్రస్తుత చరిత్రకారు లిట్టివానిని విశ్వసింపరు. ఒకప్పుడు అహమ్మదుషా వేటకుజని అడవియందు ఒక నక్క యొకవేటకుక్కను దరుముట గాంచెను. చక్రవర్తి నక్కయొక్క ధైర్యమున కచ్చెరువొంది ఆప్రదేశము ధైర్యవంతుల కాశ్రయమనియు, అచ్చట ముఖ్యపట్టణము న్న శత్రువులకు దుర్భేద్యముగ నుండుననియు తలచి అచట నొక దుర్గమమగు దుర్గమును గట్టి దానికి 'అహమ్మదుషా బీదర'ని నామకరణ మొనర్చెను.

## పట్టణ వర్ణన

గుల్బర్గాకు నుత్తరమున కొన్ని మైళ్ల దూరములో నున్న యీబీదరు పట్టణము అత్యంత సుందరమైనది. ఒక చరిత్రకారుడు "ప్రపంచమం దిట్టి సుందరమైన పట్టణము లేదనియు, మాయానిర్మితమను భ్రమకలుగుననియు, వ్రాసి యున్నాడు. బీదరుయొక్క అంతర్భాగము మణులతోను ఏనుగుదంతముతోను అమర్చబడిన చిత్రవిచిత్రపు పనులతో నుండెడిదని పూర్వచరిత్రకారులు వ్రాసిన వ్రాతలు చదువునప్పుడు మనకు పూర్వుల శిల్పకళాకౌశలము వెల్లడి అగును.

## దుర్గము *

బీదరుపట్టణము మిగుల సుందరమైనదని జీర్ణములైన కుడ్యప్రాకారగోపురములవల్ల విశదమగును. మొదట దుర్గమునుగూర్చి విచారింతము. ఇయ్యది అహమ్మదు షావాలీ రాజ్యము చేయుకాలమున కట్టబడినది. కోటనాన్నుకొని లోతైన కందకములు ఒకటివెంబడి నొకటిగ మూడున్నవి. దుర్గములోపల జలాశయములు, శాలికాగారములు, గోపురములు, చూడ సొంపెసగుచుండును. దుర్గము శత్రుల కభేద్య మనుటకు నిదర్శనముగా నా కోటపై యెనిమిదిమారులు దండెత్తినను కోటగోడలు దాటుటకు నొక్కరికిని సాధ్యమైనది కాదని చరిత్ర చాటుచున్నది. బీజపూరునందున్న మల్లిక్ మైదానము వలెనే ఈ కోటయందును గొప్పమైదాన ముండి దానిపై త్రుప్పుపట్టిన ఫిరంగు లున్నవి. కొన్నిటిమీద నిర్మాణకర్త పేర్లును కనిపించుచున్నవి.

## రంజను మహాలు †

కోట ప్రవేశించి కొన్ని ద్వారములు దాటగనే రంజనుమహాలు కాన్పించును. ఈ భవనము పూర్వ

* ౧, ౨ చిత్రములను జూచునది.

† 3 వ చిత్రమును జూచునది.

మనేకరంగులచే చిత్రింపబడినది గాన దీని కా పేరు కలిగినది. దానికి పూర్వభాగమున మూడు విశాలమండపములున్నవి. అక్కడక్కడ యిప్పటికిని శిథిలముగాని శిలా వేదికలపై నానారంగు మెరుంగుగల పుష్పములు లతలు అతినూతనముగా గన్పట్టుచున్నవి.

## రాజభవనములు

దీనికి కుడిచేతిమీదుగా కొన్ని రాజబంధువుల విశ్రాంతిగృహములు గాన్పించును. వాటిలో దర్బార్ మహలు మాచితీరనలయును. హాలంతయు సుందరముగా చెక్కబడిన కొయ్యస్తంభములచే నిండియుండును. ఈ మందిరము బీజపూరునందున్న అస్తారుమహలును బోలి యుండును. మందిరాంతర్భాగమున వరుసవెంబడి చలువరాతికుండీలు కాననగును. ఈకుండీలు పూర్వము అత్తరు పన్నీరులతో నెల్లప్పుడును నిండియుండెడివట. గోడల మీద నచ్చటచ్చట పర్షియన్ భాషలోని వాక్యములు ముత్తెపుచిప్ప పలుకులతో చెక్కబడి యున్నవి.

## ప్రభుత్వమువారి కచేరీలు

ఈ మందిరమునకు కొలదిదూరమున గాగన్ మహాలు, తారకాన్ మహాలు, నాగన్ మహాలు మున్నగాగల భవనములు గలవు. ఇవన్నియు మహమ్మదుషా భామినివల్ల కట్టబడి ప్రస్తుతము పాడువడి యున్నవి. శిథిలము కాక దృఢముగానున్న భవనములందు ప్రభుత్వమువారి కచేరీలున్నవి. వారిధినిబోలిన రాజ్యరమను ఏకఛత్రాధిపతిగ నేలి కీర్తిగాంచిన సార్వభౌముల శయనాగారములు ప్రస్తుతము జిల్లాకారాగారములక్రింద వాడబడుట యెంతయు విషాదకరము.

## జనానాస్త్రీ మందిరములు

ఈమందిరముల నన్నిటినివదలి యొకబాట గుండా బోవుదుమేని జనానాస్త్రీలుండెడి మందిరములు కాననగును, ఇప్పుడవన్నియు కూలి ప్రోవులుగా నున్నవి. వాటికి కొలదిదూరమున తర్కీమ మహల్ ఉన్నది. ఇందు బహిమినీరాజులు, బారీడుషా రాజులు నధిష్ఠించిన చలువరాతి సింహాసన ముండెడిది. ప్రస్తుత మాప్రదేశముకూడ పాడువడియున్నది. ఈమందిరమునందున్న గుమ్మటములు (Domes) మిగులపెద్దవిగానుండి కన్నులు మిరుమిట్లు గొల్పును. మొత్తముమీద కోటయందంతటను జలముప్రవహించుటకు చేసిన యేర్పాటు (Pipe system) యెంతయు శ్లాఘనీయము.

## గోరీలు *

వీటితరువాత భామినీసుల్తానుల గోరీలుచూడ నగు. ఇవన్నియు నొకేమాదిరి నలుచదరముగాకట్టబడిఅందమైన గుమ్మటములు కలిగి రంగులచే చిత్రింపబడినవి. వీటన్నిటియందును ఉన్నతమైన సమాధి బీదరుపట్టణనిర్మాతదై యున్నది. ఇదిపరిషియా దేశాచారప్రకారముకట్టబడినది.

## మదరసా†

బీదరునందు చూచి యానందింప దగిన విశేషమొకటి యున్నది. దానిని విద్యాలయము(College)లేక మదరసా యందురు. ఇది పరిషియా, అరేబియాలందున్న విద్యాలయములవలెనే కట్టబడి మూడంతస్థులు కలిగి యున్నది. ఇందు పుస్తకభాండాగారములు, ఉపన్యాస మందిరములు, ఆచార్యపీఠములు, విద్యార్థి వసతి గృహములు సొంపొందుచున్నవి. గాలియు, వెలుతురును నిరాటంకముగా లోనికివచ్చును. మన విశ్వభారతియందువలెనే యిందుగూడ ఆసియాఖండమందలి విద్యార్థులెల్లరు వచ్చి యిచ్చట విద్యనభ్యసించెడివారలట. ఇందుపూర్వము ఇరువదివేల గ్రంథములుండెడివని తెలియుచున్నది. కాని ఇప్పుడొక పుస్తకమైనను కానరాదు. ఈ మందిరమున కిరుప్రక్కలను ఎత్తయిన స్తంభములు (minarets) ఒక్కొక్కటి నూరుఅడుగుల పొడవుగలిగియున్నవి.

## నిర్మూలము

1107 వ సంవత్సరమున నొకపిడుగుపడి విద్యాలయమందలి ముందువెనుక భాగములు కూలినవని చెప్పుదురు. మరికొందరు ఔరంగజేబు బీదరుపట్టుకొన్నప్పుడు ఈ విద్యాలయమందు, మందు గుండు సామానులు నిలువ చేసెననియు ప్రమాదవశమున నగ్ని రగుల్కొని మందిరము శిథిలమయ్యెననియు చెప్పుదురు.

## ఫరకాబాగ్

పురాణప్రోక్తమగు చందనవనమువంటి ఉద్యానవనముచే నావృతమై, బీదరుపట్టణము మేరుగిరివలె చూపరుల

* ౪ వ చిత్రమును జూచునది.

† ౫ వ చిత్రమును జూచునది.

కన్నులకు వినోదమును గొలుపుచుండును. ఇప్పుడట్టి వన మొకటిమాత్రము మిగిలియున్నది. ఈయుద్యానవనము ఒకపర్వత సానువునం దుండుటచేత ఎల్లప్పుడును నీరూ రుచుండును. ఇందు పూర్వము నరసింహస్వామిదేవాలయ ముండెడిది. 1556 లో హిందూమతాంతకుడగు ఔరంగ జేబు దండయాత్రలో యీదేవాలయమును మశీదుచేసి దానికి 'ఫరకాబాగ్'యని పేరుపెట్టెను. 'ఫరకా'యన ఉర్దూభాషలో స్వర్గము.

## పరిశ్రమలు

బీదరుపట్టణము పూర్వము మంచి పరిశ్రమలకు నిల యము. అందుముఖ్యమైనది 'బీదరీ'యను నగిషీపని. ఇది పంచలోహములచే చేయబడిన లోహరసముచే కొండి బంగారుపాత్రలపై వేయబడుచిత్రపుపని. ఇప్పు డదికూడ నశించిపోయినది.

## మహమ్మదీయ దండయాత్ర

1323–వ సం. ఎ. డి. మహమ్మదు టొగ్లకు యీ పట్టణమును వశపర్చుకొనినప్పటినుండి చరిత్రాంశములు తెలియుచున్నవి. మొగలుచక్రవర్తి ఔరంగజేబు దండ యాత్రలో 1556–వ సం. నిర్మూల మొనర్చిన పట్టణ ములలో నిది యొకటి.

## పూర్వచరిత్ర

టొగ్లకు చక్రవర్తిచే 45 వ సం. గుల్బర్గా బీదరులకు పాలకులుగా నియమింపబడిన సర్దార్లిద్దరును అసూయాగ్రస్తులయి చక్రవర్తి యాగ్రహమునకు బా ల్పడి పదచ్యుతు లయిరి. 1346 లో జాఫరుఖాన్ అను వాతడు 'అల్లాయుద్దీన్ భామినీషా' యను బిరుదుతో కాకతీయ వంశీయుడగు వరంగల్లురాజుసాహాయ్య ముచే చక్రవర్తి పరివారమును (Royalists) ఓడించి నజీరుద్దీను 'యిస్మాయిల్' అను సర్దారు సహాయమున దక్కనుకు రాజయ్యెను. అతడీరాజ్యమును నాల్గుభాగ ములుగ భాగించి అందు బీదరు నొకదానిగ చేసి దాని పాలకునకు ఆజామీ హుమయూన్ (జయకారుడు) అను బిరుదు నిచ్చెను.

## అల్లాయుద్దీనుషా పాలన

1435 లో అహమ్మదుషా చనిపోయెను. అతని కుమారుడు అల్లాయుద్దీనుషా రాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రొత్తగా నిర్మించిన పట్టణమునకు గొప్ప భవన ములు, ఉచితవిద్యాలయములు, ఉద్యానవనములు కట్టించి వీనికగు వ్యయముక్రింద గొప్పభూదానములుచేసి మరింత వన్నె దెచ్చెను. ఇట్టిధార్మికు డయ్యు నీక్రింది దృష్టాంత ములవలన నీతడు మిగులక్రూరు డనియు తెలియుచున్నది. 1459 లో హుమాయూన్ తనసైన్యములతో విప్లవకారు డైన తెలింగానా జమీందారుని జయించుటకై వెడ లెను ఇట్టి తరుణమున బీదరునం దొకయల్లరి జరిగెను. ఈ సంగతి యల్లాయుద్దీను విని యాగ్రహము పట్టజాలక పురము ప్రవేశించినంతనే రెండువేలమంది పురరక్షకుల (City Police)ను అజాగ్రత్తకుగాను బలవంతముగా చంపించెను. కొత్వాలును ఇనుపకారాగారమున బంధించి, చిత్రవధ గావించెను. అల్లరికి కారకుడైన తన తమ్ముని ఒక వ్యాఘ్రముముందట బడవైచి యమసదనమునకు బంపెను. నిరపరాధులగు స్త్రీల నిండ్లనుండి తరిమి, వారలమండగీడులచే నవమానపరచిచెప్ప లేనంతటి బాధలకు బాల్పడచేసెను. 1466 సం. నీక్రూరుడు చనిపోయెను.

## నైజాముషా మహమ్మదుషాల పాలన

హుమాయూను మరణానంతర మాతని కుమారులు రాజ్యమునకువచ్చిరి. మొదటివాడగు నైజాముషా రాజ్య మునకు వచ్చిన కొలదికాలములోనే చనిపోవుటవల్ల అతని తమ్ముడగు మహమ్మదుషా రాజ్యమునకు వచ్చెను. ఇతని కాలముననే భామనీసుల్తానుల కీర్తి నల్దెసల వ్యాపించెను. దీనికి కారణము యితనియొద్ద సమర్థుడగు మంత్రిసత్తము డుండుటయే. 1469 లో మంత్రియగు గావాని కొంకణ మును, విజయనగర సంస్థానమునకు చెందిన గోవాపట్టణ మును జయించి భామినీసుల్తానుల కశేషకీర్తిని గడిం చెను. భామినీసుల్తానుల యౌన్నత్యమునకు కారకుడైన గావానీని చంపదలచి కొంతమంది సర్దార్లు ఈతనిపై కుట్రపన్ని చంపించిరి. మహమ్మదు గావానీ నలుగురు భామినీసుల్తానులకు మంత్రిగానుండి, రాజభక్తి పరాయ ణుడై, 78వ యేట నిట్టి దుర్మరణమునకు బాల్పడెను.

ఈతని మరణమునకు టర్కీ, పెర్షియా, ఆఫ్గనుస్థానముల పాలకులు మిగుల వగచిరి. దీనినిబట్టి పూర్వముకూడ విదేశస్థులకును మనకును సంబంధముండెడివని తెలియుచున్నది.

### రెండవ మహమ్మదుషా పాలన

మహమ్మదుషా అనంతరం మాతనికుమారుడు రెండవ మహమ్మదుషా రాజ్యమునకువచ్చెను. ఈతడు కీలుబొమ్మయై మంత్రి యగు 'నైజాముల్ ముల్క్ బెహరీ' చేతులలో నాడుచుండెను. ఈతని కాలమునందు దేశము అనేకకష్టములకు పాల్పడెను. రాజ్యమేలుట యందశక్తత గలవాఁడౌటచేత బామినీసుల్తానుల కీర్తి యీతనితో నడుగంటెను. 1490 సం. లో అబిసీనియన్లు దక్కను సరదార్లును, నేకమై పూర్వపు మహమ్మదీయ చక్రవర్తుల సంతతివానిని రాజుగాచేయదలచి మహమ్మదుషాను చంపదలచి కుట్రపన్నిరి. రాజు జాగ్రతవస్థ కలవాఁడై చావు తప్పించుకొని కుట్రదారుల దునుమాడి రాజ్యము తనయిష్టుల యాధీనముచేసి తాను సౌఖ్యములందు దగుల్కొనెను. ఢిల్లీ, లాహోరుపట్టణములనుండి వేశ్యలను రావించి, వారలచే నృత్యమాడించి యానందించెను. సుల్తాను ధనాగారమంతయు దొంగలు దోచికొనిరి గర్భాగ్ భవనమందు కల్లుకుండలుతొంపనమూకుచుండెను. మతగురువులు, విద్యాలయాచార్యులు తమతమ యథావిధులమరచి కడుపార మధువును గ్రోలి రాజుతోఁగూడి యానందించుచుండిరి. దేశమంతరాజకమేర్పడెను. దీనికి ఫలితముగ తెలింగానా జిల్లాయును, బీదరునకు జుట్టుపట్లనుండు ప్రదేశమును రాజు గోల్పోయెను.

### బీజపూరు సుల్తానుల యాధీనము

నైజాముల్ ముల్క్ అనంతరము కాశింబారిద్ మంత్రి అయ్యెను. ఈతనికాలమున బీరార్, బీజపూరు, అహమ్మదునగరములు స్వతంత్రతను ప్రకటించెను. మహమ్మదుషా తరువాత పేరునకుమాత్రము నలుగురు సుల్తానులు రాజ్యమేలిరి. తరువాత క్రమముగా రాజ్యము మంత్రుల యాధీనమై దేశమునందు యుద్ధము లెక్కుడై బీదరు పట్టణము బీజపూరుసుల్తానులకు చిక్కెను.

### హైద్రాబాదు నైజాము అధీనము

తిరిగి 1656 సం. ఔరంగజేబు విశేషకష్టమునకులోనై బీదరును 27 దినములు ముట్టడించి వశపరచుకొనెను. తరువాత క్రమముగా నైజాము స్వతంత్రతను ప్రకటించువరకు బీదరు మహమ్మదీయుల యాధీనమునందుండి తరువాత దక్కనునందున్న యితర దుర్గములతో పాటు నైజామువశమయ్యెను.

## క్రోధమూర్తి

పంద్యారం వెంకటసుబ్బయ్యగారు (యువకవిమండలి)

అం.బ

నా మనశ్శార్దూలమ్మున నీమనోజ్ఞ, మూర్తి ముగ్ధకురంగాంఘ్రిముక్తచిహ్న
లీయెడలఁ గూడ సుంతయు మాయ వకట, మాయదేవుఁడు మన నేమి సేయఁగలఁడో!
మన పరస్పరాలోకనమున నోదవిన, ప్రణయబంధము నీ వియద్ధాద్రిదినీ త
నుజు కరమ్ములు త్రెంచునో! నూతన ప్రసవలసన్మాల మనగళస్థలుల నిడునొ!
ఓ సార్వేశ్వర! యింతయేమిటికి భక్త్యద్రిష్టనై తావక
శ్రీసంపాది విలోచనాంతముల వాసిం బోవుచున్ దేహయా
త్రాసౌఖ్యంబును గాంచుటో! విడుచుటో! ప్రాణమ్ము వారాశి వీ
చీ సంతాన కలధ్వనిన్ హృదయవంశీనాదముం గూర్చుచున్.
అక్రిది రాకన్నె లొక్కని, వరించి వేఱొక్కని న్వివాహంబున నే
సిరికొరకొ! భ్రమసిపడి స్వీకరించు టీమాట వింతగా దెటులైనన్.



3. రంజనుమహాలు - అంతర్గృహాము



౪. భామినీసుల్తానుల గోరీలు




పంగనామముల రామచంద్రరావుగారు

అతులైశ్వర్య సుఖానుభూతి కలనాయత్తాత్మయా పూర్వభా
రత ధాత్రీశ్వరి స్వస్వరూపగుణసార జ్ఞానముంగల్గి యం
చిత నిష్కామత విశ్వమానవ జగత్క్షేమంకరోపాధి న
ప్రతిమానేశ్వర సేవలం దగిలె దేవా! వేంకటేశ ప్రభూ!

శా. ఆవిజ్ఞానము ధర్మసూత్ర రచనా వ్యాసక్తి ధర్మైక దీ
క్షా వైశద్యము భారతోర్వీజన సంఘ భ్రాతృభావంబు సే
వావర్తిష్ణుత బాధనాగరకతా ప్రాంచద్యశశ్చంద్రికా
ధావళ్య స్థిరగౌరవంబు చనెఁ గాదా నేఁడ శేషంబుగన్.

ఉ. మానవసోదరత్వ మసమానముగా గణియించి స్వార్థ మిం
తైనను జూడఁబోక వెనుకాడుట లేక రహించి లోక క
ల్యాణపరంపరానిరతమై నుతికెక్కెను దేశమాతృసం
తానము పూర్వమందున స్వతంత్రత నెంతయు నిల్వఁబట్టుచున్.

గీ. సకలవిషయంబులం బ్రపంచంబులోన, 'మాతృ'పద గౌరవంబు సంప్రాప్తమయ్యె
నిజమతాదర్శ శిల్పాది నిఖిలసుగుణ, వైభవోపేత భారత వర్షమునకు.

గీ. వెనుకఁ బాశ్చాత్యఖండంబు వెనుకఁబడుచు, సమధికాజ్ఞానపారవశ్యమునఁ దోఁగఁ
జండపాండిత్యతాండవోద్దండమగుచు, గండుమిగిలె భారతమహీమండలంబు.

సీ. వేదవేదాంగ భాషాదివ్య పాండితి, నార్జించి గౌరవం బందినారు,
బాహుప్రతాపాగ్ని కాహార మొనఁగిరి, నానావిరోధి కాంతారవిటపి,
దేశపరిశ్రమోదీర్ణ సంపల్లక్ష్మి, నునిచి రుత్తుంగసౌధోర్ధ్వసీమ,
మతకులాచార ధర్మప్రవచన భిక్షు, లారగించిరి బ్రాహ్మణాళి చెంత,
సాముదాయిక ప్రత్యేక చర్యలందు, భరతవర్షాభివృద్ధికై పాటుపడిరి
వరుసగా బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్ర, జనులు నిర్నిద్రశక్తి నిష్కపటవృత్తి

సీ. పరదేశవాణిజ్య ప్రబలవర్తకులకు, గ్రహచారయోగవైఖరులఁ దెలిపి
శాత్రవదోర్దర్ప శమనకృత్యములకు, ననువైన లగ్నంబు లనువుపఱచి
ఉపనిషత్సారపీయూషంబుచే లోక, విషయతృట్ఛాంతిఁ గావింపఁ జేసి
ఘనజటాక్రమపద గాన మాధుర్యంబుఁ, జెవియొగ్గు శ్రోతపైఁ జిలకరించి
అహరహంబును వాత్సల్యమాత్మలీన, పాఠముల్ శిష్య పంక్తికిఁ బట్టి కఱపి
శాంతి వాతావరణమున సౌఖ్యపడుచు, క్షితిసురులు తొల్లి గడపిరి జీవయాత్ర.

ఉ. భారతభూమి నద్దెసలపట్టుల దృష్టి నిగుడ్చినట్టియె
వ్వారికినైనఁ దోఁచు ననవద్య పురాతనభారతీయులే
ధారగ జ్ఞానపద్ధతిలతల్ సకలైకకళాప్రశస్తతో
దారప్రదర్శనాంబువులఁ దద్దయుఁ బెంచిరొ నిర్మలాత్ములై.

మ. తగు తార్కాణమొసంగు నిందు నిరవద్య ప్రౌఢికిం దావలం
బగుచున్ మానవబుద్ధి యల్లిక కచింత్యంబౌచుఁ గన్నార్పుచూ.
పుగముల్ నేనొక చీరికింగొనను నాఁబోల్పారుచున్ దివ్యదృ
ష్టిగతిం గూడ హరించునట్టి యలప్రాక్ఛిల్పం బనల్పంబుగన్.

గీ. వాక్కుచేతను మానసవర్తనమున, వర్ణనముఁ జేయఁగా లేఁడు పంచజనుఁడు
కఱకు ఱాగుట్టలోపలి కందరములఁ, బరిఢవిల్లెడి శిల్పంపుఁ బనితనములు.

శా. శుద్ధస్ఫాటిక దీప్తిపుంజవిలసత్ఛ్రోణీ ధరాళీగుహా
బద్ధోద్బోధకమందిరాంతర పురోభాగంబులన్ బాలకుల్
శ్రద్ధం గూర్చిన దేవతాలయములన్ సౌందర్యరేఖోజ్జ్వల
ద్బౌద్ధ స్తూపములం గనంబడును శిల్పప్రౌఢతాదర్శముల్.

సీ. ఆంధ్రదేశ క్షితీశావతంస సమగ్ర, కీర్తివల్లికల సాగించుపాదు,
సకలాగమపురాణశాస్త్ర చర్చాధీన, వైదుష్యములకెల్లఁ బట్టుఁగొమ్మ,
కృష్ణాస్రవంతిక కెంగేల విసరెడు, పైరపూజల్లు లుప్పతిలుతావు,
ప్రకృతి కాంతాముఖప్రాచుర్య మొప్పారు, నుద్యానవనపంక్తి కునికిపట్టు,
నవనవోన్మేషములకుఁ గాణాచిమెట్ట, ధాన్యపుంబంట ముక్కారు దనరు తావు
సుఖము పరసీమ సత్కళా సువుల నెలవు, ధాన్యకటకంబు సొగసుల దర్పణంబు.

గీ. ధాన్యకటకాది పూర్వపత్తనములందు, శిల్పికేల్దమ్మి చెక్కిన చెక్కడముల
సర్వ విషయంబులందు నాజ్ఞానధనులు, మోక్షముం జూపినారు ముముక్షువులకు.

శా. ఆనాఁడేర్పడి మార్గదర్శకము బ్రహ్మాండ ప్రభుత్వాళికిన్
నానాశాస్త్ర కళావిశారదులు విజ్ఞానాబ్ధిపారంగతుల్
మానప్రాణులు దేశగౌరవయుతుల్ లక్ష్మీసుతుల్ దత్ప్రజల్
రానేరా దిఁక నట్టికాలము జగద్రక్షా! కృపాంభోనిధీ!

ఉ. కొన్నిశతాబ్దముల్ వెనుకఁగూలెను హైందవపాలనంబు లం
త న్నెలకొల్పఁగాఁ బడియె నాజరుదీను ఫిరోజిషాహమా
ద్యన్నవ రామరాజ్యము లనామయమై మన దేశమాత విం
చె న్నుతులన్ దివాకరునిచేతులఁ బద్మినిభంగి నెంతయున్.

గీ. తురకరాజులు కొందఱు దుర్మదమున, నిజమతంబగు నిస్లాము నెపముచేత
స్పర్ధ మోసెత్తి హైందవ జనము నెల్లఁ, దవిలిబాధించి యుంట యథార్థమేమొ.

వ. అయినను.

శా. "అశ్వత్థామ గజంబు" బ్రుంగెననుచో నాడేన్ మృషన్ వహ్వారే!
శశ్వత్కీర్తి యమాత్మజుండనుచు ఘోషల్వెట్టుటే కాని త
ద్విశ్వస్తుత్యపవిత్ర జీవనము భావింపంగఁ బో రీగతి
న్విశ్వాసంబున జూడ రిస్లము నృపానేకోపకారంబులన్.

గీ. ప్రస్తుత ఫిరోజిషాపరిపాలనమున, వ్యాపనముఁ గొనె సత్ప్రతిష్ఠానములు
గలవు నక్షత్రశాల లఖండవృద్ధి, బళిరె! పూర్వనాగరకతా పాటవంబు.

శా. ఈవిద్యుత్తులు సద్భుత క్రియలు మున్నే నాఁడో హిందూప్రజా
భావోదగ్రతఁ జూఱుగొన్నటులు కబ్బంబుల్ నిరూపించు నా
శావర్తంబున నెల్లశాస్త్ర సముదాయంబుల్ విఘూర్ణిల్లె నీ
సేవావృత్తియె తక్కెఁబో భరతలక్ష్మీదేవి కంఠంబునన్.

ఉ. యూరపుఖండమందలి సముత్కట విస్మయకారిశోధ నా
ధార సమేతశాస్త్రము లుదారమనీషఁ దుఱంగలించు నీ
భారత నీతికోవిదులె వ్రాయఁగఁ గాలమువచ్చి యేడ కో
చేరెనటంచుఁ బెద్దలువచింతురు కన్నుల నీర ముంచుచున్.

గీ. అంతటఁ బటానుభూపతు లయిన వెనుక, హస్తినాపురరత్నసింహాసనమున
నక్బరాదులు గుణవంతు లడుగువెట్టి, ప్రజలదింపిరి కుత్తుకబంటి హాయి.

ఉ. భారతభూమిపాలనము పండితుఁ డగ్బరుభూమిభృత్సునా
సీరుఁడు చేతఁబట్టి ప్రజచిత్తములం గరగింపసాగెన
వ్వారిగఁ బాడి పంటలు నభంగగతిన్ ఫలియింపఁజేసి సం
సారము లార్థికంబుగ శ్రమంపడకుండగఁజేసె నర్మిలిన్.

చ. మొగలునరేంద్రచంద్రుని ప్రభుత్వమునందె రచింపఁగాఁబడెన్
నగరములన్ విశాలమయి నాణెపు సోయగపుంగోటారు నా
జగమునఁబేరు గాంచి సువిచారముఁ గొల్పెడి 'టాజ్మహాలు' ము
న్నగు మహనీయమందిరచయంబులు చూపఱ కక్షిపర్వమై.

మ. మొగలుల్ రాజ్యపదచ్యుతిం గనుటకుంబూర్వంబె యాంగ్లేయ పో
ర్చుగలుల్ డచ్చిపరాసువర్తకసమర్థుల్ వచ్చి పాదంబు వె
ట్టిగభీరోత్కట వర్తకానుగతధాటింజూప దేశాంబ యె
ట్టిగతిం గూరెనో నీవెఱుంగవొకో తండ్రీ! వేంకటేశప్రభూ.

గీ. వర్తకంబు కొన్నాళు లభంగరీతిఁ, దనరుచుండిన దామరతంపమగుచు
వర్షదినమందునను సుళ్ళపదువు వోలె, శ్వేతవర్తక సంఘముల్ చెదరిపడియె.

చ. తుదకుఁ బరాసు వర్తకుల దోర్బలమూడఁగ నాంగ్లవర్తకా
భ్యుదయమె మిన్నుముట్టెను ప్రభుత్వముపైఁ జవివుట్టె వారి కా
పిదప సహస్రయత్నములు ప్రేల్మిడిఁ జేయఁ దొడంగఁ గర్మ ప
క్వదశ విధాత చేయఁదగు గాఢ సహాయమొనర్చె వారికిన్.

వ. ఆంగ్లేయుండు రాజభక్తిమొదలగు విషయంబులు బోధించుచు రాజ్యపాలనంబు దిన దినాభివృద్ధిం బొందించుచుండె. పాశ్చాత్త్యులసహజనాగరకత దేశంబున నాటుకొనియె. వారి నాగరకతారీతిం జూచుచు స్వధర్మజ్ఞానంబు గలిగి మహోత్కృష్టకీర్తిచే విరాజిల్లు రవీంద్రుఁడు మొదలగువా రెందఱో మహాత్ములుగలరు; తదితరులుం గలరు. పాశ్చాత్య నాగరకతావిభవంబు జూచి చొక్కి యనేక విషయంబుల వారి ననుకరించిన నాజీవిత చరిత్రం బింత విన్పింతు. శ్రీవేంకటేశ్వరా! సావధానంబుగాఁ జెవి యొగ్గఁ బ్రార్థింతు. [సశేషము]






దిగవల్లి వేంకట శివరావు గారు, బి. ఏ., బి. యల్.



## ధర్మస్వరూపము

ఆర్యులకు ధర్మము పవిత్రమగు నుత్తమపురుషార్థము. ఇది మానవనిర్మితమగు విధికాదు. దైవప్రేరణమున మానవులకొఱ కేర్పరుపబడిన పవిత్రపథము. ధర్మముకన్న మిన్నయగునది వేఱొండియు లేదు. ధర్మమునకు లోబడనివస్తువు, మానవుడు, నసంభవములు. రాజుకూడ ధర్మబద్ధుడె. ధర్మాచరణ మాతని విధి. ధర్మము నాచరింపుమని శాస్త్రమె రాజును హెచ్చరించుచున్నది. ధర్మము మీమాంసకుల ప్రకార మపూర్వమైనది.

"ఒకని నింకొకడు ధర్మవిరుద్ధముగ బాధింపగ నాతడు రాజుతో మనవిచేసికొనినచో నది ధర్మపరిపాలనమున నొక వ్యవహారపద మగును" అని యాజ్ఞవల్క్యమహాముని యనినాడు. అందువలన "ధర్మవిరుద్ధుల నడతలవలననె ధర్మశాస్త్రపుహద్దు లేర్పడుచున్న"వను పాశ్చాత్య సిద్ధాంతమున కిది సరిపోలుచున్నది. ఈరెంటికి నొక్కటే భేదము. పాశ్చాత్యసిద్ధాంతము ప్రకారము ధర్మము రాజు నాజ్ఞలవలననే కలుగుచున్నది. ధర్మపరిపాలన మతడు స్వయముగ నేర్పఱచుకొనినపద్ధతి. మనసిద్ధాంతము ప్రకారము ధర్మము పరమేశ్వరునివలన నిర్ణయింపబడిన పురుషార్థము. రాజు నాజ్ఞలకన్న మిన్న.

"దండన ప్రజలను హద్దులలో నుంచును. వారిని కాపాడును. వారు నిదురింప నది మేల్కొనియుండును. అందువలన నది ధర్మస్వరూప మని పెద్దలు గ్రహించినారు." అని మను వచెను.[1]

ధర్మపరిపాలన రాజ కర్తవ్యము. మననృపాలుడు మనవలన సుంకములను పుచ్చుకొని సైన్యముల గూర్చుకొనుటమాత్రమేగాక మన క్షేమముకొఱకు ధర్మాచరణము చేయవలసియుండెను. "అట్లుచేయనిరాజు ప్రజల పాపములనెల్ల నొడిగట్టుకొను"నని మను వనినాడు.[2] రాజువలన రక్షణములేని ప్రజలు చేయుపాపమున సగమంతు రాజే భరించునని యాజ్ఞవల్క్యస్మృతి.[3]

రాజు ధర్మము పరిపాలింపవలయునే కాని ధర్మవిధులను సృజింపరాదు. రాజుచిన్నవిషయములందు నిర్ణయింపవచ్చును; కాని ధర్మనిర్ణయమును శాస్త్రజ్ఞులే చేయుచుండిరి. వీరుపవిత్రులును పండితులు నగు సద్బ్రాహ్మణులై యుండిరి.

ధర్మ మారువిధము లని మనుధర్మశాస్త్రమునకు భాష్యము వ్రాసిన మేధాతిథియు, యాజ్ఞవల్క్యస్మృతికి లఘుమితాక్షరము వ్రాసిన విజ్ఞానేశ్వరుడును వ్రాసియున్నారు. అవి వర్ణధర్మము, ఆశ్రమధర్మము, వర్ణాశ్రమధర్మము, గుణధర్మము, నిమిత్తధర్మము. సాధారణధర్మము నై యున్నవి. యాజ్ఞవల్క్యస్మృతియందు ధర్మశాస్త్రము ఆచారాధ్యాయ మనియు, ప్రాయశ్చిత్తాధ్యాయ మనియు, వ్యవహారాధ్యాయ మనియు మూడు భాగములుగ వ్రాయబడినది. వ్యాజ్యవ్యవహారములు, అప్పుగొనుట, ఒకరివద్ద కాపాడ నుంచిన ద్రవ్యమును

1. దండశ్శాస్తి ప్రజా స్సర్వా దండఏవాభిరక్షతి, దండస్సుప్తేషుజాగర్తి దండం ధర్మంవిదుర్బుధాః. మను. 7-18.
2. అరక్షితారం రాజానం బలి షడ్భాగహారిణమ్; తమాహు స్సర్వలోకస్య సమగ్రమలహారకమ్. మను. 8-308.
3. యాజ్ఞవల్క్యస్మృతి అ. 1. శ్లో. 337.

గూర్చినవి. స్వంతదారుడు కానివా డమ్ముట, సముదాయముగ లాభము పొందుట, దానముచేసిన ద్రవ్యమియ్యకుండుట, సేవకుని జీత మియ్యకుండుట, ప్రమాణమును మీరి నడచుట, ఒకరివస్తువును కొనియైన విక్రయించియైన పిదప సందేహించుట, ఎద్దునుకలవానికి మేపెడువానికి కలుగు వ్యాజ్యములు, పొలిమేరవ్యాజ్యములు, వాక్పారుష్యము, (తిట్టుట) దండక్రౌర్యము (కొట్టుట), చోరత్వము, కఠిన క్రియ, పరునిభార్య నపహరించుట, స్త్రీపురుషులధర్మము, విభాగవ్యాజ్యములు, జూదమాడుట యని పదునెనిమిదివిధము లని మను అనినాడు.[౧] బృహస్పతియు వ్యాజ్యకారణము లెల్ల నీవిభజనమునం దిముడు ననినాడు. నారదకాత్యాయను లింకను వివిధవ్యాజ్యములుగ విభజింపవచ్చు ననినారు.

శాస్త్రవిషయమునను, ధర్మపరిపాలనాపద్ధతులందును, ఆచరణమందును, శాస్త్రముయొక్క విలువయందును మనధర్మశాస్త్రము ప్రాచీనధర్మశాస్త్రములలో నెల్ల వన్నె కెక్కినది. ధర్మతత్త్వమును, స్వరూపమును, న్యాయబాధ్యతలను బాగుగ గమనించినది. మానవుల పరస్పరసంబంధములందు, క్లిష్టములగు సందర్భములందు సైతము మనధర్మము వర్తించుచున్నది. మనధర్మశాస్త్రమును, పరిపాలనావిధానమును ఆర్యులధర్మనిరతిని,సత్యానురక్తిని చాటుచున్నవి. మనశాస్త్రమున ధర్మవిధులెల్ల సకారణముగనె యున్నవి. తర్కశాస్త్రప్రకారము సకారణముగ లేని ధర్మసూత్రమును మనవిద్వాంసు లంగీకరింపలేదు. ప్రజాసామాన్యముయొక్క యోగక్షేమమును శాస్త్రము జాగ్రత్తగ గమనించినది. ధర్మము ప్రజలకొఱకె యను సంగతిని మనశాస్త్రజ్ఞులును గ్రహించిరి. ధర్మశాస్త్రవిధులను రాజుకూడ తిరస్కరింపజాలడు. వర్ణాశ్రమములనుబట్టి దండనవిధాన మేర్పరుపబడుట పొరబాటే కాని చిన్నలోపములఁ జూచి శాస్త్రమునే నిరసించుట పాడికాదు. మొత్తముమీద మనధర్మశాస్త్ర ముత్తమమైనది సూర్యుడు తూర్పుననె యుదయించి పశ్చిమమునకు పోయెననియు, నెల్లయెడల నొక్కేజ్ఞానజ్యోతి వెలుగుచున్నదనియు విమర్శకులు తెలిసికొనవలెనని చెప్పి కీర్తిశేషులగు ప్రియనాథసేనుగారు టాగూరు ధర్మశాస్త్రోపన్యాసము ముగించిరి.

## ధర్మాచరణము

మనుస్మృతియందలివ్యవహారాధ్యాయమున,స్మృతిచంద్రిక వ్యవహారకాండమున ధర్మపరిపాలనాపద్ధతి వివరింపబడియున్నది. శాస్త్రముల నెఱిగిన బ్రాహ్మణులతోను, మంత్రులతోను కూడిన సభయందు రాజే స్వయముగ ధర్మపరిపాలన సేయవలెను.[౨] రాజునకు తీరుబడి లేనిచో నొక ప్రాడ్వివాకున కనగా న్యాయాధిపతికి తనయధికారము నీయవచ్చును.[3] న్యాయసభ యనగా శాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులతో కూడినది.[౪] నిష్పక్షపాతులును వేదములను స్మృతులను పఠించి సత్యనిరతులైన ముగ్గురు, ఐదుగురు, లేక నేడ్వురుసభికులతో రాజు ధర్మ మాచరింపవలెను. శాస్త్రవేత్తలగు సభ్యులు తమ యభిప్రాయములను చెప్పవలెను. కాని మిన్నకుండరాదు. అసత్యము పలికినను మిన్నకున్నను పాపము వచ్చునని మనుస్మృతిలోను, ఇతరులు మాటాడకూడదని నారదవచనమును కలదు. ప్రాడ్వివాకుడు ద్విజుడై యుండవలెను. రాజప్రాడ్వివాకన్యాయాధికరణములు గాక కొన్నిసందర్భములందు కొన్నికుటుంబములును, సంస్థలును ధర్మపరిపాలనము చేయుచుండెను. ఈధర్మాధికరణముల

---

౧. "తేషా మాద్యమృణాదానం నిక్షేపోస్వామివిక్రయః;
సంభూయచ సముత్థానం దత్తస్యా నపకర్మచ.
వేతనస్యైవచా దానం సంవిదశ్చ వ్యతిక్రమః;
క్రయవిక్రయానుశయో వివాదః స్వామిపాలయోః.
సీమావివాద ధర్మశ్చ పారుష్యే దండవాచికే;
స్తేయంచ సాహసంచైవ స్త్రీసంగ్రహణ మేవచ.
స్త్రీపుంధర్మో విభాగశ్చ ద్యూత మాహ్వయ ఏవచ;
పదా న్యష్టాదశైతాని వ్యవహారస్థితావిహ."
మను. అ–8. శ్లో. 4-7.

౨. వ్యవహారాన్ దిదృక్షుస్తు బ్రాహ్మణై స్సహపార్థివః;
మంత్రజ్ఞై ర్మంత్రిభిశ్చైవ వినీతః ప్రవిశే త్సభామ్.
మను. 8. శ్లో. 1.

3. యదా స్వయం నకుర్యాత్తు నృపతిః కార్యదర్శనమ్;
తదానియు ఞ్జ్యాద్విద్వాంసం బ్రాహ్మణం కార్యదర్శనే. మను. 8. శ్లో. 9.

౪. యస్మిన్ దేశే నిషీదంతి విప్రా వేదవిదస్త్రయః;
రాజ్ఞ శ్చాధికృతో విద్వాన్ బ్రహ్మణస్తాంసభాం విదుః. మను. 8. శ్లో. 11.

పైన రాజే యున్నతన్యాయాధికారి. రాజు లేకుండ రాజసభలో నియ్యబడినతీర్పును రాజు సరిచూడవచ్చునని నారదవచనము.

నేడు మనము "సివిలుదావా" లని వ్యవహరించు నభియోగములవంటి వాని నాకాలమున నెవరైన మనవి చేసికొనినగాని రాజు గ్రహింప వీలులేదు. రాజుగాని ప్రాడ్వివాకుడు కాని వ్యాజ్యములను కల్పింపరాదు. ఒకరు తెచ్చిన వ్యాజ్యమును విచారింపకుండరాదు.[౧] నష్టపడినవానితో సంబంధ మున్నవాడుతప్ప, ఇతరు డభియోగము చేయకూడదు. సంబంధములేకనె వ్యాజ్యము తెచ్చినవానిని దండింపవలయునని నారదవచనము. అయిన నీవిధి నేరములను గూర్చిన విన్నపములకు వర్తింపదు.

వాది యడుసుతో న్యాయసభ యెదుటకువచ్చి తన యభియోగమునుగూర్చి విన్నవించుకొనవలెను. ఆసంగతులనెల్ల లేఖకుడు జాగ్రత్తగవ్రాయును. అంతట రాజు కాని సభికులుగాని వ్యాజ్యమునుగూర్చి యేమైనప్రశ్నింపవచ్చును. అటుపిమ్మట నిజముగ నీవ్యాజ్యమునకు కారణమున్నదాయని యోజించి సభవారు తృప్తిజెందినచో "సాధ్యపాలుడు"ను రాజోద్యోగిని ప్రతివాదిని తీసికొని రమ్మని యాజ్ఞాపింతురు. లేనియెడల నేటిసమ్మను పద్ధతిని లిఖితపూర్వకముగ నాజ్ఞాపింతురు. చాలకష్టమున మునిగి యున్నవారిని, ఎల్లప్పుడు ధర్మాచరణమున, దీక్షలందుండు వారిని, స్వయముగ వచ్చినచో చాలనష్టపడువారిని, రాజకార్యమునగాని శుభకార్యములందు కాని నిమగ్నులైన వారిని, మతిస్థిరము లేనివారిని, జబ్బుగానున్న వారిని, స్త్రీలను, ఇంకను తమకుతోచినవారిని స్వయముగ రమ్మని యాజ్ఞాపింపరాదు. కాని చాల గొప్పనేరము చేసిన వెంచవలసివచ్చినవారెవ్వరైనను స్వయముగ రావలసినదే. న్యాయసభవారి యాజ్ఞప్రకారము రానియెడల కొన్నియాక లపరాధము విధింపబడుచుండెను. వాదికి ఋణస్థుడు తనబాకీని ఎగవేయప్రయత్నించుచున్నాడని తోచినచో నేటితీర్పునకు ముందు పొందు అరెస్టుకన్నను సులభమగు నిర్బంధమున ప్రతివాది నుంచవచ్చును. ఈ నిర్బంధమునకు 'అసేధ'మని పేరు. ఇది నాలుగువిధములు. ప్రతివాదికి స్థానాటంకము కాని కాలాటంకము గాని ప్రయాణాటంకముగాని, కార్యాటంకముగాని, వాది కలిగింపవచ్చును.[౨] వాదిచెప్పిన విననిచో రాజాజ్ఞను తీసికొనిరావచ్చును. న్యాయస్థానమునకు స్వయముగ రప్పింప వీలులేనివారి కీనిర్బంధవిధి వర్తింపదు. అక్రమ నిర్బంధమేర్పరచినవారికిని క్రమనిర్బంధము తిరస్కరించినవారికి నపరాధము విధింపఁబడుచుండెను.

ప్రతివాది న్యాయసభవారియెదుటకు వచ్చినపిదప వాది వాని సమక్షమున నిలచి తన యభియోగ విషయములను సవిస్తరముగ మరల చెప్పవలెను. దావా సంగతులు, దావాకారణము, స్పష్టముగా విశదపరుపవలెను. పూర్వము చెప్పిన ప్రతిజ్ఞకు నిప్పటిసంగతులకును తారతమ్యమున్నచో వ్యాజ్యమునకె ముప్పువచ్చును. వాది వాజ్మూలమున కర్థములేనిచో, వాది అభియోగము చాల స్వల్పమైనసంగతికొఱకైనచో, ఋజువుచేయుటకు వీలులేనిసంగతియైనచో, అసంభవముగ తోచినను, వ్యాజ్య కారణమె కనబడనియెడలను సభవారు వాదిదావాను వెంటనే పరిహరింపవచ్చును. వాది వాజ్మూలమున నేమైన లేఖకప్రమాదదోషము లున్నయెడల ప్రతివాది సభకు రాకముందుగనె సవరింపవచ్చును. కాని తరువాత చేయరాదు. అట్లు చేయునెడల వాదనకు నిలుకడ యుండదని వారి యభిప్రాయము.

వాది విన్నపము జాగ్రత్తగ వ్రాయబడిన పిదప సాధారణముగ ప్రతివాది తత్క్షణమె యభియోగమునకు ప్రత్యుత్తర మీయవలెను. అయినను కానరాని సొత్తువిషయమునను, సాక్షిసాధనములు దేశాంతరముననున్నను, ప్రతివాది యశక్తుడైనను ఉత్తరమునకు కాలవ్యవధి యియ్యవచ్చును. ప్రతివాది తన యుత్తరమును వాది సమక్షముననె చెప్పవలెను వాది విన్నవించిన యంశముల కన్నిటికిని తగిన సమాధానములు విరళముగ స్పష్టముగ క్రమముగ చెప్పవలెను. ఉత్తరము నాలుగువిధములుగ నుండవచ్చును.[౩] సత్యోత్తరమున సంగతులెల్ల నిజములనియంగీకరింపవచ్చును. మిథ్యోత్తరమున నవి యబద్ధము లనవచ్చును.

౧. నోత్పాదయేత్స్వయం కార్యం రాజానాప్యస్యపూరుషః; నచప్రాపితమన్యేన గ్రసేదర్థం కథంచన. మను. 8-43,
౨. నారదవచనము. స్మృతిచంద్రిక, వ్యవహారకాండము.

కారణోత్తరమున వాది యభియోగముసంగతి యొప్పుకొనియు నది పరిహరింపబడుటకు తగిన ప్రత్యేకకారణమును చెప్పవచ్చును. పూర్వన్యాయోత్తరమున ముందీ వాది యొక్క వ్యాజ్యమున తనచే నోడింపబడెనని చెప్పవచ్చును. ఇది నేటి 'రీస్‌జూడికేటా' వాదనవంటిది.

ప్రతివాది ఉత్తరమైనపిదప ప్రమాణ విచారణ. ఇందు రుజువుభారము వాదిప్రతివాదులమధ్య శాస్త్రము బాగుగనె నిర్ణయించినది. సత్యోత్తరమున ప్రమాణమె యనావశ్యకము. మిథ్యోత్తరమున వాదికూడ ప్రమాణము బయలుపడునటులు చేయవలెను. తుదిరెంటను ప్రతివాదిదే రుజువుభారము. తుదిమూడును కలసిన మిశ్రోత్తరమున వాది యొక్క ప్రమాణమును ప్రతివాది రెండు ప్రమాణములను తీసికొనిరావలెను. మిథ్యోత్తరము కలసిన చెరియొక ప్రమాణము తీసికొనిరావలెను.౧

విచారణకుముందు వాదిప్రతివాదులమధ్య నీయబడు తీర్పుపర్యంతమును దావాఆస్తికి తగిన హామీ వారివలన పుచ్చుకొనవలెనని యాజ్ఞవల్క్యముని చెప్పినాడు. అట్లు జామీను నిచ్చువారు లేనిచో నుభయవాదులు విచారణ జరుగునంతకాలము క్రమముగ వచ్చుచుండవలెను.

మొదట వాది తెచ్చిన యభియోగము పరిష్కరింపబడునంతవరకును వాదిపైన ఎదురుదావా అంగీకరింపబడకూడదని నారదవచనము. కాని వాక్పారుష్యము దండపారుష్యము మున్నగు నేరములను గూర్చిన యభియోగములలో నెదురువ్యాజ్యము లంగీకరింపవచ్చును. ఏలయన శిక్షించుటయందు దీనినికూడ యోజింపవలసి యుండునని మితాక్షరము.

అభియోగవిషయములను మొదట నొకవిధముగ విన్నవించి తరువాత మరియొకవిధముగ చెప్పుకొన్నను, విచారణయందు సభికులకు తోడ్పడకున్నను, సభకు రాని యెడలను, పరారియైనను, సభవారికి ప్రత్యుత్తర మీయకున్నను వాదిదావా పరిహరింపబడును. సివిలుదావాలలో వాది మాటలలో పొరబాటు పడినంతమాత్రమున దావాకు భంగము రాదు. కాని నేరములవిషయమున నిదిజరిగిన ఫిర్యాదు భగ్నమగునని మితాక్షరము. న్యాయసభవారియనుజ్ఞ లేనిది దావాలు రాజీ కాగూడదు.

ప్రమాణవిచారణమున గ్రహింపబడు ప్రమాణసాక్ష్యము మూడువిధములైనది. లేఖ్యప్రమాణము, స్థానప్రమాణము, సాక్ష్యప్రమాణము. ఇది లేనిచో తొమ్మిదివిధములగు దివ్యప్రమాణములలో నొకటి. లేఖ్యము రాజవిధి, దేశవిధి యని రెండువిధములు. రాజవిధియైనది శాసనము, ఆజ్ఞాపత్రము, జయపత్రము, ప్రకటనపత్రము, నిబంధనపత్రము, అనుగ్రహపత్ర మను నారువిధములు. దేశవిధియైనది నేటి ప్రామిసరీనోటువంటి ధనస్వహస్తపత్రము, విక్రయపత్రము, దానపత్రము, విభాగపత్రము, పొలిమేరపత్రము మున్నగువిధములైనది. లేఖ్యప్రమాణమె చాల మంచిది. స్థానప్రమాణము వాది ప్రతివాదుల సాక్ష్యలు తెలుపుట కుపయోగపడును. ఇవి రెండును లేక సాక్షులుమాత్ర మున్నను దివ్యప్రమాణమును రాజంగీకరింపడు. కాని దండపారుష్యము మున్నగు గొప్ప నేరములందును, చాలకాలమునాటి సంగతులను గూర్చిన వ్యాజ్యములందును సాక్ష్యముతోపాటు దివ్యప్రమాణము నుపయోగించును. దివ్యప్రమాణమున తుల, అగ్ని, జల, విష, కోశ, తండుల, తప్తమాషములు, ఫాలకపాలు నుపయోగింపబడుచుండెను. ఆచారముల విషయమునను, దారులనుగూర్చిన తగాయిదాలలోను, ఆవరణ, నీటివసతి తగాయిదాలలోను, స్థానప్రమాణబలిమిని, లేఖ్య ప్రమాణము మాత్రమే రాజు గ్రహించును. నిర్ణీతులు, నిర్ణీతులు కానివారు నని సాక్షులు రెండువిధములైనవారు. సాక్షులు, యోగ్యులును, గృహస్థులును, బిడ్డలు కలవారును, ధర్మపరులును సత్యనిరతులునై యుండవలెను.౨ న్యాయాధికారి సత్యమును ద్రవ్యముయొక్క మొత్తమును, సాక్షులయొక్క నిశ్చయమును, దేశమును, అపరాధము యొక్క యల్పాధిక్యములను కాలమును యోజించిచూచి తనఆత్మ నరకము బొందకుండునట్లు తీర్పు చేయవలెను.౩ బయటకు తెలియవగిన ముఖకాంతి, క్రిందిచూపు మొదలగు

౧. కాత్యాయనవచనము, స్మృతిచంద్రిక వ్యవహారకాండము.

౨. గృహిణః పుత్రిణో మౌలాః క్షత్రవిట్ఛూద్రయోనయః; అర్థ్యుక్తాః సాక్ష్యమర్హంతి న యే కేచి దనాపది. మను. 8-62.

3. సత్యమర్థం చ సంపశ్యే దాత్మానమథ సాక్షిణః; దేశం రూపం చ కాలం చ వ్యవహారవిధౌ స్థితః. మను. 8. 45.

నభిప్రాయసూచన, చెమట, గగుర్పాటు, చేయితొట్రుట మొదలగు చేష్టలు, కనుసంజ్ఞ వీనిచేత వ్యాజ్యగాని మనస్సులోని భావము నెఱుగవలెను.[౧] అసత్యము చెప్పు సాక్షి యెల్లప్పుడును కదలుచుండును. పెదవిమూలలను నాకుచుండును. వానినుదుట చెమటలు పోయును. మోము వివర్ణమగును. నోరు ఆరిపోవును. మాట తడబడును. చెప్పినదానిని కాదని పలుమఱు దిద్దుచుండును. దేశములోని యాచారమునుబట్టి లేఖ్యప్రమాణావశ్యకతయు విలువయు నుండును. సాక్షులు సభకు రాగనె న్యాయాధిపతి వాదిప్రతివాదుల కెదుట నిలిపి వారికి ధర్మమును తెలియచెప్పి శాస్త్రప్రకారము ప్రశ్నించును.[౨]

ఈధర్మములు మనుస్మృతియందు ౬0-వ శ్లోకము మొదలు 113-వ శ్లోకమువఱకును చెప్పబడియున్నవి. అబద్ధసాక్ష్యము చెప్పినవానికి దండనయు 120-వ శ్లోకము మొదలు 130-వ శ్లోకమువఱకును చెప్పబడినది. అబద్ధపుసాక్ష్యము పలుకబడినదని తెలియవచ్చినచో నావ్యాజ్యము తీర్మానము చేయబడియుండినను త్రోసివేయబడును. అందు చేసిన దండనయు మార్చబడిపోవును. విచారణ ముగిసి తీర్పుచెప్పుసమయముగ నుండినను మఱల విచారింపవలెను.[3] అక్రమముగ చేయబడిన తీర్పువలన కలిగెడు నధర్మమందు నాలుగింట నొకవంతు తప్పుచేసినవానికిని, ఒకవంతు సాక్షులకు నొకవంతు సభ్యులకునుమఱియొక భాగము రాజును పొందుచున్నది.[౪] ఒకసంగతి కాదని, దానికివ్యతిరేకమగు సంగతిని ఋజువు చేయుటవలన నిర్ణయింపవచ్చును కాని ఒకసంగతి కాదని ఋజువుచేసినంతమాత్రమున దానికి వ్యతిరేకమగు సంగతి నిజమని నిర్ణయింపరాదు ఒకసంగతి యగుననియు కాదనియు దివ్యప్రమాణమున నిర్ణయింపవచ్చునని శాస్త్రమువలన తెలియుచున్నది.

ప్రమాణవిచారణ యైనపిదప న్యాయసభవారు వ్యవహారనిశ్చయము చేయుచుండిరి. వ్యాజ్యమున గెలిచినవానికి జయపత్ర మొసగుచుండిరి. ఇందు వాదనముల సారాంశము, సాక్ష్యసారాంశము, వ్యాజ్యమునకు వర్తించు ధర్మము, న్యాయసభవారి యాలోచనము, తీర్మానము నుండును. దీనిపైన న్యాయాధికారి చేవ్రాలును రాజముద్రికాచిహ్నము నుండెను.

స్త్రీలయొద్దను రాత్రియందును, ఊరిబయటను, ఇంటిలోపలను, పగవానిస్థానమందును, రహస్యమునను, నిశ్చయింపబడిన వ్యవహారమందును, శక్తిద్రవ్యాపేక్ష మొదలగువానివలననిశ్చయింపబడిన వ్యవహారములందును, అజ్ఞానముచేతగాని పక్షపాతమువలనగాని తప్పునిశ్చయమగును; గనుక పునర్విచారణ కర్తవ్యమని నారదవచనము. బృహస్పతి, యాజ్ఞవల్క్యులు నిట్లె చెప్పినట్లు స్మృతిచంద్రికలో వ్రాయబడియున్నది.

## ధర్మశాస్త్రమునకు మూలాధారములు

ధర్మపద్ధతి యెట్లుండెనో కొంత తెలిసికొనిన పిదప మనధర్మశాస్త్రమునకుగల యాధారముల నెఱుగవలసియున్నది. మనువే "వేదములు స్మృతులు సదాచారము ఆత్మతుష్టియు ధర్మమునకు ప్రమాణము"లని నాడు.[౫] వేదములు, శృతులు, ఇవి పవిత్రప్రమాణములు. అయినను వీనియందు మన ధర్మశాస్త్ర విద్యార్థికి గావలసిన విషయములు చాల తక్కువ. ఇక మన ధర్మశాస్త్రమునకు స్మృతులే మూలాధారములుగ నున్నవి. ధర్మసూత్రములెల్ల నిందే యున్నవి. స్మృతులలోనెల్ల మనుస్మృతి యగ్రగణ్యము. ఇదిగాక యాజ్ఞవల్క్య, అత్రి, విష్ణు, హారీత, ఉశనస, యమ, ఆపస్తంబ, సంవర్త, కాత్యాయన, బృహస్పతి, పరాశర, వ్యాస, నారద, శంఖ, లిఖిత, దీక్ష, గౌతమ, శతాతప, వసిష్ఠ, బోధాయనధర్మ

---

౧. బాహ్యైర్విభావయేల్లింగైర్భావ మంతర్గతంనృణామ్,
స్వరవర్ణేంగితాకారై శ్చక్షుషా చేష్టితేనచ. మను. 8-25.

౨. సభాంత స్సాక్షిణఃప్రాప్తా నర్థిప్రత్యర్థి సన్నిధౌ;
ప్రాడ్వివాకోనుయుంజీత విధినా తేన సాంత్వయన్.
మను. 8–79.

3. యస్మిన్ యస్మిన్ వివాదేతుకౌటసాక్ష్యంకృతంభవేత్
తత్తత్కార్యం నివర్తేత కృతంచా ప్యకృతం భవేత్.
మను. 8–117.

౪. పాదో ఽధర్మస్య కర్తారం పాద స్సాక్షిణ మృచ్ఛతి,
పాద స్సభాసద స్సర్వాన్ పాదో రాజాన మృచ్ఛతి.
మను. 8–18.

౫. వేదఃస్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః;
ఏతచ్చతుర్విధం ప్రాహు స్సాక్షాద్ధర్మస్య లక్షణమ్.
మను. 2.12.

శాస్త్రములును, సుప్రసిద్ధములె. ధర్మసూత్రములు గద్యమునను, ధర్మశాస్త్రములు పద్యమునను కనబడుచున్నవి. వీనియందు దేశకాలపరిస్థితులనుబట్టి కొన్ని భేదములు కానవచ్చుచున్నవి. ఈభేదముల జాలవఱకు సమన్వయము చేయవచ్చును. అట్లు వీలులేనిచో నేది మంచిదని తోచిన దానినె గ్రహింపదగునని నారదవచనము.

సదాచారము కేవల మపూర్వమైన ధర్మలక్షణము కాదు. ఆచారమునకును ధర్మశాస్త్రప్రమాణ ముండియుండుననియు నది మఱువబడినదనియు కొందఱియభిప్రాయము. ఒకప్రదేశమున, తెగయందు, కుటుంబమున నున్న యాచారమును మన్నింపవలెను. లేనియెడల ప్రజలలో కల్లోలము కలుగునని బృహస్పతి యనినాడు. అట్టి యాచారము ధర్మవిరుద్ధము కానిచో దానిని ప్రమాణముగ గ్రహింపవచ్చునని ఆపస్తంబవచనము. ఈ విషయమున మనఋషుల యభిప్రాయమును బ్రిటిషు ప్రీవీకవున్సిలు న్యాయసభవారు నామోదించి మన్నించి "హిందువుల ధర్మమునుబట్టి ఆచారము స్పష్టముగ ఋజువైనచో శాస్త్రముకన్న నెక్కుడుగౌరవార్హ మనిరి."౧

ఆత్మకు ప్రియమును సంగతియు ధర్మమునకు మూలాధారమె కాని దీనిప్రమాణము వైకల్పికమని గార్గ్య వచనము కలదు. వేఱుప్రమాణము లేనప్పుడే ఇది ప్రమాణ మగును.

ఇదిగాక ఋషిప్రోక్తములగు మనపురాణములును మనధర్మశాస్త్రమున కుదాహరణములను చూపి సాహాయ్యము చేయుచున్నవి.

మనధర్మశాస్త్రమును చక్కగపరికించి, వివరించిన కొందఱు పండితులు వానికి విపులములగు నిబంధగ్రంథములను వ్రాసినారు. కాలము కడచినకొలది మన ధర్మశాస్త్రములు వీరిగ్రంథముల ముఖమునవె ప్రజలు గ్రహించిరి, పాలకులు పరిపాలించిరి. కాలము మారుటయు నాచారమును మారుచుండెను. నిబంధకారుల సిద్ధాంతములందు భేదములు కానవచ్చెను. ఇయ్యభిప్రాయభేదములను బట్టి సాంప్రదాయభేదము లేర్పడెను. వంగదేశమున దాయభాగసాంప్రదాయమును, తక్కిన చోటుల మితాక్షరసాంప్రదాయము నాచరణయోగ్యము లయ్యెను. మితాక్షరసాంప్రదాయమునను, వీరమిత్రోదయనిర్ణయసింధువులనుబట్టి కాశీవారును, వివాదచింతామణి, వివాదరత్నాకరములనుబట్టి మిథిలవారును, వ్యవహారమయూఖవీరమిత్రోదయ నిర్ణయసింధువులను బట్టి మహారాష్ట్రులును, స్మృతిచంద్రికా పరాశరమాధవ వీరమిత్రోదయములనుబట్టి దాక్షిణాత్యులును ధర్మశాస్త్రములను గ్రహించి యాచరించుచుండిరి. దత్తతవిషయమున దత్తకమీమాంసయు చంద్రికయు, గణనీయములయ్యెను. ధర్మాచరణపద్ధతియు శాస్త్రవిషయము నాయాప్రదేశముల సాంప్రదాయములప్రకారము నిర్ణయింపవలెనని ప్రీవీకవున్సిలువారును తీర్మానించిరి.౨

## ధర్మశాస్త్రపరిణామము

కాలము మారినది. బ్రిటిషుపరిపాలనమున మొదటి దినములలో పండితులసాహాయ్యమునధర్మశాస్త్రమునుపరిపాలించిరి. క్రమక్రమముగ బ్రిటిషున్యాయస్థానములందు, ముఖ్యముగ ప్రీవీకవున్సిలువారి తీర్పులవలనను, భారతీయ శాసనసభలు చేసిన చట్టములవలనను ధర్మపరిపాలనమున, శాస్త్రమున, నాచరణమున, జాలమార్పులుకలిగినవి. 1850 సంవత్సరమున హిందూమతకుల స్వేచ్ఛచట్టమును, 1870 లో మరణశాసనములచట్టమును, 1856 లో హిందూ స్త్రీల పునర్వివాహచట్టమును, 1886 లో హిందూదేశపు క్రైస్తవులవివాహముల రద్దుచట్టమును, 1882 లో దానదమన విక్రయములచట్టమును (Transfer of Property Act) 1875 లో యుక్తవయస్సు చట్టమును, 1290 లో గార్డియను వార్డులచట్టమును, 1872 లో ఇండియన్ కాంట్రాక్టు(ఖరారుల)చట్టమును, సాక్ష్యస్మృతి (Evidence Act) వారసత్వపత్ర చట్టము, దండనస్మృతి, సివిలు క్రిమినలు ప్రొసీజరులు, కాలదోష చట్టము మన్నగునవి మన ధర్మశాస్త్ర పద్ధతులందును ఆచరణమందును కొన్ని మార్పులు కలిగించినవి. అయినను మనవారసత్వములందు వివాహవిషయములందు ఇతర ఆచారములందును తగ

౧. ౨. 12. M. I. A. 397. మధుర కలెక్టరు, వి. ముత్తురామలింగ సేతుపతి.

వులు వచ్చినప్పుడు, సాధ్యమగునంతవరకు పై మార్పులు వచ్చినచోట్లతప్ప మన ధర్మశాస్త్రమె యుపయోగింపబడుచున్నది. నేడు మన ధర్మశాస్త్రమును సమిష్టికుటుంబధర్మము, విభాగము, ఋణములు, వారసత్వము, వివాహము, దత్తత, స్త్రీధనవారసత్వములు, దానములు ధర్మసంస్థలు, మరణశాసనములు, మనోవర్తి మున్నగు విషయములుగ విభజించి చూచినచో ప్రాచీనధర్మశాస్త్రపద్ధతులందు నవీనపద్ధతులవలన కలిగినమార్పులు విశదమగును.

నేడు పైనచెప్పబడిన మార్పులతోడిదె హిందూధర్మ మెవరెవరికి వర్తించునని చూడగ తీర్పులనుబట్టి యిది తేలుచున్నది: పుట్టుకచేతను మతమునను[౧] హిందువులైనవారికిని, హిందువులము కామని బహిరంగముగ చెప్పుకొననివారికిని,[౨] హిందూదంపతులకు పుట్టిన అధర్మసంతానమునకు,[౩] హిందూతల్లికిని, క్రైస్తవతండ్రికిని పుట్టి హిందువులుగ పెరిగినవారికిని (వీరికి సమిష్టికుటుంబధర్మములు వర్తింపవు),[౪] జైనులకును,[౫] సిక్కులకును,[౬] నంబూదిరిబ్రాహ్మణులకును,[౭] హిందూమతమును వదలియు ప్రాయశ్చిత్తము చేసికొనివచ్చినవానికిని,[౮] వర్తించును. అయినను క్రైస్తవతల్లికిని హిందూతండ్రికిని పుట్టి క్రైస్తవుడుగనె పెరిగినవానికిగాని,[౯] హిందూతండ్రికి మహమ్మదీయ ఉంపుడుకత్తెవలన పుట్టినవానికిగాని,[౧౦] క్రైస్తవమతముపుచ్చుకొనినవానికిగాని,[౧౧] ప్రత్యేకముగ నొక తెగగా నేర్పడి వింతమతాచారములతో నున్నవారికిగాని వర్తింపదు.[౧౨] ఒకదేశమునుండి యింకొకదేశమునకు పోయినను మొదటి సాంప్రదాయమె యాకుటుంబమునకు వర్తించును; కాని వారు క్రొత్తయాచారము నవలంబించినచో క్రొత్త సాంప్రదాయము వర్తించును.[౧౩] నేడు మన దేశమున నున్న ఉన్నతన్యాయస్థానముల తీర్పులును, ప్రీవీకవున్సిలువారి తీర్పులును ధర్మసహితముగ నున్నవని తీర్పులయందె కలదు.[౧౪] నేడు మనకివియె ప్రమాణములైనవి. ఇదియె మనహిందూధర్మశాస్త్రపరిణామము.

౧. 9 M. I. A. 199.
౨. 31 Cal. 11.
౩. 18 Cal. 264.
౪. 8 M. I. A. 420.
౫. 25 C. W. N. 273.
౬. 31 Cal. 11.
౭. 34 Mad. 496.
౮. 30 Cal. 999.
౯. 27 Mad. 13.
౧౦. 2 Lah. 243.
౧౧. 49 Cal. 310.
౧౨. 49 Cal. 310.
౧౩. 40 Cal. 407, 48 Cal 30.
౧౪. 10 Cal. 82, 17 Bom. 555.

---

# అనుభవిస్తున్నానురా

కొడాలి వెంకటసుబ్బారావు, కామరాజు గడ్డ శివయోగానంద రావుగార్లు

౨

మంచు గప్పిన పూల
మాలలన్నీ గూర్చి
వాటితోటే అమ్మ
మాటె మరుతామంటె
దుఃఖంపు కెరటాలురా-దైవమా
దొల్లుకొని వస్తాయిరా.

యెనకజన్మంలోన
యేతల్లి పిల్లలకు
యెడబాటు కల్గిచ్చి
యేడిపిస్తినోగాని
అదె యెదురుగోడతాదిరా-దైవమా
అనుభవిస్తున్నానురా.

మాతృకారుడు చంద
మామ రాహువు జూడ
కుంభాన కేతువుతో
కూర్చుండె నారింట

నని జోస్యు లంటారురా-అందుకీ
యనుభవం బంటారురా.

మీయమ్మ యేదంచు
మిత్రు లడిగేవేళ
అమ్మ యెట్లుంటుందో
అసలే యెరుగమంచు
తమ్ముళ్లు చెపుతారురా-కడుపట్లు
తరుగుకొని పోతుందిరా.

కోడలెక్కడ యంటు
కొత్తవాళ్లడిగితే
బామ్మ కన్నీళ్లతో
బదులు చెప్పేవేళ
గుండెనీరై పోవురా-దైవమా
మొండిజీవిత మేలరా.

ఏలోపముం లేని
యిరువు లెన్నున్నాను
గొప్ప కొరతొక్కటే
గోచరిస్తుంటాది
దానిదీర్చుట ఎట్లురా-మనసుకది
తట్టుకుంటున్నాదిరా.

ఆటల్లో మరిగున్న
ఆనందసమయాన
ఆచరించిన యట్టి
అపరాధముల సంఖ్య
లన్నిటికి ఫలమిద్దిరా-దైవమా
అనుభవిస్తున్నానురా.

దేవతార్చన పెట్టె
తీసి తాతకు నియ్య
పులిగాపు జేస్తూనే
పూజించినట్లుంటె
అమ్మ భక్తిని జూస్తిరా-నీమీద
ఆశ లప్పుడె పుట్టెరా.

గోమాత దరికొస్తె
గోకుతూం లాలిస్తు
తల్లిపిల్లల్లాగు
తరలి వస్తుంటేను
అమ్మప్రేమను జూస్తిరా-ఆప్రేమ
కంతులేదను కొంటిరా.

శివరాత్రి యాత్రకై
శ్రీశైల మెడుతుంటె
అమ్మమ్మ మారుపడ
అమ్మ యేడుస్తుంటె
అదిజూచి నవ్వానురా-దైవమా
అనుభవిస్తున్నానురా.

బళ్లోకి బోవుటకు
బద్ధకం పుడితేను
సెలవుకై అమ్మమా
సికమంచు బొంకాను
అది నిజంబైపోయెరా-దైవమా
అనుభవిస్తున్నానురా.

విసిగించి విసిగించి
వేధిస్తు వుంటేను
"నేజచ్చినాకలే
నీపాట్ల"నుచు అమ్మ
యనుట నిజమైపోయెరా-దైవమా
అనుభవిస్తున్నానురా.

కాసేపు కూసేపు
కాదు యీ అనుభవము
కడతేరి నీలోన
కలిసి పోయేదాక
కలకవేయుచు నుండురా-దైవమా
కడుపుమండుచు నుండురా.

# హిందూదేశమున గ్రహారాధనము

నిడుమోలు కనకసుందరం గారు, బి. ఏ., ఆనర్సు

(రెండవసంపుటము – ఏడవసంచిక తరువాయి)

## మధ్యయుగమున గ్రహారాధనము

ఇక, మధ్యయుగమున ప్రచారములో నున్న గ్రహపూజావిధానమును పరిశీలింతము. క్రీస్తు శకానంతరము నాలుగవ శతాబ్దమునందు రచింపబడిన యాజ్ఞవల్క్యస్మృతి యిటులు శాసించుచున్నది.

"శాంత్యభ్యుదయముల నాశించువారు గ్రహముల పూజింపవలెను. వర్షముకొరకు, దీర్ఘాయువుకొరకు,(పుష్టి కొరకు)ను ఆప్రకారమే చేయుము. సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు శని, రాహువు, కేతువు అనునవియే గ్రహములని జ్ఞాపకముంచుకొనవలెను."

"ఆగ్రహములకు వరుసగ, రాగి, స్ఫటికము, శిల, అరుణగంధము, బంగారము, వెండి, ఇనుము, సతు(తుత్తునాగము), కంచు సమర్పింపుము. వానిని వలయాకారమున నుచితవర్ణములతో, గంధముతో చిత్రింపవలెను. లేకున్న వానివివిధవర్ణములుగల వేలికలతోగాని, పువ్వులతోగాని సూచింపవలెను. సుగంధములు, పూలదండలు, గుగ్గులు ధూమములును సమర్పింపవలెను. మంత్రములతో వానిని పూజింపవలెను."

అటుపిమ్మట వేర్వేరు గ్రహములకు వేర్వేరుమంత్రములు సూచింపబడియున్నవి. ప్రత్యేకగ్రహములకు సంబంధించినంతవరకు వేదగ్రంథములందుదహరింపబడిన భాగములనే గ్రహించి, వానిని మంత్రములుగ నేర్పరచియుండినటుల కన్పడుచున్నది. ఆ సంబంధము సూర్యచంద్రుల విషయమునను, కొంతవరకు బృహస్పతి విషయమునను తప్ప తదితరగ్రహముల నామమాత్రముననే గ్రహింపబడినటుల నున్నది. ఏలనన, వేదములందు వర్ణింపబడిన గ్రహముల స్వరూపస్వభావాదులకును, మధ్య యుగమున జ్యోతిషగ్రంథములందు వర్ణింపబడినవానికిని సాంగత్యము నుపపడుట లేదని యిదివరకే చెప్పియుంటిని. చూడుడు. ఋగమంత్రము, "ఉద్బుధ్య......" అనగా "మేల్కొనుము......" అని యుపక్రమించుచున్నది. శ్వేతయజుర్వేదమను గ్రంథమునుండి యీక్రిందిభాగములు గైకొనబడినవి.*

సూర్యుడు:— (మనక) చీకటిని నిరంతరము నాశనమున ముందున కుపక్రమింపజేయుచు, అమరులను మర్త్యులను శాంతింపచేయుచు, తన బంగరురథమునెక్కి జీవకోటినిగాంచుచు, సావిత్రి, దేవుడు, వచ్చుచున్నాడు. (శ్వే.య. వే. xxxiii-43; ఋ. వే. i-35)

చంద్రుడు:— అట్టి జాతిలో, అట్టిపురుషునకును, అట్టివనితకును సుతుడనగు నాయొక్క నిరంకుశాధికారమును, ప్రబలనాయకత్వము నెదుర్కొనెడివారు ఎవరును లేకుండునటుల దేవతలు నా(కనుగ్రహింతురు) గాక! ఓ జాతీయులారా! వీడే మీ ప్రభువు! మన దేవతలకు సోముడే ప్రభువు, రాజు. (శ్వే. య.ix-40)

అంగారకుడు:—అగ్నియే ఆకాశమునకు శిరస్సు.. ... పృథ్వికి యజమాని అతడే. అతడు నీటి(తో) విత్తనములను పెంచుచున్నాడు. (శ్వే.య.iii-12)

బుధుడు:—ఓ అగ్నీ! మేల్కొనుము. ఆతని జాగరూకతతో కాచి యుండుము. అభీష్టమునుఫలమును నేకమై యటులేకలసియుండును. సర్వదేవతలును, యాజ్ఞికుడును యిచ్చటను, స్వర్గమందును, స్వస్థులై యుందురు. (శ్వే. య. xv–54).

* గ్రిఫ్ఫీతుగారి White yazur Veda యనునాంగ్లగ్రంథమునుండి తెలుసు.

బృహస్పతి:—ఆశ్చర్యకరమగు నా పెన్నిధిని, శత్రువుల సత్సంపద నతిక్రమించెడిదానిని, ప్రజలలో సార్థకమై దివ్యమై వెలిగెడిదానిని, బలోపేతమై శాస్త్రజమగు దానిని, బృహస్పతీ, మాకు ప్రసాదింపుము. బృహస్పతీ, యిదియే నీస్థావరము (స్థానము).

[శ్వే. య. xxvi–3; ఋ. వే. ii –23(15)]

శుక్రుడు:—మురుగులు గ్రక్కెడి యాహారముయొక్క రసమును, రాజ్యాధికారమును, బ్రహ్మవలన ప్రజాపతి గ్రోలెను...... నాశ రహితమగు నీమధుక్షీరమే ఇంద్రుని సామర్థ్యము. (శ్వే. య. xix–75)

శని:—మనకు సహాయకారులగు దివ్యజలములు, మనము పానముచేయుటకు మధువుగనుండుగాత. మనకు ఆరోగ్యము బలముకలుగునటుల ప్రవహించుగాక!

(శ్వే. య. xxxv–12, ఋ. వే. x–94)

రాహువు:—దివ్యుడై, నిరంతరాభ్యుదయముగల (యీ) మిత్రుడు మనకెట్టి ప్రశాంతిని కొనిరాగలడు? ఎట్టి బలోపేతమగు పరివారముతో (వచ్చును)?

(శ్వే. య. XXVII–39 ఋ.IV–31)

కేతు:—ప్రకాశరహితము లగుచోటుల జ్యోతిర్వంతములుగ జేయుచు, స్వరూప రహితము లగుచోటుల స్వరూపముల కల్పించుచు, నీవు, ఉషస్సులతోగూడి జనించితివి. [శ్వే. య. xxix–37; ఋ 1-6 (3)]

క్రీస్తుశకము ఆరవశతాబ్దమునందు వరాహమిహిరాచార్యుడు, బృహత్సంహిత (CIV- 47)యందు గ్రహారాధనక్రమము నిట్లు సూచించియున్నాడు: "సూర్యాంగారకులను, అరుణపుష్పములతోను, సుగంధముతోను, వకుళపుష్పములతోను, రాగి, బంగారము, వృషభములను బ్రాహ్మణులకు దానముచేసి పూజింపవలెను. శ్వేత గోదానముచే చంద్రుని పూజింపవలెను. శుక్రుని, శ్వేతపుష్పములతోను, వెండి, మధురపదార్థములను దానమొనర్చుటవలనను, పూజింపవలెను. నల్లనివస్తువుల దానముచే శనిని, రత్నములు, వెండి, తిలకపుష్పముల దానములతో బుధుని పూజింపవలెను. (పసుపు)పచ్చని పుష్పములు, పదార్థములయొక్క దానములతో బృహస్పతిని పూజింపవలెను."

## గ్రహముల ప్రతిమలు

మన కీకాలమున లభించిన ప్రాచీన శిలావిగ్రహములవలన కొంతవరకు గ్రహములయొక్క రూపరేఖావిలాసములను గ్రహించియున్నాము. ఈ విషయములే, గ్రంథరూపమున, పురాణములందును, ప్రాచీన జ్యోతిశ్శాస్త్రములందును, ఆధునికపద్ధతులు, పంచాంగములు మొదలగువానియందును వివరింపబడియున్నవి.

ఈ నడుమ కొన్ని ప్రత్యేక సూర్యగ్రహ ప్రతిమలు దొరకియున్నవి. కాని, వానికి గ్రహవర్గముతో నెట్టి సంబంధము నున్నట్లగపడదు. అట్టి ప్రతిమలందొక్క సూర్యదేవుడేగాక, వివిధవస్తువులును, కొంతపరివారమును ప్రదర్శింపబడి యున్నవి.

ప్రాచీన దేవాలయముల గోడలపై, నవగ్రహప్రతిమలు చెక్కిన ప్రాచీన శిల్పములు కొన్ని మనకు లభించుచున్నవి. వానియందు, సర్వసాధారణముగా, రాహుకేతువులు తప్ప తదితరగ్రహము లన్నియు, నరరూపమున,—అందును పురుషరూపమున నున్నవి. వంగదేశమున లభించిన యొకరాతిపలకపై నున్న చెక్కడములలో, శుక్రగ్రహము స్త్రీరూపమున ప్రదర్శింపబడి యున్నదట. శుక్రగ్రహమును వీనస్ (Venus) అని గ్రీకులును, వారిద్వారమున పాశ్చాత్యు లెల్లరును పిలుచుచున్నారు. కావుననే, 'వీనస్' వలెనే శుక్రుడును స్త్రీగ్రహమని వా రపోహము జెందియున్నారు. కొనారకునందు దొరకిన చెక్కడములను వర్ణించుచు, స్టర్లింగు (Stirling) దొరగారు (Asiatic researches xv–232) "కాయ పటుత్వముగల యౌవనవనిత" రూపమున శుక్రుడు వర్ణింపబడియుండెనని వ్రాసియున్నారు. సుప్రసిద్ధ చరిత్రకారుడగు సర్ విలియం హంటరుగారు కూడ (Orissa I- 293) అటులనే పొరబడియుండిరి. బృహజ్జాతకమున (II-6) "బుధ సూర్యసుతౌ నపుంస కాఖ్యౌ శశి శుక్రౌ యువతీ నరాశ్చ శేషాః" అని శశిశుక్రులను స్త్రీలుగ వర్ణించినను, యీ స్త్రీపురుష వివక్షత జాతకభాగమునకే వర్తించునుగాని పూజా పురస్కారములకు గ్రహములన్నియు పురుషరూపముననే యున్నటుల మనము భావించుచున్నాము. ఈ నవగ్రహములను గురు

తించుట క్రింది యంశములను గమనింపవలసి యుండును. అవేవన:—

1. చేతులందుదాల్చిన అస్త్రములు లేకముద్రలు
2. వాహనములు
3. వర్ణములు
4. పదార్థములు
5. ప్రత్యేకచిహ్నములు
6. స్థానములు
7. దుస్తులు మొదలగునవి

ప్రాచీన శిల్పములయందు వాహనములు చాల నరుదుగ నున్నవి. ఆ మూవిగ్రహముల కుచితములగు రంగులు కూడ వేయబడెడివేమో కాని యందులకు ప్రమాణము లగుపడుటలేదు. ముల్తానులోని యొకసూర్యవిగ్రహముపై నెర్రనిచర్మము కప్పియున్నదని 'ఆల్బెరూని' వ్రాసి యుండెను. గ్రహములను పూజించునప్పట్టలనే, యీ ప్రత్యేక పదార్థము లుపయోగింపబడెనని మన మూహింపవచ్చును. ఱాల చెక్కడములందు గ్రహములు మనము వాడుకొను వారములక్రమముననే వరుసగ చిత్రింపబడి యున్నవి. పూజావిధులందలి వలయాకారముగ నీక్రింద చూపబడిన ఫలకమున 6 వ కాలమునందువలె చూపబడి యున్నవి. కావున, ప్రాచీన శిల్పములందు, అస్త్రములు మొదలగు ప్రత్యేక చిహ్నముల సహాయముననే మనము గ్రహములను ప్రత్యేకింపవలసియున్నది. ఆధునిక కాలమందలి చిత్రములును, విగ్రహములును, వాహనములనుగూడ చూపుచున్నవి. కాలము గడచిన కొలదిని,యీ చిహ్నములు తారుమారై ఒకదానినుండి వేరొకటి ప్రత్యేకింప సాధ్యముకాకున్నది. సూర్యుడు, రాహు కేతువులు తప్ప తదితరగ్రహములయొక్క చిత్తరువులన్నియు నొకే రీతిగానుండుటవలన వానిలో నేగ్రహమేదియో ప్రత్యేకించుటకు వలనుపడుటలేదు.

సూర్యుని విషయములో, సమృద్ధిగనున్న ప్రాచీన శిలావిగ్రహములే కాక వరాహమిహిరాచార్యుని బృహత్సంహిత యందలి ప్రత్యేకవర్ణనము [58 అధ్యా 47]న, ఆతని వస్తువాహనాదికముల స్పష్టముగ జూపుచున్నవి. "సూర్యునకు పెద్దముక్కు, నుదురు,పాదములు, డారువులు, వక్షము నుంచవలెను. విగ్రహము నలంకరించుటయందు, ఉత్తరదేశములందు వాడుకలోనున్న పద్ధతిని అవలంబింపవలెను. ఆతని చేతులందు చెరియొక కమలము నుంచవలెను. ఒక పతకమును, కంఠమాలను సమర్పింపవలెను. కర్ణకుండలములతో నాతని నలంకరింపవలెను. ఆతని నడుముచుట్టు నొకదట్టీ (అవ్యంగము) యుండవలెను."

గ్రహముల స్వరూపములకు సంబంధించిన కొన్ని విశేషములు క్లుప్తముగ నీక్రింద వివరింతును.

## హస్తములు

ఆధునిక ప్రతిమలయందు గ్రహములచేతులందుంచెడి చిహ్నములు, అస్త్రములు మొదలగువాని యందు చాల విభేదము కన్పడుచున్నది. ప్రాచీనశిల్పములందెచ్చటను గ్రహములకు నాలుగుచేతు లున్నటుల చూపలేదు కాని మత్స్యపురాణము (అధ్యా 124)న సూర్యుడు, చంద్ర కేతువులుతప్ప తదితరగ్రహములు చతుర్బాహులై యున్నటులు వర్ణింపబడి యున్నారు.

అనేక ప్రతిమలయందు, సూర్యునిచేతియందొక కమల ముంచబడి యున్నది. ఆ కమలము, ఉత్తరదేశములందలి ప్రతిమలలో సంపూర్ణముగ వికసించినట్లును, దక్షిణదేశ ప్రతిమలలో సగముమాత్రమే విరిసినట్లును నున్నవి. అంతియేకాక, యీ విగ్రహముల చేతులు, ఉత్తరదేశ ప్రతిమలలో నడుమునకు సమముగ నున్నవి. దక్షిణదేశ ప్రతిమలలో నవి యట్లుగాక, భుజముల వరకు నెత్తుకొనబడి యున్నవని పండిత గణపతిరావుగారు (Elements of Hindu Iconography, page 311) వ్రాసియున్నారు.

ఇక నితరగ్రహముల విషయములో నెట్టి నియమములను పాటించినట్లగపడదు కాని రాహుగ్రహ ప్రతిమలు దాదాపుగ నన్నిటియందును చేతుల నెత్తుకొని యున్నటులే చిత్రింపబడి యున్నవి. ప్రతి గ్రహమునకును, కమండలము, రుద్రాక్షమాలయు నున్నవి. కొనారకను, జాగేశ్వరములలోని శిల్పములందు సూర్యుడు, రాహుకేతువులు తప్ప తదితరగ్రహము లన్నియు వీనిని ధరించియున్నవి. కొన్నిచోట్ల బుధునిచేతియందొక బాణమును, ప్రక్క నొకవిల్లును నున్నవి. శనిచేతియం

దొకదండ మున్నది. కోనారకు ప్రతిమయందు రాహువు రెండుచేతులందును వజ్రాయుధము లున్నవి. వేరొక చోట, ఆతని ప్రతిమకు క్రిందుగ వజ్రాయుధము చెక్కబడి యున్నది. ఆధునిక పంచాంగములందు వర్ణింపబడిన ఆయుధములకు ప్రాచీనప్రమాణములు కానరావు.

గ్రహములయొక్క మనుష్యచిహ్నము లీ క్రింది ఫలకమున ప్రదర్శింపబడి యున్నవి:

## మనుష్యచిహ్నములు

| | సూర్యుడు | చంద్రుడు | అంగారకుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని | రాహువు | కేతువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అగ్ని పురాణము (ii) | ఖడ్గము | కమండలము రుద్రాక్ష మాల | రుద్రాక్ష మాల బల్లెము | విల్లు | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | గంటలు గల నడుము దట్టీ | అర్ధ చంద్రుడు | ఖడ్గము దివిటీ |
| మత్స్య పురాణము (xciv) | పద్మము | గద | శూలము గద | ఖడ్గము కవచపతకము, గద | రుద్రాక్ష మాల దండము కమండలము | రుద్రాక్ష మాల దండము కమండలము | శూలము విల్లు అంబులు | ఖడ్గము కవచ పతకము బల్లెము | గద |
| శిల్పములు కలకత్తా చిత్రవస్తు ప్రదర్శన శాల నెం. 4168 | పద్మము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల బల్లెము | విల్లునంబులు | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల ధ్వజము | | |
| కోనారకు | పద్మము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | వజ్రము | రుద్రాక్ష మాల దివిటీ |
| ఆధునిక పద్ధతి పంచాంగములు | పద్మము<br>పద్మము | కలువ | దండము కమండలము | త్రిశూలము | రుద్రాక్ష మాల కమండలము | రుద్రాక్ష మాల కమండలము | దండము కమండలము | అర్ధ చంద్రుడు | రుద్రాక్ష మాల ఖడ్గము కవచపతకము, జండా |

### వాహనములు

మయుడు జ్యోతిషశాస్త్రము నెరుగగోరి భగవానుడగు సూర్యుని వేడగా, నాతడు ప్రత్యక్షమై, "ఆఖ్యాతుం నాస్తిమే క్షణః" [చెప్పుటకు నాకు క్షణమైనను (విశ్రాంతి) లేదు] అనియెనని సూర్యసిద్ధాంతమున చెప్పబడి యున్నది నిజమే. దినదినము విశ్రాంతి లేక ననంతపథమున గదలుచుండెడి సూర్యున కొకవాహనము మిగుల నవసరముగదా. సూర్యునకు దక్క తదితర

గ్రహముల కొసగబడిన వాహనములు ప్రాచీనములు కాక పోవచ్చును. పెక్కు ప్రాచీనగ్రంథములందు గ్రహముల వాహనములగూర్చిన ప్రశంసయే లేదు. గ్రహములు సంచరించుటకు వాహనములను కల్పించుట ఆధునికాచారమే యైయుండనోపు. సూర్యునివాహనము ఏడుగుర్రములు గల యొంటిచక్రపురథమని అగ్నిపురాణము [51–1] నందు వర్ణింపబడి యున్నది:

"ససప్తాశ్వే సైకచక్రే రథే సూర్యో ద్విపద్మధృక్
మషీభాజనలేఖిన్యౌ బిభ్రద్దండీతు దక్షిణే."

కొనారకు శిల్పములందు సూర్యుడొంటరిగ గుర్రముపై నెక్కియున్నటుల చిత్రింపబడి యున్నది. బుద్ధగయయందలి యొకశిల్పమున సూర్యస్యందనమునకు నాల్గుచక్రములే యున్నవి. కొన్ని యాధునికచిత్రములు ఏడుముఖములు గల యశ్వమొకటి సూర్యునివాహనముగ చూపుచున్నవి. మత్స్యపురాణమున [124–39]:

"హిరణ్మయేనాణునా అష్టచక్రైకనేమినా,
చక్రేణభాస్వతాసూర్య స్స్యందనేన ప్రసర్పిణా"

అనియున్నది. ఇతరగ్రహములకు సాధారణముగా నెనిమిదియో, లేక పదియో గుర్రములుగల రథములే వాహనములుగ పురాణము లన్నియు వర్ణించుచున్నవి. కాని ఆధునికసాంప్రదాయములు వానికి ప్రత్యేకవాహనముల సూచింపుచున్నవి. లక్ష్మణపురము (Lucknow)నందలి చిత్రవస్తుప్రదర్శనశాలలోనున్న యొక శిల్పముపై గ్రహములకు దిగువనే వరుసగ నీక్రిందివాహనములు చెక్కబడి యున్నవి. గుర్రము, జంతు ముఖముగలపక్షి, నెమలి, యెలుగుబంటి, అశ్వముఖముగల పక్షి, కప్ప, గుర్రము, వజ్రము.

## వర్ణములు

జ్యోతిషగ్రంథములు, పురాణములు, పద్ధతులు, మొదలగునవి యన్నియు గ్రహములకు వేర్వేరు రంగులను వివరించియున్నవి. ఆయాగ్రంథములు నిర్ణయించిన వర్ణములందు విశేషమగు వ్యత్యాసమున్నటుల కానరాదు. వరాహమిహిరాచార్యుని బృహజ్జాతకమునందు (ii–45) గ్రహముల వర్ణములిట్లు వర్ణింపబడి యున్నవి.

రక్తః శ్యామో భాస్కరో, గౌరఇందు
ర్నాత్యుచ్చాంగో రక్తగౌరశ్చ వక్రః;
దూర్వాశ్యామో జ్ఞో, గురు గ్గౌరగాత్రః
శ్యామశ్శుక్రో, భాస్కరిః కృష్ణదేహః.

పాశ్చాత్యశాస్త్రజ్ఞుడగు టాల్మీ చూపిన వర్ణములుకూడ మన హైందవ సాంప్రదాయములకు విరుద్ధముగ లేవు. గ్రహముల కాయాగ్రంథము లొసంగిన వర్ణముల ఫలకరూపమున నిట ప్రదర్శించుచున్నాను.

| | సూర్యుడు | చంద్రుడు | అంగారకుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని | రాహువు | కేతువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| గరుడపురాణము (xxxIx) | ... | తెలుపు | ... | ... | పసుపు | తెలుపు | నలుపు | ... | ... |
| మత్స్యపురాణము (xcxIv) | కమల వర్ణము | తెలుపు | తెల్ల నెండ్రుకలు | పసుపు | పసుపు | తెలుపు | ఆకుపచ్చ | నీలము | మసక |
| వరాహమిహిరుడు | ఎరుపు | తెలుపు | మిక్కిలి ఎరుపు | ఆకుపచ్చ | పసుపు | తెలుపు లేక నీలము | నలుపు | ... | ... |
| పద్ధతులు | ఎరుపు | తెలుపు | ఎరుపు | పసుపు | పసుపు | తెలుపు | నలుపు | నలుపు | మసక |
| టాల్మీ | ... | ... | ఎరుపు | చంచల వర్ణములు | తెలుపు | పసుపు | నలుపు | ... | ... |

## పదార్థములు

గ్రహములయొక్క రంగునుబట్టియే గ్రహగోళము లందలి పదార్థములు నిర్ణయింపబడినవి. పాశ్చాత్యులు గూడ యీవిషయము నంగీకరించియే యున్నారు. కాని యీపదార్థములను ప్రత్యేకముగ లోహజాతి నుండియే కాక ముత్యములు, రత్నములు మొదలగువానిలో గొన్నిటినికూడ మనహిందూశాస్త్రజ్ఞు లేరుకొని యున్నారు. వరాహమిహిరుని బృహజ్జాతకమునందు సూర్య, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర గ్రహములయందలి పదార్థములు వరుసగ నిట్లు వర్ణింపబడియున్నవి.

"తామ్రం స్యాన్మణిహేమయుక్తిరజతా న్యర్కాచ్చ ముక్తాయసీ"

ఆయా ప్రాచీనగ్రంథములు చూపెడి పదార్థజాల మిూ క్రింది ఫలకమున వివరించుచున్నాను.

| | సూర్యుడు | చంద్రుడు | అంగారకుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని | రాహువు | కేతువు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వరాహ మిహిరుడు | రాగి | మణి | బంగారము | లోహ యుక్తి | వెండి | ముత్యములు | యినుము | ... | ... |
| యాజ్ఞవల్క్య స్మృతి | రాగి | చలువరాయి | అరుణగంధము | బంగారము | బంగారము | వెండి | యినుము | సత్తు | కంచు |
| పద్ధతులు | రాగి | చలువరాయి | అరుణగంధము | బంగారము | బంగారము | వెండి | యినుము | సత్తు | కంచు |
| గ్రీకులు | బంగారము | వెండి | ఎర్రయినుము | తుత్తునాగము | పసుపు పచ్చని యణువు | రాగి | సత్తు | ... | ... |

## ప్రత్యేక చిహ్నములు

కొన్ని సమయములందు గ్రహముల విగ్రహములకు బదులుగ ప్రత్యేకవర్ణములుగల వస్త్రములను, లేక విగ్రహములు చెక్కిన లోహపు ముక్కలను పూజించు నాచారము మనదేశమున ప్రబలియున్నది. వీనికిని, పాశ్చాత్య చిహ్నములకును సన్నిహితసంబంధము కలదని జాగరూకతతో పరిశీలించువారు గ్రహింపగలరు. వీని నీదిగువఫలకమున వివరింతును.

## వేషములు

కొన్ని యతిప్రాచీనశిల్పములలో సూర్య బుధులకు ప్రత్యేకములగు కిరీటము లున్నవి. ఉత్తరదేశమందలి చిత్తరువులు, సూర్యునకైన పాదరక్షలును, నడుము పట్టీయు, పార్శ్వమున నొకఖడ్గమును చూపుచున్నవి.

## అంగవిన్యాసము

రాహుకేతువులుగాక నితరగ్రహము లన్నియు, నిలిచియున్నటుల ప్రతిప్రాచీనచిత్రమును చూపుచున్నది. కొన్నిటియందు బుధుడొక కాలిపై నింకొకటి యుంచుకొని నిలచియున్నటుల చూపబడియున్నది. శని కుంటివాడైనటుల చాలచిత్తరువు లందున్నది. శనికి 'పంగు' (కుంటివా) డను నామాంతరముకలదు. ప్రాచీనకాలమున హైందవజ్యోతిష్కులెరిగి యుండిన గ్రహములలో నెల్ల శని చాల నెమ్మదిగా నడచువాడగుటవలన, వానికి కుంటివాడను పేరు కలిగియుండవచ్చును లక్ష్మణపురమందు చిత్రవస్తు ప్రదర్శనశాలలో నున్న యొక రాతిపలకపై రాహుకేతువుల ప్రతిమలు కలసియున్నవి. గ్రహముల యొక్క స్వరూపస్వభావాదులన్నియు సమగ్రముగ నీ క్రిందిఫలకమున జూడనగును.

| | 1<br>హస్తములు | 2<br>వాహనములు | 3<br>వర్ణము | 4<br>పదార్థము | 5<br>చిహ్నములు | 6<br>స్థానము | 7<br>ప్రత్యేకచిహ్నములు |
|---|---|---|---|---|---|---|---|
| సూర్యుడు | రెండుచేతులలోను పద్మములు | ఏడు గుఱ్ఱముల రథము | ఎఱుపు | రాగి | వలయము | కేంద్రము | నడుము దట్టీ ఎత్తైన పాదరక్షలు ఖడ్గము, కవచము పరివారము |
| చంద్రుడు | రుద్రాక్షమాల కమండలము | పది గుఱ్ఱముల రథము, (హరిణము) | తెలుపు | పలువరాలు వజ్రములు | రేఖాకారము | ఆగ్నేయము | ... |
| అంగారకుడు | రుద్రాక్షమాల బల్లెము | (గొఱ్ఱె పొట్టేలు) | ఎఱుపు | అరుణ గంధము | త్రికోణము | దక్షిణము | ... |
| బుధుడు | విల్లు అంబులు | నెమలి (సింహము) | ఆకుపచ్చ | బంగారము | బాణము | ఈశాన్యము | ఒకకాలుపై నొకటి నుంచుకొని నిలుచుట, ప్రత్యేకకిరీటము |
| బృహస్పతి (గురుడు) | రుద్రాక్షమాల కమండలము (పుస్తకము, ఖడ్గము) | (ఏనుగు, లేక, హంస) | పసుపుపచ్చ | బంగారము | సమ చతుర్భుజము (పద్మము) | ఉత్తరము | ... |
| శుక్రుడు | రుద్రాక్షమాల కమండలము (ధనపు సంచి, పుస్తకము) | (గుఱ్ఱము, లేక, కప్ప) | తెలుపు | వెండి ముత్యములు | నక్షత్రము చతురము | తూర్పు | ... |
| శని | రుద్రాక్షమాల దండము | (డేగ, లేక ఎనుబోతు) | నలుపు | యినుము | విల్లు దండము | పశ్చిమము | కుంటివాడు |
| రాహువు | వజ్రము | (సింహము) | నలుపు | సత్తు | ... | వాయవ్యము | చంద్రచిహ్నము గడ్డము గలదు పెద్ద కుక్క దంతములు, నాగపరివేషము పెద్దచేతులు |
| కేతువు | ఖడ్గము, దివిటీ జండా, కవచపతకము, శూలము | (డేగ) | మసక | కంచు | జండా | నైరుతి | నాగవాలము |

## సూర్యారాధనము-ఆధునికాచారములు

ఆధునికకాలమున దైవభక్తిగల హిందువుల నిత్యకర్మానుష్ఠానములందు సూర్యారాధనము ప్రాముఖ్యమై నదిగ నున్నది. సంపన్నగృహస్థులు రానున్న యరిష్టముల నివారించుటకు, సూర్యారాధనమును గ్రహ శాంతియు సాధనములని నేటికిని విశ్వసించుచున్నారు. సదాచారుడగు నాధునిక హైందవుడు ప్రాతఃకాలమున బ్రహ్మవిష్ణు మహేశ్వరులతోపాటు నవగ్రహముల గూడప్రార్థించుచున్నాడు. గాయత్రీమంత్రమును నిత్యము నూటయెనిమిది పర్యాయములు పఠించి పునీతుడ నగుదుననియెంచుచున్నాడు. గాయత్ర్యాది మంత్రోచ్చారణములచే సూర్యునకు జలతర్పణములొసంగి, యిట్లాతనినిప్రార్థించుచున్నాడు.

"నమో వివస్వతే బ్రహ్మభాస్వతే విష్ణుతేజసే,
జగత్సవిత్రే శుచయే సవిత్రే కర్మదాయినే"
[విష్ణుపురాణము, iiii 11 (40)]

ఋగ్వేదమున( i -115) సూర్యోదయ మిట్లువర్ణింపబడి యున్నది.

"అత్యద్భుతమగు నా కిరణపుంజ ముదయించెను. మిత్రవరుణాగ్నులనేత్రమును, సకలచరాచరముల కంతరాత్మయు నగు సూర్యుడు, ఆకాశమును, భూమిని, వాయువును నిండియున్నాడు.

"పురుషుడు స్త్రీని వెంబడించినటులనే సూర్యుడును ప్రకాశవంతములగు దివ్యఉషస్సులను వెంబడించుచున్నాడు. ఆసమయమున ఫలాపేక్షచే నాపుణ్యుని పూజించుచు ప్రాచీనానుష్ఠానముల నిర్వర్తింతును.

"అంగసౌష్ఠవము గలవై, మార్గమును శీఘ్రముగ నధిగమించుచు, మెప్పొందదగిన సూర్యుని దివ్యాశ్వములు మనచే గౌరవింపబడి, యంతరిక్షమున నత్యున్నతస్థానమునకు జేరినవి. ఇక శీఘ్రగతిని భూమ్యాకాశముల చుట్టి పోగలవు.

"........ఆతడు తనగుర్రములను రథమునుండి విప్పగనే, రాత్రి, సర్వము నంధకారమున గప్పుచున్నది.

"సూర్యుడు గగనమధ్యమున ప్రకాశించుచున్నాడు. ఆతని కిరణము లొకప్రక్క ప్రచండమగు ననంత ప్రతిభను సాగింపుచు, వేరొకప్రక్క నంధకారమును కొనివచ్చుచున్నవి.

"ఓ దేవతలారా! ఈదినమున సూర్యుడుదయించుచుండగా, మాపాపములనుండి రక్షింపుడు! మిత్రవరుణులు, అదితి, సముద్రుడు, భూమ్యాకాశములు, (మా యీ ప్రార్థనము) ననుగ్రహింతురు గాక!"

సూర్యారాధనము అనుల్లంఘనీయ మని శాసింపుచు, సంధ్యానుష్ఠాన మొనర్పనివాడు సూర్యహంతకు డగునని విష్ణుపురాణము (ii--8) యిటుల శాసించు చున్నది.

తస్మాన్నోల్లంఘనం కార్యం సంధ్యోపాసనకర్మణః,
సహంతిసూర్యంసంధ్యాయాం నోపాస్తింకురుతేహియః.
తతః ప్రయాతి భగవాన్ బ్రాహ్మణై రభిరక్షితమ్
వాలఖిల్యాదిభిశ్చైవ జగతః పాలనోద్యతః.

(కావున, సంధ్యోపాసనాకర్మము అనుల్లంఘనీయము. ఏలన, నదిచేయనివాడు సూర్యునిజంపిన పాపమున కొడిగట్టుచున్నాడు. బ్రాహ్మణులు, వాలఖిల్యాదులిటుల రక్షింపగా, సూర్యుడు ప్రపంచమునకు వెలుగునిచ్చుచు, తనమార్గమున బోవుచున్నాడు.)

## గ్రహారాధనము—ఆధునికాచారములు

బ్రహ్మచర్యాశ్రమమును స్వీకరించెడి వటువు నియమిత విధుల ననుసరించి నవగ్రహముల పూజించుచున్నాడు. సుమారు పదునెనిమిది అంగుళముల చతురముగల వేదికపై, నెనిమిదిరేఖలుగల ప్రఫుల్లకమల మొకటి పిండితో నేర్పరతురు. అందు ప్రతిరేఖపైనను, ఆయాగ్రహములకు సరియగు రంగులను, కుంకుమ, పసుపు మొదలగువానితో నేర్పరతురు. ఆరేఖలపై, వరుసగ గ్రహముల ప్రతిమలు గాని, ప్రత్యేక చిహ్నములు గల లోహపు ముక్కలనుగాని, వేర్వేరువర్ణముల వస్త్రములను గాని యుంచి, పెరుగుతో తడిపిన బియ్యమునుకూడ కొంచెముగ నుంతురు. మొట్టమొదట, ప్రతిలోహపు విగ్రహమును 'పంచామృతము'నందు వేర్వేరుమంత్రములతో శుద్ధిచేయుదురు. గ్రహములను ప్రతిష్ఠించునపుడు. ప్రతిదానికిని 'వ్యాహృతి'ని కూడ పఠింతురు. గ్రహములయొక్క అనుచరులను, వాని కిరుపార్శ్వముల నుంతురు. అనంతర మాయాగ్రహముల వేషభూషణముల

వర్ణనమును, ప్రత్యేక ప్రార్థనశ్లోకములను పఠించుచు, వాని కిష్టములగు నాహారములను సమర్పింతురు. అంతట హోమసామగ్రిని పునీత మొనర్తురు. వేర్వేరుగ్రహములకు వేర్వేరు సమిధలను బ్రోగుచేసి, తగిన మంత్రములతో హోమమొనర్తురు. ఈ విధమున గ్రహముల బూజించుట యే, యజ్ఞోపవీతధారణ కర్మమునందు ముఖ్యాంగమై యున్నది. వివాహాదికములందుకూడ నిట్టివిధి కొంతవరకు నాచరింపబడుచునే యున్నది.

హిందూదేశమున ననాదినుండియు నాచరింపబడుచున్న సూర్య, గ్రహారాధన విధానములను పైన చర్చించియుంటిమి. ఆధునికకాలమున నిష్ఠాపరులగు బ్రాహ్మణు లాచరించెడి సూర్యోపాసనాదిక్రమమునకు వేదములం దాధారమున్నది. కాని గ్రహపూజావిధానము వేదములం దెచ్చటను గానవచ్చుటలేదు. గ్రహములను దేవతలుగ పూజించునాచారము వేదకాలానంతరమే యార్యావర్తమున బ్రవేశించియుండవచ్చును. ఈ గ్రహారాధనక్రమము పురాణములందు విపులముగ వివరింపబడి యున్నది. ఆధునికకాలమున నిది సూర్యారాధనముతో పాటు ప్రాముఖ్యమై, కర్మానుష్ఠానములందు ప్రధానాంగ మైనది.

ఈ గ్రహారాధనాచారము మాఘులనువారివలన హిందూదేశమునందు ప్రచారములోనికి వచ్చెనని కొంద రాధునికశాస్త్రజ్ఞు లెంచుచున్నారు. హిందూదేశమందలి మాఘులనుతెగవారు సూర్యారాధకులని వరాహమిహిరుడు వ్రాసియుండెను. భవిష్యపురాణమునం దీతెగ యుదహరింపబడి యున్నది. సూర్యునకు జరశస్థుడు (లేక జరథుస్టుడు) అను నొక పుత్రు డుండినటులును, కృష్ణునిపుత్రు డొక డీతెగవారి ప్రభావమువలన కుష్ఠరోగబాధనుండి విముక్తిచెందె ననియెడి యొక గాథయు నందున్నవి. మాఘులను తెగవారు "ప్రస్తుత కాలమున గూడ హిందూదేశమున నివసించుచున్నా"రని అల్బిరూని వ్రాసియుండెను. క్రీ. శ. 1137-వ సంవత్సరమున చెక్కబడిన యొకశిలాశాసనమునందు మాఘులయునికి సూచింపబడియున్నది. ఈకాలమునందును, మాఘుబ్రాహ్మణులనువారు హిందుదేశమునం దున్నారు. 'నాగేంద్రనాథవాసు' అను వంగదేశీయు లొక్కరు "Castes and Sects of Bengal" అనియెడి గ్రంథములో మాఘుల చరితమును, వారి సంపర్కమువలన హైందవ సాంప్రదాయములెట్లు పరిణామ మొందినదియు వివరించి యున్నారు. ఈగాథ లొకదానితో నొకటి సరిపడకున్నను, చాల వింతగ నుండుటచే నీక్రింద క్లుప్తముగ వివరింపబడినవి.

(1) శాకద్వీపాధిపుడగు ప్రియవ్రతుడు, దేవాలయ మొకటి నిర్మించి యందు సూర్యుని సువర్ణ విగ్రహము ప్రతిష్ఠింపదలచి, పరదేశములనుండు సౌర్యులనెనమండుగురు బ్రాహ్మణులను తీసికొనివచ్చెను.

(2) ఆరాజు దేవాలయమును నిర్మించి, యందు సూర్యుని విగ్రహమును ప్రతిష్ఠించి ఆరాధకులను ప్రసాదింపుమని భగవంతుని బ్రార్థించెను. అంత దేవుడు, తన యెనిమిది యంగములనుండి యెనమండుగురు బ్రాహ్మణులను సృష్టించెను.

(3) మార్కండేయ, మాండవ, గర్గ, పరాశర భృగు, సనాత, నాంగీరస, జహ్నులను నెనమండుగురు ఋషులు శాకద్వీపవాసులై యుండిరి. వారి కుమారులు గ్రహారాధకులు. గరుడుడు శ్రీకృష్ణునిచే ననుజ్ఞాతుడై, వారిని సాంబపురము (ముల్తాను)నకు కొనివచ్చెను, ఈ శాకద్వీప బ్రాహ్మణుల సంతతిలోనివారే 'గణకు' లైరి.

(4) గౌరదేశాధిపుడగు శశాంకుడు వ్యాధిపీడితుడై యుండి, మాఘు బ్రాహ్మణులకొరకు సర్జా(గోగ్రా) నదీ తీరమునకు బంపెను. ఈబ్రాహ్మణు లుగ్రశాంతియొనర్చి వ్యాధిని పోగొట్టగా, రాజు వారి నాదేశమునందే స్థిరనివాస మేర్పరచుకొనగోరెను. గ్రహారాధకులగు 'గ్రహవిప్రు'లనువారు వారి సంతతిలోని వారే.






నాదెళ్ల వెంకట్రావుగారు బి. ఏ.

వారిజబాంధవుం డపరవారిధిఁ జేర విహాయసాధ్వసం
చారము మానివైచి ఖగసంతతు లెంతయు సంతసాన సం
ధ్యారుణరుగ్వితానరుచిరాంబరచుంబి మహీరుహాగ్ర శా
ఖా రమణీయగేహముల కల్లవె మెల్లనఁ జేరుచుండెడిన్.

ఉ. వాయసపంక్తు లిండ్లకయి బారులు దీరిచి జీవులార! మీ
ఆయువులందు నొక్కదిన మంతముఁ జెందెను నేఁటితో నటం
చీమెడఁ గూయఁ జొచ్చెనని యేను చమత్కృతివైఖరిం దలం
పోయుదు కాని కాకవులమూకలకేకల కర్థ మున్నదే?

ఉ. చెంత రసాలభూమిరుహసీమ వసించిన రెండు కోయిలల్
పంతముఁ బూనిన ట్లొకటి పాడిన వెంటనె పాడుగీతముల్
అంతకదిక్సమాగత సదాగతిలోన విలీనమై కడున్
సంతస మిచ్చుచున్నవి ప్రశాంతవసంతదినాంత మం దిటన్.

మ. పగలెల్లం బొలమందు మేసి, పసు లంబా యంచు వత్సాళికై
మిగులన్ దొందరఁ జెందఁ దోలుకొని నెమ్మిన్ బోవు గోపాలకుల్
ఖగకంఠస్వరనైజమాధురిని వీఁక న్బాడుపాటల్ భవ
జ్జగదానందదమైన శైశవముఁ గృష్ణా! జ్ఞప్తికి న్దెచ్చెడిన్.

ఉ. చల్లనివేళ నీపలుకు జ్ఞప్తికి వచ్చినయంత గోపికా
వల్లభ! కోపతాపములఁ బాసి యఖండసుఖంబుఁ జెందె నా
యుల్లము, నీవు కట్టెదుట నుండఁగఁ జూడఁగ నోచినట్టి వ్రే
పల్లెజనుల్ పురాతనభవంబుల నేమి యొనర్చి పుట్టిరో!

ఉ. ఎన్నఁడు నందు నింట వసియించి పశుప్రకరంబుఁ గాచితో
యెన్నఁడు వేణుగానమున నెండిన మ్రోళ్లఁ జిగుర్పఁ జేసితో

మున్నఁటిమాట లట్లు తలపోయుచు నుందుము కాని కృష్ణ! ని
న్గన్నులఁ గాంచు భాగ్యమది కల్గదుగా. యిఁక నెన్నినాళ్లకున్.

మ. మునిమాపయ్యెను చీకటుల్ ప్రబలె నేమో కాని మా చిన్నికృ
ష్ణుని జాడల్ పొడగానరా వెచట నస్తోకప్రభావాతిమో
హనవేణుస్వనమున్ వినంబడదు మాయాశీలురే రాక్షసు
ల్గాని పోఁజిక్కెనో చిట్టితండ్రి! యనోత్కంఠాలోలాత్మయై యెంతచిం
తను నీతల్లి యశోద పొందెడిదో సంధ్యావేళలన్ మాధవా!

సీ. తనువెల్లఁ గనులుగా నొనరించుకొని నిన్నుఁ, జొక్కింపుఁ జూపులఁ జూచిచూచి
వరహాలు రాలు నీ దరహాసమును గాంచి, విరహాగ్నిలోఁబడి వేఁగివేఁగి
మీఱుచుంబనవాంఛ తీఱు దారియలేక, పట్టి గాలికె ముద్దువెట్టిపెట్టి
దినము నిన్ముద్దాడు తిలకంబుగానైనఁ, బుట్టమైతి మటంచుఁ బొగిలిపొగిలి

గీ. యెంతచూచిన సంతృప్తి సుంతలేక, కనులతోడనె ముద్దులుగొనుచు గొల్ల
పడుచులెంతటి బాధలఁబడిరో! వీథు, లందు గోవులవెంట నీవరుగఁ గృష్ణ!

ఉ. కేవలగోపబాలుగతిఁ గేలను గోలనుబూని యామునా(?)
శైవలినీతటంబుదరి శైశవమం దలనాఁడు నీవు బృం
దావనవీథి గోవ్రల ముదంబునఁ గాచిననాఁటిరూపమే
భావమునందు నిత్యమును బాదుకొన న్వరమిమ్ము మాధవా!

* * * * * *

ఉ. అన్నిదినంబులందుఁ గను నస్తమయావసరంబె కాని నేఁ
డున్నతభావ సంచయము లుద్భవమయ్యెను మానసంబునం
దెన్నఁ దినాంతవేళ, నవిమెట్టులొ వెల్వడఁ జేయునన్న నా
కున్న పదప్రయోగరచనోద్యమశక్తులు చాలవయ్యెఁగా.

తే. గీ. మానసంబను నాకాశసీమనెగురు, భావవిహగంబులను బట్టి పద్యపంజ
రములఁ బడవైవఁ దొంటి యందములఁ బాసి, మొదట నే ననుకొన్నంత ముదము నిడవు

మ. యతికిం బ్రాసకు నెన్నొపాట్లు పడి ఆయాసంబుమై నెట్టెటో
అతుకుల్గూరిచి నాల్గుపద్దెములు సేయన్నేర్తునే కాని యే
చతురత్వంబుఁదలంచి చూచినను. బూజ్యంబే కదా యింకనా
బ్రతుకెట్టుల్ చరితార్థమౌనో తెలుపం బ్రార్థింతు నో మాధవా!




దర్భా యజ్ఞేశ్వరసోమయాజులు గారు, బి. ఏ.

శ్రీ వాణీసతుల కిరవై, యఖిలవిద్యల కాకరమై బుధజనాళీ నిలయంబై, విదేశవిద్వన్నికర సంస్తుతిపాత్రంబై, సకలదేశంబులకు దలమానికంబై, పేరెన్నికగన్న మన హిందూదేశముయొక్క పూర్వపుచరిత్రమునకును, ప్రకృతచరిత్రకును గల తారతమ్యము హస్తిమశకాంతరమన్న నతిశయోక్తి కానేరదు. వాల్మీకివ్యాసాది మహర్షు లేదేశంబునబుట్టి తమ విజ్ఞానచంద్రికాప్రసారంబునంజేసి యాదేశంబున కనన్యసామాన్యంబైన కీర్తిని గడించిరో: కవితాపట్టభద్రులైన కాళిదాసమయూరాదు లేదేశమునబుట్టి తమవాగ్విలాససౌరభాదులచే బాశ్చాత్యులతలలనాడింపజేసిరో, చరకసుశ్రుతాదు లేదేశమున బుట్టి యితరుల కాయుర్వేదమును వలయించి శస్త్రవిద్య నిల్పిరో, బ్రహ్మగుప్తభాస్కరాదు లేదేశమున బుట్టి యాయాదేశస్థులకు జేయిబట్టి యంకెలనుగఱపిరో యట్టి మనదేశమున బదిపంద్రెండువందల యేండ్లనుండి యట్టి మహామహులపుట్టుక లరుదైనవి. కాని యిప్పటికి గూడ మనదేశమునం దచ్చటచ్చట నిట్టి సుగంధపుష్పము లుద్భవించి తమ సౌరభమును భూగోళమునందెల్ల వ్యాప్తమౌనట్లొనర్చుచునే యున్నవి. కాని యిట్టిమొగడలు సకాలముననే చక్కగ బ్రోదిచేయబడమింజేసి యకాలముననే వాడిపత్తలగుచున్నవి. ఇట్టి యిక్కట్టులకు మనము పాల్పడకుండ మనపూర్వులవలె యుచ్చదశ ననుభవింపవలెనని న, మనముగూడ వారున్నట్టువంటి పరిస్థితులనుకల్పించికొనవలెను. అప్పటిపరిస్థితు లన్నియు నిప్పుడు మనకు లభించుట దుస్తరము. కాని వానిలోకొన్నిటి నేని మనము ప్రయత్నపూర్వకముగా సాధించి యలవరచికొనుట యావశ్యకము. మనపూర్వులు వారివారి దేశభాషలందును, సంస్కృతమునందును, నసాధారణ పాండిత్యముగలవారు. వారికి వారభ్యసించిన విద్యలయం దత్యంతాదరమును, నభిమానమును నుండెడిది; వారాయావిద్యలయందు తమకు గల వాత్సల్యమునంజేసివానియభ్యాసవ్యాసంగములకై జీవితములను ధారవోసిన ప్రోడలు. ఇవియన్నియు నిప్పటివారికి గూడ సులభసాధ్యములే. మన పూర్వులకంటె మనకైహిక చింతలు మెండగుటచే మన ధీశక్తి యుపబృంహితము గాక, రట్టువడి, వినాశము జెందుచున్నది.

మన యాంధ్ర సారస్వతమునంతను నొక్క దృష్టి నిజూచినచో నయ్యది యాదినుండియు రాజపోషణము నంజేసి యభివృద్ధిచెందిన ట్లెరుకపడును. రాజరాజనరేంద్రుని యాదరణమునకు బాత్రుడై, దేశకవిత బుట్టించి నన్నయభట్టాంధ్రభారతరచనమునకు గడగెను. ఈరాజునాదరణయే పావులూరి మల్లన ననుదినరాజ్యవ్యాపారకులకు వలయు గణితము నాంధ్రమున వ్రాయ బురికొల్పినది. ఆయన ఘనిష్ఠాదరణమునకు బాత్రుడైయేకదా శ్రీనాథు డనేకాంధ్రగ్రంథములను రచించెను. కృష్ణదేవరాయలు కవులను దనయాస్థానమునకు రావించి వారిని దనతో సమానులుగా జూచికొని వారి కెల్ల సౌకర్యములను గల్పించుటచేతనేకదా యాతని సభనలంకరించిన యష్టదిగ్గజములు ప్రబంధరాజములను రచించిరి. వేయేల! నేడుగూడ చాలమంది గ్రంథకర్తలు రాజపోషణము కుదిరిన తరువాతనే కదా యుత్కృష్టములైన గ్రంథములను వ్రాసి ప్రముఖులగుచున్నారు. ఇవి యన్నియు జూడ నాంధ్రగ్రంథరచనమునకును రాజపోషణమునకును జాల సంబంధమున్నట్లు తేటపడుచున్నది. రాజపోషణము లేనిచో నాంధ్రగ్రంథములకు నిలువనీడయైన గానరాదు.

పావులూరి గణితమును రచించిన తరువాత నొక కొందరు బుద్ధిమంతులు గణితగ్రంథములను వ్రాసినట్లు వాఙ్మయచరిత్రల మూలమునను, పత్రికలందు ప్రకటింప

బహు ప్రాచ్యలిఖితగ్రంథ నామములపట్టికలవలనను తెలుకపడుచున్నది. పూర్వయుగములందు సంస్కృత గణిత గ్రంథములు ప్రబలినను, మన యాంధ్రమున నట్టి గ్రంథములు ప్రబలుటకు దగిన యవకాశము లిప్పటికినిగూడ కలుగనేలేదు. రాజకీయ వ్యవహారములకు వలయునంత గణితమమాత్రమే గల పుస్తకములు నానాట నాంధ్రమున వెలువడుచున్నను నవి విపులగణితజ్ఞానదాయకములును, కేవల గణితగ్రంథములని పేర్కొననర్హములగునంతటి యుత్కృష్టకావ్యములును గాకున్నవి.

కడచిన యిరువదిసంవత్సరములనుండియే కదా యాంధ్రులకు దమమాతృభాషయం దభిమానముగల్గినది. ఈయభిమానము గల్గినదాదిగా బ్రబలిన నూతనవాఙ్మయ భాగములు నవలలు, విమర్శనము లేకదా. ఇవి యింకను బాల్యావస్థలో నేయుండి తప్పటడుగు లిడుచుండుటను మాత్రమే చూచుచున్నాము. గ్రంథమాలలు ప్రబలినవి; ఆయాగ్రంథమాలల సంపాదకులు తమయుద్యమములపట్టికలందు శాస్త్రగ్రంథములను బ్రకటించుటగూడ వారి యాశయములలో నొక్కటియైనట్లు ప్రచురించుచుండుటనే చూచుచున్నాము. ఇప్పటివరకు శాస్త్రగ్రంథములను బ్రకటించిన దొక్క విజ్ఞానచంద్రికా గ్రంథమాలయే కదా! ఈగ్రంథమాలకూడ గణితగ్రంథముల బ్రకటించి యుండలేదను సంగతి యెల్లరకును దెలిసినవిషయమే. వీరు ప్రకటించిన రసాయనశాస్త్రము చదువరులును, బోధకులునుకూడ లేకపోవుటచేత నేకదా యచ్చటచ్చట బీరువాలయం దలంకారార్థమై యుంచబడుచున్నది. పదార్థవిజ్ఞానశాస్త్రమునందలి మొదటిసగభాగము పాఠశాలలందు పఠనీయగ్రంథముగా నియమితమగుటచే నానాట వివిధపరీక్షా వికారములనందుచు గొంచెము ప్రచారములోనికి వచ్చినది. తక్కిన శాస్త్రగ్రంథములు రసాయనశాస్త్రముతోపాటుగా భాండాగారములలోని గ్రంథములసంఖ్యను స్వల్పముగా బెంపొందజేయ దోడ్పడుచున్నవి. అన్ని శాస్త్రములను దేశభాషలందే పాఠశాలలలో బోధింపవలెననియెడి నవీనవిద్యాబోధన విధానము నిరవకాశవిధిని విధించి యాచరణలోనికి గొనివచ్చినప్పుడే యీబీరువాలలో నలంకారముగ నున్న గ్రంథములు హస్తాలంకరణయోగ్యము లగును. లేనిచో నివి కాలక్రమమున చెదపురుగుల తీవ్రకరుణావలోకనపాత్రము లగును.

ఇదియిట్లుండ, నాంధ్రమున గణితగ్రంథము లింతవఱకు వెల్వడమికిగల వివిధకారణములను జూతము. ఈ కారణజాల మిప్పటివలె ప్రబలముగా నున్నంతకాలము నాంధ్రభాషయందు గణితగ్రంథములు లేకుండుటే తటస్థించును. ఈపరిస్థితులు మారినపుడే యాంధ్రమున గణితగ్రంథములు ప్రబలి ప్రచారములోనికి రాగలవు. ఈ పరిస్థితుల మార్పునందు చెట్టుముందా విత్తుముందా యను సమస్యవంటి సమస్య నొక్కదానిని మనము సాధింపవలెను. తరువాత శిలవిషాణాన్వేషణమునకై గడగి దానిని సంపాదింపవలెను. అటుపిమ్మట మూర్ఖులమనసు రంజింపవలెను. ఇన్ని దుస్తరకార్యములను బూని వానినెల్ల ప్రయత్నపూర్వకముగా సాధించినపుడే, యాంధ్రమున నన్ని శాస్త్రగ్రంథములును వెలువడును. అప్పుడే, 'దేశభాషలయందు తెనుగులెస్స' యన్న పొగడ్తకు మనభాష పాత్రమైనది కాగలదు.

ఆంధ్రమున గణితగ్రంథములుబయలు దేరకముందు వానియొక్క యావశ్యకత కలుగవలెను. ప్రస్తుతస్థితిగతులనుబట్టి వానిని పఠనీయ గ్రంథములుగా పాఠశాలలందు విశేషించి వాడుదురను నిశ్చయము గ్రంథకర్తలకు, దృఢముగా గలుగవలెను. ఇప్పుడున్నతపాఠశాలలన్నిటియందును గణితపాఠముల నాంధ్రముననే బోధించుచున్నను పరీక్షలాంగ్లముననే జరుగుచుండుటవలన నయ్యది యాంగ్లగ్రంథములద్వారముననే యభ్యసింపబడుచున్నది. పరీక్షలాంధ్రమునందే జరుపవలెనను నిరవకాశ విధిని విధించిననేకాని గణితగ్రంథము లాంధ్రమున బయలు వెడలవు. గ్రంథములు వెలువడిననేకాని విద్యాధికారు లీవిధానమును నిరవకాశ విధిలోనికి దేజాలరు. దీనినే "చెట్టుముందా విత్తుముందా" యను సిద్ధాంతమువంటి సమస్య యని పేర్కొనినాడను. దేశభాషలలో విద్య గరపవలెనను నిరవకాశవిధిని విధించినపుడు, గ్రంథప్రకటనముముందా పరీక్షలు దేశభాషలందే జరుపవలెనని విధించుట ముందా యను సమస్య మబ్బువిడినట్లు విడిపోవును.

ఈపట్టున మఱియొక ప్రతిబంధకముకూడ పొడకట్టుచున్నది. మనదేశమున నూతనమార్గావలంబనములకు

ముందంజవేయు వంగదేశీయులుకూడ గణితముపట్ల శీతకన్నునేవైచిరి. స్కాట్లరు విద్యాశాసనసభ్యులు గణితము తక్క తక్కిన శాస్త్రముల నన్నిటిని దేశభాషలలోనే గరపుట యుక్తమని ప్రతిపాదించిరి. ఇయ్యది కడుంగడు శోచనీయము.

వ్యవహారమంతయు దేశభాషలలో జరుగుచు, పరీక్షలాంగ్లముననే జరుగుచుండుటచే, మననానావిధమైన సంకరభాషను కల్పించి దానిలోనే వ్యవహరించుచు నీపట్టున మనతమిళసోదరులకు దీసిపోని ప్రతిభాశాలురగుచున్నారు. దీనికిదార్కాణముగా నీదిగువయుదాహరణలను గ్రహింపుడు. "ఒకపోయింటు మార్కు చెయ్యి" "అడ్జసెంటాంగిల్సు పోయింటౌట్ చేయుము" అని వ్యవహరించుటను సాధారణముగా జూచుచున్నాము. ఇదియిట్లుండ విద్యార్థులెందరు 'అడ్జసెంటు'నుపదముయొక్క వర్ణక్రమమున పలుదెఱంగుల తప్పులు చేయుట జూచుచుండుటలేదు? వారికన్నిపర్యాయములు చెప్పినను వాని వర్ణక్రమమెల్లపుడును వాస్తవబాహిరముగా నుండుటే చూచుచున్నాము. ఇట్టిదురవస్థ లనుభవజ్ఞులకే తెలియునుగాని విద్యాధికులగు శాసనసభ్యులెఱుంగజాలరు. 'ఒక బిందువును గుర్తింపుము' 'సంసక్తకోణములను చూపింపుము' అనగానే మనవారిలో గొందరికి దుర్భరముగా నుండును. ఆంగ్లపదము లుపయోగించినమాత్రమున మనభాష మైలపడిపోయి యస్పృశ్యతాదోషముపాలై యొక గొప్పరాజకీయసంస్కరణమున కవకాశమిచ్చి యాంధ్రమండలమునెల్ల కలచునని యందురు. సంస్కృతశబ్దప్రయోగమున నాంధ్రము మడిగట్టుకొని యందరను దూరముగాపొమ్మని కసరునా? అన్యభాషాపదములతో నాంధ్రపదముల సంతరించిన నాభాషకు సౌకుమార్యమును, గ్రహణసౌలభ్యమునుగూడ నుండజాలవు. పెద్దనాదు లన్యభాషాప్రయోగములగూర్చి వ్రాసిన పద్యపాదములు కేవలాంధ్రభాషాభిజ్ఞులకెఱుంగ శక్యముగుచున్నదే. కన్నడపదములను ప్రయోగించివ్రాసిన నన్నెచోడుని కుమారసంభవమిప్పటి వారికెంత దురవగాహముగా నున్నది? నిరవకాశవిధిని దేశభాషలలోనే గణితమును గఱపవలెనను నిర్ణయమును జేసినప్పుడే సలక్షణమైన భాషలో గ్రంథములు వెలువడ గలవు.

పైనచెప్పిన యడ్డంకులనుసాధించి గ్రంథరచనమునకు గడంగితి మనుకొనుడు. గ్రంథకర్తకు దొలుదొల్తబొడగట్టు దుస్తరవిషయము పరిభాషానిర్ణయము. పరిభాషాపద నిర్ణయమునుగూర్చి రెండువిధముల ప్రబలవాదములున్నవి. ఆంగ్లభాషాపదములనే గ్రహించి యేల ప్రయోగింపరాదని కొందఱును, నానార్థపదముల యభిప్రాయములను ప్రబోధించుపదముల నేల కల్పింపరాదని కొందఱును వాదులాడుచున్నారు. ఆంగ్లమునందలి గణితపరిభాషయంతయు నాభాషకు మాతృభాషలైన గ్రీకు ల్యాటినులనుండియు, దాని యక్కసెల్లెండ్రనం బఱగు నితర పాశ్చాత్యభాషలనుండియు గ్రహింపబడినదే. ఆంగ్లభాషాపరిచయములేని యాంధ్రుల కాపరిభాషాపదముల భావ మెట్లెఱుకపడును. ఇదియిట్లుండ 'డయాగనల్' అనుపదమునే గ్రహించి వాడితిమనుడు. ఇయ్యది 'డయా + గోన' యనుగ్రీకుప్రకృతుల సంయోగమున నేర్పడినది. 'డయా=గుండా; గోన=కోణ" యని యీ ప్రకృతులకర్థము; రెండు సమ్ముఖకోణముల గుండా పోవు రేఖయే 'డయాగన' లనబడుచున్నది. ఆంగ్లపదమునే గ్రహించి ప్రయోగించినచో పదార్థమును గ్రహించుటకాంధ్రులు గ్రీకు, ల్యాటినులను; తదితర పాశ్చాత్యభాషలనుగూడ నభ్యసింపవలెనా? ప్రస్తుతము "డయాగనల్" అనుపదమును తొలిసారి నేర్చుకొనువారాపద మీయర్థమును బోధించుచున్నదని తెలిసికొనియే దానినిర్వచనమును నేర్చుకొనుచున్నారా? ఎవరిభాషకు నైసర్గికములుగా నుండు పదజాలమును నాయాదేశస్థులు గ్రహించుచుందురు. ఇప్పుడు "ఆక్సియమ్" అను పదమును తెనుగున కూడ "ఆక్సియమ్" అనియే ప్రయోగింపవలెనా. "ఆక్సియమ్" అనునది "ఆక్సియోమా" యనుగ్రీకుప్రకృతినుండి జనించినది. ఈగ్రీకుప్రకృతికి సన్నిహిత సంస్కృతప్రకృతి 'అక్ష' దీనినుండి తెనుగున 'అక్షము' అను పదమును గ్రహింపవచ్చును. "అక్షము=తెలియబడిన యర్థము" అని శబ్దరత్నాకరము చెప్పుచున్నది. ఆంగ్లమున 'ఆక్సియమ్' అనగా A well-known truth ఎల్లఱకు దెలిసినవాస్తవము అనియేయర్థము. ఇట్టిస్థితిలో మనమాంధ్రమున 'అక్ష'మని వ్యవహరించుట యుక్తమో లేక 'ఆక్సియమ్' అనివ్యవహరించుటయుక్తమో నిర్ణయించుభారము మె

దటితెగవాదులకే వదలెదను. ఇట్లన్ని పదములకు గుదురునాయని కొందర డుగుదురు. తగుపరిశ్రమ పూర్వకమైన శోధనలకు గడగినచో విద్యాధికులకు సాధ్యమగునని నానమ్మకము. ఇట్లు గణిత పరిభాషా పదముల యొక్క వ్యుత్పత్తులను పరిశోధించి యాయాప్రకృతులకు వికారరూపములగు సంస్కృత ప్రకృతులనుండి మన యాంధ్ర పరిభాషాపదములను నిర్ణయించుటే యుచితము. అన్యభాషాపదముల కాంధ్రభాషావేషము వేసినపుడవి పంచెకట్టిన దొరను తలపునకు దెచ్చుచుండును. అట్టి వారికి వారిసంగమున నెట్టి గౌరవముండునో యూహించియు నట్టి యభిమానము మనకేల యుండవలెననినచో నాంగ్లపదముల నట్లే గ్రహించి గ్రంథములు వ్రాయుటకు గడంగి మిక్కిలి సులభసాధ్యమైన యీసంకరము నొనర్చి (Italian of the east) అని పేర్వడ్డ 'యాంధ్రి'ని సంకరసానిగా నొనర్చినను సరే లేక శ్రమకోర్చి సంస్కారసమ్మతమైన యలంకారములచే నలంకరించి యామెను పూజ్యార్హగా నొనర్చినను సరే ఆంధ్రులదే భారము. ప్రకృతులసహాయమున నిర్ణయింపనలవిగానివానిని విద్యాధికులముఖతః పరిష్కరించికొనవలెను. భాషావిదులు నిర్ణయించిన పరిభాషాపదములు గ్రంథకర్తల కనుకూలములుగా నుండనప్పుడు, వారే యాపదములను తమ కనువగునట్లును, విద్యాధికుల మన్ననకు పాత్రమౌనట్లును సంస్కరించి, ప్రయోగింపవలెను.

పరిభాషాపదములకు రూఢి, సౌలభ్యము, సంకుచితత్వములను మూడు గుణము లుండవలెను. పరిభాషను నిర్ణయించుటకు పండిత మండలి నొకదాని నేర్పఱచి, వారినందఱ నొకచోట సమావేశమౌనట్లొనరించి, వారి కన్ని సౌకర్యముల నేర్పఱచి, రూఢమగు పరిభాషను నిర్ణయించు టవశ్యకర్తవ్యము. వంగదేశీయు లీపనిని జేసియే "హిందీశాస్త్రపరిభాషా పారిజాతమును" ప్రకటించి యున్నారు. ఆప్రతు లిపుడు దొఱకుటలేదు. రూఢమైన పరిభాషయే లేనిచో గ్రంథకర్తలు తమ యిష్టమువచ్చిన పరిభాషాపదములను వాడెదరు. కాలక్రమమున నాయాగ్రంథములు చదువరులకు దుఃఖవగాహములగును. సంస్కృతమున నున్న కొన్ని గణిత గ్రంథము లీబాధయేపట్టి, భిన్నాభిప్రాయములను ప్రకటించు వ్యాఖ్యానములకు పాల్పడియున్నవి. సౌలభ్య సంకుచితత్వములే లేనిచో పరిభాషాపదములు ప్రచారములోనికివచ్చి ప్రయోగమున కెక్కవు.

పరిభాషా సౌకర్య మేర్పడినంతమాత్రముననే గణితగ్రంథములు బయలువెడలునను నిశ్చయ మేమియును లేదు. మూడు భాషలందు ప్రవేశము గల్గి గణితజ్ఞానమలవడినవారే గణితగ్రంథములను వ్రాయుటకు తగిన ప్రజ్ఞాశాలురు. ఆంగ్లముననున్న గణితముల పరిచయము గలవారై, సంస్కృతముననున్న యాయాగణితభాగములను జదివి వాని మర్యాదలను గ్రహించి, యాశాస్త్రము నాంధ్రమున వెలయింపవలెను. ఇవి యన్నియు నొక్కని కలవడుట యంత సులభము గాదు. అలవడెను బో వానికి గ్రంథరచనమునకు గడంగు నభిలాషయుండి, కేవలగ్రంథరచనమునందు గల్గు బాధలను పడుటకు వలయుశక్తి సామగ్ర్యములుగూడ నుండవలెను.

ఇవియన్నియు గుదిరి గణితగ్రంథమును ముద్రణమునకు సిద్ధపఱచిరందము. అప్పుడు వానిని ముద్రించి ప్రకటించుటగూడ నొకకష్టతరాంశమే. గణితగ్రంథముల ముద్రణమున కాంధ్రమున నొక కొన్ని నూత్న లిపులను గల్పింపవలెను. గణిత చిహ్నముల నాంధ్రలిపుల యొరవడినిబట్టి తయారుచేయవలెను. అట్లొనర్పనిచో తెనుగు లిపిని ఆంగ్లలిపి యొరవడినిబట్టి తయారుచేసిన చిహ్నములతో గలిపి గ్రంథమును ముద్రింపవలెను. ఇట్లొనర్చినచో నాముద్రణము రమ్యగానుండకపోవుటే కాక యాయక్షరములను కూర్చువారుకూడ మిక్కిలి యవస్థపడవలసి వచ్చును. గణితగ్రంథములను చక్కగా ముద్రించు సామర్థ్య మన్ని ముద్రణాలయములకు నుండదు. ఆంగ్లమున నచ్చుపడిన గణిత గ్రంథములన్నిటిలో కేంబ్రిడ్జి యూనివర్సిటీవారు ప్రకటించిన పుస్తకములే చాల సుందరముగా నుండును. మనదేశమున బ్రకటించిన గ్రంథములను వీనితో బోల్చిచూడ వానికిని వీనికి నెంతో వ్యత్యాసము కనబడుచుండును. గణితగ్రంథములను ప్రకటించుటకై యొక యుత్కృష్టాంధ్ర ముద్రణాలయ ముండవలెను; దానితో నొక కుప్యశాల (Foundery) కూడ నుండవలెను. ఇట్టి దానిని నెలకొలుపుట కెంత ద్రవ్యము వ్యయపఱుపవలెనో యది యనుభవజ్ఞులే యెఱుంగుదురుగాని తక్కొఱులకేమి దెలియును?

సాధారణముగా గణితగ్రంథములను ముద్రించుట చాల వ్యయప్రయాసలతో గూడినపని. ఇంతవ్యయమునకు గూడ నొప్పుకొని ముద్రించినను గ్రంథములను కొని చదువువారు లేనిచో నవి వ్యాప్తమగుట యెట్లు? ఇంతటి త్యాగపురుషు లీ దినములలో నెవరున్నారు? గ్రంథముల ముద్రించి యింట నుంచుకొనుటకంటె గ్రంథమును వ్రాసి యాప్రతి నింట నుంచికొనిన జాలదా? శృంగారగ్రంథములను ముద్రించి పంచిపెట్టెడి ధనికులు తియ్యవిలుకాని వింటినివిరిచి యా తియ్యనిరసమునే క్రోల నుంకింతురుగాని గరళతుల్యమై గళంబుల జారని యీ వెగటుగ్రంథములబారి జేరుదురే? అట్టి యుదారపురుషు లుండిరిపో వారెంతవ్యయమునని భరింప గలరు. ఆంధ్రమున గణితగ్రంథములే ప్రబలవలెనని తలచినచో కొంతధనమును, కొందరు పరమపురుషులజీవితములును వృథాగా వ్యయముగావలెను. ఇట్టివ్యయము వృథా కాకుండవలెననిన నా గ్రంథములు విరివిగా కర్చుపడి వ్యాప్తిలోనికి రావలెను. పాఠశాలలందు పఠనీయ గ్రంథములుగా నవి నిర్ణయింపబడి వాడుకలోనికివచ్చినపుడే వానికి దగువ్యాప్తి గలుగును. పాఠశాలలందు దేశభాషలలోనే శాస్త్రములను గఱపవలెనను నిరవకాశవిధిని ప్రబలపఱచినపుడే యిట్టిప్రచారము గల్గును.

ఈగొంతెమ్మ కోరికలన్నియు సిద్ధించిన వనుము. అప్పుడుకూడ మనవిద్యాధికులలో గొందరు వీనిని ప్రచారములోనికి రానీయరు. వా రుగ్గుబాలనుండియు నేర్చికొనిన యాంగ్లభాష నట్టేవీడలేరు. ఆంగ్లమును విడచినప్పుడే తా మజ్ఞానతమఃపటలమును జెందుచున్నా మని యనుకొనియెదరు. ఇట్టిమహనీయులు మనవారిలో నాంగ్లభాషాజ్ఞానము కుదురమింజేసి గణితజ్ఞానము నలవఱచికొనజాలనివారిసంఖ్యను గమనింపవలయును. కేవలము విదేశభాషాజ్ఞానము కుదిరి గణితము నొక కొంతవరకే యభ్యసించి వెఱ్ఱిఱేలవేసినవారు మనలో జాలమంది యున్నారు. గణితశాస్త్రభాగములలో నేదో యొకదాని నాద్యంతము కరతలామలకముగా నేర్చినవారుకూడ నరుదుగానే యున్నారు. ఏదేని యొక మహాకార్యమును బూనిన వారికే పెక్కు యిక్కట్లు వచ్చుచుండును. మహామహు లెందరెందరు తమ యుద్యమములను ప్రచారములోనికి గొనివచ్చుటకై దేహత్యాగములను జేయలేదు? వారు స్వర్గస్థులైనతరువాత వారివారి యుద్యమములను సాదరాయత్తచిత్తములతో నంగీకరించి, వారిసంతతులవారు ప్రచారములోనికి గొనివచ్చుచుండుటను గూడ చూచుచున్నాము కదా? పాశ్చాత్యదేశస్థులందరును శాస్త్రములను మాతృభాషలోనే యభ్యసించుచున్నారు గదా. మనముగూడ నట్లేల చేయరాదు? విదేశభాష నన్వయించికొనుట యొక కష్టము. శాస్త్రజ్ఞానము నలవఱచుకొనుట యొక కష్టము గదా? నాగరికులందరు నొక్కయిక్కట్టును సాధించికొని జ్ఞానులగుచున్నారు. రెండిక్కట్లకుపాలై యాజ్ఞానమునే సంపాదింపగోరెడి మన నాగరికత నేమని చెప్పవచ్చునో చదువరులే యూహింతురుగాక. భాషాభిమానులైన శాస్త్రజ్ఞు లాంధ్రమున శాస్త్రగ్రంథముల బయలుదీసెదరుగాక యని నమ్మెదము, దాపున నేయున్న విద్యావిధాన సంస్కరణమును త్వరితముగావచ్చునట్లు సూర్యాదిదేవు డొనర్చునని తలచుచు నింతటితో విరమించుచున్నాను.

వాగ్వాదముకంటె కార్యసాధనమే యుత్కృష్టకర్తవ్యమని పెద్దలందురు గావున, దశవిధగణితములలో నొక్కొక్కదానినుండి యొక్కొక యుదాహరణము నీదిగున నాంధ్రభాషయందు నా నేర్చినకొలది బ్రకటించెద. అల్పజ్ఞుడనగు నా సాహసమును క్షమించి, దోషములున్నవానిని సవరించి, నన్ను కృతార్థుజేయ విద్యాధికుల బ్రార్థించుచు నింతతో విరమించుచున్నాడ.





## జీవమా!

మనమేల కలియరాదె, జీవమా!
తనువేల పొలియరాదె?
చీకటులఁ జీకటులు చేరిపోవుచునుండ
వెలుఁగులోఁపల వెల్గు కలసిపోవుచునుండ
కనుమూసి కలలేల
మతిపీడి మఱపేల
మనమేల కలియరాదె, జీవమా!
తనువేల పొలియరాదె?

వలపుచీకటిమేడవద్దనే కలగాంచి
తలఁపుసంజలనీడ తట్టునే తెలివొంది
ఆనందవనములో
అమృత సౌధంబులో
మనమేల కలియరాదె, జీవమా!
తనువేల పొలియరాదె?

—చింత.

# మురళీకృష్ణుడు

సీతంరాజు సత్యనారాయణశర్మగారు

తావి బురుడించు కస్తూరి తళుకు దిద్ది
శిఖిశిఖాపింఛజాలముల్ శిఖను దాల్చి
మధురమధురస మైనట్టి మధురగీతి
పాడగదవోయి! అస్తోకఘృణిత కృష్ణ.

గీ. మధురచంద్రహాసములోని మార్దవంబు
పొగరుకోయిల పాటలో సొగసుదనము
నలరు పూదేనెలోని తీయ్యదనమ్ము
కలదు గోపాల నీవేణుగానమందు.

సీ. మ్రోయింపుమోయి నీమురళి నిముదమొప్ప
ముడిచిన పూరేకు విడులునటులు
చిలికింపుమోయి నీ చిత్సుధారసమును
మొకోళ్ళపుగళములు పల్కులాగు
గిలింపుమోయి నీగీతామృతపుసోన
కఠినశిలాతతుల్ కరగునటులు
వర్షింపుమోయి నీవాగమృతపుధార
చెట్లసంతతి చిగురించులాగు

గీ. పలుకుపలుకున తేనియ లొలుకునటులు
పరమపావని గంగాస్రవంతిమీది
పిల్లగాడ్పుల యలలతో పల్లవించి
మురళి మ్రోయింపు సంగీతమోహనముగ.



# శ్రీ సత్యనారాయణస్వామి

బలిజేపల్లి లక్ష్మీకాంతకవి గారు

ఓసర్వేశ్వర! యోకృపాజలనిధీ! యోభక్తమందార, యో
హో సత్యాశ్రయ; యోవిపన్నజనబంధూ; యోత్రిలోకైక సా
క్షీ! సర్వజ్ఞవరా! చరాచర జగత్ క్షేమంకర శ్రీకటా
క్షా! సాక్షాత్ భువనైకధర్మపరిరక్షా! సత్యనారాయణా!

నీమాహాత్మ్య మెఱుంగరా దజునికేనిన్ లోకసంతాన మి
చ్ఛామాత్రంబున సృష్టిచేసెదవు వీక్షామాత్ర శాసింతువు
ద్దామం బింత యజాండమందును విచిత్రంబేమొ కన్గొందు వెం
దే మై చీమచిటుక్కుమన్నను గృపాబ్ధీ! సత్యనారాయణా!

వరదా! యోమురదానవాంతక! కృపాపారీణ! దీనావన
త్వరితాంతఃకరణా! పరార్థహరణ వ్యాపారమాయాధురం
ధరుఁబారిం బడి లేనిపోని యపరాధం బంది యాపత్పరం
పరలోఁ జిక్కితి నెట్లు తేల్చెదో మహాత్మా! సత్యనారాయణా!

ఏ నేపాప మెఱుంగనం చఖిలసాక్షీ! నీకు బోధింపనే
లా నీచూడని లోకసంగ్రహణలీలాలేశ మెందుండున
య్యా! నిర్మాయికు లిట్లు దుర్మతిఁ మిత్త్యాపాయము ల్పొంద, నీ
దీనత్రాణపరాయణత్వ మిపు డేదీ? సత్యనారాయణా!

పరమాణ్వాదిచరాచరా ద్భుతనిజబ్రహ్మాండమం దంతరాం
తరలీలాపరిణాహమూర్తి వయి భూతవ్రాతచేష్టాపరం
పర లెల్లం బరికించు సాక్షివిగదా ప్రత్యక్షమై యేల నీ
పరిపూర్ణత్వముఁ జూపవో భువనదీపా! సత్యనారాయణా!

ద్యావాపృథ్వ్యవకాశభాసితసహస్రాక్షుండవై నిర్మల
ద్యోవీథిన్ జరియించుచుందువు పరంజ్యోతిస్స్వరూపుండవై
యావత్కర్మకలాపసాక్షివిగ దేవా! ధర్మనిర్ణేతవై
ఈవిప్పట్టున నాకు సాక్ష్య మిడవేమీ! సత్యనారాయణా!

తలమే నీ కనుమూయనోయి! జగదంతర్యామి! యాం గాములన్
దెలియన్ నీతరమానుగాక, యపరాధిన్ సాపరాధిన్ బోన
ర్చు లఘుజ్ఞానులు చర్మచక్షువు లధీరుల్ తథ్యమిథ్యాపరీ
క్షలకుం జాలుదురయ్య? యోజగదధీశా! సత్యనారాయణా!

# పరపతిసంఘములు లేక బ్యాంకులు

## అవి చేయగల్గు పనులు

రంగనాయకులు (డి. ఇ. పి.) ఆక్సుఫర్డు, సి. యస్. డబ్ల్యు.

(సంపుటము ౨. సంచిక ౬ తరువాయి)

అడిగినప్పుడీయవలసియున్న ధనమెల్ల, గల్లాపెట్టె ధనముగా నున్న లక్ష, అప్పులవారికివ్వవలసిన పదిలక్షలు, మొత్తము, 1100,000 రూపాయలు. దీనికెదురుగానున్న ధనమెంత? 600,000 రూపాయలు. అనగా షుమారు 50% లేక సగము దీనినిబట్టి, ఎటుల బ్యాంకులు పరపతినొసంగి, తమదగ్గిరనున్న ధనమునకు మూడు నాల్గురెట్లువరకు, అప్పులనిచ్చెదమని వాగ్దానమొసంగి, వ్యాపారమును వృద్ధిచేయుటకు తోడ్పడగలవో తెలియుచున్నది. గదా. మనదృష్టాంతమునందు, సగభాగము చేతికందు ధనముగా నున్నట్లు చూపెట్టితిమి. కాని, సగముగా నుండవలసిన యగత్యములేదు. మూడవవంతుండుట జర్మను, ఫ్రాన్సు ఆదిగాగల దేశములందు చాలు. ఐదు లేక, ఆరవవంతుండుట, ఇంగ్లండు అమెరికా దేశములందు చాలు. కాని మనదేశమునందు ప్రస్తుతము, రెండవవంతైన నుంచుట తప్పనిసరి. ఎందులకన, జర్మనీ, ఫ్రాన్సుదేశములందు కంటె ఇంగ్లండు, అమెరికాదేశములందు, బ్యాంకింగు లేక వడ్డీవ్యాపార మమితేసులువు, ప్రజాదరణ కల్గియున్నది. క్రెడిటు, పరపతి పద్ధతు లెక్కువగా ప్రచారమై, చెక్కులనిచ్చి పుచ్చుకొను నలవాటు హెచ్చుగా నున్నది. మనదేశము, ఈవిషయములందు, ఫ్రాన్సు, జర్మనీలకంటె తక్కువస్థితియందున్నదని యెల్ల రెరింగినదేకదా; కనుక 'పరపతి' పద్ధతుల నెక్కువశ్రద్ధగా నడిపి, వాణిజ్యమునం దెక్కువగా ననుభవము బొంది, నమ్మకపునిలువ నెరింగి, బ్యాంకులను, చెక్కుల నుపయోగించు యింగ్లీషువారు, అమెరికనులు, మనదృష్టాంతము ననుసరించియైనచో, తామీయవలసియున్న 11,00,000 రూప్యాయలకు గాను 20 లేక 25 వేల రూప్యాలు చేతికందున ట్లుంచుకొన్న చాలు. అనగా ఆబ్యాంకు 20,000-25,000 రూపాయలు చేతియం దుంచునట్లు జాగ్రత్తపడుచో పదకొండులక్షలధనమును వ్యాపారుల కప్పిచ్చి, వ్యాపారమును వృద్ధిపరచి తాను వడ్డీ పొంది దేశమునకు లాభము కల్గించుననుట తెల్లము. ఎటుల యీమహాత్కార్యమును చేయుటకు వీలైనదను ప్రశ్నకు ప్రథమమున దృష్టాంతపూర్వకముగా కన్పరచిన బస్తీయు, దానిబ్యాంకుపద్ధతులే సరియగు సమాధానము.

తరువాత, మన బస్తీయందున్న బ్యాంకుల కితర ప్రదేశములందు సంబంధములేదనియు, ఆబస్తీయందున్న ప్రజ లితరబస్తీలప్రజలతో వ్యాపారము చేయుట లేదనియు తలంచితిమి. కొంతవర కిదివరకే నిజమగు ప్రపంచమునకు కూలివారిగూర్చి యాలోచించునప్పుడు దిగితిమి. ఇప్పుడీవిషయములందుగూడ దిగవత్తుము. మనబస్తీయందున్నప్రజ లితరపట్టణపు ప్రజలతో వ్యాపారము చేయుటయేకాక, ఇతరదేశపు ప్రజలతోగూడ వ్యాపారము చేయుచుందురు. మనపట్టణపుబ్యాంకుల కితరపట్టణములందు కొన్ని బ్రాంచి లుండుటయేకాక, ఇతరబ్యాంకులతో పరస్పర సంబంధముండును. అంత, ఈబస్తీప్రజ లితరబస్తీప్రజలనుండి మొత్తముగ వస్తువులకొనిన, ఆప్రజలకీబ్యాంకిపై చెక్కుల నీబస్తీప్రజ లిత్తురు. ఆప్రజలు, తమపట్టణమునందు బ్యాంకులులేనిచో, ఈబ్యాంకుయొక్క బ్రాంచిలేనిచో, ఈబ్యాంకుయొక్క చెక్కులను తీసుకొననొల్లరు. అంత ఈబ్యాంకునుండి ధనముతీసుకొనివెళ్లి, ఇతరబస్తీప్రజలకు ధనముచెల్లించి, వస్తువులుకొనవలసివచ్చు. అంత, ఈబస్తీబ్యాంకులకు చాలనష్టము కలుగుట తటస్థించునని తెలియుచున్నది. ఆ యితరబస్తీయందు, ఈబ్యాంకు బ్రాంచియున్న, ధనము చెల్లింపవలసిన యగత్యముండదు. ఆబస్తీవర్తకులు యీబస్తీవర్తకులిచ్చిన చెక్కుల నాబ్రాంచియం దిచ్చుటతో వ్యాపారము

పూర్తియగు; లేక, ఆబస్తీయందొక బ్యాంకియుండుచో ఆవర్తకు లాబ్యాంకుయం దీబస్తీబ్యాంకిపై వ్రాయబడిన చెక్కులనిచ్చుటయు, నీబ్యాంకులు తమతమ పరస్పర అప్పులను పరపతిద్వారా తీర్చుకొనుటయు సాధ్యము. ఇటులనే దేశమునందంతట బ్యాంకులుండుటచే, ఒక బ్యాంకుపై వ్రాయబడినచెక్కులు తదితరబ్యాంకు లనేకములం దివ్వబడుటచే, ఆబ్యాంకులపై వ్రాయబడినచెక్కులితరబ్యాంకులం దివ్వబడుటచే,పరస్పరముఅప్పులనుతీర్మానించు టమితకష్టమగును. ఈకష్టమునుదీర్ప తూరుపార బట్టుజాతీయగృహము (National Clearing House) ఒకటి స్థాపించబడుటయు,దానిద్వారాపరస్పరము అప్పుల తీర్మానించుకొని పరపతిద్వారా లెక్కల సరిపెట్టుకొనుటయు జరుగుట లాభకరము. పరపతి సంఘములు చేయగల్గుపను లింక ననేకము కలవు. వాని మరొకవ్యాసమునందు విచారింతము. అప్పుల నిచ్చి పుచ్చుకొనుటయను రెండుపను లతిముఖ్యములు. అందులకె నిదే యింతదీర్ఘముగా నాప్రశ్నగూర్చి విచారించుటగల్గెను. 'వడ్డీవ్యాపారము' ప్రస్తుతవాణిజ్యస్థితియం దెట్లుండవలయునన్న ప్రశ్నగూర్చి విచారింప బ్రారంభించ నింకను యదను రాలేదు.

క్రిందటిప్రకటనయందు, పరపతి సంఘములనెవ్వియో, 'పరపతి'కల్గియుండుటన్న,'పరపతి' యిచ్చుటన్న నెట్టిదో, వడ్డీవ్యాపార మెట్టిదో చూచితిమి. ఇచ్చట 'బ్యాంకులు' ఇంక నేయేపనుల చేయకల్గునో చూతము.

'బొంబే' పశ్చిమతీరమునందున్న సముద్రతీరపు పట్టణములలో ప్రధానమైనది. ఇండియాయందున్న సముద్రతీరపు పట్టణములలో నాయకమణియై యున్నది. బొంబే, అహమ్మదాబాదులయందు, గుడ్డలవర్తకము అతి విస్తారముగ సాగుచున్నది. ఇండియానుండి యితరదేశములకు, అందు ముఖ్యముగ పాశ్చాత్యదేశములకు, పోవువస్తువులలో చాలభాగము, అందు మనదూది, గోనెపట్టలు, గోధుమలు, బొంబేమీదుగా వెడలుచుండును. మనదేశపు వర్తకులం దచటివా రమితధనికులై యుండుటయు,అచ్చటి పారిశ్రామికనాయకులు, ధైర్యసాహసములుకల్గి, పరిశ్రమలం దధికోత్సాహము గన్పరచువారై యున్నారు. అచ్చటి పార్శీవర్తకులు, గుజరాతీ మార్వాడీలు, మహమ్మదీయవర్తకులు, జాయింటుస్టాకు కంపెనీలయొక్క షేరులనుకొనుటయందు, క్రొత్త క్రొత్తజాయింటుస్టాకు కంపెనీలస్థాపించుటందు, క్రొత్తపరిశ్రమల బయలుదేరదీయుటందు ముందంజవేయుచు, దేశపువాణిజ్యాభివృద్ధికై తోడ్పడుచున్నారు.

కనుక నట్టి వాణిజ్యముతో తులతూగు ఆపట్టణమునందే,మనబ్యాంకు కధికపనియుండునని తెల్పకయే తోచును. (అ) జాయింటుస్టాకుషేరులదుకాణము, (ఆ) ఎగుమతి, దిగుమతియగు వస్తువులదుకాణము,(ఇ)హుండీలదుకాణము, ఈమూడుదుకాణము లాపట్టణమున గలవు. వీనిగూర్చి ప్రత్యేకముగా మరొకప్పుడు చెప్పుట మంచిదైనను, ఇచ్చట క్లుప్తముగా వానిరీతుల తెలుపవలయును.

## జాయింటుస్టాకు కంపెనీలు

జాయింటు స్టాకుకంపెనీలన్న నేమి? కొందరువర్తకులుకలిసి, ఒకప్రత్యేకవ్యాపారమునం దొకఫ్యాక్టరీనో ఒక యెగుమతిదిగుమతి దుకాణమునో, ఒకవస్తువులకును లేక, అమ్ముదుకాణమునో స్థాపించనెంచి, ఆకంపెనీయందు పదిలక్షలులేక మరికొంతధనము మూలధనము నేర్పరచి, ఆకంపెనీకి కొందరు యజమానులసంఘము నేర్పరచి, వారియాజమాన్యమున నాకంపెనీనడుపనెంచి తాము తమధనమును కొంతగా యీకంపెనీయందు బెట్టి, మూలధనమున కిన్ని షేరులనియేర్పరచి,అందు తమషేరులుపోగా,మిగతషేరుల నితరులతీసికొనమనిగోరుచు నేర్పరచు కంపెనీని జాయంటుస్టాకు కంపెనీయందురు. ఇంతియే గాదు. ఈకంపెనీని రిజిష్టరుచేయవలసియున్నది. తరువాత రెండువిధములగు కంపెనీ లిందేయుండును. 'Limited' 'లిమిటెడు' కంపెనీలు ఒకవిధము. ఒకకంపెనీని 'లిమిటెడు'గా రిజిష్టరుచేసినచో, అకంపెనీ దివాలాతీయుచో, ఆకంపెనీ కప్పులనిచ్చినవారు కంపెనీయందు మిగిలినధనము గైకొననర్హులేకాని, షేరులను కొన్నకంపెనీసభ్యులందరి యాస్తులపై యేమాత్రమధికారము లేదు. 'లిమిటెడు' అనుమాట లేకుండా, జాయింటుస్టాకుకంపెనీయుండుచో, అంతె యాకంపెనీ దివాలాతీసిన, జప్తులుతెచ్చినవారు, కంపెనీలో మిగిలిన ధనమును గైకొనుటకేకాక, షేరులను కొన్నకంపెనీసభ్యులందరి యాస్తులనుండి తమయప్పులు తీరువరకు ధనము గొనుట కధికారము బొందియుందురు. కనుక, హెచ్చు

మంది 'లిమిటెడుజాయింటు స్టాకుకంపెనీ'ల షేరులనే కొందురు. పెద్దషాహుకారులు ప్రథమముననే కొన్ని షేరులను తీసుకొని, తాము హామీ నిచ్చుచున్నారమని ప్రకటించి, ప్రజల మిగతషేరులను కొనవలెనని కోరినను, జయముబొందుట దుర్ఘటము. కనుకసామాన్యముగా జరుగునదియేమన, ఈషాహుకారులు, తమప్లానును, దళారి యను Underwriter ముందుబెట్టి, ఆయనకు తమవ్యాపార మెట్లెట్లు లాభకారియగునో తెల్పి, కొంతకమీష నిచ్చెదమని తెల్పి, తమ మిగతషేరులనన్నిటి నితరులు కొనునట్లు చేయ ప్రార్థింతురు. అంత నీ దళారి ప్రథమమున నా ప్రత్యేకవ్యాపారము జయప్రదముగ త్వరలో లాభము కలుగచేయునా, లేదా యనువిషయ మాలోచింపవలసి యున్నది. తరువాత, జయప్రదమగునని తలంచినచో, వడ్డీవ్యాపారమునందు, తగినంతధనము, ఈకంపెనీవారు యేర్పచిన పద్ధతులప్రకారము దొరుకునా, దొరకదాయని విచారించు.

అంత నవసరమగుచో, కంపెనీవారి యేర్పాటులు, వడ్డీవ్యాపార స్థితిగతుల కనుగుణముగా మార్చునట్లు చేయవలసియుండు. తుదకు, ఈయేర్పాటుల ప్రకారము ధనము దొరకునని దృఢపడినపిమ్మట ఆదళారి తానా మిగతషేరుల కొనువారి దెచ్చెదనని వాగ్దానమిచ్చినట్లు ఆకంపెనీ కాగితము క్రిందవ్రాయును. ఇటులవ్రాయుటను Under Writing Business అందురు. పైనతెల్పినయే మెట్లుపై సరియగుసమాధానము దళారికి రాకపోయినను ఆకంపెనీజీవితము ముగిసిన దనుకొనవలసినదే! అటుల వాగ్దానమిచ్చిన దళారి ఎటులు లక్షలకొలదిగా గావలసినధనమును దెచ్చును? ఇచ్చట జాయింటుస్టాకుషేరు దుకాణమునకు వెళ్లవలయును. ఈదుకాణమునం దీ 'దళారి' తన ప్లానును, ధనమును వడ్డీకిచ్చువారిముందు పెట్టును. తదితర దళారులందరు తమతమప్లానుల ధనమును వడ్డీకిచ్చువారికి జూపెట్టుదురు. ఇచ్చట దళారులు పరస్పరముగా, వడ్డీవ్యాపారులముందు, మేము హెచ్చులాభముల నిచ్చెదమని వాగ్దానము చేయుచున్నారము. మాకంపెనీ లెక్కన జయప్రదమగునని, పోటీలనంది, తమతమప్లానులకు ధనము నాకర్షించుకొన సదా ప్రయత్నించుచుందురు. ఇటులు కొంత కాలమువరకు క్రమముగా షేరుల మనప్రథమదళారి, పదితర, దళారులునమ్మి ధనము గొనుచుందురు. దినదినము, క్రొత్తక్రొత్తగావచ్చు ప్లానుల వడ్డీరేట్లు, లాభపద్ధతులు, దళారి షేరుల యధికాకర్షణ, లేక, తక్కువఆకర్షణ బట్టి, ఇదివరకె వెలువడిన ప్లానుల కెక్కువలేక తక్కువ ధనము వచ్చుచుండు. ఇటులు, ప్రాతప్లానులు, క్రొత్త ప్లానులు, పరస్పరముగా పోటీపడుచు, వడ్డీవ్యాపారుల నుండి ధనము నాకర్షించుట జరుగుచుండు; కనుక, మన ప్రథమకంపెనీ షేరులన్నియు నమ్ముడుపోవుటకు కొంత కాలముపట్టును. అంతవరకు కంపెనీవ్యాపారము సాగించ కూరకుండుట లాభసాటికాదు. కనుక సామాన్యముగా, 'క్రిందదస్కతు' పెట్టినవెంటనే, Underwriting ఐన వెంటనే, దళారి స్వంతధనమును కావలసి వచ్చునప్పుడెల్ల, కంపెనీదారుల కొసంగుచు, వ్యాపారము సాగించుచు, సాగించినకొలదిగల్గు జయముబట్టి షేరుల మరింత త్వరితముగనమ్ముచు, వడ్డీవ్యాపారులనుండి, ధనము గొనును. క్రింద దస్కతు పెట్టుటతోడనె ధనమెచ్చటనుండి యీ దళారులు తెత్తురు? ఇచ్చట బ్యాంకులు వడ్డీవ్యాపారులు గావచ్చును. దళారులు, బ్యాంకులవద్ద చేబదులుగా లేక, నాలుగైదు దినములలో తిరిగి యిచ్చెదమని ధనము నప్పుగా దెచ్చి వ్యాపారుల కిచ్చెదరు. ఈలోపుగా షేరుల నమ్మి తిరిగి ధనము వెంటవెంటనే బ్యాంకుల కిత్తురు. ఇటు లప్పులకిచ్చుధనమునే పిలుచుటతో వచ్చుధనమని బ్యాంకులెక్కలందు తెలుపబడును. ఈ విధముగ, అనుదినము వెలువడు వ్యాపారపుకంపెనీల ప్లానులక్రింద దస్కతులు పెట్టు దళారులకు లక్షలకొలదిధనము చేబదులుగా వడ్డీలకిచ్చి, వ్యాపారకంపెనీలకు సహాయము చేయుచు, జాయింటుస్టాకుకంపెనీలు జయప్రదముగా జరుగునట్లు జాగ్రత్తపడు దళారులకు ధనమిచ్చుచు, అధికముగా వడ్డీ ద్వారా లాభము బొందుచుండును.

ఇంతవరకు మనము వ్యాపారపు కంపెనీలషేరుల కెట్లు ధనమువచ్చునో యని చూచితిమి. షేరుల కొనుట కెట్లు ధనమును 'వడ్డీవ్యాపారులు' తెచ్చెదరో చూడవలసి యున్నది. వడ్డీవ్యాపారులు సరాసరి జాయింటు స్టాకు కంపెనీ దుకాణములోనికి వెళ్లి షేరులనుకొనుట చాల యరుదుగా జరుగును. సాధారణముగా జరుగునది యేమన వడ్డీవ్యాపారులు జాయింటుస్టాకుకంపెనీ దుకాణములందుండు కష్టనష్టముల బాగుగనెరింగి, వచ్చు వ్యాపారపు

కంపెనీల స్థానుల బాగుగా నెరింగిన దళారుల ద్వారా తమ ధనమును, షేరులుకొనుటకుగా నుపయోగింతురు. ఒక్కొక్కప్పుడు కొన్నికంపెనీలషేరులు చాల లాభకరముగా కన్పడవచ్చు. అప్పుడు దళారు లొకతమాషా చేయుదురు. ఇతరులు కొనకముందే, ఆయా లాభకరములగు షేరుల కొనబ్రయత్నింతురు. ఎటు లధికధనమును తెచ్చుట. ఒకటి, తమకు ధనములనిచ్చు వడ్డీవ్యాపారులకీ విషయము తెల్పి వారిని కొనమని బలవంతపెట్టుదురు. వడ్డీవ్యాపారులు అకస్మాత్తుగా ధనమును కలిగియుండక పోవచ్చు. అట్టిసమయమున లాభకరమగు వ్యాపారము చేయుటకై బ్యాంకులం దప్పులదెచ్చి దళారులకిచ్చి ఆషేరులను కొందురు. రెండు, వడ్డీవ్యాపారు లన్ని షేరులను కొనజాలకపోవచ్చు. అంత దళారులే బ్యాంకులందు చేబదులుగా ధనము అప్పుబట్టి షేరుల కొందరు. నాలుగైదు దినములలో ఆషేరులధర లేచుటతోడనే వానినమ్మి వచ్చిన లాభమును తమ లెక్కలక్రింద బ్యాంకులందు పెట్టి మిగత ధనముద్వారా తమ యప్పులను తీర్తురు. ఈవిధముగ నెప్పుడు జాయింటుస్టాకు షేరుదుకాణములందు వ్యాపారముచేసి వ్యాపారాభివృద్ధికై పాటుపడు క్రింద దస్కతులు పెట్టు దళారులు షేరులకొను దళారులకు బ్యాంకుల వసరమువచ్చినప్పుడెల్ల చేబదులుగా లక్షలకొలది ధనము నప్పులుగానిచ్చి వడ్డీలాభము బొందుచుండును. ఇందు, రెండువిధముల లాభమును బ్యాంకులు పొందును. ఒకటి క్రింద దస్కతులుపెట్టు దళారులకు ధన మప్పునిచ్చి వడ్డీ బొందుదురు. వీరెవరికి తమ షేరుల నమ్మి ధనము బొంది బ్యాంకులయప్పులదీర్చుచుందురో, అట్టివారికే తమ ధనమును ఎల్లప్పుడప్పులనిచ్చుచుండుటవలన షేరులమ్మువారికి కొనువారికి తాత్కాలికముగా నప్పులనిచ్చును, వడ్డీలబొందుచున్నవి. ఇందువలన, ఈగారడీవలన సంఘమున కేమిలాభము బ్యాంకులు కలుగజేయుచున్నవను ప్రశ్న పెట్టుట సాధారణమైన విషయమే! పైన తెల్పినటుల దుకాణమునందు షేరులపెట్టుటతోడనే కొనువా రుండరు. షేరుల నమ్మకములో పెట్టినవెంటనే యన్నియు నమ్ముడుబోవు. ఈలోపల షేరులచే సాగించబడు వ్యాపారములు సాగవలసియున్నవి. ఆవైపున షేరులు దొరికినవెంటనే కొనుటకు ధనముండదు. వస్తువుల నమ్మి ధనము దెచ్చుటకు కొంత యాలస్యముతప్ప కెల్లప్పుడు జరుగుట తథ్యము. అట్లైన కొనదగు షేరులను కొనుటకు ధన మప్పునిచ్చుసంస్థ లుండు టెంతలాభమో చూడనగు. ఆపనిని బ్యాంకులుచేసి సాంఘికసేవ చేయుచున్నవి. ఇటుల బ్యాంకులు, షేరుల దుకాణమునందు, అమ్మకపు కొనుట యను వ్యాపారమునందు అమ్మువారికి కొనువారికి కావలసినధన మిచ్చెదమని వాగ్దానమొసంగి అనగా, పరపతినొసంగి వ్యాపారాభివృద్ధి గల్గించుచున్నవి.

ఎగుమతి దిగుమతియగువస్తువుల దుకాణముగూర్చి విచారింతము. క్రిందటి జాయింటుస్టాకు కంపెనీషేరుల దుకాణమునందు షేరులనుకొనుట,అమ్మకపు జరుగుచుండుననియు, అమ్ముకొనుదళారులకు బ్యాంకులు లక్షలకొలది ధనము చేబదులుగా నప్పులనిచ్చి వ్యాపారమును త్వరితముగ జరుగునట్లుచేసి, దేశసేవచేయుచున్నవని జూచితిమి. ఈదుకాణమునందు, షేరులకు బదులు, వస్తువులగూర్చి వ్యాపారము జరుగును. మనదేశము, ఇంగ్లండునుండి, ఇనుపసామాను, మెషినులు, వస్త్రములు అమెరికానుండి మోటారుకారులు, బస్‌బండ్లు వగైరాలు, జపానునుండి బొమ్మలు, సిల్కులు,తదితరచిల్లరవస్తువులు, జావా సుమత్రాద్వీపములనుండి చక్కెరను, జర్మనీనుండి రంగులు దిగుమతి చేయుచున్నది. తిరిగి మనము, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీదేశములకు మనదూదిని, చైనాజపానులకు మనదూదిని, నూలును, ఇంగ్లండు ఫ్రాన్సుదేశములకు మనపొగాకు, గసగసాలు, తేయాకు, రబ్బరు, తివాసీలు, ఆముదపుపిండి, తెలికపిండి, నువ్వులనూనె, వేరుసెనగకాయలు, అమెరికా దేశమునకు మన మిరపకాయలు, ఆఫ్రికా, కెన్యా, ఈజిప్టుదేశములకు మనబియ్యమును, ప్రతివత్సరము, ఎగుమతి చేయుచున్నారము. ఈవ్యాపారములందు కోట్లకొలది ధనము ప్రతివత్సర మటునిటు తిరుగుచున్నది. ఏకొంతమంది వర్తకులు కలిసినగాని, బొంబేవర్తకులందరు కలిసినగాని యింతధనమును తేజాలరొక్కపరి. ఈధనమును,బ్యాంకులు, తమ యనుదినచర్యల ద్వారా సప్లైచేయుచున్నవి.ఎటుల? పొగాకును గుంటూరు రైతులొద్దకొనుచున్న, ఇంపీరియల్ టుబాకో కంపెనీ వారు, సంవత్సరమునకు కొన్నివేల పొగాకుబేళ్ల నెగుమతి చేయుచున్నారు. రాలీబ్రదర్సు అనుకంపెనీవారు, మన

దూదిని వేరుసెనగకాయలను ప్రతివత్సరము, ఎగుమతి చేయుచు కోటికిపైగ వ్యాపారము చేయుచున్నారు. ఈరెండు దృష్టాంతరములద్వారా, ఎగుమతివర్తకమునం దెట్లు బ్యాంకులు సాయము చేయుచున్నది చూతము. ఇంగ్లండు, ఫ్రాన్సుదేశములకు వస్తువుల నెగుమతిచేయగా, సముద్రముపై నొకనెల అచ్చట యాదేశములం దాయావస్తువుల నమ్ముట కొకనెల ధనము బొందుటకు మరొక నాల్గునెలలు, అధమముపట్టును. అనగా యారునెలలు, తిరిగి ధనము బొందునప్పటికి పట్టును. ఈలోపల కంపెనీలకు ధనము కావలసియుండు. పైగా రైతులు పండించి, అమ్ముటకు తెచ్చినపంటను కొన్నపిమ్మట, ఎగుమతిచేయునప్పటికి రెండునెలలయిన పట్టును. కనుక రైతుకు చెల్లించినపిమ్మట, అమ్మలోపల ఎనిమిదినెలలు గడచును. ఇంతకాల మూరకయుండుచో, ఇప్పుడువారు చేయుచున్న వ్యాపారమునకు కావలసిన ధనమునకు పదిరెట్లధికధనము కావలసియుండును. అంతవ్యాపారములాభకరముగా నుండజాలదు. చూడుము. ఒక్క కన్సైన్‌మెంటు, లక్ష రూపాయల ఖరీదుగలది రాలిబ్రదర్సు యూరపుఖండమునకు పంపుచున్నా రనుకొందము. జరుగుచున్నదేమి? వారు షిప్పులో ఆకన్సైన్‌మెంటుపెట్టినవెంటనే, లేడింగుబిల్సు అనునవి తెత్తురు. వానిని తమ బ్యాంకరుల కిత్తురు. ఆబ్యాంకువారు వర్తకుని పేరుప్రతిష్ఠల ననుసరించి, ఇచ్చట రాలిబ్రదర్సు విషయములో షుమారు మూడువంతులధనమును, ఎదు రిచ్చెదరు. లేక, మార్కెటునందున్న వడ్డీరేటుప్రకారము డిస్కౌంటుచేసి మిగత ధనమునంత నిత్తురు. ప్రథమపద్ధతి ప్రకారము, లేడింగుబిల్సు హామీపై డెబ్బదియైదువేల ధనము ఇచ్చి దానిపై వడ్డీమాత్రము తీసుకొందురు. రెండవపద్ధతి ప్రకారము, ధనమంతయునిచ్చి వడ్డీమాత్రముతీసుకొందురు.

ఇందువలన ఎటులు రాలీబ్రదర్సు లాభము బొందుచున్నారో చూతము. తిరిగి తమచేతిలో ధనమున్నది. దీనితో తిరిగి వస్తువులకొని, ఒక్కనెలలో మరొకకన్సైన్‌మెంటుపంపెదరు. ఇటులు నెలనెలకు వెనుకనున్నలక్షరూప్యములతో ఎనిమిదినెలలవరకు, ఎనిమిదిలక్షలవ్యాపారము చేసి, ఎనిమిది కన్సైన్‌మెంటుల నింగ్లండు, ఇతరదేశములకు పంపుచున్నారు. ఇంతలో, మొదటి కన్సైన్‌మెంటు ధనము తిరిగివచ్చుటయు, అంత క్రమముగా తిరిగి యాధనముతో వ్యాపారముచేయుటయు జరుగును. బాంకిట్లు ధనమివ్వనిచో, ఎనిమిదినెలలవరకు, ఎనిమిదిలక్షల ధనము హాజరుగ నుండవలసివచ్చెడిది. దీనియంతపై వడ్డీనష్టము కల్గుటయేకాక, వ్యాపారము చల్లగజరుగుట, జరిగినదానికధికధనము కావలసివచ్చుటచే, వ్యాపారము ముడతవడుట తటస్థించు. తరువాత, రాలీబ్రదర్సువంటి కంపెనీకి మొదట లక్షకూడ బ్యాంకే,పరపతియిచ్చి,వ్యాపారముచేయించు. బ్యాంకు ఎట్లు యీలోపల యీవిషయమై వ్యాపారము చేయుచున్నది? మొదటనే, రాలీబ్రదర్సుకు యెనిమిది లక్షలపరపతియిచ్చి యుండినచో, ఆకంపెనీవారు, ఆధనముపై వడ్డీనిచ్చుచుండెడివారుకారు. బ్యాంకునుండి యెనిమిదిలక్షలు బైటికిపోయియుండును. అంత, రాలీబ్రదర్సుకు ధనము తిరిగివచ్చువరకు, బ్యాంకుయం దెనిమిది లక్షలకు తొట్రుకల్గుటయు,అంతబ్యాంకుకు పరపతి చేయుటందు నష్టముకల్గుటయు తటస్థించు; కాని, ప్రతిపర్యాయము పరపతి నిచ్చుచు, లేడింగుబిల్సును తీసుకొని, వానిపైధనము ఎదురిచ్చుచుండుటచే, తానిచ్చు ధనముపై ముందుగా వడ్డీబొందును. తరువాత, తన 'క్రిందదస్కతు;' ఆలేడింగుబిల్సుకుపెట్టి 'ఎగుమతి దిగుమతివస్తువుల దుకాణమునందు' బెట్టును. అచ్చట నీబిల్లులు, అమ్మకము జెందుటయు, బ్యాంకు కొన్నిదినములు లేక వారముల లోనె, తనధనము బొందగల్గుటయు తటస్థించు. ఎటుల నెవ్వరీబిల్లులను కొందురను ప్రశ్నకు సమాధానము త్వరలోనే యిత్తము. ఈలోపల నిచ్చట, ఎట్లు మనబ్యాంకు కొన్నిదినములు, వారములందే తానిచ్చిన లక్షరూపాయలధనమును తిరిగి తెచ్చుకొనుచు, వడ్డీని బొందుచున్నది చూచుచున్నారము. చూడుడు: పెట్టెలోని ధనముగా ననేకలక్షలధనము ప్రజలు బ్యాంకులందు బెట్టి, కొన్నిదినములందా బ్యాంకులం దుంచుచున్నారని తెలుసుకొన్నప్పుడు వడ్డీలకిచ్చినధనము కోట్లకొలది ప్రతిబాంకు నందుండునని తెల్పినప్పు డెంతవ్యాపార మెన్ని విధముల నెన్నిపరియాయములు, అటునిటు గిరగిర నీ ధనమును త్రిప్పుచుచేసి, ధనమెంతగా బ్యాంకులు సంపాదింప వీలగునో తెలుసుకొనుట సులభము. ఎటుల నెవ్వ రీబిల్లుల కొందురు? దిగుమతియగువస్తువుల కెట్లు ధనము చెల్లింతురు. అను ప్రశ్నల విచారించవలయును. ఇతర దేశము

లందు మనవస్తువులకొనుచున్న వర్తకులందరు, మన ఎగుమతివర్తకులకు తిరిగి ధనము చెల్లింపవలసి యున్నారు. సాధారణముగా మనవర్తకులకు రూపాయలందు ధనము చెల్లించినచో చాల సుకరముగ నుండును. ఇంగ్లండు మన దేశములగూర్చిమాత్రము విచారింతము. మన పొగాకు, తివాసీలు, నూనెపదార్థములు కొను వర్తకు లింగ్లండునందుండి మనకు తమ నాణ్యములగు పౌనులందే చెల్లించెదమనుచో మన యెగుమతివర్తకులు సాధారణముగా నొప్పుకొనరనియు, మనకు ముందుగా యిన్ని రూపాయల చెల్లించెదమని పరిష్కరించుకొనినపిమ్మటనే తమ వస్తువుల నమ్మెదమని పల్కెదరని, మనదేశపు యెగుమతి దిగుమతి విషయముల నెరుంగని రాజకీయజ్ఞులు పలుకవచ్చు. వారు చెప్పుదానియందు చాల సత్యము కలదు. కాని, ఒక్క విషయమును జాగ్రత్తగ గమనించవలయును. మనదేశపు యెగుమతి దిగుమతివ్యాపారములో ప్రధానభాగము ఇతర దేశీయులగు ఇంగ్లీషుబ్యాంకరులచేతిలోనున్నది. అందువలన వారు ఇంగ్లీషువ్యాపారము జరిగినంతవరకు, పౌనులందే చెల్లింపకోరెదరు. ఐనను వారికైనను, తమప్రస్తుతప్రదేశము యిండియాయందే, ఆదేశపు నాణ్యములందే తమధనము త్వరగావచ్చుట లాభకరముగ నుండును. కాన పైనతెల్పిన వస్తువులకొన్న యింగ్లండువర్తకులు తమ ధనమును ఇండియాదేశమునకుబంపి, ఆపౌనుల ప్రభుత్వమున కిచ్చి రూపాయలతీసికొని వానిని తమకు వస్తువుల నమ్మిన వారి కిచ్చుటయుగల కష్టనష్టముల బొంద నిష్టములేక మరొకపని చేయుదురు. ఇంగ్లండుదేశమునుండి మనవారు ఇనుపసామానులనేకములు, వస్త్రములు తెప్పించుచున్నారు. వాని కన్నిటికి ఇంగ్లండుదేశపు నాణ్యములగుపౌను లందు ఇంగ్లండుదేశపువర్తకుల కాదేశమునందే చెల్లింపవలసియున్నారు మనవర్తకులు. వీరికి తమ రూపాయలను తమప్రభుత్వమునకిచ్చి, పౌనులను గైకొని వానిని యింగ్లండునకు బంపి అచ్చట నాదేశపు వర్తకులకుచెల్లించి బాకీతీర్చుట చాల కష్టతరమనితోచు. అందువలనమరొక మార్గమును వెదకుదురు. మనదేశమునకు ధనము బంపగోరు వర్తకు లెల్లప్పుడు కొందరు ఇంగ్లండుదేశమునందు ముఖ్యముగ లండనునందున్నారు. మనదేశమునుండి పౌనులందు ధనము బొందవలసిన వర్తకులు మరికొందరు లండనునం దెల్లప్పు డుందురు. మనవారు చేయవలసిన దెల్ల యేమి? లండనులోనున్న యావర్తకుల నొకరియొద్దకు మరొకరి జేర్చి ఒకరికొకరు ధనము చెల్లించునట్లు చేయుటయే, మనవారు ఇంగ్లండుకు ధనమును, ఇంగ్లీషువారు మనదేశమునకు ధనమును ఓడలద్వారా పంపించనగత్యము తప్పును. అంత మనదేశమునుండి ధనము పొందవలసినవారికి మన దేశమునకు ధనము పంపవలసినవారు, తమ ధనము చెల్లింతురు. అంత, మనదేశమున ఇట్టియేర్పాటే మరొకటి జరుగును. మనదేశమున, ఇంగ్లండుదేశమునుండి ధనము బొందవలసిన వారికి, మనదేశమునుండి యింగ్లండుదేశమునకు ధనము పంపవలసినవారు, రూపాయల రూపకముగా ధనము చెల్లించి, ఇచ్చటివ్యాపారము సరిపెట్టుకొందురు. అంత, ఇంగ్లండు, మనదేశము మధ్య, నాణ్యములు, అటునిటు, త్రిప్పవలసిన యవసరము తగ్గు; కాని, ఇటుల, అచ్చటి వర్తకు లొకరివద్దకు మరొకరు, ఇచ్చటివర్తకులు, ఒకరి యొద్దకు మరొకరువెళ్లి, తమతమ వ్యాపారము సరిపెట్టు కొనుట దుస్సాధ్యము; అమితకష్టము కల్గించును. ఒక వ్యాపారునకు కావలసినధనముకై యనేక వ్యాపారుల వద్దకువెళ్లి, ధనము గొన్ననేగాని, వ్యాపారము సాగదు. కనుక, ఒకయుపయోగకరమగు దుకాణము బయలుదేరినది. దానిని Foriegn Exchange Market 'పరదేశనాణ్యముల దుకాణ'మందురు. ఇందు, దళారు లుందురు. వీరు, అన్ని దేశముల నాణ్యములగూర్చి వానియొక్క తాత్కాలికపు విలువగూర్చి బాగుగచదివి, పండితులై యుందురు. వీరుచేయునదియెల్ల, మన దేశమునుండి ధనము రప్పించుకొనవలసిన వర్తకులనుండి, వారి బిల్లుల కొనెదరు. అంతమనదేశమునకు ధనము బంపవలసినవారినుండి, ఆదేశముయొక్క ధనమగు పౌనులుతీసుకొని, వారిపరముగా వారియప్పుల నిండియాలో తీర్చెదమని వాగ్దానముచేయుదురు. ఇటులవీరు, మనదేశమునుండి ధనమురాబట్టుకొను వారినుండి, మనదేశమునకు ధనము పంపవలసినవారినుండి కమీషన్ బొంది, తాము లాభము పొందుచు, సంఘమున కత్యవసరమగు కార్యమును నెరవేర్చుచున్నారు. మనదేశమునందిట్టి పరదేశనాణ్యముల దుకాణము బొంబేయం దొకటికలదు. అచ్చట, దళారులు, ఇంగ్లండుదేశము నుండి ధనము బొందవలసినవారినుండి, వారిబిల్లులకొని

వారికి రూపాయలను చెల్లింతురు. అంత యింగ్లండు దేశమునకు ధనము బంపవలసిన వారినుండి రూపాయల ద్వారా ధనముగొని, ఇంగ్లండు దేశపువర్తకులకు పౌనులద్వారా ఆ ధనమును చెల్లించెదమని వాగ్దానమిత్తురు. అంత నిచ్చట వ్యాపారము సరిపెట్టబడును. ఐనను, దినదినమును, లెక్కలు సరిపడకపోవచ్చు. వారమువారమును లెక్కలు సరిపోవు. అనగా ఇంగ్లండునందు ఇండియానుండి రావలసిన ధనముకంటె, ఇండియాకు పంపవలసినధనము హెచ్చుగా నుండు ననుకొందము. ఈస్థితి కొన్నిదినముల వరకే యుండునేని, కొంచెము తక్కువధరకు పౌనులను తీసుకొని, ఇండియాకు ధనము బంపెదమని దళారులు చెప్పెదరు. అనగా పౌనుయొక్క విలువ దగ్గును ఒక్కపౌనుకు తక్కువరూపాయలు వచ్చును. ఎంతవరకుతగ్గును అను ప్రశ్నకు సమాధానము మనదేశముగూర్చి చెప్పబడునుగాని యూరపులోని యనేకదేశములగూర్చి చెప్ప వలనుపడదు. 'మారకమును'గూర్చి 'నాణ్యములు—పరపతి'గూర్చిమరొకప్పుడు పుస్తకరూపకముగా తెల్పబోవుచున్నానుగాన యిచ్చట ఇంతకంటె దీర్ఘముగవిచారింపనవసరముండదు. ఎంతవరకు తగ్గును? మనదేశమునకు పౌనులబంపి మనప్రభుత్వమునకా ధనమిచ్చి,రూపాయలబొంది ఎగుమతిదారులకిచ్చుట కెంత కర్చగునో, అంతవరకు పౌనుయొక్క విలువ తగ్గును. ఇటులనే, మనదేశమున ఇంగ్లండునుండి రావలసినధనముకంటె ఇంగ్లండుకు పంపవలసిన ధనము హెచ్చుగా నుండునేని ఇంగ్లండుకు ధనము పంపదలంచువారికి దళారులుతక్కువ పౌనులనిచ్చి ఇంగ్లండుకు ధనము బంపెదమనెదరు. ఇందు నూడ, ఇండియానుండి వెండినితీసుకొనిపెళ్లి, ఇంగ్లండులో బంగారముగొని అచ్చటి యెగుమతిదారులకు చెల్లించుట కెంతకర్చగునో అంతధనమునందు కొంత కొంతగా ప్రతిరూపాయిపై హెచ్చువెల దళారుల కివ్వవలయును. లేక అంతగా రూపాయలవిలువ తగ్గును.

కాని సాధారణముగా, ఇంగ్లండునందు దళారిపని చేయుకంపెనీలకే బలీయములగు బ్రాంచిదళారి బ్యాంకులు మనదేశమునకలవు గనుక, అటునిటు వత్తిడివలన కల్గు లాభములబొందుచు, ఇండియాకు హెచ్చుధనము రావలసియుండునప్పుడు, ఇండియాను బ్రాంచినుండి రూపాయల యిండియానువర్తకుల కిచ్చుటయు, ఇంగ్లండునకు హెచ్చు ధనము రావలసి యుండునప్పుడు, ఇంగ్లండు బ్రాంచినుండి పౌనులద్వారా యచ్చటి వర్తకులకు చెల్లించుటయు జరిపి, వ్యాపారము సరిపెట్టుచుందురు.

ఇప్పటికే చాలాకాలాతీతమైనది. మొదటమనము రాలీబ్రదర్సుయొక్క లేడింగుబిల్లుకు క్రిందదస్కతు బ్యాంకుచేసినపిమ్మట రాలీబ్రదర్సుకు ధనముచేరినపిమ్మట, ఎగుమతి దిగుమతియగు వస్తువులదుకాణమున కాబిల్లుల పంపి, ధనముగొందురు, ఆబ్యాంకు లాభముబొందుచున్నదని తెలిపితిమి. ఎటులు అప్పుడు జరుగుచున్నదో యను ప్రశ్నకు సమాధానమిచ్చుటకు, అవైపునుండి యెటులు దిగుమతి చేయువర్తకులకు ఎగుమతిదిగుమతియగు వస్తువులదుకాణమునకుగల సంబంధము జూచుటకై యింతతడవుగా, మనదేశము, ఇతరదేశములమధ్య జరుగువ్యాపారమునందు చెల్లింపవలసిన మొత్తములనెట్లు, అటునిటు త్రిప్పుపని జరుపబడుచున్నదో యనువిషయము, ఇంగ్లండుమనదేశముమధ్య జరుగు వ్యాపారమును దృష్టాంతముగా గైకొని విచారించితిమి.

ఇకనిప్పుడు మనప్రశ్నను విచారింతము, 'బ్రాంచి మారకపుదళారి బ్యాంకులు' మనదేశమునందు, అందు బొంబాయందు దమితప్రాముఖ్యమువహించి యున్నవని తెల్పి యుంటిమిగదా! ఆమారకపు బ్యాంకులందు కొంత ధనమెప్పుడు నిలకడగా యుండుననియు. దానినుండియే, అప్పుడప్పుడు కల్గు వత్తిడిద్వారా మనదేశపు వర్తకులకు ఇతరదేశపు వర్తకులనుండి రావలసినధనము మన దేశమునుండి యితరదేశములకు పోవలసిన ధనముకంటె హెచ్చగునేని ఆహెచ్చగు మొత్తమును చెల్లించుచుండునని సూచితిమి. అప్పుడప్పుడు కల్గువత్తిడులకని, కోట్లకొలదిధనమును ఖజానాలందు సోమరిగా నుంచి ఏవడ్డీని బొందక నష్టపడుటకంటె ఆధనమును అవసరముగు సమయములయందు ధనరూపముగావచ్చు వస్తువులందిడి, ఆవస్తువులద్వారా వడ్డీసంపాదించుచునేని లాభముకల్గుననుట తెల్లము. కనుక, అట్టివస్తువు లెవ్వి యన్న లేడింగుబిల్సు (Exchange Bills) లేక 'మారకపుబిల్లులు' అని చెప్పవచ్చు. ఇచ్చట నిదివరకు తెలుపని 'మారకపు బిల్లులు' వచ్చినవి. అవియేవి? మన ప్రథమప్రశ్నకు సమా

ధానము ముందుచూతము. మారకపుబ్యాంకుల దళారులు, లేడింగుబిల్లులను కొనెదరు. కొనుటయందతి జాగరూకతతో రాలీబ్రదర్సుయొక్క వ్యాపారము మంచిదా కాదా యనుప్రశ్నను గూర్చి, క్రిందవస్తువు పెట్టిన బ్యాంకుపలుకుబడి మంచిదా కాదా యను ప్రశ్నను గూర్చి, యాలోచించి తరువాత ఆయాబిల్లులు తిరిగి ధన రూపకముగా వచ్చు సమయమున తమ కెంతధనము కావలసివచ్చు నను ప్రశ్నకు సరియగుసమాధానములు తట్టినపిమ్మట కొన్నప్పటినుండి వస్తువు లమ్ముడుబోవు తేదీవరకు అప్పటి మార్కెటురేటుప్రకారము వడ్డీతగ్గించుకొని మిగతధనము కాబిల్లులకొని, ధనము బ్యాంకునకు చెల్లించు. అంత ఆ బిల్లుల ద్వారా సోమరిగాపడియుండు ధనమునుపయోగించి వడ్డీని సంపాదించుట సాధ్యమైనది. తరువాత, మరొక లాభము కలుగుచున్నది. దానిని మారకపుబిల్లులనుగూర్చి విచారించినపిమ్మట చూతము.

మారకపుబిల్లులేవి ? పైనతెల్పిన రాలీబ్రదర్సు వ్యాపారమునందు, మనదేశమునుండి, ఆకంపెనీవారు సరుకులను, ఇతరదేశములకు గొంపోయి, అచ్చటనమ్మి, పిమ్మట ధనము బొందుచున్నారని తలంచితిమి. అట్టుల యన్నివ్యాపారములందు జరుగదు. సాధారణముగా జరుగుచున్నదేమన, ఇతరదేశవర్తకులు తమ యేజెంటులద్వారా మనదేశమునందు మనవర్తకులనుండి, మనరైతులనుండి, మనవస్తువుల కొనుచున్నారు. కాని, వారు,మన వర్తకులకు, రైతులకు సాధారణముగా వెంటనే ధనమును చెల్లించుచున్నారు. అందువలననే పైన తెల్పిన లేడింగుబిల్లుల యవసరము, ప్రాముఖ్యము మనదేశమున నుండుట కేర్పరచబడెను. కాని యితరదేశములందు మారకపుబిల్లులు చాలముఖ్యముగనున్నవి. అచ్చట యితరదేశపువర్తకులా ప్రత్యేకదేశమునందు (ఇంగ్లండువర్తకులు అమెరికాదేశమునందనుకొందము) వర్తకులు రైతులనుండి వస్తువుల కొందురు. అంతట ఆవర్తకులకు రైతులకు, కొనుచున్న యింగ్లీషువర్తకులు, ఆయావస్తువులు తమ దేశముచేరిన కొన్నిదినములలో, కొంతధనము చెల్లించెదమని వాగ్దానమిచ్చి ఒకపత్రము నావిషయముల దెల్పుచు వ్రాసియిచ్చి వస్తువుల తీసుకొనివెళ్లెదరు. కాని ఆవర్తకు డెట్టివాడో తెలియకుండుట సాధారణము గాన ఫలాని యింగ్లీషు బ్యాంకుద్వారా చెల్లింతునని యాతడువ్రాయును. అంత ఆవస్తువులు ఇంగ్లండుచేరి అమ్ముడుపోయినపిమ్మట ధనము వచ్చువరకు అమెరికాదేశపు వర్తకుడుగాని, రైతుగాని, ధనములేకుండా కష్టపడుట కొప్పుకొనడు. లాభకరము గాదుగాన, ఆవర్తకుడుగాని, రైతుగాని, ఎవరైనను, ఆ పత్రమును తనబ్యాంకునకు తీసుకొనివెళ్లి దానిపై పరపతి నీయగోరును. అంత నా బ్యాంకు ధన మెప్పుడాపత్రముపై వచ్చునో అంతకాలమునకు వడ్డీని తగ్గించుకొని మిగత ధనమును రైతునకుగాని, వర్తకునకుగాని యిచ్చును. అంత నా బ్యాంకు ఆపత్రమును యింగ్లండునకు బంపి, హామీ యిచ్చిన యింగ్లీషుబ్యాంకునకిచ్చి దానిచే చెల్లించెద నను వ్రాలును (Acceptence ) బొందును. ఇట్టుల హామీ యిచ్చు వ్యాపారమును 'Accepting Business' అందురు. అంత ఆపత్రము (Exchange Bill) మారకపుబిల్లు అని పిలువబడుటయు, మన లేడింగుబిల్లువలె ఎగుమతి దిగుమతియగు వస్తువులదుకాణమునందు కొనబడుటయు, మొదటిబ్యాంకు తనధనము తిరిగిపొందుటయు జరుగును. ఇచ్చటకూడ మారకపుబ్యాంకునకు సోమరిగా నుండవలసిన ధనముపైవడ్డీవచ్చు. (Lading Bills, Exchange Bills) 'లేడింగుబిల్లులు, మారకపుబిల్లులు' వీనిమధ్య కొంత భేదము గలదు. మొదటిబిల్లులకెప్పుడు తప్పక ధనము వచ్చునను నిర్ధారణ నిశ్చయము లేదు. అందువలన కొంత సందేహమునకు కారణమగును. మారకపుబిల్లులు ఫలానా ఫలానా తేదీలయందు ధనము తెచ్చునని నమ్మకమిచ్చు. కానియనుభవముగల, 'వస్తువుల యమ్మకము, కొనుట'ను గూర్చి జాగ్రత్తగ జదువుచుండు 'మారకపుబ్యాంకు'ల దళారులకు లేడింగుబిల్లులగూర్చికూడ చాలవరకునిశ్చయముగా నెప్పు డెంతధనమువచ్చునని తెలుసుకొనుటసాధ్యము.

కనుక, ఇదివరకు తెల్పినట్టుల సోమరిగా నుండవలసినధనముపై వడ్డీవచ్చుటయేకాక, మరొకలాభముకల్గుచున్నది. పైనచూచిన ధనముబత్తిడులను ఎంతవరకుఅరుదుగాచేసిన యంతేలాభమే. మారకపు బ్యాంకులు హెచ్చు ధనము ఆవైపున ఈవైపున ఇచ్చుట పుచ్చుకొనుట జరుపుచు అమితముగా నెత్తి యెంత పగులగొట్టుకొని లెక్కల వేయునవసరము దప్పుటద్వారా బొందును. పైగా హెచ్చుదళారి ఖాయిదా చెల్లింపవలసిన యగత్యము తగ్గ

టచే వ్యాపారమునందు పరస్పరధనము విలువయొక్క నిలకడ గట్టిగనున్నదను నమ్మకము గల్గుటచే పరస్పరము అన్ని దేశములవర్తకులు, లాభము బొందెదరు. కనుక బ్యాంకులు, వర్తకులకు మారకమునందు అమ్ముటయందు కొనుటయందు పరపతి నిచ్చుటచే చాలలాభము గలుగజేయగలవు.

ఇంతవరకు ఎగుమతిచేయువర్తకులకు చేయవలసిన వసతులగూర్చియేవిచారించితిమి. ఇతరదేశములందు మారకపుబిల్లులున్నవని చెప్పునప్పుడు ఇంగ్లండు వర్తకుడు అమెరికా దేశమునందు వస్తువులగొని, ధనము ఇంగ్లండు చేరిన కొన్ని దినములలో చెల్లింతునని వాగ్దానముచేయుచు అమెరికను దేశపు వర్తకునకు పత్రమిచ్చును. ఆ పత్రమునకు ఇంగ్లండుదేశపు బ్యాంకుయొక్క హామీయిచ్చిననే వ్యాపారము సాగుగాన,అట్లుచేయుచున్నాడని తెల్పియుంటిమి( ఇంగ్లండుదేశపు వర్తకులకే యితరదేశపు వస్తువుల కొనునప్పుడు తమదేశపు బ్యాంకుల హామీయవసరమైనప్పుడు, మనదేశపు వర్తకులకు మన బ్యాంకులు హామీ యిచ్చుట మరింతయావసరమని తెల్లమేకదా! ఇటుల హామీ యిచ్చినందులకుగూడ బ్యాంకు కొంతకమీషను తీసుకొనవచ్చు. ఇటుల బ్యాంకునకు లాభముకల్గును. అటు మనదేశపువర్తకుడు, మనదేశమునకు వస్తువులతేకముందే మన దేశమున వాని నమ్మువసతుల కల్గించుకొని, అమ్మి ధనముబొందకముందే, కొనినవెంటనే యింగ్లండుదేశపు ఇతర దేశపు వర్తకులకు ధనము చెల్లింపవలసివచ్చునో చాల కష్టము కల్గును ఎట్లన లక్షలకొలది మూలధనముతో కోట్లకొలది పరపతితో కోట్లకొలది వ్యాపారముచేయుట, బ్యాంకు హామీయిచ్చిన సాధ్యమగుచుండ, కోట్లకొలది మూలధనముతో,లక్షలకొలది వ్యాపారముమాత్రమే బ్యాంకుహామీ యివ్వని రోజరుగును. అంత బ్యాంకునకు లాభముతక్కువ వచ్చుటయు, వర్తకము తగ్గుటయు, మనదేశపు దిగుమతి చేయువర్తకులు నష్టమొందుటయు, ఇతరదేశపువర్తకులు కూడ వ్యాపారము తగ్గుటచే నష్టమొందుటయు కల్గు. కనుక ఇటుల హామీనిచ్చి మనవర్తకుల ప్రోత్సహించి, వ్యాపారము వృద్ధిచేసి, తమలాభముల హెచ్చించుకొనుట బ్యాంకుల ధర్మము.

హుండీల దుకాణముగూర్చి యిచ్చట తెల్పుటకు, ఇతరవిషయము లెన్నియో తెలియవలసి యున్నవి గాన, ప్రస్తుతము వీలులేదు. ప్రత్యేకముగా మారకపుబ్యాంకుల గూర్చి తెల్పునప్పుడు వానిగూర్చి విచారింతము. ఇంతవరకు జాయింటుస్టాకు షేరుల దుకాణమునందు ఎగుమతి దిగుమతియగు వస్తువులదుకాణములందు ఎట్లు బ్యాంకులు తమధర్మములనెరవేర్పవలసియున్నది చూచితిమి. షేరులు కొను దళారులకు షేరులనమ్ము దళారులకు అప్పుల నిచ్చి వ్యాపారమును త్వరపెట్టుటగత్యము, బ్యాంకుల ధర్మము- బ్యాంకులేయాపని చేయగలవు. ఎగుమతి చేయు వర్తకులకు పరపతియిచ్చుటయే కాక, వారికి లేడింగుబిల్లులపై ధనమిచ్చుటయు, వారిమారకపుబిల్లులపై ధనమిచ్చుటయు బ్యాంకుల ధర్మము. దిగుమతిచేయువర్తకులకు వారు చేయు వ్యాపారమునకు హామీయిచ్చి మనదేశమునకు వారికి కావలసిన వస్తువులు వచ్చినక్షిమ్మటనే, అవి యమ్మబడుటకు తగినంతయవకాశము గల్గిన పిమ్మటనే, వారితరదేశవర్తకులకు ధనముచెల్లించు వసతిగల్గించి వారిమారకపుబిల్లులకు తగినహామీనిచ్చుట మనబ్యాంకుల ధర్మము.

ప్రథమవ్యాసమున అప్పుల నిచ్చి పుచ్చుకొనుట ప్రథమమున బ్యాంకులు నెరవేర్పవలసిన రెండు ధర్మముల నుచూచితిమి. ఇచ్చట మరిరెండు ధర్మములను చూచితిమి. మనదేశపు ప్రత్యేకస్థితిగతుల ననుసరించి ఈనాల్గుధర్మములను మనబ్యాంకులే నెరవేర్పవలయునని చెప్పదగు. ఇతరదేశములందెట్టి ఇతరపద్ధతులు సాధ్యమైనవో మరొకవ్యాసమున తెలుపబడును. *



* తరువాయి 'శారద' 1924 వ సంవత్సరపు అక్టోబరు సంచికయందు కలదు.




# సంస్కృతభాషాప్రశంస

నేమాన సూర్యప్రకాశ కవిగారు

ఈశ్వర భారతీశ్వర రమేశ్వరులుం ద్రిదివేశ్వరాది లో
కేశ్వరులు న్నృపర్షులు మునీశ్వరులున్ వ్యవహారభాషగా
విశ్వవిధంబులం గొనుట విశ్రుతమై స్తుతమై పవిత్రమై
శాశ్వతమై చెలంగినది సంస్కృతభాషయెకా సహోదరా!

చ. అకలుషమై సమస్తవిబుధాభినుతంబయి యగ్రగణ్యమై
సకలసుధీజనశ్రుతిరసాయనమై రమణీయమై మహా
సుకవిమనోవినోద మయి శోభనమై భువనప్రజానురం
జకమయి మించునీసరససంస్కృతభాషకు సాటి యున్నదే.

గీ. ఘూర్మపింగలభాషల కెల్ల దల్లి, ఘనపదార్థంబుల నొసంగు కల్పవల్లి
భవ్యకావ్యామృతమునకు బాలవెల్లి, సంస్కృతము దీని సన్నుతిసల్ప వశమె.

గీ. వాసవాదిదివిజవర్గంబు నిరతంబు, బలుకుచుండు పరమభాష గాన
దీని మానులెల్ల దేవభాష యటంచు, నిర్ణయించి రదియె నిక్కువంబు.

గీ. నలువ మొగమున బొడమిననాల్గువేద,ములును జేజేలబాసయై యలరెగాదె
మరి పరబ్రహ్మరూపమై నెరిబరంగు, ప్రణవము పవిత్రమగు దేవభాష గాదె.

క. పరమేశ్వరుని విలాసము, సరవిం బ్రకటించునుపనిషత్తతులెల్లన్
సరసతరసంస్కృతోక్తుల, విరచింపంబడవె తొల్లి విశ్రుతరీతిన్.

సీ. అగ్రజోపాస్యగాయత్రీప్రముఖమ,హా మహిమాసహితదివ్యమంత్రములును
పరమేశ్వరప్రీతికరయజ్ఞసాధన, మానిస్తుత శ్రౌతమంత్రములును
కమనీయధర్మార్థకామమోక్షప్రద, మంజుతరస్మార్త మంత్రములును
శాక్తేయ గారుడ శాబరాదిక తంత్ర, మహితాఖిలాగమమంత్రములును
సకలసుకవివినుతసంస్కృతభాషాప్ర,కల్పితంబులై యనల్పరీతి.
బరగుచుండె గాన బరికింప నీదివ్య, భాష బోలినట్టి భాష గ దె.

మ. విలసద్వ్యాకరణంబు దర్కము మహావేదాంతవైద్యంబు లు
జ్జ్వలమౌజ్యోతిషముం గళాభరతము ల్సంగీతసాముద్రికం
బులు శిల్పంబును మున్నుగా గల సుధీపూజ్యంబులౌ శాస్త్రముల్
తలప న్సంస్కృతవాఙ్మయంబులుగదే తత్ప్రౌఢి సామాన్యమే.

సీ. అతిపవిత్రంబు రామాయణకావ్యంబు, పరికింప సంస్కృతభాష గాదె
పంచమవేదంబు భారతగ్రంథంబు, పరికింప సంస్కృతభాష గాదె
భక్తసంసేవ్యంబు పరమభాగవతంబు, పరికింప సంస్కృతభాష గాదె
ఆర్యస్తుతములు స్కందాదిపురాణముల్, పరికింప సంస్కృతభాష గాదె
కలితధర్మబోధకములైన స్మృతులును, కావ్యములును నాటకములు స్తోత్ర
పాఠములును సరవి బరికింప సంస్కృత, భాష యగుచు జగతి బరగుగాదె.

సీ. కశ్య పాత్రి వసిష్ఠ కణ్వ పరాశర, వ్యాసాది సన్మునివ్రాతములును
దశరథ శ్రీరామ ధర్మజ విక్రమా, దిత్యభోజాది ధాత్రీపతులును
బాణ దండి మయూర భవభూతి భారవి, కాళిదాసాదిసుకవివరులును
శంకర శంకరాచార్య రామానుజా, చార్యాది సన్మతస్థాపకులును
భాసమాననివ్యభాషా ప్రసేవాప్తి, శేషమునను భువి విశేషయశము
గౌరవంబు ప్రతిభ ఖ్యాతియు భూతియు, బడసి రిట్టి భవ్యభాష గలదె.

సీ. ఏభాష బఠియింప నిద్ధరిత్రి నరుండు, పండితుండై ఖ్యాతి బడయగలడు
ఏభాష జదివిన నిద్ధారుణిజనుండు, కవివరుండై పేరు గాంచగలడు
ఏభాష నెఱిగిన నిమ్మహి మనుజుండు, విజ్ఞానవంతుడై వెలయగలడు
ఏభాష నెనసిన నిద్ధర బురుషుండు, భూరిగౌరవముల బొందగలడు
ఏమహాభాష దెలిసిన నెలమిమర్త్య, డైహికాముష్మికసుఖంబు లందగలడు
అట్టి సంస్కృతభాష హతార్యదోష, దీని మహిమంబు దగ సన్నుతింప వశమె.

గీ. గ్రామములపేళ్లు మనుజులనామములును, స్నానము జపంబు పూజ భోజనము నిద్ర
అనుచు మనమెప్పుడును వాడుకొనుచునుండు, పలుకులం బెక్కు జేజేలబాస గాదె.

గీ. ఏల నీలీల నిక నది యిది యటంచు, బలుకగావలె నేతత్ప్రపంచ మెల్ల
సంస్కృతోక్తిమయంబై యెసంగు జగము, నిండియుండిన సర్వేశ్వరుండుపోలె.

క. ఈభారం బీమార్దవ, మీభూరిగభీరతయును నీ సరసత్వం
బీభాషకు గా కిల మరి, యేభాషకు నైన గలవె యెద జర్చింపన్.

ఉ. భారతభూమికీ యమరభాష విశేషయశంబు సంపదల్
గౌరవము న్మహోన్నతియు ఖ్యాతియు గల్గగజేసె గాన నీ
భారత మాతృపుత్రు లయి భాసిలుచుండిన భారతీయు లి
చ్ఛారతి నిచ్చలు న్సరస సంస్కృతభాష బఠింపగాదగున్.

క. భూదేవకులోద్భవులకు, వేదాధ్యయనంబు ముఖ్యవిధి గావున మ
త్సోదరు లెల్లం దద్విధ, మాదరమున సల్పి మహిమ మందగవలయున్.

సీ. సంస్తుత్యసాహిత్యసరణి గావలె నన్న, వరనైషధాదికావ్యములు గలవు
శృంగారనాటకభంగి కావలె నన్న, శాకుంతలాదులు చాల గలవు
ఘనతరాలంకారకలన గావలె నన్న, కువలయానందాదు లవని గలవు
అతులవేదాంతసంగతులు కావలెనన్న, సూత్రభాష్యాదులు ధాత్రి గలవు
ఆతతజ్యోతిషరీతి గావలె నన్న, కాలామృతాదులు చాల గలవు
నిరుపమాయుర్వేద గరిమ గావలె నన్న, సద్వాహటాదికోశములు గలవు
స్తవనీయనీతివైభవము గావలె నన్న, శుక్రనీత్యాదులు క్షోణి గలవు
సరససంగీతవైఖరులు గావలె నన్న, గానామృతాదులు గలవు మిగుల
ఇంక నిది యిది యని పల్కనేల నేఁడు, గావలయునన్న సురభాష గల దిది యొక
కల్పవృక్షంబు దీని ననల్పమహిమఁ, బెంపలర నెల్లజను లుపాసింపవలదె.

గీ. మాతృభాషయైన మన సంస్కృతము వీడి, యితరభాష జనువు లెల్ల కన్న
తల్లి వదలి సవతితల్లిని జేరుటగాదె, తలప దాన గలదె మేలు.

క. అవని వ్యవహారార్థము, నివసించిన దేశభాష నేరిచినను నా
ర్యవరుండు సంస్కృతంబుం, దివిరి చదువవలయు దాన ధీరుఁడయి తగున్.

గీ. భారతీయులెల్ల బ్రాజ్ఞులు వీ రెఱుం, గనివిశేషములు జగమున లేవు
అయిన నాకు నిమ్మహాభాషపై గల, ప్రీతి నిట్లు విన్నవించినాఁడ.

గీ. శారదాభూరితరకృపాసారగరిమ, రచన గావించె నీపద్యరత్నములను
శ్రీశ! నేమాన సూర్యప్రకాశనామ, ధేయుఁడు సుధీనికాయవిధేయుఁ డగుచు.





# * నాట్యరంగ ప్రయోజనము

ఎంతదూర మేఁగినను, ఎందఱినిగూర్చివిన్నను మనకుఁ బ్రస్తుతమునవలయు స్వజాతీయ ధర్మోపదేశక రంగరాజమ్ములుగాని, నిర్మాణవైచిత్ర్యములుగాని కనిపించియుండ లేదనియే చెప్పవలసియున్నది. రాజమహేంద్రవర మనేక వేలరూప్యములను వెచ్చించి యనేక రాంగిక వైచిత్ర్యములను బ్రదర్శించియుండెడిది. అటుపై మైలవరం బాలభారతీసమాజమును, రాజమహేంద్రవరసామాజికరంగమునకుఁ గౌరవమైన నాట్యభవనమును నిర్మించుకొనియు ననేకయవనికాదిపరికరములను సేకరించుకొనియుఁ బ్రజామోదపాత్రంబై నెగడియుండినది. ఎలక్ట్రిక్ నామకవిద్యుద్దీపములనుగూడఁ బ్రదర్శించి యుండినది. ఏలూరు మోతేవారి సమాజమును దీనితోపాటుగనే ధనరాసులను గుమ్మరించి తనదురంగమును సకలసంపత్సమన్వితముగ వెలిగించినది. దుగ్గిరాల, తెనాలి, గుంటూరు, బందరులందును ఇందునుగూర్చి యిప్పటికిని యథాశక్తిఁ బ్రయత్నములు సేయుచునేయున్నారు. బళ్లారియుఁ బైన పేర్కొనఁబడినవానికంటె మిన్నగ నేయలరారుచుండినది. అన్నిటికంటె మైసూరు గుబ్బికంపెనీ లక్షలకొలఁదిగ వెచ్చించి తనదు నాట్యరంగమును హిందూదేశమునందలి యేపెద్ద "ఆల్ఫ్రెడ్డు థియేటరు"నకును దీసిపోని సమగ్రరంగ ప్రసాధనములతో, యాంత్రికవైచిత్ర్యములతోఁ, బ్రయోగవైదుష్యములతోఁ బ్రసిద్ధ నటాంతర పరిపాక ధీప్రాగల్భ్యములతో, నిఖిలాంగోపాంగిక సామరస్యములతో, స్వకపోల కల్పితానేక నవీన నాటక ప్రయోగప్రావీణ్యములతోఁ, బాటలతోఁ, బద్యములతో, డ్యాంసులతో, సీనులతో, హంగులతో, రంగులతోఁ, దాళములతో, మేళములతో, జంత్రములతోఁ దంత్రములతో, మెరసినటులు, మొలచినటులు, కర్ణాటక రాజ్య సామ్రాజ్యైకనాట్యకళాసామ్రాజ్యసార్వభౌమత్వమును వహించి నిజకీర్తిచంద్రికలను నిఖిలభూములను వెలిఁగించుచున్నయది. మహారాజరాజేంద్రసంవర్ధిత సకల సంపత్సమృద్ధితో మాఱులేక మహీమండల మంతకు నలంకారప్రాయంబై విరాజిల్లు నీ గుబ్బిసామాజికరంగ వైచిత్ర్యములకంటె యతిశయించిన రంగరాజమ్ములను మనప్రాంతములం దెందును జూడఁబోమనుట నిస్సంశయము.

గుబ్బిసమాజము లక్షలకొలఁది వెచ్చించి యిట్టి రంగప్రసాధనాధికసంపదలను సంపాదించుకొనెను. బొంబాయి, కలకత్తా, నైజాములుగూడ శ్రీమంతుల కాలవాలమ్ము లగుటచే నీ గుబ్బిసమాజమును మించు రాంగిక వైచిత్ర్యముల నప్పుడప్పుడు ప్రదర్శింపఁగలవు. వీనిని మించి పాశ్చాత్యనాటకరంగములు వెలుగొందునట్టులు మనము గ్రహింపఁగలము.

నాట్యకళాభిమాను లాశింపఁదగిన దిట్టిది కాదు. కాలోచిత, కథోచిత, రసోచిత, ప్రకృతి ప్రతిబింబనం బగు నాట్యరంగము. అదియు నాంధ్రుల ప్రత్యేక ప్రతిభా ప్రకటనమ్మునకు సమర్థమైనదై యుండవలయు. అట్టిరంగమే యాంధ్రనాటకరంగ మనందగియుండును. అట్టి రంగమే యాంధ్రదేశాలంకారప్రాయంబై విబుధ జనాభినందనములకుఁ బాత్రంబగుచుండును. అట్టిరంగమే యధునాతన చిత్రకళావిలాసప్రబోధనంబై యాంధ్రోద్యమపోషకం బగుచుండును. అట్టిరంగమే ప్రాక్తనభరత విద్యావ్యాసంగిక పవిత్రాశ్రమంబై యాంధ్రులనాట్యకళాప్రాశస్త్యమునకుఁ దార్కాణ మగుచుండును. అట్టి రంగమే నిరాడంబరనిరుపమబ్రహ్మానందరసప్రతిపాదనపటిష్ఠంబై యాంధ్రుల విజ్ఞానవిశేషమును విశదీకరించుచుండును.

---

* శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణకృతాముద్రితాంధ్ర నటప్రకాశికనుండి—వడ్లమన్నాటి కుటుంబరావు.

నాట్యరంగ మనిన నొక పవిత్రలలితకళానిలయ మనియు, నిట్టిది నాటకోచితప్రకృతిప్రయోగసౌలభ్యము నొంది ప్రత్యేకాంగప్రతిభాప్రబోధకంబుగ నెగడ వలయు ననియు, నాడంబరమునకుఁగాని, యస్వాభావ్యాను కరణమునకుఁగాని, పాశ్చాత్య విలాసములకుఁగాని, పాశ్చాత్య యంత్రతంత్రాత్మకవిపరీతవైచిత్ర్యములకుఁగాని, యసందర్భయవనికాద్యుపాంగికాలంకరణములకుఁ గాని, యిట్టి రంగమునఁ బ్రయోగించుట కవకాశ ముండనేర దనియు నొక నిశ్చితాభిప్రాయమునకు మనము రావలసియున్నది. కాని యిట్టిరంగము మనకెట్లు నిర్మించుకొన సాధ్యమగు నను విషయమును గూర్చియు నొక్కింత విచారింపవలసి యున్నది.

వేలు వ్యయపఱచినను, లక్షలు వ్యయపఱచినను నయ్యది స్వభావము ననుసరించి యుండినంతవఱకు మాత్రమే ప్రాజ్ఞప్రశంసలకుఁ బాత్రంబగునుగాని యాదరక లేనిపోని వికృతవైచిత్ర్యములను బ్రదర్శించినంత మాత్రమునఁ గళాప్రయోగమున కుపకారి కానేరదు. వస్తుసాదృశ్యమే కళాసిద్ధికి ముఖ్యాదర్శ మగుటచేఁ గాలోచితప్రకృత్యుద్బోధనంబుగ రంగప్రసాధనము లన్నియుఁ బ్రదర్శించుట యనున దొక సులభసాధ్యమైన విషయము గానోపదు. ఇట్టినేర్పు లోకానుభవము, విషయవిమర్శనము, శాస్త్రపరిజ్ఞానము, రసాస్వాదన మొదవిన కవికిగాని, చిత్రకారునకుగాని లభించును. కళానిధులగు నాయుభయులసాహాయ్యముననే నాట్యరంగము వస్తురూపసాదృశ్యమునంది ప్రేక్షకుల కమందానంద మొనగూర్చును.

## రసాస్వాదనవైదుష్యము

ఎట్టివానికొదవునని యోచించుటకుముందు రసము, ఆస్వాదనము, వైదుష్యమునను పదార్థములనుగూర్చియు, నేతద్పద త్రయాత్మకవాక్యాంతరభావమును గూర్చియు మఱికొంత చర్చింపవలసియుండును. దీని యనంతరమునఁ గాని మన కీవిషయము తేలదు. ఏదోయొకమాదిరిగ ముడి నెట్టఁజూచిన నదియు నంతగ విశ్వాసార్హము కానోపదు.

"శ్లో. విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్;
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్."

రసనిర్వచన మనునది సామాన్యులకు గ్రాహ్యమగునది కాదు. అయ్యది యనుభవసిద్ధమై యిట్టిదని సంస్కార మొదవినసహృదయులకుమాత్రమే స్ఫురింపఁగలదు. ఇందులకుఁ బ్రమాణముగ మహాకవి కాళిదాసు:

"శ్లో. అక్షరస్య మధురిమాణం
పదకాఠిన్యం దృశోశ్చ తైక్ష్ణ్యంచ,
కవితాయాః పరిపాకం,
హ్యనుభవరసికో విజానాతి."

అని చెప్పియున్నాఁడు. రసమను పదార్థమును మనము చూడలేము. "ఆహా! యెంతచల్లని మలయమారుతము" అనిసుఖింపనేర్తుమేకాని మారుతమును సహితము చూడలేము. వానికి రూపములు లేవు. రూపము లేని వాని నిరూపించుట యనఁగొంచె మించుమించుగ రూపము నిచ్చుటయే యగును. ఇట్టిచో రసమునుగూర్చికాని మారుతమునుగూర్చిగాని యనుభవించియుండిన వారలకు గాక యన్యులకుఁ జెప్పుట దుష్కరమైన విషయము. అట్లుకానిచో నది యంతతోఁ బోక

"శ్లో. శ్రోతరిజ్ఞాతరిప్రాప్తే, శ్లోక శ్లోకత్వమాప్నుయాత్;
శ్రోత ర్యజ్ఞాతరి ప్రాప్తే, లకార స్తత్ర లుప్యతే."

అనునట్లు వ్యసనమునకుఁగారణమగును. లోకానుభవమునకుఁ జెందిన మఱియొక యుదాహరణమున నీ విషయము నింతకంటె తేలికగ స్థిరపఱచుకొనవచ్చును. ఎవఁడేని యొకగ్రామమున నొకనినివాసమును గూర్చి తెలియఁగోరునప్పుడు వాఁడాగ్రామమునకుఁబరిచయుఁడై యుండిననే "అయ్యా! అదిగో! అచ్చటఫలానివారి మేడ; దాని వెనుకనే మీరుకోరినవారు వసించుస్థానము." అని చెప్పుదుము. ఆమాత్రమేని గ్రామానుభవము లేనివానికి మన మేకొండగుర్తులను జూపినను, నయోమయముగానే యుండునుగాని యవ్వాని కయ్యది యందివచ్చుకొనున ట్లుండనేరదు. దీనినిఁబట్టి రసనిర్వచనమునఁ బ్రమోదింపఁగోరెడు ప్రతిమనుజుఁడును నొకపాటిప్రాజ్ఞుఁడుగ నుండి యుండవలయునని తేలుచున్నది.

"ప్రాజ్ఞత" యనినఁ దెలుఁగున "నెఱుక" యని యర్థము. అదియే తెలివి. "తెలిసికొనునది" యనియుఁ జెప్పవచ్చును. దీనినే "జ్ఞానము"ని యందురు. జ్ఞానమునకు

మితిలేదు. ఎవ రెంతవఱకుఁ దెలిసికొనిన నంతవఱకు జ్ఞానము నగ్గి జ్ఞానులనియుఁ బండితులనియుఁ బలుకుదురు. అట్లని రసమునుగూర్చి మనము పండితులకుఁ జెప్పవలసిన యావశ్యకత యుండదు పండితులవలననే మన మెంతేని గ్రహింపఁదగినవారమై యుందుము. ఇఁక మనము తెల్పునది మూఢులకా? అందురేమో తెలియనివారికే తెలిసినవారు చెప్పవలసియుందురు. రసమనునదిమాత్రము తెలియనివారికిఁ దెలుపఁ దగినది కాదని పై ప్రమాణమువలన ధ్రువపడుచున్నది. రెండియు

"శ్లో. అరసికేషు రసస్య నివేదనమ్
శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ."

అను వాక్యమునుబట్టి రసికుఁడుమాత్రమే రసమునుగూర్చి తెలియఁదగినవాఁ డనియుఁ దేలుచున్నది. ఇక్కడను నొకసందేహము పొడమకమానదు. ప్రస్తుతమున "రసిక" శబ్దము "తలచీర" శబ్దమువలె లోకవ్యవహారమునందు వ్యతిరేకార్థము నిచ్చుచున్నయది. రసికులన రసాస్వాదనపరులని ముందుగ స్థిరపఱచుకొని యావలఁ బ్రస్తుత విషయ మనుసరింతము.

"శ్లో. మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

అనునట్టులు ప్రకృతివైచిత్ర్యములను జూచుటవలనఁ గాని వినుటవలనఁ గాని ప్రయత్నమువనో యప్రయత్నమువనో మనుజున కొక మనోవికార ముత్పన్న మగుచున్నది. మన యెట్టయెదుట నెవఁడో యొకబాలుఁ డాకస్మికముగ నొక యాపదకుఁ జిక్కి దురపిల్లుచుండుటనే మాతవము కొనుడు. లేదా మనకుఁ బరిచయము గల యొకానొక నిరుపేదయగువాఁడు శ్రీమంతునివలె వస్తువాహనాన్వితుండై దేవేంద్రవైభవముతోఁ బ్రత్యక్షమగు ననుకొనుఁడు. మన కీరెండు సందర్భములందును రెండువిధములగు వికారములు పొడమకపోవు. అందొకటి దుఃఖమనియు మఱియొకటి విస్మయమనియు లాక్షణికులచే వ్యవహరింపఁబడుచుండును. దుఃఖవిస్మయములను నీవికారము లప్పటికి స్థాయిభావము నందియున్నవని రసజ్ఞులు గ్రహింపఁగలరు. పరగతసుఖదుఃఖాదులవలన దిదృక్షులయందుఁ బొడము నిట్టివికారములే సాత్త్వికభావములు నాఁ బరిగణింపఁబడుచుండును.

ఒకదానినిఁ జూచుటమాత్రముననే కాదు. వినుటచేత గూడ నిట్టి సాత్త్వికభావములు సర్వథా సరసులకు జనియింపఁగలవు. కాలక్రమాగతదుర్గతికిం జిక్కి నలోహితుఁ డడవులలోఁ గుశాపహరణార్థము సంచరించుపట్టున సర్పదష్టుండై మృత్యువుపాలంబడియుండెను. గర్భనిర్భేదనంబగు నీవృత్తాంతమును చంద్రమతీసతీమతల్లితో బ్రాహ్మణబాలురు చెప్పలేక చెప్పెడుకథాభాగమును వినునప్పుడును రసజ్ఞుఁడగువాని కేతద్విషయాంతర్గర్భితప్రకృతితత్త్వరహస్యమును, బుత్రవియోగ దుర్భరదుఃఖాతిశయమ్మును, హృదయమ్మును గలంచి కన్నుల నీరునింపక మానవు.

వినుకలి, కనుకలి యనువానివలనఁ గలుగు మనోవికారములను గొన్నిటిని మనమిప్పుడు చర్చించియున్నాము. పూర్వజన్మసుకృతపరిపాకంబున విజ్ఞానసంపత్తి నంది సదా యానందించు తత్త్వజ్ఞున కీచూచుట, వినుట యనునవి లేకున్నను బ్రహ్మానందమే యొదవుచుండును. ప్రకృతిసిద్ధమ్ములగు వస్తుచయమ్మునందలి యస్థిరత్వము కన్నులగట్టుచుండును. లోకాదరమ్ములగు ననేకభావమ్ములు తొంగి పొరలుచుండును. శాశ్వతానందమయుండగు నమ్మహనీయరసజ్ఞుఁడు భావిప్రపంచోపయోగము కొఱకు కాత్మానుభవము నంతయుఁ గావ్యరూపమ్మున వెలయించును. చిత్రకారుఁడు చిత్రరూపమ్మునఁ బ్రకటించును.

పరగతసుఖదుఃఖములచే జనించుసాత్త్వికభావము లనంబడు స్తంభము, రోమాంచము, అశ్రువు, వైశ్వర్యము, కంపము, ప్రళయము, వైవర్ణ్యము, భక్తి, వాత్సల్యము, శాంతి మున్నగునవే రసవాహకృత్యమునకుఁ గారణమాత్రములని మనము గ్రహింపవలసియుండును. ఇయ్యవి భావనాతిరేకవిస్తృతాలంబనోద్దీపనాదిక సంచారాతిశయమ్మున గ్లాని, శంక, నిర్వేదము, మదము, అసూయ, ఆలస్యము, దైన్యము, శ్రమము, స్మృతి, మోహము, చపలత, చింత, విషాదము, సుప్తి, బోధము, ఔత్సుక్యము, ఆవేగము, గర్వము, హర్షము, అమర్షము, నిద్ర, మతి, అపస్మారము, ఉన్మాదము, త్రాసము, ఉగ్రత, జడత, వితర్కము, అవహిత్థ, ధృతి, మరణము, వ్యాధి, వ్రీడ యను ముప్పదిమూఁడు రూపమ్ముల వ్యభి

చరించిన యనంతరము రతి, ఉత్సాహము, దుఃఖము, విస్మయము, హాసము, భయము, జుగుప్స, క్రోధము, శాంతి, భక్తి, వాత్సల్యములను స్థాయిభేదమ్ములతోఁ గ్రమముగ శృంగారము, వీరము, కరుణ, అద్భుతము, హాస్యము, భయానకము, బీభత్సము, రౌద్రము, శాంతము, భక్తి, వాత్సల్యము లను నేకాదశరసమ్ములను గలిగించుచున్నయవి.

ప్రకృతివస్తుసందర్శనమ్మున దత్త్వవిచారము, రసానుభవము ఆనందము అనునవి కల్గుచున్నవనియు, అయ్యవి రసజ్ఞునకు భావపరంపరలను బెంచి ఆలంబనోద్దీపనాద్యంతరములఁ బరిపక్వమ్ములై రసార్ణవరూపమ్ములందుచున్నవనియుఁ బైవిషయమునుబట్టి పర్యవసానము తేలుచున్నది. ఇంకను సమగ్రముగ రసప్రకరణమ్మునాఁ బఱఁగు మఱియొకభాగము దీనిని గూర్చి వివరింపనున్నందునఁ బ్రాసంగికజనితంబైన యీ రసనిర్వచనాంశము నిప్పటి కింతతో నిలిపి యింక యాస్వాదన మను శబ్దార్థము నించుక విచారింతము.

## ఆస్వాదనము

అనఁగ ననుభవించుటయని అర్థము. రసాస్వాదన మనినందున రసము ననుభవించుటయని తేలుచున్నది. కాని సర్వసామాన్యానుభవములవలె రసాస్వాదనము మాత్ర మందఱకును జతపడనిదని యింతకుముందు సప్రమాణముగ సిద్ధాంతపఱచియున్నాము. కావున నావిచారము మన కిప్పు డవసరముకాదు. రసజ్ఞునియందు రసానుభవమెట్టులు తాండవించు ననుసంగతిమాత్రమే మన మిప్పుడు యోచింపదగినదై యున్నది.

ప్రకృతిపై చిత్ర్యము రసజ్ఞునిహృదయ మాకర్షించి ప్రతిక్షణమును నానందమే నింపుచుండును. ప్రతివస్తురూపమ్మునందును బ్రేమబద్ధమగు సృష్టితత్త్వార్థమే ద్యోతకమగుచుండును. అనంతమైన అక్షరంబైన అగణ్యమైన విచిత్రప్రకృత్యంతర బ్రహ్మానందపారవశ్యుండగు రసజ్ఞుండాత్మీయరసపారవశ్యోద్రేకమ్మున నేమేమో గానము సేయుచు సదా వినోదించుచుండును. అమ్మహనీయునిఁ బ్రతిబంధించు నట్టి రాగద్వేషములుగాని ఇంద్రియప్రాబల్యములుగాని యుండవు. క్షరాక్షరవస్తు తత్త్వాంతర వినోదవిలాసవిభవుండగు నమ్మహాప్రాజ్ఞుని భయపెట్టు దండనాధికారిగాని, శాసించు పంచగ్రహమ్ములుగాని కనిపింపవు. ఉపాసితప్రకృత్యతీత పరతత్త్వాభిజ్ఞుండగు నమ్మహాయోగీశ్వరుని జ్ఞానచక్షువున కీరేడులోకమ్ముల గోచరమ్ములుగాని ప్రదేశపదార్థము లుండవు. నిష్కళంక నిరుపమతపోనిష్ఠాగరిష్ఠు లగు నిట్టి నిర్వికల్పానందమయుల మహత్తర రసాత్మక ప్రసంగమ్ములే యమూల్యకవితా విలాసమ్ములు. అట్టి దివ్యజ్ఞాన చక్షుర్విభవాతిరేకవిజ్ఞాన విశిష్టులగు రసప్రపంచ విహారలాలసుల వస్త్వభివర్ణనమ్ములే చిత్రకారుల యథారూపానుకరణ ప్రయోజనమ్ములు. మహనీయులగు నిట్టికవులు గాని, చిత్రలేఖకులు గాని వేయింటి కొక్కరేని గన్పడుట దుర్లభమైనవిషయము.

## వైదుష్యము

అనఁగ విద్వద్భావమని యర్థము. వేదాధ్యయనమ్ములు, ధర్మశాస్త్రాదిమీమాంసలు, ఛందోవ్యాకరణాభిజ్ఞతలు, బి. యే., ఎమ్. ఏ. ఇత్యాది బిరుదమ్ములు మాత్రమే విద్వత్ప్రకటనమ్ములు గావు. సంస్కారము లోకానుభవము విద్వాంసునియందు వెల్లివిరిసి లోకోపయోగమునుగోరి పెక్కురీతుల విద్యాంసులను గ్రియాపరతంత్రులుగ నొనర్చుచుండును. ఈకారణమ్మున కళాభిజ్ఞులు విక్రమాదిత్యునికాలమునుండి నిన్నమొన్నటి యానందగజపతిమహారాయలవారివఱకే కాక యిప్పటికిని బరోడా, మైసూరు, పిఠాపురము, ముక్త్యాల, వనపర్తి, గద్వాల మున్నగు ప్రసిద్ధసంస్థానాధీశ్వరులచేతను బహుభంగుల బహూకరింపబడుచు దేశమంతట వెలుంగుచున్నారు. ప్రస్తుతమున నాట్యకళోద్ధరణమును గోరి సౌత్ మైలవరం జమీందారులగు మ. రా. రా. శ్రీ, శ్రీ రాజా సూరానేని వేంకటపాపయ్యారావు బహదూరుగారును, మ. రా. రా. శ్రీ, మోతే నారాయణరావు జమీందారుగారును, నాంధ్రదేశ మందలి పెక్కు నటాగ్రేసరులను, నాటకకవులను బోషించుచున్నారు. బందరు, రాజమహేంద్రవరము, విజయనగరము, నెల్లూరు, మదరాసు మున్నగు పట్టణరాజమ్ములందును జిత్రకళాపోషణము, సారస్వతప్రచారము, పండితసన్మానము లాదిగాగలుగు మహత్కార్యము లనేకమహాపురుషులచే ననేకరూపమ్ములఁ గావింపఁబడుచున్నవి.

వైదుష్య మనునది ప్రతిమనుజునియందును గాక సంస్కార మొదవిన కొందఱియందే మనకుఁ బొడగట్టును. కవిత్వమను పేరుతోఁ బద్యము లల్లువార లనేకులు గలరు. ఇటులే చిత్రలేఖకులు, శిల్పులు, గాయకులు, నటులు, వక్తలు, వ్రాయసకాండ్రును లెక్కకు మించియుందురు. ఎవరు తమయాత్మానుభవమును దేశముకొఱకు సుగ్రాహ్యముగాఁ బ్రకటింపనేర్తురో, ఎవరు ప్రకృతితత్త్వార్థమును విమర్శించి యనుభవించి వెలయింపనేర్తురో, ఎవరు వృద్ధిక్షయాంతర సుఖదుఃఖాద్యఖిల వ్యాపారములందలి మాయాంతరమునుగడచి సృష్టికారుని నిష్కామకార్యకర్తృత్వముల విలోకించి తమయానందమును బ్రసాదింపనేర్తురో అట్టివక్తలయెడ, కవులయెడ, చిత్రలేఖకులయెడ, నటులయెడ, వేయేల దేశోపకారక్రియాపరతంత్రులగు మహాపురుషు లెల్లఱియెడ వైదుష్యమనిర్వచనీయమై యనంతప్రతిభాసమన్వితమై యశేషజనాదరపాత్రమై గభీరభావభరితమై ధర్మసంరక్షణార్థమవతరించిన మహాపురుషులగు బుద్ధ, శంకర, రామకృష్ణ, వివేకానంద, త్యాగరాయ, తిలక్, గాంధీలయందువలె నిరంతరము ప్రకాశించుచుండును. శేషించినవారియందు వైదుష్యము ప్రయత్నముకొలఁది, లోకానుభవముకొలఁది మితముగ నుండును. కానిచో సర్వతోముఖమైన ప్రస్తుతభాషాభివృద్ధిగాని మఱి యేకళాభివృద్ధిగాని గలుగుటకే యవకాశ ముండనోపదు.

## రసాస్వాదన వైదుష్యము

అనగ రసము ననుభవించి లోకమునకుఁ బ్రసాదించునట్టి పాండిత్యమని నానిశ్చయము. అట్టిదియుఁ బైనఁ జెప్పినటు లెవఁడో యొకచిత్రలేఖకునియందే ప్రకాశింపనోపును గాని కుంచియఁ జేకొని కడుపుకక్కుర్తి కేవో కొన్నిరంగులతో రంజనమొనగూర్చెడు ప్రతినామకచిత్రలేఖకునియందును బ్రకాశింపనేరదు. ఇట్టిచో రాజమహేంద్రవరము, మైలవరము, ఏలూరు, దుగ్గిరాల, తెనాలి, గుంటూరు, బందరు, విజయనగరము, బళ్లారి, చిత్తూరు, మదరాసులు వేలకొలఁదిగ వెచ్చించినను బెంగుళూరు గుబ్బి కంపెనీవారు లక్షలకొలఁదిగ వ్యయపరచినను జివరకాంధ్ర నాట్యరంగమునకు రసోచితాలంకరణము గాని, ప్రత్యేకాంధ్రప్రతిభాప్రకటనాభిజ్ఞతగాని కథోచిత ప్రకృతిప్రతిపాదనౌచితిగాని సమగ్రముగ చేకూరినదని యనుకొనుట కవకాశము లేదు. విమర్శకులైనను నటులనుగూర్చియే యెంతెంతయో విమర్శించుచు నెన్నియో సిద్ధాంతరాద్ధాంతములను సేయుచున్నారు గాని, నాట్యరంగస్వరూపమునుగూర్చి యొక్కరును చర్చించుచున్నటులు కన్పట్టుటలేదు. చివరకు స్వంతమునకు రంగములు లేకయే వెల్లివిరియు నీనాఁటి నాటకసంఘముల కేతద్విషయికావశ్యకతనేని తలపించుఁ బుణ్యము గట్టికొనుచున్నటులు పొడకట్టదు.

ప్రతిపట్టణమందలి జనసమూహమున నెక్కొని తైతక్కలాడు నీనాటక ప్రదర్శన వ్యామోహమును గుర్తించినవారిలోఁ గొందఱు వ్యవహారజ్ఞులు నాట్యభవనములనిర్మించి యద్దెలకిచ్చుచు ద్రవ్యార్జనము సేయుచున్నారు. అవసరమున కేవో కొన్ని చింపిరితెరలు, రంగల్రేఖములు, గంతబొంతలు గల్గిన యిట్టి భవనములలోఁ దమకుఁగల ప్రదర్శనోత్సాహమును దాత్కాలికముగఁ దీర్చికొనుచు సాంఘికులు సంతృప్తినందుచున్నారు. ప్రేక్షకులు సహిత మెంద ఱెన్ని నాటకము లాడినను నెన్ని యసందర్భప్రహసనములను బ్రదర్శించినను రాంగికాదర్శమునుగూర్చి తలఁపనైనఁ దలఁపకున్నారు. కొందఱవేని నూతన యవనికాదులఁ జూచినయెడల నవ్వాని నిరర్థకచిత్రరచనాడంబరములకే మురిసి ముప్పందు మగుచున్నారు. సామాజికుల కెందును ప్రతిబంధకము గాని, యవసర మగుపడని, లోపము కనుపింపని యిట్టి నాట్యశాలలనుగూర్చిన మంచిచెడుగులు విమర్శనాతీతము లగుచున్నవి.

నాటకము కవిచేతను, చిత్రలేఖకునిచేతను, నటునిచేతను రూపమునంది అవస్థానుకరణమునఁ, బ్రకృతిప్రబోధనమున, రసప్రసరణమునఁ బ్రేక్షకుల బ్రహ్మానందభరితులఁ జేయవలసి యుండునని యిదివరకే ప్రస్తావించి యున్నాఁడను. ఇట్టిచో నీయద్దెలకీఁబడు నాట్యభవనములవలనను, నిరర్థకప్రదర్శనములవల్లను ఆంధ్రుల మహత్తర నాట్యకళాప్రాశస్త్యమున కెన్నివిధముల ననర్థములు సంప్రాప్తించుచున్నవియో విచారింతము:

(1) అద్దెలకీఁబడు నాట్యరంగ మొకవిధముగ వెలయాలి పడకటింటితోఁ బోల్పవచ్చు ననుకొనెదను.

ఏలయన స్వగృహముకంటె వెలయాలి పడకటిల్లు పెక్కు తరగతులకుఁ జెందిన యలంకారములతోడనే నిండి ముచ్చట యగుచుండును. ఎన్నియున్నను నయ్యది వెల యిచ్చు నెట్టివానికేని యందిపుచ్చుకొనునట్టిదిగ నుండును. తాత్కాలికప్రయోజనమున్నను కొకవిధముగ లోటని పింపకపోయినను స్వగృహమునందుండు స్వాతంత్ర్యముగాని, దానివలనఁ గలుగు నిర్వ్యాజానందముగాని యందెంతమాత్రము నుండనేరదు.

(2) పవిత్రమైన నాట్యకళాపరిశ్రమమునకు నిలయము నాఁబఱగు నిట్టి నాట్యరంగము సర్వసామాన్యమై బాహ్యతను గలిగింపకుండుటను జేసియే తన్నాటకరంగమందుఁ గళోపాసకుల కుండఁదగిన పూజ్యభావము లేశమైన నుండుట కవకాశము నియ్యక కూరలబజారు వలెఁ బరిణమించి నాట్యకళాప్రయోజనమును సైతము నాశన మొనర్చుటకుఁ గారణమగుచున్నది.

(3) ప్రదర్శనేతరదినములయం దీ భవనములం దంతటనిర్వ్యాపారులు చేరి పెక్కుగతుల నీతిదూరములుగ నొనర్చుచున్నారు. ఈకారణమునఁ గొన్ని నాటకశాలలు నాటకసందర్భమ నేని పండితప్రవేశమున కర్హములు గాకున్నవి. నాట్యకళయుఁ బండితాదరమును బడయనేరకున్నది.

(4) ప్రదర్శనమున కుద్దేశింపఁబడిన దినమునాఁటి సాయంతనము దనుక నారంగము ప్రదర్శకుల వశమ్మున నుండమి రంగప్రసాధనములను సమగ్రముగ నమర్చుకొను నవకాశ మొదవక సామాజికు లేదోయొకవిధముగ సరిపెట్టుకొనవలసివచ్చుటను జేసి ప్రదర్శనములన్నియుఁ బెక్కుభంగుల నసందర్భములుగ పొడగట్టఁగలవు. ఈ కారణమున సామాజికులు స్వశక్తిసంపద లుపయోగింప నేరకున్నారు.

(5) రసజ్ఞులకు విసుగుఁగొల్పు నిట్టిరంగములందుఁ బ్రదర్శింపఁబడు నెట్టి మహానాటకమైనను ప్రేక్షకుల మన్ననలను బడయనేరకపోవుచున్నది. అది యటుండ కళాభిమానులకుఁ గలుగునభిమానమును గూడ నిర్మూలము కావించుచున్నవి.

ఇటులే తఱచినకొలఁదిగా నెన్నియేని యనర్థము లీరంగమునుండి నాట్యప్రపంచమునకుఁ గలుగుచున్నవని గ్రహింపఁగలము. ఆంధ్రదేశమున బయలువెడలు ప్రతి సమాజమును కళాసంరక్షణైకప్రయోజనముగ నెగడు నాటకభవనమును సహితము స్వంతమునకు సంపాదింపఁ బ్రయత్నించి ప్రదర్శనములను రసోచితరంగస్థానముల నెలయించుచు నాటకాభిమానుల యామోదము నందఁ గోరెదను.



# ప్రణయాంజలి

కొప్పర్తి నారాయణమూర్తి గారు, బి. ఏ., యల్. టి. [సాహితీసమితి]

భవదస్తోక కటాక్షవీక్షణ లసద్వ్యాపారసందోహమై
భవకల్లోలపవిత్రడోలికల నవ్యాజప్రహార్వానిలో
త్సవ సంభూత దిగంత పర్యటన మశ్రాంతంబుఁ గాంక్షింతు, మా
ధవ! నా మానస మొక్కసారి తనివొందఁగ ముద్దుఁ జెల్లింపవే.

మ. భవ దత్యంతకృపారసాకలిత సౌభాగ్యస్ఫురచ్చంద్రికా
నవశోభావహభావవీచికలు నానాతుంగభంగానిల
ప్లవగాఢాహతులఁ జలింప, మది డోలాలోలనిర్వేలమై
వివశత్వంబు ఘటింపకుండ వరదా! నే కౌఁగిటం బట్టుమా.

## శ్రీ జిట్టా అప్పయ్యగారు స్థాపించిన పది ధర్మపాఠశాలల బాలురు, బాపట్ల



గౌరవనీయులగు చెన్నపురి విద్యాశాఖమంత్రి సర్. అన్నెము పరశురామ పాత్రో కే. టి., బి. ఏ., బి. యల్.; అండు యం. యల్. సి., గారు బాపట్లలో జిట్టా అప్పయ్యగారి 10 ధర్మపాఠశాలలను 21-1-1925 తేదీన చిత్తగించి యీ క్రింద రిమార్కులు వ్రాసినారు.

"శ్రీయుత జిట్టా అప్పయ్యగారిచే నిర్వహింపబడుచున్న పాఠశాలలలోని విద్యార్థులను నేను చూచితిని. ఆయన చాలమంది బీదవిద్యార్థులకు ధర్మవిద్య నిచ్చుచున్నారు. పలకలు పుస్తకములు మొదలగునవికూడా సప్లయిచేయుచున్నారు. శ్రీయుత అప్పయ్యగారు 10 ధర్మపాఠశాలలను యొక్కువశ్రద్ధతోను నేర్పుతోను నిర్వహించుచున్నారు. విద్యార్థులు ముఖ్యముగా నిమ్న జాతివారు. విచారించగా యీ పాఠశాలలు చాలా ఉత్సాహముతోను నిజమైన దేశోపకారముకొరకే నిర్వహింపబడుచున్నదని తెలిసినది. ఈకార్యము చాలా ఎన్నదగినది. శ్రీయుత అప్పయ్యగారు చేయుచున్న ఉపయోగకరమైన యీ కార్యమునకు అందరు అన్నివిధముల సహాయముచేసి వారి యుద్యమము జయప్రద మగునట్లు చూచెదరు గాక."

ఏ. పి. పాత్రో, చెన్నపురి విద్యాశాఖమంత్రి. (మకాం-బాపట్ల 21-1-1925)

శ్రీయుత జిట్టా అప్పయ్యగారిచే నిర్వహింపబడుచున్న ధర్మపాఠశాలలలో నొకదానిని యీసాయంత్రము చూచి సంతసించితిని. వారు చేయుచున్న యీఘన కార్యముయొక్క ఫలితమునకు మిక్కిలి కొనియాడదగియున్నారు. ఆయన కడచిన ఆరు సంగ్గములనుండి చేయుచున్న కృషియొక్క ఫలిత మేమనగా 600 విద్యార్థులుగల 10 ధర్మపాఠశాలలు పోషింపబడుచున్నవి. ఈవిధముగ పట్టుదలతో పనిచేయువారు మరికొందరున్న యెడల కార్మికులకు విద్యగఱపువిషయము యొక్కువగ కొనసాగగలదు.

ఆర్. హెచ్. ఎల్లిస్., ఐ. సి. యస్., లేబరుకమీషనరు, చెన్నపట్టణము. (మకాం, బాపట్ల. 27-4-25.)

# దేశబంధుని హృదయవేదన

ముడుంబ నరసింహాచార్యులు గారు

(మంజరీ గేయము)

ఏమి సేతును భారతాంబిక
కిట్టిదుస్థితి ప్రాప్తమయ్యెను!
గురుతరంబయి నట్టిదేశము
గొడ్డువోయినదా? ౧

తల్లిబంధ విముక్తి కీప్స
త్తైన త్యాగము జూపజాలని
మొండికట్టెల దైవమా, యిట
పుట్టజేసితివా? ౨

పరులచే నవమాన మందుచు
భరతమాత గృశించుచుండగ
జూచి పండ్లికిలించుమూఢులు
సుతులు నాదగునా? ౩

భవ్యగుణము లొసంగుదొల్లిటి
భరతవిజ్ఞానమున లెస్సగ
గ్రామముల బునరుద్ధరింపక
రాజ్యమెట్లబ్బున్? ౪

సొరిదిముప్పది మూడుకోటుల
సోదరుల్ వహియింపజాలిన
భారమొక పదిమందిపై బడ
వశమె భరియింపన్? ౫

గాఢమైన స్వరాజ్యకాంక్షను
గ్రాలుకోటి జనమ్ముగూర్చిన
రాజ్యమిచ్చెద ననిమహాత్ముడు
ప్రతిన సేసెనుగా. ౬

కోటిసభ్యుల గూర్చినామను
మాటపల్కితిమందులో సహ
స్రాంశమైనను దీక్షగల్గిన
జనము లున్నారా? ౭

తల్లి దేశముకొఱకు వీరిని
"దనువు లర్పణసేయు" డంటిమె?
"యాస్తులను విడనాడి లేమిడి
నందు" డన్నామా? ౮

కఱ్ఱదెబ్బల చేత నెద్దులు
గాడిదలు వశమగునుబో, మన
భారతీయులు భక్తిచేతనె
బాగుపడవద్దా? ౯

దండనమ్మునగాని వీరలు
దారి గనరనిగా స్వరాజ్యపు
పక్షబలమున గొన్నిహక్కులు
వడయు యత్నమ్ముల్! ౧౦

మాయశాసనసభలబూటక
మంత వెల్లడిసేయుటకు నా
శక్తినంతయు వ్యయమొనర్చితి
జాలశ్రమగల్గెన్. ౧౧

మధ్యరాష్ట్రము వంగదేశము
సాధ్యమైనపు డిట్లుమిగిలిన
సర్వరాష్ట్రము లింక లోబడ
జాలకెట్లుండున్? ౧౨

బూటకపు సంస్కరణచట్టము
లేటగలసిన నేమిలాభము?
శాసనోల్లంఘనము సేయగ
శక్తి చేకుఱెనే? ౧౩

గ్రామపునరుద్ధారణమ్మున
గాని యీపని జరుగనేరదు
పన్నులెగగొట్టుటకు శిక్షణ
వలయుగా ప్రజకున్. ౧౪

ఐకమత్యము దేశభక్తియు
వ్యాప్తిసేయుటె మనకు సాధ్యము
గాకయుండినచో స్వరాజ్యము
గగనకుసుమంబే. ౧౫

మనమహాత్ముని బోధ విని, ని
ర్మాణకార్యక్రమము నూనక
వేఱుపోకడ లెన్నిపోయిన
విఫలమౌగాదే? ౧౬

ప్రతిదినమ్మరగంటకాలము
వడుకలేరే నూలుదారము
కట్టజాలరె కదరువస్త్రము
జ్ఞానమే యున్నన్? ౧౭

వ్రతములకు మ్రొక్కులకు నుత్సవ
వైభవములకు వెనుకచూడరు
మాతృబంధవిముక్తియన్నను
మాంద్య మదియేమో? ౧౮

తల్లిదాస్యవిముక్తి కన్నను
ధాత్రి నెక్కుడుపుణ్య మున్నదె?
దేశద్రోహము బోలుపాపము
దేవ! మఱియున్నే? ౧౯

భయముచేతనొ భక్తిచేతనొ
ప్రజలకున్ దేశాభిమానము
మిగులజేకుఱ జేయుమా! పర
మేశ! నినుగొల్తున్. ౨౦

కాళికాంబరో! నీకు ముడుపులు
గట్టమఱచిన వారినింబలె
కదరుగట్టని భారతీయుల
బెదరువెట్టగదే! ౨౧

కఠినహృదయుల్ మూఢజనములు
గరముగల్గిన భారతావని
బాగుపఱుచుట కెందఱిన్, విధి
బలిని గోరెడినో? ౨౨

తిలకు, దాదాభాయి, గోక్లే
ధీరు లీవ్యథ నోర్వజాలక
హృదయవేదనచేతనే దివి
కేగియుండిరిగా. ౨౩

భరతమాతరో! నీదుదాస్యము
బాపకింక, నిమేషమైనను
వ్యర్థపఱుపను నమ్ముమా! యిదె
ప్రతిన గైకొంటిన్. ౨౪

మృతిని జెందిన నీతలంపే
బ్రతికియుండిన నీదుచింతే
యితర మికనాకెద్ది యెచ్చట
హితవుగాదమ్మా. ౨౫

గ్రామపునరుద్ధారణమ్మును
రమ్యకద్దరు ధారణమ్మును
బూని సోదరులెల్ల పావన
మొందరే యింకన్? ౨౬

నాదుమనుగడ వల్ల దేశము
నకును మేలొనగూరునే యిక?
లేకయున్నను దైవమా! నను
జేకొనుము దివికిన్. ౨౭

వ్యర్థపుంబ్రదుకింక నిచ్చట
బ్రతుక జాలను నిన్నుజేరియె
భారతాంబకు దాస్యముం బెడ
బాపయత్నింతున్. ౨౮

"రమ్ము! ర"మ్మని పిల్చుచుంటె? క
రమ్ముప్రేముడి దేవ! నన్గయి
కొమ్ము; వచ్చి, స్వరాజ్యసిద్ధికి
నెమ్మి కృషిసేతున్. ౨౯

భరతసుతులకు నాదుకడపటి
వాంఛ దైవము! తెల్పగదవే
గాంధిదేవుని నమ్మి కార్య
క్రమము నెఱవేర్చన్. ౩౦




టి. శివశంకరంపిళ్లెగారు

ఇప్పటికి సుమారు వెయ్యేండ్లకుముందు భారతభూమియం దెల్లెడల గ్రామసంఘములు నెలకొని సముదాయమున జనహితకార్యములను ప్రగల్భముతో నెరవేర్చుచు వచ్చినవనుటకు ప్రబలమైన సాక్ష్యములు తఱచుగా శాసనములయందు తోల్చబడి యున్నవి. వీనిలో, కొన్నిటిని విమర్శించినపుడు ఆకాలపు స్వరాజ్యభారక్రమము ఇట్టిదై యుండెనని యూహించుటకు దగును.

దక్షిణజిల్లాలలో సుమా రిరువదియైదేండ్లకుముం దొక శాసనము కనుగొనబడి చెన్నపురి శాసనపరిశోధకశాఖవారి 1899-1900 సం. నివేదికములో (Madras Epigraphic Report, 1899 190)) ప్రకటింపబడినది. ఆ శానసమును విమర్శించగా నీ క్రిందియంశములు వ్యక్తమయ్యెను:

ఆగ్రామమున క్రీస్తుశకము సుమారు 1054వ సంవత్సరమున కఱవువచ్చినది. గ్రామసంఘమువారు పరిహారమునకై రాజునుండి సహాయము కోరి తుదకు విఫలులైరి. ఆతరుణమున గ్రామసంఘమువారు 1011 (కళంజుల) బంగారమును, 464 పలముల వెండియు నా గ్రామదేవాలయపు బొక్కసమునుండి క్షామబాధను. నివారించుటకై యప్పుగా దీసికొన్నారు. ఇందుకుగాను గ్రామసముదాయమునకు జేరిన రమారమి ఏబదియెకరముల సాగు జమీనును తాకట్టుంచిరి.

తిరుక్కచ్చూరను గ్రామమునందు మూడవకులోత్తుంగచోళరాజు కాలమున క్షామము సంభవించెననియు, దానిని గ్రామసంఘమువారే నివారించుకొనిరనియు మరి రెండుశాసనములు కనుగొనబడినవి. ఈ రెండు శాసనములు చెన్నపురి శాసనపరిశోధక శాఖవారి 1909-1910 సం. నివేదికము (Madras Epigraphic Report 1909-10) పేజి 95 లో ప్రచురింపబడినవి. వీని సారాంశ మేమన:

తిరుక్కచ్చూరు గ్రామమున క్షామము సంభవించెను. అపుడు గ్రామసంఘమువారు ఆయూరిపెద్దమనిషి యొకనివద్ద గ్రామసముదాయమునకు జేరిన కొంత సాగుప్రదేశమును తాకట్టుపెట్టి ధాన్యము నప్పుగాదీసిరి. ఆజమీనుపైనైన సర్కారుశిస్తును దామే యచ్చుకొనిరి. ఆకాలమున క్షామములు సంభవించినపుడు దొరతనమువారు సర్కారురూకలు వజాచేయక పోయినను గ్రామసంఘమువారు తమకర్తవ్యమును జక్కగ గమనించిరి. అప్పి

చ్చిన పెద్దమనిషి యాగ్రామమునందు దేవాలయమున క్షామకారణముచే దీపారాధననిలిచెనని తెలిసి యాఖర్చును దానే నిర్వహించెను.

మరియొక గ్రామమునం దిట్లే క్షామము సంభవింపగా నాగ్రామ సంఘమువారు దేవాలయపు బొక్కసమునుండి ధాన్యము నాగుకు అప్పుగాదీసి, బాధనివారించుటకై వినియోగించిరని మరియొక శాసనము వివరించుచున్నది. ఇది సహితము చెన్నపురి శాసనపరిశోధక శాఖవారి (Madras Epigraphic Report) 1913 వ సంవత్సరపు నివేదికమున 397 నంబరుగా గుర్తించబడియున్నది.

క్రీ. శ. 1052 సంవత్సరమున రాజేంద్రదేవు డను రాజు రాజ్య మేలుచుండెను. ఈరాజు గ్రామమున అతి దేవాలయమును గట్టించుటకై గ్రామసంఘము వారియొద్ద గొంత సొమ్మిచ్చి యుండెను. దేవాలయపు మొదలంగములు కట్టించునప్పటికి కఱవువచ్చెను. గ్రామసంఘపువారు కఱవు కారణముచే కక్కినపనిని ముగించలేక పోయిరి. మిగత పైకమునైనను జెల్లించుటకు వారిచేత గాక పోయెను. ఇందుపైన దేవాలయపు ధర్మకర్తలు పిర్యాదుచేయగా నాదేవాలయమందు ప్రతిష్ఠించుటకై యొక విగ్రహమును సిద్ధముగా చేయించియిచ్చు సమయముతో వారి యుత్తరవాదిత్వమును దొలగించుకొనిరి. ఆకాలపురాజుల నిరాదరణకును, గ్రామసంఘముల శ్రద్ధకును, నిది మరియొక నిదర్శనము. ఈ యంశము మరియొక శిలాశాసనమున జెక్కబడియున్నది. దీనిని చెన్నపురి శాసనపరిశోధకశాఖవారి (Madras Epigraphic Report) 1909 సంవత్సరపు నివేదికమున 353 నంబరుగా గుర్తించియున్నారు.

ఈనిదర్శనములు శోధించినపుడు రాజ్యాధిపతు లెట్టివారైనను ప్రజలనుండి తమకు రావలసిన శిస్తులను కఠినముగ వసూలుచేసికొన్నను, గ్రామసంఘములు జనహిత మాచరించుటయందు దీక్షాబద్ధములై తమకార్యముల నొడళ్లంతయు గండ్లుకలిగి నెఱవేర్చుచుండిరనుట తేటపడుచున్నది. ఈ మనస్థితియె స్వరాజ్యమునకు మూలము. ఇట్టి భారములు వహించుశక్తియె నిజమైన స్వరాజ్యశక్తి.

ఇట్టిశక్తి మనదేశమునం దడుగంటిపోక అక్కడక్కడ మిగిలియుండుటను గనుగొనవచ్చును. ఈ సంవత్సరము ఫిబ్రవరినెలలో గుత్తితాలూకా గ్రామములో గ్రామమొకటి సంపూర్ణముగ గాలిపోగా నుదారులగు కొందఱుగ్రామజనులు సర్కారు వారిదాపు గోరకయే యవసరముగ బాధితులకు పరిహారమిప్పించి యున్నవారు. ఇట్టి మనోవృత్తియె జనులయందు స్వరాజ్యత కర్హత్వ మెచ్చునది.






శ్రీ రీడింగు ప్రభువు రాజప్రాతినిధ్యభారమును బాగుగ నిర్వహించిన విధమును స్వదేశయాత్రను జేసి, చక్రవర్తిని భారత మంత్రిని మిత్రవర్గమును సందర్శించి సంప్రతించి, తిరిగి భారతదేశమును చేరిన విషయములు విశదము చేయుచున్నవి రాజప్రతినిధి ప్రయాణమువలన గలిగిన ఫలమును బర్కెన్‌హెడు ప్రభు వరమురికలు లేకను విశదము చేసెను. రాజప్రతినిధియొక్క రాకపోకలకు సొమ్ము వ్యయమైనది. పాలకపాలితదేశములకు గల సంబంధము విస్పష్టమైనది. వివిధ పక్షముల భారతీయులకు వారిస్థితిగతులు విశదమైనవి. బర్కెన్‌హెడు ప్రభువుయొక్క భావము లన్నిపక్షములవారికిని నిరాశను గలుగజేసినవి. భారతీయ రాజ్యాంగపరిణామముపట్ల బ్రిటీషు రాజ్యాధికారుల నావహించిన స్వార్థపరత్వము దురహంకారము సువిదితములైనవి. బ్రిటీషురాజ్యాధికారులకు పరిపాటియైనపాటనె బర్కెన్‌హెడుప్రభువును తిరిగి పాడి భారతభూమికి తరణోపాయములేదని విశదముచేసెను. ఐర్లాండునందు స్వరాజ్యస్థాపనము నామోదించినబర్కెన్‌హెడుప్రభువునకును హిందూదేశ మంత్రిత్వమువహించిన బర్కెన్‌హెడుప్రభువునకునుగల భేదము విశదమైనది. భారతమంత్రి పదమునకు విక్రమార్కుని సింహాసనమునకువలె స్థానబలము గలదు. ఆస్థానమును మోర్లెప్రభు వాక్రమించినను, ఓలివియరు ప్రభువాక్రమించినను, బర్కెన్‌హెడుప్రభు వాక్రమించినను సమానఫలము గలుగుచున్నది. భారత ప్రజారక్షణభార సిద్ధాంతమును, బాహుబల ప్రయోగసిద్ధాంతమును చిలుకపలుకులవలె బర్కెన్‌హెడు ప్రభువు తిరిగి ప్రతిపాదించి భారతీయులకు వారికర్తవ్యమును సూచ్యక్తముచేసెను.

ప్రజారక్షణభారము నెంతవరకు వహించుచున్నదియును లీకమిషను సిద్ధాంతముల నాచరణమునందు బెట్టుటయందును, పౌరసేవోద్యోగులకును నితరశాఖోద్యోగులకును నభయహస్తము నొసంగుటయందునుగనుపడుచున్నది. భారతదేశద్రవ్యమును దక్షిణలరీతిని నాంగ్లేయోద్యోగులకు వ్యయము చేయుటకు బ్రిటీషుప్రభుత్వము నిర్ణయించిన విధమును వ్యవహారవిధానము విశదము చేయుచున్నది. వేతనాదుల యధికవ్యయము రెండుకోట్ల రూప్యములు గావచ్చును. ఈ క్రొత్తభారమును నిరుపేదలైన ప్రజలభారమును హెచ్చుచేయుచున్నది. బ్రిటిషుప్రభుత్వము భారతప్రజాక్షేమమును బూనుచున్నదియును, బ్రిటీషు

ప్రజాలాభమును గోరుచున్నదియును ఇట్టి నిత్యవ్యవహారములు విశదముచేయుచున్నవి. ఆరువేలమైళ్లదూరమునందుగల బ్రిటీషు మంత్రి భారతరాజ్యాంగభారము నంతయును హస్తగతము చేసికొనునపుడు భారతదేశలాభముల విషయమై వ్యాఖ్యాన మనవసరము.

* * * *

బర్కెనుహెడుప్రభువుయొక్క ప్రసంగము

బర్కెనుహెడుప్రభువు రీడింగుప్రభువుతోను, బ్రిటీషుమంత్రివర్గముతోను సంప్రతించి చేసిన ప్రసంగము తలతోకయును లేకయున్నది. సహకారమార్గమును స్వరాజ్యపక్ష మవలంబించిన రాజ్యాంగవిమర్శనమున కవకాశము గలదని బర్కెనుహెడు తెలియజేసెను. జీవచ్ఛవమైన ద్వంద్వప్రభుత్వమును భారతీయు లారాధించవలయునని ఆయన విశదము చేసెను. 1929 వరకును సంస్కరణములను విమర్శించుట కవకాశము లేదని విశదము చేసెను. అన్నిపక్షములవారును కలిసి భారతరాజ్యాంగ విధానమును నిర్ణయించిన బ్రిటీషుప్రభుత్వము యోచించునని ప్రసంగవశమున దెలిపిన భావములమీద నాశాంకురములను నిర్మించుట నిరుపయోగమని వింటరుటను ప్రభువు చేసిన ప్రసంగము విశదము చేయుచున్నది. అయినను కన్స్వేషనుపక్షమును లిబరలుపక్షమును ఈమాటలందులేనియర్థమునుగల్పించి వ్యాఖ్యానముచేయుట భారతహృదయ దౌర్బల్యమును విశదముచేయుచున్నది. రీడింగు బర్కెనుహెడుప్రభువులసంప్రతింపుల ఫలము సువ్యక్తరహస్యమైననువ్యక్తముచేయవలసిన భారమును భారతప్రభుత్వవశము చేసి బ్రిటీషుప్రభుత్వము సహజమైన రాజ్యతంత్ర నైపుణ్యమును విశదము చేసినది. భారత స్వరాజ్యాశయము పట్లను బ్రిటీషు ప్రభుత్వమును భారతప్రభుత్వమును నవలంబింపగల మార్గమును వంగదేశ వ్యవహారములు విశదము చేయుచున్నవి. సంస్కరణములు నామమాత్రములనియును, ప్రభుత్వహృదయమునకు పరిపాటియైన నిరంకుశవిధానము నవలంబించుటకు బ్రిటీషుప్రభుత్వమునకు వెరపుగలుగదనియును, బ్రిటీషురాజనీతిజ్ఞుల ప్రసంగములును ప్రభుత్వాచరణమును విశదముచేసి యన్నిపక్షములవారికన్నులను తెరచినవి. బ్రిటీషుసామ్రాజ్యాభిమానులైన శ్రీనివాసశాస్త్రిగారు సయితము నిరాశనుజెంది కార్యదీక్షావసరమును విశదముచేసిరి. దేశబంధుదాసు మరణమును, బర్కెనుహెడుప్రభువుయొక్క ప్రసంగమును రాజ్యాంగాందోళనమునందు మార్పును గలుగజేయవలసిన యవసరమును విదితము చేసినవని గాంధిమహాత్ముడు యంగుఇండియాపత్రికయందు తెలియజేసెను.

* * * *

దేశబంధుదాసు నిర్యాణము

దేశబంధునిర్యాణమును, బర్కెనుహెడు ప్రభు ప్రసంగమును నితర భారతీయ నాయకులహృదయములందువలెగాంధిమహాత్మునిహృదయమునందును భిన్నపక్షముల సంయోగావసరమును వ్యక్తము చేసినవి. దేశబంధుదాసు ఫరీదుపురము ప్రసంగమునందు సహకారవిధానమును విశదముచేసెను. బర్కెను

హేడు ప్రభువు ద్వంద్వప్రభుత్వమో నిరంకుశప్రభుత్వమో శరణ్యమని విశదము చేసెను. బ్రిటీషు ప్రభుత్వ పాశబంధములను సుస్థిరము చేయుట కవసరమైన మార్గముల నవలంబించెను. బర్కెనుహేడు ప్రభువుయొక్క వాగ్దానములు సమ్మోహజనకములుగాని సత్యాన్వితములు గావని గాంధిమహాత్ముడు యంగుఇండియా పత్రికయందు వ్యాఖ్యానము చేసెను. దేశబంధుదాసు స్వరాజ్య సంపాదనమున కాత్మసమర్పణము జేసి కృతార్థతను బడసెను. వంగరాష్ట్రమునందు ద్వంద్వప్రభుత్వోపసంహారమునుజూచి ప్రతిజ్ఞను పూరించి ప్రాణములను చాలించెను. నిర్మాణవిధానమునందు, ముఖ్యముగ ఖద్దరునందును,హిందూమహమ్మదీయసంయోగము నందును దేశబంధుదాసు గాంధిమహాత్మునివలె గాఢమైన విశ్వాసమును గలిగియున్న విధమును గాంధిదాసుల నూలుచందా ఒడంబడిక వ్యక్తము చేసినది.

ఆరంభమునుండియును రాజకీయపరిజ్ఞానముగలవిద్యావంతులు ఖద్దరుపట్లను,ముఖ్యముగను నూలుచందా విషయమునను ప్రతిఘటనభావమును దెలుపుచుండిరి. చింతామణి కేల్కారుగా రారంభమునుండియును నూలుచందాపట్ల ప్రతిఘటనమును జూపుచుండిరి. శ్రీనివాసశాస్త్రిగారు బొంబాయి క్రానికలు పత్రికయందు బ్రచురించిన ప్రశ్నావళికి సమాధానములను జెప్పుచు ఖద్దరు పట్ల నిప్పటికిని విముఖత్వమును సూచించిరి. దేశమునకు చిరకాలపరిచితమైన విదేశవస్త్ర బహిష్కరణమునైనను శాస్త్రిగా రామోదించుటలేదు. స్వరాజ్య సంపాదనమునకు విద్యావంతులదృష్టి సక్రమాందోళనమునందు లగ్నమైనటులు ప్రత్యక్ష సాధనము నందు లగ్నము గాలేదని అసహాయోద్యమ చరిత్రము విశదముచేసినది. ఆరంభమునందు లిబరలు పక్షమువా రసహాయోద్యమము పట్లను విముఖత్వమును జూపిన విధమును నిర్బంధ విధానవ్యాపనము విశదము చేసినది. విద్యావంతులతో గూడిన స్వరాజ్యపక్షమును ప్రత్యక్షాచరణము పట్లను విముఖత్వమును జూపిన విధమును స్వరాజ్యపక్షచరిత్రము చెప్పక చెప్పుచున్నది. నాగపురములో నారంభమైన త్రివర్గబహిష్కారము బెల్గాముతో నంతము నొందినను నూలుచందా ఒడంబడిక రాజకీయపక్షముల సంయోగమునకు ప్రతిబంధకమైనది. స్వరాజ్య పక్షనాయకుడు దేశబంధుదాసు నూలుచందా నియమమును స్వపక్షపక్షమున నంగీకరించినను కార్యమునందు తగిన ప్రయోజనము గలుగలేదు. కాంగ్రెసు సభ్యుల సంఖ్య క్రమముగను తగ్గినది. విద్యావంతుల ప్రతిఘటనము క్రమముగ వృద్ధిని బొందినది. సామాన్యులు నూలుచందా నియమము నామోదించినను రాజ్యాంగ పరిజ్ఞానాభావము ప్రయోజనమును సంకుచితము చేసినది. ధర్మాత్ముడు గాంధిమహాత్ముడు దేశపరిస్థితులను గ్రహించి భావికర్తవ్యమును నిర్ణయింపవలసిన యవసరమిదివరకే యేర్పడినదని గ్రహించెను.

దేశబంధుదాసు మరణమును బర్కెనుహేడు ప్రభువుయొక్క ప్రసంగమును

కాంగ్రెసు ప్రణాలికను మార్చవలసిన యవసరమును పరిస్ఫుటము జేసినవి. గాంధి మహాత్ముడు పండిత మోతీలాలునెహ్రూగారికి వ్రాసిన లేఖయందును యంగు ఇండియా పత్రికయందు వ్రాసిన వ్యాసమునందును దాసు గాంధి యొడంబడికనుపసంహరించి కాంగ్రెసును స్వరాజ్యపక్ష వశముచేయుట కంగీకారమును తెలుపుచున్నాడు. స్వరాజ్య పక్షవిధానమును స్వయముగ పోషించుటకును కాంగ్రెసు పోషణమును బడయునటులు చేయుటకును గాంధిమహాత్ముడు నిశ్చయించినటులు వారి యభిప్రాయములు తెలుపుచున్నవి. ఈముఖ్యమైనమార్పును జేయుటకు కాన్పూరు కాంగ్రెసువరకును వేచియుండక వెంటనే చేయుట యవసరమని మహాత్ముడు నిర్ణయించిరి. అఖిలభారత జాతీయసభోప సంఘసమావేశమును అక్టోబరు మొదటితేదీని బొంబయియందుగూడునటులు కార్యనిర్వాహకసంఘము నిర్ణయించినది. నూలుచందాపట్లను సానుభూతిలేని కెల్కారు శ్రీనివాసయ్యంగారు మోతీలాలునెహ్రూగారులు నూలుచందా నియమమును విమర్శించి నివేదికను బంపుట కేర్పరుపబడిరి. వారి సూచనలు నూలుచందాకు తర్పణమును జెప్పునని యూహింపదగియున్నది. ఆంధ్ర తమిళ రాష్ట్రీయోప సంఘములు కాంగ్రెసుచందా 2000 గజములు స్వయముగను వడికిననూలునుగాని ఎనిమిదిఅణాలు నూలుగాని యుండవచ్చునని నిర్ణయించినవి. ఇతరరాష్ట్రములు నూలుప్రమేయమునె తలపెట్టకపోవచ్చును. ఆ సమావేశమునందు నూలుచందా నిర్ణయము తొలగింపబడుననియును, కాంగ్రెసు కార్యవిధానమునందుమార్పులు గలుగుననియును, దేశవ్యవహారములునుమహాత్ముని యభిప్రాయములును విశదము చేసినవి. ఈ మార్పుతోను అసహాయయోగాధ్యాయము ప్రస్తుతము విరామమును బొందినదని గ్రహింపదగియున్నది. అక్టోబరు సమావేశ మెట్టి విధానమును నిర్ణయించినను భావికర్తవ్య మగమ్యగోచరముగ నున్నవిధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

* * * *

భావికర్తవ్యము

నిరంకుశప్రభుత్వమును ప్రతిఘటించుటకన్ని పక్షముల వారును నేకముఖమునను నడువవలసిన యవసరమును బర్కెనుహెడు తెలిపిన భావములు విశదముచేసినవి. ఆయవసరమును సామ్రాజ్యశాసనసభలోను రీడింగు ప్రభువు చేయనున్న ప్రసంగము విశదము చేయగలదు. మడ్డిమనుకమిటియందలి అధిక సంఖ్యాకుల సలహాలనైనను బ్రిటీషుప్రభుత్వమంగీకరించునని నమ్ముటకు సూచనలు గనుపడవు. సామ్రాజ్యశాసనసభయందు సూత్రధారుడు రీడింగుప్రభువు ప్రదర్శింపనున్న రాజ్యాంగప్రహసన స్వభావమును బర్కెనుహెడుప్రభువు పార్లమెంటునందు ప్రదర్శించిన ప్రహసనము విశదము చేయుచున్నది. రెండు ప్రదర్శనములకును రంగములందును, భాషము లందును భేదము గనుపడినను భావములందు మాత్రము భేదము గనుపడదని యనుభవము

విశదము చేయుచున్నది. రాజ్యతంత్రనిపుణుడు రీడింగుప్రభువు రాయలుకమిషనునియామకమును వ్యక్తీకరించి సభ్యులదృష్టిని ప్రస్తుత కర్తవ్యమునుండి మరల్చవచ్చును. సభ్యులు భేదాభిప్రాయములను గలిగి స్వధర్మనిర్వహణమునందు ప్రమత్తులగుట సహజము. ఈయుపద్రవమునుండి భారతీయులు తప్పించుకొనుటకు ప్రయత్నించవలసి యుందురు. పండిత మోతీలాలు నెహ్రూగారి నాయకత్వముక్రిందను సామ్రాజ్యశాసనసభయం దన్ని పక్షములవారును నిరంకుశ ప్రభుత్వ తంత్రములను భేదించి విజయధ్వానములను మ్రోగించుదురు గాత! సామ్రాజ్యశాసనసభా సమావేశమునందేమి సంప్రాప్తమైనను స్వరాజ్యప్రస్థానమతి గహనమనియును విజయముదుఃఖ భూయిష్ఠమనియును గతకాలానుభవము, బ్రిటీషు రాజ్యాధికారులసంకల్పములువిశదముచేసినవి.

* * * *

సాత్వికనిరోధము

కార్యసిద్ధికి లౌకిక వ్యవహారములందు భిన్నమార్గము లున్నను ధర్మమార్గావలంబనము లోకమునందు సకలజనులకును శ్రేయోదాయకము. స్వరాజ్యమునకు దౌర్జన్యము సక్రమాందోళనము సహకారము ప్రతిష్టంభనము సాత్వికనిరోధము మొదలగు మార్గములు సాధనములైనను నాత్మార్పణమూలమైన సాత్విక నిరోధము దురారాధ్యమైనను నుత్తమసాధనముగ నున్నది. కాంగ్రెసుసిద్ధాంతములు దౌర్జన్య సాధనమును ప్రతిషేధించుచున్నవి. సక్రమాందోళనము సహకారము నిరుపయోగములని నలువదేండ్ల యనుభవము విశదముచేసినది. ప్రతిష్టంభనము ప్రజాశక్తిని ప్రజాభిప్రాయమును విశదముచేసినను నిరంకుశప్రభుత్వము నిరాటంకముగను రాజ్యాంగవ్యవహారములను నడుపగలవిధమును వంగరాష్ట్ర మధ్యరాష్ట్ర వ్యవహారములు విశదముచేసినవి. సాత్వికనిరోధప్రస్థానమును జేయుటకు ప్రజలకు స్థిరసంకల్పమును సామర్థ్యమును లేదని గతకాలానుభవము విశదముచేసినది. మహత్తరమైన భరతవర్షము నిరంకుశపాశబద్ధమై చేష్టారహితమై దురంతమార్గమునను బోవుచున్నను ముక్తిమార్గము మాత్రము సాధ్యముగాకున్నది. హిందూమహమ్మదీయ విభేదములు బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు శాసనసభాప్రవేశ బహిష్కారపక్ష విభేదములు జాతీయసహకారపక్ష విభేదములు స్వరాజ్యలక్ష్యమునం దంతర్హితము లగుచున్నను సాధనసంపత్తియందు ప్రత్యక్షమగుచున్నవి.

భారతజాతీయమహాసభ స్వరాజ్యసంపాదనమున కేర్పడిన మహాప్రతిష్ఠాపనము. కాంగ్రెసునం దన్నిపక్షములవారును జేరి వారి వారి సంస్కారానుసారముగను స్వరాజ్యసంపాదనమునకు పాటుపడుట కవకాశములు గలవు. అల్పసంఖ్యాకు లధికసంఖ్యాకుల మతము నవలంబించుట రాజ్యాంగధర్మముగ నున్నది. ఈ ధర్మమును గ్రహించి గాంధిమహాత్ము డధికసంఖ్యాకులైన స్వరాజ్యపక్షావలంబనులకు రాజ్యాంగాందోళనమును వశము చేయుటకును నూలువడుకుటయందు విశ్వాసము గలవారు నూలుసంఘముగ నేర్పడి కాంగ్రెసునందు పని జేయుటకును నిశ్చయించి కాంగ్రెసు స్వరూప

స్వభావములను పూర్వప్రుస్థితికి మార్చదలచి నను మహాత్ముని దృష్టి సాత్విక నిరోధము నందు లగ్నమైయున్న విధమును మహాత్ముని భావములు విశదము చేయుచున్నవి. మహాత్ముడు సంకల్పించెడి వ్యక్తి సాత్విక నిరోధ మేరూపము నేవేళను దాల్చునదియును కాలము విశదము చేయగలదు. అన్ని పక్షముల వారును స్వపక్షాభిమానమునువదలి స్వరాజ్య సంకల్పమునుజేసి కాంగ్రెసునందుజేరి స్వధర్మ నిర్వహణమును జేయవలసిన మహావసరమును ప్రపంచపరిస్థితులును బ్రిటీషు రాజ్యాధికారుల స్వలాభనిరసనభావములును మాతృదేశ దురవస్థయును విశదముచేయుచున్నవి. అన్నిపక్షములవారును స్వరాజ్యమునందు వారిలక్ష్యమును లగ్నముచేసి కాంగ్రెసునందు జేరి ఏకముఖమునను దేశోద్ధరణమునకు పాటుపడి స్వధర్మనిర్వహణమును జేసి చరితార్థులగుదురుగాత!



# వా మ నా ?

తిరుమల హనుమంతరావు గారు

నరకంఠీరవ! భక్తవత్సల! నినుర్ నమ్మంగరా దెంతయుర్
వరుసర్ భక్తుడు వీడు నా కనక నావాడంచు భావించకర్.
కరమర్థిర్ బలి గట్టివైచి కడకర్ గారించి యాసంపదర్
హరి! నీ యింద్రుని కిచ్చితయ్య! యిదియా హర్షం బహో! వామనా!

మ. వల దీదాన మసంగతంబు విను మీవర్ణిర్ వడిర్ బంపుమీ
జలజాతాక్షుడు విష్ణు డిట్లు వటుడై సర్వంబు దాగోరె నీ
తలపుర్ మాను మటంచు గావ్యు డటు తా తర్కించి చెప్పంగ నా
బలి యూహించియు నిచ్చెగా నతనినే బాధించితే వామనా!

ఉ. ఏమికొరంత గల్గె బలి యేలగ లోకములందు సాధువై
శ్రీమహనీయు డాతడు విశేషవదాన్యుడు ధర్మబుద్ధి నీ
వా మహితాత్ము సంపద నవారితరీతి హరించి యివ్వగా
నేమి తపంబుజేసె దగని ంద్రుడు ధర్మము లేదె, వామనా!

ఉ. లోకములందు మేటియట! లోకనుతుం డట! లోకమెల్ల నా
శ్రీకరుపంపు సేయునట! చే యటుసాచియు దానమన్న నే
సీకునికిర్ జనుల్ నగరె! యేర్పడు గీర్తి యటంచు జెప్పె ం
వా కరుణానిధిర్ జెరుప న్యాయమె నీకు మహాత్మ! వామనా!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thambu Chetty Street, G. T. Madras.